# అందాల తెలుగు కథ

('ఆంధ్రజ్యోతి' దినపత్రికలో 50 వారాలు
వచ్చిన కథా సాహిత్య వ్యాసాలు)








కోడూరి శ్రీరామమూర్తి

# అందాల తెలుగు కథ

('ఆంధ్రజ్యోతి' దినపత్రికలో 50 వారాలు
వచ్చిన కథా సాహిత్య వ్యాసాలు)




## కోడూరి శ్రీరామమూర్తి

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :

**విశాలాంధ్ర బుక్‌హౌస్**

విజ్ఞాన్ భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్

హైదరాబాద్-01

ANDALA TELUGU KATHA

(Literary Essays)

By

Koduri Srirama Murty



First Edition : 2013

| | | |
|---|---|---|
| Publisher | : | **Koduri Bharathi**<br>D-5, Akhil Apartments, Danavaipeta<br>RAJAHMUNDRY-3<br>Ph : 0883-2430754, 9346968969 |
| Printed by | : | Mugda Offset Printers<br>Beside Surya Theatre Complex<br>RAJAHMUNDRY - 533104 |
| DTP by | : | V. Simhadri, Mobile : 9000814242 |
| Sole Distributors | : | Visalandhra Book House<br>Vignan Bhavan, 4-1-435<br>Bank Street, HYDERABAD-01 |
| Price | : | 120/- |

This book is published with the financial
assistance received from the Govt. of India
(through Central Institute of Indian Languages, Mysore)

తెలుగుకథకు అడుగుజాడ చూపిన



గురజాడ అప్పారావుగారికి

అంకితం

# రెండు మాటలు....

ఇందులోని 50 వ్యాసాలు ఆంధ్రజ్యోతి దినపత్రిక 'సాహిత్య వేదిక' శీర్షికలో 1986-87 సం॥ మధ్య కాలంలో - ఒక్కొక్క విడతకు 25 వ్యాసాలు చొప్పున రెండు విడతలుగా వచ్చాయి. మొదటి విడత వ్యాసాలు 1986 సం॥ నవంబరు 3న ఆ తర్వాత రెండవ విడత వ్యాసాలు జూలై 27, 1987 సం॥న ప్రారంభమయ్యాయి.

అప్పట్లో ఈ శీర్షిక విశేష పాఠకాదరణ పొందింది. రసహృదయులైన పాఠకులను ఉర్రూతలూగించింది. కారణాంతరాలవల్ల యింతవరకూ గ్రంథరూపాన్ని దాల్చని ఈ వ్యాసాలు ఇప్పుడు మీ కోసం -


డి-5, అఖిల్ ఎపార్ట్‌మెంట్స్
దానవాయిపేట, రాజమండ్రి-3
0883-2430754, 9346968969





భవదీయులు
**కోడూరి శ్రీరామమూర్తి**

# రచయిత గురించి....

**జననం - 29,** సెప్టెంబరు 1941, రచయితగా, సాహిత్య విమర్శకుడుగా, గాంధేయ తత్వ పరిశోధకుడిగా ప్రసిద్ధులు. వృత్తిరీత్యా మూడున్నర దశాబ్దాలు కళాశాల విద్యార్థులకు అర్థశాస్త్రాన్ని బోధించారు. తత్వశాస్త్రం - ప్రత్యేకించి పాశ్చాత్య తత్వశాస్త్రంపై మక్కువ.

**బహుమతులు** : ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ పురస్కారం, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ పురస్కారం, ఆంధ్రప్రదేశ్ రవీంద్ర శత జయంతి సంఘ పురస్కారం, కృష్ణాపత్రిక గోల్డెన్ జూబ్లీ బహుమతి, పులికంటి కృష్ణారెడ్డి పురస్కారం.

**ప్రధాన గ్రంథాలు** : తెలుగు నవలా సాహిత్యంలో మనో విశ్లేషణ (విమర్శ)
తెలుగు కథ - నాడు, నేడు (విమర్శ)
వెలుగు - వెన్నెల (సాహిత్య వ్యాసాలు - విమర్శ)
మా మంచి తెలుగు కథ (కథా సాహిత్య వ్యాసాలు)
గాంధీజీ కథావళి (గాంధేయ సాహిత్యం)
ఆలోచన (గాంధేయ సాహిత్యం)
మనకు తెలియని మహాత్ముడు (గాంధేయ సాహిత్యం)
మహాత్ముని ప్రస్థానం (గాంధేయ సాహిత్యం)
మరో కోణంలోంచి మహాత్ముడు (గాంధేయ సాహిత్యం)
తెర తీయగ రాదా (కథలు)
నీటిలో నీడలు (నవల)
రవికవి (బాల సాహిత్యం)
మహనీయుల జీవితాల్లో కథగాని కథలు (బాలసాహిత్యం),
మన సంస్కర్తల జీవిత కథలు,
స్వాతంత్ర్యానంతర యుగంలో వచన సాహిత్యము - సంప్రదాయము, ప్రయోగము (అముద్రితం)

ఇంకా వందలాది సాహిత్య, సాహిత్యేతర వ్యాసాలు, ప్రముఖ దిన, వార, మాస, పత్రికల్లో శీర్షికలు - కథలు -

# ఇందులో.....




# 1

## చలం - ఆమె త్యాగం



**ఆ**ధునిక తెలుగు కథా సాహిత్యానికి వాడి, వేడి యిచ్చినవాడు చలం. ఆధునిక తెలుగు కథకు శ్రీకారం చుట్టింది గురజాడ వారా? లేక మరొకరా? అనే ప్రశ్న ఎలా వున్నప్పటికీ తెలుగు కథ వినూత్న పోకడలు పొందింది చలం కలం వెలుగులలోనే! – దాదాపు వంద కథలు, తొమ్మిది నవలలు రాసిన చలం తాను చేపట్టిన ప్రతి సాహిత్య ప్రక్రియలోనూ ఒక కొత్తదనాన్ని చూపించాడు. తెలుగు సాహిత్యంలో ఒక ఉప్పెన చలం.

తెలుగు సాహిత్యంలో వ్యక్తి వాదానికి, వ్యక్తి స్వేచ్ఛకు చలం యిచ్చినంత ప్రాధాన్యతను యిచ్చిన రచయితలు చాలా అరుదుగా కనబడతారు. నీతి పేరిట సమాజంలో ప్రచారంలో వున్న మూఢ విశ్వాసాలను, అణచివేత ధోరణులను, చలం తన రచనలలో దుయ్యబట్టాడు. నీతి పేరుతో వ్యవస్థ బిగించిన 'చట్రం'లో నిస్సహాయంగా బలియైపోతున్న స్త్రీ గురించి అతడు ఆవేదన చెందాడు.

చలం భావాలు ఎంత ఆలజడిని సృష్టించేవిగా వుంటాయో అతడి శైలి గూడా అంతటి ప్రత్యేకతను కలిగి వుంటుంది. అయితే తన రచనలలోని విషయాన్ని గ్రహించకుండా శైలిని మాత్రమే మెచ్చుకునే కొందరు వ్యక్తులను చూచి చలం జాలిపడేవాడు.

"–నా అభిప్రాయాలతో ఏకీభవించమనను గానీ, నా శైలిని విడదీసి యోచిస్తే నాకు కోపం. ఆ మాటకు అర్థం ఏమిటంటే, మీ అభిప్రాయాలు సరియైనవేగాని, వాటిని అంగీకరించే ధైర్యం చాలలేదన్నమాట" అంటూ చలం "నేనూ, నా శైలీ తగలడనూ నా అమీనా! నా అమీనా!" అని అంటాడు.

"–ఇతడు నా భర్త. ఈమె నా భార్య. ఎవరికీ దక్కనీక నాదాన్ని చేసుకోవాలి. యావజ్జీవితమూ అనుభవించాలి. అదేగా పెళ్ళి" అంటూ వివాహ వ్యవస్థను దుయ్యబట్టిన చలం అందుకు కారణాలను చెబుతూ "–పెళ్ళి అనేదానితో నాకు ఎందుకు విరోధం? పెళ్ళి వ్యభిచారం క్రింద మారింది కనుక" అని, వివాహ వ్యవస్థలో స్త్రీ భరించవలసి వస్తున్న 'యిష్టంలేని సెక్స్'కు జాలిపడ్డాడు. యిట్లాంటి అభిప్రాయాలను ఛాందసులు అమోదించగలరా?

అయితే చలంలో ఓ ప్రత్యేకత వుంది. కొంత మంది రచయితల్లా తన పాత్రల నోళ్ళు నొక్కి తన భావాలను వాటిమీద రుద్దడు. అందువల్లే ఆయన రచనల్లో కృత్రిమత్వం ఎక్కడా కనిపించదు. "కథ యిట్లా నడిపించాలని అనుకోను. పాత్రని కాగితం మీద పెట్టగానే వాళ్ళే నడిపించుకుపోతారు కథని. అందుకే నా సిద్ధాంతాలకి వ్యతిరేకంగా వుంటాయి. నేను రాసేవి చాలా సార్లు" అని చలంగారు చెప్పుకున్న మాటల్లో స్వోత్కర్ష లేదు. అక్షర సత్యాలవి.

చలంగారి రచనల్లో స్పృశించబడిన నీతి, అవనీతిలకు సంబంధించిన చర్చ ఎలా వున్నా ఆయన రచలన్నింటికీ కేంద్ర బిందువు మానవతా దృక్పథం. చలంగారి 'ఆమె త్యాగం' కథ చదివారా?-

'నీతి' పేరిట సమాజంలో ప్రచారంలో వున్న విలువలకూ, నిజమైన మానవతా విలువలకు, మధ్య గల తేడాను చూపుతూ మహోన్నతమైన మానవతా విలువల ముందు శారీరక సంబంధాలు సిగ్గుతో తలవాల్చుకోవలసిందే నన్న సత్యాన్ని చాటుతుంది ఈ కథ.

ఈ కథలోని 'ఆమె' సంసార స్త్రీ కాదు. సీతారామయ్య అనబడే ఒక మాజీ ధనవంతుడి ఉంపుడుగత్తె. బావచేత మోసగించబడిన 'ఆమె' అటు తర్వాత అనేకమంది 'పశువుల' చేతుల్లో నలిగి సీతారామయ్యకు హృదయేశ్వరి అయింది. ఆమెకోసం సీతారామయ్య చాలా డబ్బు ఖర్చుచేశాడు. చివరకు ఆస్తినంతా కోల్పోయిన సీతారామయ్యకు, వంటిని పీల్చి పిప్పిచేస్తున్న క్షయరోగం మినహాగా ఏదీ మిగలలేదు. యిట్లాంటి స్థితిలో 'ఆమె' అందరి లాంటిదీ అయితే తన వయస్సును ఆసరాగా చేసుకుని ఎవరితోనో వెళ్ళిపోయేదే! కాని, ఆమె సీతారామయ్యకోసం, అతడి ఆరోగ్యం కోసం మహాపతివ్రతలా పరితపించింది. అతడికి వైద్యం చేసే డాక్టర్‌కి ఫీజు చెల్లించలేని ఆమె, డాక్టర్‌కి తన శరీరం మీద వ్యామోహం వుందని తెలిసి అందుకు సిద్ధపడింది. కాని, సంస్కారం గల డాక్టర్ తన తప్పు తాను తెలుసుకున్నాడు. ఆమె వ్యభిచారిణి అనుకోవడం ఎంత నీచత్వమో తెలిసివచ్చింది.

ఆమె చెంపలు తాకి "ఈ త్యాగానికి ఎంత రక్తం మీ హృదయంలోంచి వొలికి వుంటుందో నాకు తెలుసు" అంటాడు.

అప్పుడు ఆమె "బిల్లు తీరింది. కాని మీ వాత్సల్యం తీరలేదు" అని దగ్గరకు వచ్చి అతని ముఖాన్ని ముద్దు పెట్టుకుంటుంది.

"ఈ జన్మలో నేను పంపించగల బిల్లుల మొత్తం అంతా తీరింది" అంటాడు డాక్టర్. తుచ్ఛమైన శారీరక వాంఛలకు, మహోన్నతమైన మానవతా విలువలకు మధ్యగల తేడాను గుండెలకు పట్టేలా చెబుతుంది ఈ కథ. చలంగారి కథలన్నింటిలోకీ ఈ కథ నన్నెంతగానో ఆకట్టుకుంది.

---

# 2

## కుటుంబరావు - 'ఫోర్త్ డైమెన్షన్'



**మా**నవ జీవితాన్ని, అందునా మధ్యతరగతి కుటుంబీకుల మనస్తత్వాన్ని నిశితంగా పరిశీలించిన గొప్ప కథకుడు కొడవటిగంటి కుటుంబరావు. రాశిలోను, వాసిలోను కుటుంబరావుగారి కథలు ప్రత్యేకతను కలిగినవి.

కథా రచనలో శైలికి, ఆడంబరానికి కుటుంబరావు గారు ప్రాకులాడరు. నిరాడంబరంగా రవ్వంత 'వ్యంగ్యోక్తి' ని మిళాయించుకుని పాఠకుల హృదయాలపై పన్నీటి జల్లుల్ని కురిపిస్తాయి ఆయన కథలు. కథా రచనా రీతిలో కుటుంబరావుగారిని ప్రసిద్ధ రష్యన్ కథకుడు చెకోవ్‌తో పోల్చవచ్చు.

1931 ఏప్రిల్ "గృహలక్ష్మి"లో 'ప్రాణాధికం' కథను ప్రచురించడంతో కథా రచనను ప్రారంభించిన కుటుంబరావుగారిపై తొలి దశలో చలం గారి ప్రభావం బాగా పడింది.

"మనిషి నుంచి మనిషికి సాధ్యమైనంత హెచ్చు ఉపకారము, తక్కువ అపకారము జరిగేటట్టు మానుకొనడమే సరిఅయిన ప్రవర్తన. మిగిలిన బూటకపు నీతి నియమాలను నమ్మకండి...." అని "చెడిపోయిన మనిషి" కథలో లేడీ డాక్టరు స్నేహలతారావు చేత అనిపించిన కుటుంబరావు, చలంగారి లాగానే అనేక కథలలో 'నీతి' పేరిట సమాజంలో అమలులో వున్న బూటకపు నియమాలను హేళన చేశారు.

అటు తర్వాత మార్క్స్ 'కేపిటల్' చదవడంతో ఆయన దృక్పథంలో స్పష్టమయిన మార్పు వచ్చింది. .... "సంఘ వ్యాధి గురించి అర్థం చేసుకోగలిగాను. మనస్తత్వం గురించి గాలి కబుర్లు రాయడం మానేసి ఆ మనస్తత్వాన్ని ఆడించే సాంఘిక శక్తుల గురించి రాయడం ప్రారంభించాను...." అని ఆయనచేత రాయించింది.

రచయితగా కుటుంబరావుగారి దృక్పథం[illegible] ఏదయినా- సాహిత్యం ఒక ప్రచార కరపత్రంగా తయారవాలని ఆయన ఏనాడూ భావించలేదు. ....."సాహిత్య కారుడుగా

జీవితం నాకు ప్రమాణం. సిద్ధాంతం కోసం జీవితాన్ని వక్రంగా చేసే రచన ఉత్తమ రచన ఎలా అవుతుందో నాకు ఏనాడూ అర్థం కాలేదు." అంటారాయన.

కథా రచన చేపట్టే రచయితలకు జీవితానుభవం చాలా ముఖ్యం అని ఆయన పదేపదే చెప్పేవాడు.

"ఒక కథకుడికి రచనా సామర్థ్యం లేకపోయినా సరిచేయవచ్చుగాని, జీవితం తెలికపోతే సరిచేయడం ఎవరివల్ల కాదు. శిల్పం, భాష, రచనకు ముఖ్యం కాదని కాదు. అవి కథా రచనకు మూల పరికరాలు. ముడి పదార్థం జీవితం...." అంటూ కుటుంబరావుగారు తెలిపిన హితవును కథకులుగా కలం పట్టిన వారందరు గ్రహించవలసి వుంది.

కుటుంబరావుగారి మంచి కథలలో "ఫోర్త్ డైమన్షన్" ఒకటి అని నా అభిప్రాయం. ఇందులో 'మనస్తత్వపు గాలి కబుర్లు' కాక – మనస్తత్వపు లోతులు అందంగా కనబడతాయి. ఈ కథను మనకు చెప్పే వ్యక్తికి చిన్నప్పుడు ఇందిర అనే అమ్మాయితో అనుబంధం ఏర్పడుతుంది. దానిని 'ప్రేమ'గా వ్యాఖ్యానించుకునే వయస్సు ఇద్దరికి లేదు– పైగా ఇందిర అతగాడి కన్నా వయస్సులో పెద్దది కూడాను!

ఏడేళ్ళ వయస్సులో ఇందిరకు పెళ్ళిచేసి, పెద్ద ఆరిందాలా చీర కట్టి ముస్తాబు చేసినప్పుడు ఆ దుస్తులలో ఇందిర చాలా అసహ్యంగా వున్నట్టు అనిపించింది అతడికి. – మరి కొన్నాళ్ళకు ఇందిరకు చీరలు కట్టే వయసు వచ్చి సముద్ర స్నానం చేసి తడి బట్టలతో కనబడితే, అప్పుడు ఇందిరను చూస్తే అసహ్యం వేసింది. పెళ్ళి బట్టలతోనే ఇందిర బావున్నట్టు అనిపించింది.

కాల గమనంలో – కథా నాయకుడు పెళ్ళి కొడుకయినప్పుడు పెళ్ళిరోజున ఇందిర కనబడుతుంది. కాని – అప్పటికి ఆమె బాలింతరాలు. చంకలో బిడ్డను ఎత్తుకుని ఇందిర అతగాడ్ణి పలకరించబోతే అసహ్యించుకున్నాడు. ఆమె మనస్సు కష్టపడిందని కూడా గమనించలేదు. బాలింతరాలి రూపంలో కన్నా సముద్ర స్నానం చేసినప్పటి రూపం అందంగా వున్నట్టు అనిపించిందతడికి.

అటు తర్వాత – టైఫాయిడ్ జ్వరం వచ్చి బాధపడుతున్న కథా నాయకుణ్ణి పరామర్శించడానికి వచ్చిన ఇందిర ఎనిమిది నెలలు కడుపుతో వుంటే ఆ రూపం అతడికి అసహ్యాన్ని కలిగించింది. బాలింతరాలి రూపమే బాగున్నట్టనిపించింది.

ఈ కథలోని కథానాయకుడికి ఇందిరపై వాంఛ వున్నది. బలమైన ప్రేమ వున్నది. అయితే దానిని అతడు బలవంతంగా తన 'లిబిడో' లోనికి అణిచి వేసుకున్నాడు. ఫలితంగా

ఆ 'ప్రేమ' మనోవైజ్ఞానిక శాస్త్రవేత్తలు చెప్పే 'రియాక్షన్ ఫార్మేషన్'గా - అసహ్యం రూపంతో బయటకు వచ్చింది. కథకుడికి ఇందిర ఏ రూపంలో దర్శనమిచ్చినా, అది మరపురాని మధురానుభూతే! కాని దానికి 'అసహ్యం' అని పేరు పెట్టుకోవడంలోనే మనస్తత్వపు వైచిత్రి అవగతం అవుతుంది.

ఇందిర విషయంలో కథానాయకుడి అంతరంగంలో ఎలాంటి అనుభూతులు వున్నాయో - ఇందిర గుండెల్లో కూడా దాదాపుగా అలాంటి భావాలే వున్నాయి.

నిజానికి ఈ కథలోని కథానాయకుడు 'కాలం' అని చెప్పాలి. (ఐన్‌స్టీన్ థియరీ ఆఫ్ రెలెటివిటీ' ప్రభావం పరోక్షంగా ఈ కథపై వుంది) కథానాయికకూ, నాయకుడికి ఒకరిపై ఒకరికి గల ప్రేమను వ్యక్తం చెయ్యడానికి - దానిని వాస్తవం చెయ్యడానికి - గతంలో గాని, వర్తమానంలో గాని, భవిష్యత్తులో గాని అవకాశం లేదు. అందుకోసమే రచయిత 'ఫోర్త్ డైమెన్షన్'ను అన్వేషించాల్సి వచ్చింది.

సిద్ధాంత దృక్పథంతో సంబంధం లేకుండా - కుటుంబరావు గారి మంచి కథ చెప్పాల్సి వచ్చినప్పుడు- 'ఫోర్త్ డైమెన్షన్' కథ చాలాకాలం మన మనసుల్లో మెదులుతుంది.

---

# 3



## బుచ్చిబాబు
## "తెరచాప దించిన పడవ"

**తె**లుగు కథా సాహిత్యానికి సొగసులు, సోయగాలు సమకూర్చిన విశిష్ట కథకుడు బుచ్చిబాబు. బుచ్చిబాబు జీవితాన్ని సునిశితంగా పరిశీలించిన కథకుడు మాత్రమే కాకుండా, విశ్వ సాహిత్యంలో వస్తున్న క్రొత్త పోకడలనూ, అటు తత్వశాస్త్రంలోను, యిటు మనో వైజ్ఞానిక శాస్త్రంలోనూ వచ్చిన అధునాతన మార్పుల్ని అవగాహన చేసుకున్న మేధావి కూడా కావడంచేత – అతని కథలు ఒక విలక్షణతను కలిగి వుంటాయి.

బుచ్చిబాబుగా ప్రసిద్ధుడైన శివరాజు వెంకట సుబ్బారావు ప్రధానంగా హృదయవాది. ప్రకృతి పలకరింపులతో పులకించిపోయే కవితాత్మక హృదయం అతనిది. కథకుల్లో భావకవి అతడు. "సౌందర్యంగా కదిలే బలహీనమైన కనురెప్పల క్రింద మంచులో కదిలిపోయిన కుందేలులా మెరిసిపోయిన నేత్రాల అందాలు' తెలుసుకోవాలంటే అతని కథలు చదవాల్సిందే! – బుచ్చిబాబుకు సోమర్ సెట్ మామ్ అంటే ఇష్టం. మామ్ గురువుగారు అయిన మొపాసా కథా శిల్పంలోని అందాలు కూడా బుచ్చిబాబుకథల్లో తళుక్కుమంటూ వుంటాయి. మామ్ మాదిరిగా "నేను"తో ప్రారంభించి, ప్రథమ పురుషలో బుచ్చిబాబులా తెలుగులో కథలు చెప్పి ఒప్పించగల రచయితలు తక్కువే అని చెప్పాలి.

"–ప్రేమించి, దూరంగా వుండి శరీర సుఖం కోరక, మనసును ఆనందంతో నింపుకున్న ఉదంతం సాహిత్యంలో రాణిస్తుంది.–" అని చెప్పుకున్న బుచ్చిబాబు అంతరంగంలో అణచివేయబడిన శృంగార భావనలతో అటమటించే పాత్రల నెన్నింటినో తన కథల్లో సృష్టించాడు.

"నన్ను గురించి కథ రాయవూ– "లోని కుముదం, "మేడ మెట్లు" కథలోని అరుణ, "ఆశాప్రియ" కథలోని ఆశాప్రియ, "పొగలేని నిప్పు"లోని సీతారత్నం, ఇలా చెప్పాలంటే ఇందుకు దాదాపుగా బుచ్చిబాబు కథల్లోని పాత్రలన్నీ తార్కాణంగా నిలుస్తాయి. తన

రచనలలో తరుచు కనబడే ఈ భావాన్ని వ్యక్తీకరించడానికి బుచ్చిబాబుకు ఫ్రాయిడ్ మనో వైజ్ఞానిక శాస్త్ర సిద్ధాంతాలు బాగా ఉపకరించాయి. తెలుగులో "సైకో ఎనాలిసిస్" సిద్ధాంతాల ప్రభావం బుచ్చిబాబుపై వున్నంతగా మరొక రచయిత మీద లేదు అనడంలో కూడా అతిశయోక్తి లేదు.

బుచ్చిబాబు కథలలో "నన్ను గురించి కథ రాయవూ-" చాలా మంచి కథ అని చాలామంది చెబుతారు. అయితే-చక్కని కథా శిల్పానికి "తెరచాప దించిన పడవ" తీసిపోదు అంటాను నేను.

"-తెరచాప దించిన పడవ వార్ధక్యం. సముద్రంలో వుంటుంది. వొడ్డుకి చేరడం అంటూ లేదు. అక్కణ్ణించి కదుల్తున్నట్టే స్ఫురించదు. అందుకే స్థిరమయిన సౌందర్యం అది-" అంటాడు బుచ్చిబాబు వార్ధక్యాన్ని గురించి చెబుతూ ఈ కథలో.

అయితే, ఈ కథలో బుచ్చిబాబు చెప్పదలచుకున్నది విదురమ్మ అనబడే వృద్ధురాలి వార్ధక్యాన్ని గురించి మాత్రమే కాదు. వ్యక్తిగతమైన విలువలకు, వ్యవస్థాగతమైన విలువకు మధ్యగల అంతరాన్ని చూపుతూ అంతరంగపు లోతులను తరచి చూపుతుంది ఈ కథ.

ఒక పల్లెటూళ్ళో కమ్యూనిటీ హాలు కట్టదలచింది ప్రభుత్వం. అందుకు స్థల సేకరణ పూర్తయింది కాని – పునాదులు లేవడానికి విదురమ్మ అనబడే వృద్ధురాలి కొద్దిపాటి స్థలం కావలసి వచ్చింది. ఈ స్థలంలో రెండు బండరాళ్ళు, విదురమ్మలాగే వార్ధక్యంతో ఒరిగిపోయి వున్న చెట్టు వున్నాయి. ప్రభుత్వానికి తెలిసింది అంత వరకే. ఆ మూడింటి వెనుకా గూడుకట్టుకుని వున్న విదురమ్మ గుండెల్లోని ఆర్ద్రతా, ఆత్మీయత, ప్రభుత్వ అధికార్లకు అర్థం కావు.

ఒకవేళ ఏ అధికారయినా అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తే, ప్రభుత్వ యంత్రాంగం అనుమతించదు. – ఆ బండల్ని చూపుతూ "-ఆ పెద్దది ఆయన. చిన్నది నేను-.... అక్కడే కూకునే వాళ్ళం. ఆయన పదాలు పాడేవాడు-" అంటుంది విధవరాలయిన విదురమ్మ. కాని, – సంఘానికి కమ్యూనిటీ హాలు ముఖ్యం. ఒక ముదుసలి స్త్రీ బండరాళ్ళ మీద పెట్టుకున్న సెంటిమెంటు ఎవరికి కావాలి?-

ఈ కథలో వున్న ప్రత్యేకత ఏమిటంటే – కథ మొదటిలో విదురమ్మ పరిచయం అయిన తీరుకు, కథ చివరిలో ఆవిష్కరించబడిన విదురమ్మ వ్యధకు, వున్న తేడా – రచయితగా బుచ్చిబాబు కథలలో వుండాలని ఆశించిన 'అర్థం కాని గొడవ' ఈ కథలో పుష్కలంగా దొరుకుతుంది.

అయిదేళ్ళు కాపురం చేసిన తర్వాత (అది కూడా అతగాడు అప్పుడప్పుడు సెలవలకు వచ్చినప్పుడు మాత్రమే) విదురమ్మ భర్త యుద్ధంలో మరణించడం చేత - ఆమెకు జీవితంలో భర్తతో గడిపిన మధురమైన క్షణాల జ్ఞాపకాలు తప్ప, మరేమి మిగుల లేదు. భర్త ఎప్పటికయినా తిరిగి వస్తాడనే వెర్రి ఆశతో అతని గదిని రోజూ శుభ్రపరుస్తూ - బందరాళ్ళను ఆపేక్షగా చూస్తూ కాలాన్ని గడిపేది ఆమె.

అయితే కథ చివరికి వచ్చేసరికి వచ్చిన మలుపు వేరు. భర్త దూరం అయిన కారణంగా శరీరం చేసే అలజడిని తట్టుకోలేక ఇంద్రన్న అనబడే మరో వ్యక్తి పొందుచేరిన ఒక సామాన్య స్త్రీలాగా విదురమ్మ కథ చివరలో మనకు అర్థం అవుతుంది. అయితే - దాని ఫలితంగా ఆమె పొందిన అపరాధ భావం, సంఘర్షణలను వాచ్యం చెయ్యకుండానే కథకుడు చెప్పడంలో ప్రత్యేకత కనబడుతుంది.

కమ్యూనిటీ హాలు నిర్మాణానికి విదురమ్మ తన జీవితంలోని తీపి గురుతులయిన బందరాళ్ళను తొలగించడానికి ఒప్పుకుంది. కానీ, చెట్టు కొట్టించడానికి ఒప్పుకోలేదు. చెట్టు మొదటలో వున్నది అపరాధ భావాన్ని రగిల్చే చేదు జ్ఞాపకాలు. తీపి జ్ఞాపకాల చిహ్నాలు ఏమయినా ఫరవాలేదు. చేదు జ్ఞాపకాల గురుతులు ఎవరికీ తెలియకూడదు. తనతోనే అంతం కావాలి.

అందుకే - కమ్యూనిటీ హాలు నిర్మాణం ఆగదు అని తెలిసినప్పుడు - తనలాగే వార్ధక్యం అంచులో వున్న చెట్టు మొదలు తవ్వి - అక్కడ కప్పెట్టిన ఇంద్రన్న యిచ్చిన ఉంగరాన్ని త్రవ్వి తీసుకుందామని ఆమె తపన చెందింది. ఉంగరం దొరికింది కాని, చెట్టు కూలింది. అక్కడే విదురమ్మ కూడా తుది శ్వాస విడిచింది.

బుచ్చిబాబు కథలలో ఆణిముత్యం అనతగ్గ కథ ఇది. వ్యక్తి ప్రయోజనానికి, సాంఘిక ప్రయోజనానికి, మధ్య గల అంతరాన్ని - సంఘర్షణను మాత్రమే గాక - నీతికి, అవనీతికి మధ్యగల సన్నటి గీత గురించి ఎన్నో ఆలోచనలను చెలరేపుతుంది. మనిషిలో వుండే బొమ్మ, బొరుసుల కథను హృదయానికి 'హత్తుకునేలా చెబుతాడు బుచ్చిబాబు ఈ కథలో.

---

# 4

## పద్మరాజు - "వెండి సీసా"



"**జీ**వితం గొప్పదా?- కళ గొప్పదా?- సందేహం ఎందుకు? జీవితమే.... అన్ని కళలూ నశించి పోయినా జీవితం మిగలాలి-" పద్మరాజుగారి 'ఫల శృతి' అనే కథలో ఒక పాత్ర అంతరంగ ఆవేదన యిది. నిజానికి - పద్మరాజు గారి కథలన్నింటి వెనుకా వున్న దృక్పథం యిదే అని చెప్పవచ్చును. ఆయనకు సిద్ధాంతాలు, పిడివాదాలు, ముఖ్యం కాదు. రంగు టద్దాలు లేకుండా జీవితాన్ని యథాతథంగా చూడ గలిగిన విశిష్ట కథకుడు ఆయన. ఆ జీవితం 'గాలివాన'లో చిక్కుకున్న ముష్టిదాని బ్రతుకుకు సంబంధించి కావచ్చు - దానికి 'కొలవరాని దూరం'లో వున్న విమానయానం చేసే బడాబాబుల గురించి కావచ్చు.

ఎవరి గురించి చెప్పినా కథకుడుగా ఆయన దృష్టిలో మార్పు వుండదు. "-నాలోని కథకుడు నాలోని సూత్రకారుడి కన్నా బలమైనవాడు" అని తనను గురించి తాను చెప్పుకున్న పద్మరాజుగారు- యిది యిలా ఎందుకు వుంది? ఎలా వుండాలి? అనే విషయాల గురించి ఎక్కువగా ఆలోచించరు. జీవితాన్ని నిశితంగా పరిశీలించి అది తనకు ఎలా కనబడితే అలా రాయడమే ఆయన పని.

"నేనొక స్వేచ్ఛా కళాకారుడులాగా వుండాలని కోరుకొంటాను. ట్రేడ్ మార్కులు, లేబుల్స్, యివన్నీ మూఢ నమ్మకాలని నా అభిప్రాయం." అని చెప్పుకున్న రష్యన్ కథకుడు చెకోవ్ (Chekov) పలుకులకు, రచయితకు వుండవలసిన 'ఆబ్జెక్టివిటీ'ని గురించి చెబుతూ "రచయితకు మతం వుండకూడదు. దేశం వుండకూడదు. సామాజిక నమ్మకం వుండకూడదు-" అంటూ 'గుస్టావ్ ఫ్లాబే' వెలిబుచ్చిన వాక్యాలకు పద్మ రాజుగారి దృక్పథం సన్నిహితంగా కనబడుతుంది.

పద్మరాజు కథల్లోని మరొక ప్రత్యేకత - పాండితీ ప్రకర్ష కలిగి పెద్దలమని చెప్పుకునే వాళ్ళకంటె - జీవితాన్ని యథాతథంగా చూడగలిగిన సామాన్యులు ఎంతో ఎత్తున కనబడడం, 'గాలివాన' కథలో తుపాను వచ్చిన రాత్రి జీవితం గురించి నిర్దుష్టమైన అభిప్రాయాలు గాని - నిర్దేశించుకున్న విలువలు గాని, లేని ఒక బిచ్చగత్తె నుంచి రావు గారి వంటి

మేధావి అందుకున్న సందేశాన్ని పాఠకులు మరిచిపోగలరా?- 'పడవ ప్రయాణం'లోని కథకుడి విషయంలోనూ, 'వాసనలేని పువ్వులు' కథలోని కవిగారి విషయం లోనూ యిదే వాస్తవం.

పద్మరాజుగారి కథల్లో నాకు 'వెండి సీసా' నచ్చుతుంది. 'గాలివాన', 'పడవ ప్రయాణం' వంటి ప్రసిద్ధ కథలతో పోల్చి చూస్తే ఇది సామాన్యమైందిగా కనబడవచ్చు. కాని - ఆయన కథలలో సర్వత్రా కనబడే మానవతా విలువలకు ఈ కథ అద్దం పడుతుంది. అంతేకాదు - ఈనాటి సమకాలీన సమాజాన్ని పట్టి పీడిస్తున్న ఎన్నో సమస్యలకు మూలకారణమైన మానవ ప్రవృత్తిని మనం మరిచిపోలేని రీతిలో మన కళ్ళముందు వుంచుతుంది ఈ కథ.

ఈ కథలోని గోవిందన్‌కుట్టి పొట్ట చేత్తో పట్టుకుని ఎక్కడో కేరళ రాష్ట్రం నుంచి ఆంధ్రప్రాంతంలోని ఒక చిన్న గ్రామంలో హోటల్ పెట్టుకోడానికి వచ్చిన ఒక చిన్న 'వ్యాపారస్తుడు మాత్రమే కావచ్చును. కాని - అతడిలో మనుషులను ప్రేమించగల, వాళ్ళ తప్పుల్ని క్షమించగల మహోన్నతమైన మానవతా విలువలు వున్నాయి. ఎదురు దెబ్బలకు కృంగిపోని గుండె ధైర్యము, బ్రతుకు పట్ల నమ్మకము కూడా వున్నాయి.

ఆ వూళ్ళో పని పాటలు చేసుకుని బ్రతికే 'పెంటి'ని - తన సాటి వ్యాపారస్తుడయిన కన్నమనాయుడు అవసరానికి వాడుకొని గర్భవతిని చేసి, ఛీదరించుకుని వదిలేస్తే ఆమెకు పుట్టిన బిడ్డను గోవిందన్‌కుట్టి పెంచుకున్నాడు. అంతేకాదు - ఆమెను ఒక మనిషిగా ఆదరించడం మాత్రమే కాకుండా ఆమెకు తాళికట్టి జీవితంలో స్థిరత్వాన్ని ప్రసాదించాడు.

పెంటితో తనకు పెళ్ళి జరిగే రోజునే గోవిందన్‌కుట్టి తన టీ దుకాణంలో పావలాలతో నిండిన సీసాను పెట్టి - అందులో ఎంత డబ్బు వుందో సరిగ్గా చెప్పగలిగినవాళ్ళకు క్రిస్ట్మస్ పండుగ రోజున ఆ డబ్బు ఇచ్చేస్తానన్నాడు. అందుకు ప్రవేశ రుసుము పావలా పెట్టి తన దుకాణంలో ఏదయినా తిను బండారం కొనుక్కోవడం. దీనివల్ల గోవిందన్‌కుట్టి దుకాణంలో అమ్మకాలు పెరిగాయి. పావలా సామాను కొనుక్కొని పేరు రాయించుకొనే వారి సంఖ్య రోజురోజుకూ పెరిగిపోయింది. దీని ఫలితంగా కన్నమనాయుడు దుకాణం మూత పడింది. మరో వ్యాపారాన్ని అతడు వెదుక్కోవలసి వచ్చింది. ఆధునిక పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో అమ్మకాలు పెంచుకొనేందుకు వ్యాపారస్తులు అవలంబించే విధానాలకు - గోవిందన్ కుట్టి 'వెండి సీసా' - అనే 'పావలాల' సీసా ఓ చిన్న ఉదాహరణ కావచ్చు. ఈ వ్యాపారానికి అతడి 'మలయాళీ బుర్ర' కొంత తోడ్పాటు యిచ్చి వుండవచ్చు. అంతకు మించి, గోవిందన్ కుట్టి విషయంలో దోషంగా చెప్పుకో దగ్గది ఏమీ లేదు.

అయితే కథ చివర్లో అనాథ బాలుడు 'బూతప్ప' పావలాల లెక్క సరిగా చెప్పి బహుమతిని గెలవడంతో గోవిందన్‌కుట్టి అదృష్టం తారుమారయింది. గోవిందన్ కుట్టి, బూతప్పతో లాలూచీ పడ్డాడన్నారు ప్రజలు. యిందులో వాస్తవం ఎంత వున్నప్పటికీ- "వాడూ మళయాళీ వోడే-వీడూ మళయాళీ వోడే- అందరి డబ్బూ అళ్ళవోడికి దొబ్బ పెట్టాడు-" అన్న కన్నమనాయుడు మాటల్లో మాత్రం వాస్తవం లేదు. కడుపు మంట మాత్రమే వున్నది.

గోవిందన్‌కుట్టి చేసిన పనిలో ప్రాంతీయ తత్త్వం లేదు. అనాథగా బ్రతుకుతూ - పసితనంలోనే పొట్ట చేత్తో పట్టుకుని చాకిరీ చెయ్యవలసి వచ్చిన బూతప్ప గుండెలలో చదువుకోవాలని కొండంత ఆశ వున్నదని తెలిసి, - ఆర్థికంగా సహాయం చేసి, వాణ్ణి మనిషిగా నిలబెడదామన్న మానవతా దృక్పథం మాత్రమే వున్నది. - అయితే, అందరూ "మళయాళీలు - నక్సలైట్లు - తెలుగోళ్ళను దోచుకోడానికి వచ్చారు నా కొడుకులు. తన్నండి. కొట్టండి" అనే ప్రాంతీయ తత్త్వపు విష కోరల్లోంచి వెలువడే విషజ్వాలలలో గోవిందన్‌కుట్టి మానవతా విలువలు మలమలా మాడిపోయినా మనిషిగా తన కర్తవ్యాన్ని నెరవేర్చేందుకు అతడు ఎప్పుడూ వెనుకంజ వెయ్యలేదు.

అసూయా ద్వేషాల ఫలితంగా గోవిందన్‌కుట్టి యిరవయ్యేళ్ళ కష్టం - అతని దుకాణం నేలపాలయ్యింది. యింత జరిగినా గోవిందన్‌కుట్టి నిరాశతో కృంగిపోలేదు. తాను తప్పుచేశానేమోనని అనవసరంగా ఆందోళన చెందలేదు. - నేలపాలయిన కష్టాన్ని తలచుకుని తల్లడిల్లి పోతున్న పెంటితో అంటాడతడు - "యాడో ఓ చోట బ్రతకలేకపోం- భారత దేశం చాలా పెద్దది".

గోవిందన్‌కుట్టిలోని ఈ అచంచలమైన ఆత్మ విశ్వాసం - మానవతా విలువలు ఆరిపోవనే ఆశావాదానికి ప్రతీకగా నిలుస్తుంది. కథకుడుగా పద్మరాజు ఆశించింది అదే.

---

# 5

## గోపీచంద్ - "ఆపద్బాంధవ్యం"



**1910**లో గురజాడ అప్పారావుగారు "ఆంధ్రభారతి"లో "దిద్దుబాటు" కథను ప్రచురించి సమకాలీన సమాజాన్ని దిద్దుదామని ప్రయత్నించిన సంవత్సరము, త్రిపురనేని రామస్వామి చౌదరి గారి కుమారుడుగా గోపీచంద్ జన్మించిన సంవత్సరమూ ఒకటే!

జేమ్స్ మిల్ దగ్గిర నుంచి జాన్ స్టువార్ట్ మిల్ "ఎందుకు?" అనే ప్రశ్న నేర్చుకున్నట్టుగా తండ్రి దగ్గర నుంచి "ఎందుకు?" అనే ప్రశ్నను గోపీచంద్ పుణికి పుచ్చుకున్నాడు. గోపిచంద్‌ను నిరంతర అన్వేషణకు గురిచేసింది ఈ ప్రశ్నే!

ఈ అన్వేషణ ఫలితంగానే గోపీచంద్ మార్క్సిస్టు సిద్ధాంతాల నుంచి రాయిస్టు సిద్ధాంతాలకు, అటునుంచి అరవింద దర్శనానికి చేరువయ్యాడు. హేతువాదంలో పుట్టి పెరిగిన గోపీచంద్‌కు "హేతువాదం మనోవీధిలో వున్నంతవరకు ఫరవాలేదు. కాని, జీవితంలో ప్రవేశించి పరిపాలించదానికి పూనుకునేటప్పటికి సిద్ధాంతంగా తయారయి ప్రతి అభివృద్ధి కదలికకూ అడ్డుగా నిలుస్తుంది" అనే అరవింద వాక్యాలలోని ఆధ్యాత్మిక దృక్పథం ముందుకు తీసుకువెళ్ళిందా లేక వెనక్కు తీసుకువెళ్ళిందా అనే ప్రశ్నను ప్రక్కకు పెట్టి ఆలోచిస్తే, గోపీచంద్‌లోని ఈ భావ పరిణామాలన్నింటి ప్రభావం అతని సాహిత్య సృష్టి అంతటి పైన – ముఖ్యంగా అతని కథా సాహిత్యంపైన కనబడుతుంది. "నా మనస్సు పడే ఆరాటాన్ని ఒకరికి చెప్పుకోడానికే కథలు రాశాను" అంటాడు గోపీచంద్.

వెనుకటి తరపు ప్రసిద్ధ కథకుల్లో వున్న పాశ్చాత్య సాహిత్య పాండిత్యానికి గోపీచంద్ కూడా తార్కాణంగా నిలుస్తాడు. చెహోవ్, గోర్కి, పుష్కిన్, బేట్స్ మొదలయిన ఎందరో కథకుల కథలు అతనికి సుపరిచితం.

అంతేకాదు, ప్లేటో నుంచి సార్త్రె వరకు ఎందరో తత్త్వవేత్తల సిద్ధాంతాలను అతను మధించాడు. అయితే ప్రతి సిద్ధాంతానికి గల బొమ్మ, బొరుసులను చూడగల శక్తి అతనికి

వున్నది. ఈ కారణం చేతనే అతని కథలు ఏదో ఒక సిద్ధాంతానికి కట్టుబడి వుండవు. ఏదో ఒక చట్రంలో ఇమడవు.

"ఎప్పుడయితే మనం ఒక చట్రాన్ని నిర్మించుకున్నామో– అప్పుడే దానిలో ఇమడని జీవితం అంటూ ఒకటి వుండడం కూడా తప్పదు. అందుచేత– మనం చెయ్యగలిగింది జీవితాన్ని సమగ్రంగా ప్రదర్శించగల అనువైన దృష్టిని నిర్మించుకొనడం – దీనివల్ల చట్రం సడలవచ్చు. అయినా నష్టం ఏముంది?" అంటాడు గోపీచంద్!– గోపీచంద్‌కు 'జీవితం' ముఖ్యం. అయితే గోపీచంద్ అంటాడు కదా– "జీవితం పట్ల నాకు ఏదో ఒక ప్రత్యేకమైన పద్ధతి లేనట్టే నా కథా రచనకు కూడా లేదనిపిస్తుంది!" అని!

కొందరు అభ్యుదయ రచయితల మాదిరిగా గోపీచంద్ 'బీదవాళ్లంతా ఒక్కటే' అంటూ కథలు రాశాడు. హేతువాదపు పరిధిని విస్మరించకుండా 'వంక' వంటి కథలు రాశాడు. ఒకప్పుడు వున్న చలం ప్రభంజనం సరళిలో 'పతివ్రత ఆంతరంగికం' బయట పెట్టాడు. (ఇందులో ఫ్రాయిడ్ ప్రతీకల్ని కూడా విస్తృతంగా వాడడం జరిగింది) 'హిందూ పాతివ్రత్యాన్ని' గేలిచేశారు. 'సంపెంగ పువ్వు' కథలో సంపెంగ లాంటి అమ్మాయి కథ జ్ఞాపకం వుంది కదా!– ఇలా రాసిన గోపీచంద్ 'వెంకటచలం పాత్ర'ను విమర్శించడానికి వెనుకాడలేదు.

సిద్ధాంతాల విషయంలో మాదిరిగానే– కథా శిల్పం విషయంలో కూడా గోపీచంద్ ఏదో ఒక చట్రానికి ఒదిగినవాడు కాదు. అతని కథలు కొన్ని సందర్భాలలో కథానికా లక్షణాలను కోల్పోయి వ్యాసం లాగానో, స్కెచెస్‌లాగానో తయారవుతాయనే విమర్శ కూడా వుంది.

ఇందుకు గోపీచంద్ ఏమంటాడంటే– "విషయానికో, భావానికో ప్రాధాన్యత ఇచ్చినప్పుడు కథ వ్యాసానికి దగ్గరగా వున్నట్టు కనిపిస్తుంది. ఒక పాత్ర పరిశీలనకు అన్నీ కథలే!" అని.

నిజానికి గోపీచంద్ కథాశిల్పం గురించి కొందరుకథకుల్లా అనవసర తాపత్రయం పడలేదు. "–శిల్పం ఎంత నిరాడంబరంగా వుంటే నా మనస్సుకు అంత ఆహ్లాదం కలుగుతుంది. నిరాడంబరంలో పెద్ద శిల్పం వుందని నా నమ్మకం" అంటాడతను.

గోపీచంద్ సిద్ధాంతాల గురించి, అతని రచనా శిల్పం గురించి సంబంధించిన చర్చ మాట ఎలా వున్నా, అతని కథలలో ఆణిముత్యాల్లాంటి కథలను చెప్పమంటే –

"ధర్మవడ్డీ", "కూపస్థ మండూక్యం", "భార్యల్లోనే వుంది", "జనానా", "ఆత్మ విశ్వాసం" మొదలయిన ఎన్నో కథలు జ్ఞాపకానికి వస్తాయి. నాకు మాత్రం "ఆపద్బాంధవ్యం" కథ అంటే ఎంతో ఇష్టం. అన్ని కాలాలకు సంబంధించి ఒకే మాదిరిగా వుండే మానవ స్వభావం యొక్క మౌలికమైన గుణం ఆ కథలో అందంగా కనబడి నన్నెంతో ఆకట్టుకుంది.

మనిషిని మనిషి నుంచి దూరం చేయడానికి ఆర్థికపరమైన, అధికారపరమైన ఎన్నో కొలబద్దలు వున్నాయి. మనిషికీ మనిషికి మధ్య మనిషి తనకు తానుగా కట్టుకునే అడ్డుగోడల కథ ఈనాటిది కాదు. అయితే – ఈ గోడలను ఛేదించే శక్తి హఠాత్తుగా తారసిల్లినప్పుడు మనుషులు ఒకరికొకరు ఎలా సన్నిహితం అవుతారో– రవ్వంత వ్యంగ్యాన్ని, హాస్యాన్ని కూడా మిళాయించి చెబుతాడు గోపీచంద్ "ఆపద్బాంధవ్యం" కథలో–

ఆర్థికంగా అతనొక మధ్య తరగతి మానవుడు. ఏదో ఒక ప్రభుత్వ ఉద్యోగానికి దరఖాస్తు పెట్టుకుంటే ఇంటర్వ్యూకు రమ్మని పిలుపు వచ్చింది కాని – వెళ్లడానికి చేతిలో డబ్బు లేదు. ఇలాంటి పరిస్థితిలో ఇతని మీద జాలిపడి ఒక స్నేహితుడు ఆర్థిక సహాయం చేస్తే – రైలులో వెడితే సమయానికి అందుకోలేమనే భయంతో విమానం మీద ఢిల్లీకి బయలుదేరతాడు.

విమానంలో ప్రక్కనే కూర్చుంది ఓ అందమైన అమ్మాయి. ఆమెకు విమాన ప్రయాణం అలవాటే! ఇతగాడికి మాత్రం అదే ప్రథమ అనుభవం. ఆ అమ్మాయితో మాట్లాడాలని మనసులో తహ తహ – కాని, ఆమెకు ఇతడి పట్ల నిర్లక్ష్యం. కథ ఇలా జరుగుతూండగా నాగపూర్ దాటాక విమానం ఆపదలో చిక్కుకుంటుంది. విమానం కూలి పోతుందేమోనన్న భయం అందరిలోను అలుముకుంటుంది. మృత్యు భయం వికటాట్టహాసం చేస్తూ వుంటుంది.

ఇలాంటి స్థితిలో తన మనసులో ధైర్యాన్ని నింపుకోవడం కోసం– ప్రక్కనున్న అమ్మాయి ఇతడికి సన్నిహితురాలవుతుంది. తన వ్యక్తిగత జీవితపు కథ అడగకుండానే చెబుతుంది. భర్తపట్ల తనకు గల వైముఖ్యాన్ని గురించి, తన కోసం ఢిల్లీలో ఎదురుచూస్తున్న ప్రియుడి గురించి చెబుతుంది. ఆ ప్రియుణ్ణి కలుసుకోకుండానే చనిపోతానేమోనన్న భయం. ఇతగాడు ఆమెకు ధైర్యం చెప్పి ఊరట కలిగిస్తాడు. తన భుజం మీద వాలి ఆమె పడుకుంటే– తనకు ఆమె ఎంతో సన్నిహితురాలన్న భ్రాంతి. మనిషికి మనిషికి మధ్య వున్న అడ్డుగోడలు కూలిపోయిన మధుర క్షణా లవి.

ఆ 'విమాన స్నేహితురాలు' అతడికి ఢిల్లీలో ఉద్యోగం దొరికేలా చేస్తానంటుంది. తన ప్రియుడి ఇంట్లో అతిథిగా వుండమంటుంది. ఇంత దగ్గరగా వచ్చిన ఆ 'స్నేహితురాలు'

విమానం ప్రమాదం నుంచి బయటపడిందని తెలియగానే మొహం పక్కకు తిప్పుకుంటుంది. సాన్నిహిత్యాన్ని తగ్గిస్తుంది. ఢిల్లీ ఎయిర్‌పోర్టులో కనీసం మాట మర్యాదకు వెడుతున్నానని చెప్పకుండా విమానం దిగి వెళ్లిపోతుంది. మరచిపోయిన పుస్తకాన్ని అందిచ్చినా 'థ్యాంక్స్' తప్ప మరో మాట లేదు! క్షణం క్రితం కూలిపోయిన అడ్డుగోడలు మళ్ళీ పదిలంగా, దిట్టంగా లేచాయి!

మానవ జీవితంలో 'అవసరార్థం' ఏర్పడిన స్నేహాల కథలన్నీ ఇంతే! ఈ కథను కాస్తంత పొడిగించి చూస్తే – ఎందరో మనుషుల మధ్యగల వ్యాపార సంబంధాల అసలు కథ బయటపడుతుంది! మానవ మనస్తత్వానికి అద్దం పడతాడు గోపీచంద్ ఈ కథలో!

తెలుగు సాహిత్యానికి "ఎదద, మెదడుల విందు"ను (ఆరుద్ర అన్నట్టు) సమకూర్చిన గోపీచంద్ మంచి కథలలో ఇది ఓ మచ్చుతునక మాత్రమే!



# 6

## తిలక్ - "ఆశాకిరణం"



"నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసిన దయాపారావతాలు
నా అక్షరాలు ప్రజాశక్తులవహించే విజయ ఐరావతాలు
నా అక్షరాలు వెన్నెల్లో ఆడుకునే అందమైన ఆడపిల్లలు....."

అని చెప్పుకున్న దేవరకొండ బాలగంగాధర తిలక్ కథ రాసినా, కవిత్వం రాసినా, నాటికను రాసినా, తన అక్షరాలకు అన్నింటా ఈ ప్రత్యేకతను సమకూరుస్తూనే వచ్చాడు. భావకవులలోని సౌందర్య దృష్టిని - అభ్యుదయ కవుల సామాజిక దృష్టిని పుణికి పుచ్చుకున్న తిలక్ రచయితగా ఏ తరహా 'యిజమ్'కు లోబడిన వాడుకాదు. 'నా కవిత్వం కాదొక తత్వం' అని ప్రకటించుకున్న తిలక్ కవితల్లాగానే తన కథలను కూడా 'అంతరాంతర జ్యోతిస్సీమలను' బహిర్గతం చెయ్యడానికే నిర్దేశించుకున్నాడు.

మానవాళి కథనంతటిని గుండె లోతుల్లోంచి తిలకించి వాళ్ల బలహీనతల్ని, లేకితనాన్ని, కలల్నీ, కన్నీటినీ, సమగ్రంగా అవలోకించగల నిశితమైన దృష్టి తిలక్‌ది. 'అద్దంలో జిన్నా' గుండెలకంటుకున్న రక్తపు మరకను తిలక్ చూడగలిగాడు. గుళ్లో అడుగుపెట్టడానికి కూడా ఇష్టపడని నాస్తికుణ్ణి 'దేముణ్ణి చూసి వాడు'గా గుర్తించగలిగాడు. 'సముద్రం అంచుల'వరకూ విస్తరిల్లిన దారిద్ర్యం రాచపుండులా కొరికేస్తుండి ఆర్థికంగా అట్టడుగు స్థాయికి చేరిన బడుగు జీవుల దయనీయ గాథకు భాష్యం చెప్పగలిగాడు. తిలక్ ఏం రాసినా అది మానవతా విలువలతో కళకళలాడుతుంది. అది సామ్యవాదంగానీ - మరొకవాదంగానీ - దానికతడు జవాబు దారీకాడు. 'సముద్రపు అంచులు' కథలో చివరి భాగం జ్ఞాపకం వుందా?-

"సముద్రంలో పడి సచ్చిపోదామనుకున్నాడు గానీ .... సావనేదు....." అంటాడు వీరయ్య.

"..... మరి మన యిల్లు మాట ఏంటీ ఈరయ్య బావా?.... అంటుంది చంద్రి.

"…. ఉత్తిది. అంతా ఉత్తిది. మనం ఇంతే…. ఇలాగే వుంటాం. వెదవ ఆశ. అంతే!…." అంటాడు వీరయ్య.

'కన్నీటి జడులలో తడిసిన దయాపారావతాలు' కావూ ఈ అక్షరాలు అన్నీ! సిద్ధాంత చర్చ గురించిన విషయం ఏమైతేనేం? 'కథలో ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించడానికి గాని, బలపరచడానికి గాని చేసే ప్రయత్నం కథా శిల్పంలోని ఒక ముఖ్యమైన దోషం' అనేది తిలక్ దృక్పథం.

చాలామంది తెలుగు కథల్తో పోల్చి చూస్తే తిలక్ రాసిన కథలు చాలా తక్కువే! మూడు పదులకు మించవు ఆయన కథలు. తాను జీవించింది కొద్ది కాలమే అయినా చిరకాలం మిగలగల కథలు రచించిన ఘనత తిలక్‌ది. తిలక్ కథల్లో 'ఊరుచివరి ఇల్లు,' 'నల్లజర్ల రోడ్డు', 'సుందరీ, సుబ్బారావు' మొదలయినవి ప్రసిద్ధ కథలు, ఈ కథలలో లేని ఒక ప్రత్యేకత 'ఆశాకిరణం' కథలో వుందనిపిస్తుంది నాకు.

ఈ కథలకు వున్న కాల్పనికతగాని, ఇతివృత్తం గాని 'ఆశాకిరణం'కు లేకపోవచ్చు. నిడివిబట్టి కూడా వాటికన్నా ఇది చిన్న కథ. అయితే కథా కథన రీతిలో ఒక అరుదయిన పరిపూర్ణత ఈ కథలో నాకు కనబడింది.

అంతేకాదు – సమకాలీన సమాజపు వికృత రూపాన్ని ఏ మాత్రమూ దాపరికం లేకుండా, చుట్టు తిరుగుడు ధోరణిలో కాకుండా సరాసరి గుండెలకు హత్తుకునేలా చెబుతాడు తిలక్ ఈ కథలో. మనం ఎంతో గొప్పవిగా చెప్పుకునే విలువలు, .. ఉదాత్తమైనవిగా చిత్రించుకునే 'సెంటిమెంట్స్' ఆకలి సమస్య ముందు నిలవలేక, బలహీనమై ఎలా మలమల మాడిపోతాయో తెలుస్తుంది. ఈ కథ చదివితే–

వెంకటేశ్వర్లు బ్రతకలేని బడి పంతులు. చాలా మంది బడి పంతుళ్ళలాగా బ్రతుకును వెళ్ళమార్చుకునే వాడేగాని – మధ్యలో రవ్వంత 'రసహృదయ'మూ, మరికాస్త బద్ధకమూ తోడయి క్లాసులో నిద్రపోయిన నేరానికి 'స్కూల్ ఇన్‌స్పెక్ట్రెస్' ఆగ్రహానికి గురి అయ్యాడు. ఆవిడగారు ఇతనితో అన్నాళ్ళూ చనువుగాను, సరదాగాను మెలిగిన వ్యక్తి కావడంచేత… క్షమార్పణ చెప్పుకోడానికి పైట పట్టుకోబోతే అది కాస్తా ఊడింది. అంతటితోనే ఆగక ఉద్యోగమూ ఊడింది. బ్రతుకు బజారున పడింది.

బ్రతకడానికి వెంకటేశ్వర్లు ఏ మార్గం తొక్కుదామన్నా కలసి రాలేదు. చేతిలో కానీ లేని స్థితిలో తినడానికి తిండిలేక – "పెళ్లామూ, అయిదుగురు పిల్లలూ ఏ ఆకలి వల్లనో చచ్చిపడిపోయి వుంటే ధైర్యము, కులాసా, కలిగేది….." అనుకునే వెంకటేశ్వర్లు – కొడుకుకోసం భార్య దాచిన అన్నాన్ని దొంగచాటుగా తినెయ్యబోయిన వెంకటేశ్వర్లు – కొడుకు చావు బ్రతుకుల మధ్య వుంటే క్షుద్బాధను అణచుకోలేక తినడానికి ఏమన్నా

వుందా అని భార్యను అడిగి ఆవిడచేత చెంబును ముఖంమీదకు విసిరించుకున్న వెంకటేశ్వర్లు- సాధారణ సభ్య సమాజానికి ఒక అసహ్యాకరమైన 'పురుగు'లాగా కనిపించవచ్చు.

కొడుక్కు జబ్బుచేస్తే వైద్యం చేయించలేని స్థితిలో వున్న వెంకటేశ్వర్లు ఇంట్లోంచి పారిపోయి రెండు రోజులు అక్కడా ఇక్కడా గడిపిన తర్వాత - ఇంటి ముందున్న పొరుగు కుర్రాడితో "- ఏరా మా చిన్నబ్బాయికి జబ్బు చేసిందట- బ్రతికాడా చచ్చిపోయాడా...." అని అడిగిన ప్రశ్న ఆతని అపరాధ భావానికి మాత్రమే దర్పణం అనే విషయాన్ని అందరూ అంగీకరించలేకపోవచ్చు-

ఏది ఏమయితేనేం చివరకు చద్దామని నిర్ణయించుకుని రైలు కట్టదగ్గిరకు వెడుతున్న వెంకటేశ్వర్లును ఓ పెద్ద మనిషి పిలిచి - "కన్న కూతురును పల్లిగ్గా తారుస్తావా?- ఏజంటుగాడి దగ్గర నీ కూతురు పదిహేను రూపాయిలకు కుదిరింది" అంటూ లాడ్జింగులో వెంకటేశ్వర్లు కూతుర్ని చూచిన పెద్ద మనిషి కులప్రతిష్ఠ గురించి లబోదిబోమంటూ వుంటే... వెంకటేశ్వర్లుకి మాత్రం "ఏదో ఆనందంలాంటి కాంతి' ముఖంమీద కమ్మిందట! నడి సముద్రంలో కొట్టుకుపోతున్న అతడికి ఏదో నావ దొరికినట్టనిపించిందట! బ్రతకడానికి మార్గం దొరికింది కాబట్టి చావనక్కరలేదనుకుంటాడు.

ఇది చదివిన పాఠకులకు జుగుప్స కలగవచ్చు. వీడూ ఒక తండ్రేనా అని కూడా అనిపించవచ్చు. నిజమే వెంకటేశ్లర్లు 'తండ్రి' అనే పదానికి అనర్హుడు కావచ్చు. కాని అతను 'ఆకలి'ని జయించలేని మనిషి, బ్రతకడానికి తిండి కావాలని కోరుకునే మనిషి.

ఆ రోజు వెంకటేశ్వర్లు చావుని వాయిదా వేసుకుని, ఇంటికి వెళ్లి కడుపునిండా 'తిండి' తిన్నాడు. ఆకలిని తీర్చే 'పడుపుకూడు!....' .... గుండెల్ని పిండే వాస్తవం ఇది.

ఆకల్ని తీర్చుకున్న వెంకటేశ్వర్లు కూతురుకు 'కృతజ్ఞత' తెలుపుదామనుకున్నాడు గాని... ఆమె వెక్కి వెక్కి ఏడుస్తూండడం చూచి తన 'వందన సమర్పణ' కార్యక్రమాన్ని వాయిదా వేసుకున్నాడు!

.... మనం ఎంతో గొప్పగా చెప్పుకునే నైతిక విలువలు, అనుబంధ బాంధవ్యాలు, కడుపు నిండిన తర్వాత మాత్రమే అనుభవంలోకి వస్తాయని..... కాలే కడుపుకు ఆకలి తీర్చుకోవడం ఎలా? అని ఆటవిక ధర్మానికి మించిన నీతి మరొకటి కనబడదని... గుండెలకు హత్తుకునేలా చెబుతుంది ఈ కథ.... అంతేకాదు.... ఆకలి సమస్యను పరిష్కరించలేని సమాజం విలువలను కాపాడుకోలేదనే హెచ్చరిక కూడా పరోక్షంగా వినబడుతుంది.

.... ప్రేమ్‌చంద్ "కఫన్" స్థాయిలో కలకాలం జ్ఞాపకం వుంచుకోతగ్గ కథ ఇది!

---

# 7

## శ్రీపాదవారి "వడ్ల గింజలు"



"దేశ భాషలందు తెలుగు లెస్స" అనే దాంట్లో స్వోత్కర్ష వుందో లేదో నాకు తెలియదు గానీ - తెలుగు భాష వ్యావహారిక పలుకుబడిలో వున్న సొగసుల్ని, సోయగాల్ని సంతరించుకున్న శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి కథలు చదివిన వాళ్ళకు అదొక తిరుగులేని సత్యంలాగానే అనిపిస్తుంది. ఈ కథల్ని - ఇంకో భాషలోకి ఇంత అందంగా అనువదించగల 'మొనగాడేడీ' అనిపించడమూ సహజమే!- 'చిన్న కథల' పేరుతో ఎన్నో 'పెద్ద కథల'ను రాసి తెలుగు కథామతల్లికి పెద్ద పీటను వేసిన వారిలో శాస్త్రిగారు ముఖ్యులు.

కథకు 'శైలి' అనేది ఊపిరి అవునా కాదా అనే విషయం చర్చనీయాంశం అని అనుకునేటప్పటికీ శాస్త్రిగారి కథలకు అంతటి అపురూపమైన అందాల్ని సమకూర్చి పెట్టింది అనితర సాధ్యమైన ఆయన భాషాశైలి. ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే- ఇంతటి కలకండ వంటి భాషను తన సొత్తు చేసుకున్న శాస్త్రిగారు అంటారు కదా "స్త్రీలను ఆశ్రయించే తెలుసుకున్నాను తెలుగు భాష. ప్రయోగ విజ్ఞానం కూడా స్త్రీల వల్లనే నాకు అలవడింది" అని! ఇంతటితో వూరుకోక- "- ఈవాళ నేను రాస్తున్న భాష వారనుగ్రహించిన దానిలో సహస్రాంశమే-" అనడం కూడా ఆసక్తి దాయకంగానే వుంటుంది.

ఇది ఇట్లా వుండనివ్వండి. కథలకు 'అన్నంత పనీ అయ్యింది', 'జన్మానికల్లా ఒక ముద్దు', 'ఇద్దరమూ ఒక చోటకే పోదాం', 'పెండ్లాడ దగ్గర మొగాడేడీ' వంటి ఆసక్తిదాయకమైన మకుటాలను పెట్టిన కథకులు కూడా అరుదుగానే కనబడతాడు.

కొంత మంది ఆధునిక కథకుల్లా ఆయనకు ఆంగ్ల సాహిత్య పరిచయం లేకపోవచ్చు. పాశ్చాత్య సాహిత్య దృక్పథాల గురించిన పుస్తక పాండిత్యం కూడా లేకపోవచ్చు. కాని, ఆయన జీవితాన్ని క్షుణ్ణంగా చదువుకున్నాడు. ఒక తరపు శ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబాల జీవితమూ నాటి గ్రామీణ జీవనము- జమీందారుల, ముఖ్యంగా క్షత్రియ ప్రభువుల మర్యాదలు- వారి రస హృదయము-దివాణాలలో వుండే మతలబులు-వీటన్నింటిపైనా ఆయనకు ఒక అధికారికమైన అవగాహన వున్నది. దీనికి తోడుగా రవ్వంత లౌక్యము, వ్యంగ్యము వున్నాయి. వీటన్నింటి కలగలుపుకొనే నిండైన, నిఖార్సయిన తెలుగు కథ శాస్త్రిగారి లేఖిని నుండి జాలువారింది. అంతే కాదు. ఆధునిక కథకు అలంకారాలు

గానో, ఆవశ్యకాలుగానో, పాశ్చాత్య పండితులు చెప్పే ఏ అంశంలోనూ శాస్త్రిగారి కథలు తీసికట్టుగా కనబడవు. పై పెచ్చు ఎంతో ఎత్తున కనబడతాయి.

మరొక్క మాట– శ్రీపాదవారి కథల్లో వెనుకటి తరం వాతావరణం కనబడవచ్చునేమో గాని ఆయన కథల్లో ద్యోతకం అయ్యే సత్యం కేవలం ఒక తరానికి మట్టుకు సంబంధించింది మాత్రమే కాదు. 'కలుపు మొక్కలు' కథను ఒక్కమారు జ్ఞాపకం చేసుకోండి. బల్లకింద చెయ్యిపెట్టి అక్కడ పనిపూర్తయితేనే గాని – కాగితం మీద కలం పెట్టడానికి యిష్టపడని 'కలుపు మొక్కలు' ఎన్ని కార్యాలయాలలో కనబడడంలేదు? వీటిని పెకలించడం అన్నది ఈనాటికీ సిద్ధాంతంగానే మిగిలిపోతున్నది కదా? "మా అందరికీ ఆధారం చూపించబోతున్నందున తమ కొక్క మణుగు నెయ్యి, ఏ పులుసులోకయినా పనికి వస్తుంది ఒక బుట్టెడు బెల్లం, ఏ రొట్టె ముక్కలోకయినా వాడుకోడానికి డబ్బా తేనె పానకం" అనే ఆశ్రితుల 'భాష' మాత్రం ప్రస్తుత 'నాగరికత'లో మరో విధంగా వుండవచ్చు. అది వేరే విషయం.

శ్రీపాదవారి కథలలో "వడ్లగింజలు" చాలా ప్రసిద్ధమైంది. శాస్త్రిగారికి యిష్టమైన కథలలో ఈ పెద్ద కథ కూడా ఒకటి. "వడ్ల గింజలు" కథలో– "ఒక గోచి పాత కట్టుకుని, మరో గోచి పాత కప్పుకుని" వుండే గర్భ దరిద్రుడయిన తంగిరాల శంకరప్పకు చదరంగ విద్యావైదుష్యం వుంది. లౌక్యము, బ్రతక నేర్చితనమూ కూడా వుంది. అంతే కాదు. పెద్దాపురం ప్రభువులు చతుర్భుజ తిమ్మ జగపతి మహారాజుగారి చదరంగ క్రీడా ప్రియత్వము, రసికత, దానగరిమ వున్నాయి.

అయితే దీనికి గ్రహణం పట్టించగల తానేదారు దివాన్జీ వంటి "పూజారుల"– కాఠిన్యము, వివేకహీనత కూడా వున్నది. ఇవి అన్నీ ఒక ఎత్తు– చదరంగం బల్లను అడ్డం పెట్టుకుని–బ్రతుకు చదరంగం ఆటలో ప్రత్యర్థుల ఆట కట్టించాలంటే నేర్వవలసిన ఎత్తులను శాస్త్రిగారు పరోక్షంగా చెప్పిన తీరు మరొక ఎత్తు.

ఒక విధంగా చెప్పాలంటే – శాస్త్రిగారి మరొక గొప్ప కథ "గులాబీ అత్తరు"కు ''వడ్ల గింజలు'' కథ కొనసాగింపుగా కనబడుతుంది. ''–తిమ్మ జగపతి మహారాజులుంగారంటే చదరంగం ఆటలో నిధి అని దిగ్దంతులు ఘోష పెడుతూ వుండడం వల్ల – వొక్కమారు ఒక్క ఆట వారితో ఆడాలని–" శంకరప్ప పని గట్టుకుని పెద్దాపురం వచ్చినట్టే, "గులాబీ అత్తరు" కథలో అత్తరు సాహెబు ఖాను– ప్రభువులకు గులాబీ అత్తరు ప్రీతిపాత్రం అని విని రెండు సంవత్సరాలు కష్టపడి గులాబీ అత్తరు తయారుచేసి ఢిల్లీ నుంచి వచ్చాడు. కాని "కిట్టింపు ధర" అడిగి, అతని అత్తరు ఘుమ ఘుమలను "కంపు"గా హేళన చేసిన రాజోద్యోగుల అవమానాలను అతను తట్టుకోగలిగాడా?– చివరకు విసుగెత్తి ప్రభువులకు దక్కవలసిన అత్తరును కోపంతో కోట గోడకు విసిరి నేలపాలు చేశాడు కాదూ?–

కాని – "వడ్ల గింజలు" కథలోని శంకరప్ప అలాంటి అమాయకుడేం కాదు. తన చదరంగ విద్యా గంధాన్ని ఆస్వాదించగల వారికి అందివ్వగల లౌక్యం అతడికి వుంది. ప్రభు దర్శనం వీలుకాదని దివాన్జీ మెడపట్టి బయటకు గెంటించినా–పూటకూళ్ళ పెద్దమ్మ సలహాతో–వూళ్ళో వున్న పెద్దలందరికీ తన చదరంగ విద్యా వైదుష్యాన్ని రుచి చూపించాడు. శాస్త్రులు, యాజులు, మొదలుకొని – మహారాజుకు సన్నిహితులయిన విజయరామరాజు, అప్పల నరసింహరాజు, మొదలగు పెద్దలకే కాదు – మహారాజుగారి చదరంగం బల్ల సర్దే వేశ్య రంగనాయకి వరకూ అందరిచేత ఆటలో 'సెభాష్' అనిపించుకున్నాడు. గురుతుల్యుడయ్యాడు.

సాక్షాత్తూ సామర్లకోట శ్రీరావు రాయదప్ప రంగారాయణింగారు ఆటకు రమ్మని ఆహ్వానించి పల్లకీని పంపించినా– పెద్దాపురంలో రాజకార్యం ముగిసిందాకా రానన్నాడు. ఇలా–శంకరప్ప ఖ్యాతి ఊరంతా గుప్పుమన్నాక– ప్రభువు తనకు తానుగా శంకరప్పను ఆహ్వానించకుండా వుండగలడా? – ప్రభువులకు సన్నిహితులయిన వారి నెందరినో శంకరప్ప ఇదివరకే శిష్య సమానులను చేసుకున్నాడాయే–

ప్రభువుల వారితో శంకర్ప ఆడిన ఆట ఓ పట్టాన కొలిక్కి రాలేదు. మరొక ఎత్తు వేస్తే 'త్రోసిరాజు ఆటకట్టు' అవడం ఖాయం. అష్ట దిగ్బంధంగా వుంది ప్రభువుకు. ఆరు నెలలు శంకరప్పతో రోజూ ఆ కబురూ, ఈ కబురూ చెప్పి చివరకు "దాసోహం" అనక తప్పలేదు. దానశీలుడయిన ప్రభువు శంకరప్పను కోరిక కోరుకోమంటే–మురిపించి, మురిపించి – చివరకు చదరంగం బల్ల దగ్గరకే వచ్చాడు. చదరంగపు బల్లమీద మొదటి గడిలో ఒక ధాన్యం గింజపెట్టి – అలా రెట్టింపు చేస్తూ వెళ్ళమన్నాడు.

చివరకు అది–వామనుడు బలిచక్రవర్తిని కోరిన కోరికగా తేలింది. పెద్దాపురం మాట దేముడెరుగు–త్రిలింగ దేశంలోని ధాన్యరాసి అంతా పెట్టినా శంకరప్ప కోరిక తీరదని తెలిసింది. ప్రభువు మరొకసారి దాసోహం అయిన తర్వాత అగ్రహారికుడై తన దరిద్రాన్ని వదిలించుకున్నాడు శంకరప్ప.

కథ జనశృతంగా చిరకాలంగా వింటూ వస్తున్నదే కాని, ఈ కథకు శాస్త్రిగారు చెక్కిన అందాలు అనుభవంలో మాత్రమే ఆనందించగలిగిన విషయం. ప్రభువుల యుగం అయినా, ప్రజాస్వామ్యం అయినా కళాకారుడు ఎప్పుడూ ఆశ్రయం కోసం రెప రెపలాడతాడు. అత్తరు సువాసనలను 'కంపు'గా భావించే అధికారులు ఏ యుగంలో నయినా వుండవచ్చు. కాని–శంకరప్ప లాంటి గుండె ధైర్యం, ఆత్మ విశ్వాసం, కళాకారుడికి ఏనాడూ అవశ్యకమే. లేనప్పుడు అత్తరు నేలపాలు కాకతప్పదు. ఇవాళ చదరంగం ఆటకు ఒకనాటి ఆదరణ లేనప్పటికీ–పెద్దాపురం ప్రభువుల వంటి ప్రభువులు ఉన్నప్పటికీ లేనప్పటికీ – "వడ్ల గింజలు" కథ మనకు అందిచ్చే నిరంతర సత్యం మాత్రం అదే!

---

# 8

# మల్లాది వారి "సర్వమంగళ"



**"ముం**దు ముందు ఎప్పుడో మహాభారతం పదిహేను పర్వాలూ తెలుగులోకి రాయబోయే తిక్కన సోమయాజి గార్ని కనబోయే గుంటూరు కొమ్మన్నగారు- నిండు యౌవనం వచ్చీ రావడంతోటే తండ్రితో పోట్లాట పెట్టుకున్నాడు.

కారణం ఏమిటంటే - "గర్భాధానం విషయం!"

- మల్లాది రామకృష్ణ శాస్త్రిగారి 'దుముపులు' కథ ప్రారంభ వాక్యాలు ఇవి.

కథకు అందమైన మకుటాలను వుంచడంలోనూ, మరిన్ని సోయగాలతో కథనాన్ని నడిపించడంలోనూ శాస్త్రిగారిది సంప్రదాయ భాషలో చెప్పాలంటే 'అందెవేసిన చెయ్యి' (సన్మానాలకు, సత్కారాలకు శాస్త్రిగారు దూరంగా వుండేటప్పటికీ!) రాయల యుగంనాటి ఇతివృత్తమైనా, రసికజనమనోభిరామంగా వుండే సమకాలీన సమాజ ఇతివృత్తమైనా- కథ ఎత్తుగడ మొదలుకొని చివరికంటా పన్నీటి జల్లుల్లాంటి శాస్త్రిగారి శైలీ విన్యాసం పాఠకుల్ని పలకరించి అలరించకమానదు. చిన్నదాని చెక్కిలి పుణికేందుకు ఆకసానికి అల్లంత చేరువలో అందీ అందనట్టుగా వున్న కొండ శిఖరాలు, ఆదమరిచి ఆపసోపాలు పడే కన్నెపడుచుల్లాగా వున్న మల్లెల గుబురులూ ('చెంగల్వ' కథ జ్ఞాపకం లేదూ?) చూడాలంటే శాస్త్రిగారి కథలే శరణ్యం.

కొత్తగా సమర్తాడిన సానిపాప ఆశీర్వచనం కోసం తాతగారి దగ్గరకు వచ్చి, వారి ముద్దు ముచ్చటలను పొంది, "కల కించితం" అనడమూ, కొడుక్కి ఐశ్వర్యవంతుల ఒక్కొగానొక్క కుమార్తెతో సంబంధం కుదిరితే- 'మనవాడి ప్రయత్నంలో ఈషత్తులోపం' జరిగి, ఆ పిల్ల కడుపున నలుసు కాయకపోతే ఆస్తి అంతా పరాధీనమవుతుందనే భయంతో పెళ్ళికి ముందు సానిపాప దగ్గిర శృంగార పాఠాల శిక్షణ ఇప్పిందామనుకుంటే- 'ఒరవడి పెడితే ఓం నమశ్శివాయ' వంటబట్టిపోవడమూ ఆపైన సానికూతురే సర్వస్వం అయిపోయి 'పెళ్లాన్నే కాదు, రంభను తీసుకొచ్చి దాఖలు చేసుకో కుచ్ నహీరోలేత్ హునక్ లే' అని తేలిపోవడమూ- శాస్త్రిగారి కథల్లో మళ్ళీ మళ్ళీ చదవాలనిపించదూ? ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ మురిసిపోవాలనిపించదూ?

శాస్త్రిగారి కథలు కవిత్వానికి సన్నిహితంగా వుంటాయి. ఒకటి రెండు సార్లు చదివితేగాని వాటిలోని సారస్యం బోధపడదు. అప్పుడుగాని ఆయనతో చెయ్యి కలిపి "సై" అనుకోము! శాస్త్రిగారిలోని మరొక ప్రత్యేకత తన పాత్రలకి తాళ్ళు బిగించి 'ఇల్లా మాట్లాడండి' అని చెప్పకపోవడం.

" 'తన్మంత్రం బ్రాహ్మణాధీనం' అన్నట్టు కథ నీ చెప్పుచేతల్లో వుండదా? అంటావా?- ఊహు! కథలో ఆడా మగా, పశు పక్ష్యాదులు సైతం తన చెప్పుచేతల్లో వుండకపోవడమే కాకుండా మనల్ని ఎప్పుడు వదిలిపెడతాయో మనకే తెలియదు. మన ఊహాసోహాలతో పగ్గాలు వేసి వాళ్ళను పట్టకుండా వుంటే వాళ్ల పలుకు వాళ్ళు పలికి, వారి కథను వారు నడుపుకుపోతారు!" అనేది శాస్త్రిగారి దృక్పథం.

అందుచేతనే- శాస్త్రిగారు ఏదో ఒక 'నీతి' భోదిద్దామని పని గట్టుకుని కథలు రాయలేదు. "కథకు నీతి ఏమిటి? దానికున్నదల్లా జాతి!" అనగల జాతి కథకుడు ఆయన

అయితే- శాస్త్రిగారి కథల్లోని ఈ తరహా ధోరణి ఆయనకు వెనుక చూపును కలిగించలేదు. 'దుమువులు' కథలో ప్రజాకవి, తన సోదరుడు అయిన గురునాథుడిని చూచి సాక్షాత్తూ తిక్కన సోమయాజి "అన్నా కవే! నేనూ కవేనా? నాదీ ఓ కవిత్వమేనా!" అనే ఆత్మవిమర్శకు గురికావడం- ఆ కథ పాఠకులకు జ్ఞాపకం వుందనే అనుకుంటాను. దేశభక్తిని పెదాలపై పులుముకునే కుహనా దేశభక్తులకన్నా సానిపాపలు ఎంత మెరుగో తెలుస్తుంది 'చైత్రరథం' వంటి కథలు చదివితే!

శాస్త్రిగారి కథల్లో "సర్వమంగళ" కథ నాకు బాగా నచ్చుతుంది. ఈ కథలో ప్రధానంగా కనబడేది రవ్వంత వ్యంగ్యంతో కూడిన శృంగారమే అయినా - కాస్తంత లోతుకు చూడగలిగితే ఒక తరపు సామాజిక సమస్య పట్ల శాస్త్రిగారు పొందిన ఆవేదన అర్థం అవుతుంది. పురుషాధిక్య సమాజంలో అన్యాయానికి గురి అయిన ఒక అబల అంతరంగ ఆవేదనకు అద్దం ఈ కథ.

ఈ కథ గురించి చెబుతూ శాస్త్రిగారు అంటారు కదా-

"వెనుకటికి 'సర్వమంగళ' అనే కథ వుంది... అందులో భోగట్టా ఏమిటి?- ఇద్దరు అక్క చెల్లెళ్ళు... సదరు అక్కయ్యకు వయసూ, వైధవ్యము సంక్రమించాయి.... ఈ ఫలానా చెల్లెలు వున్నదే ఒక వయసు మళ్ళుతూ వున్నవాడికి ద్వితీయా విభక్తి కావడం సంభవించింది.... తదనంతరం పిల్ల కాపురానికి వెళ్ళినప్పుడు ఈ వుపసర్గ కూడా అక్కడకు చేరుకుంది. తదుపరి గిరీశంగారు సాయించినట్లు "ఆదలేడి కన్నులున్న...." ఈ పద్ధతిలో రెండు అచ్చులూ ఒకచోట చేరినప్పుడు వ్యాకరణ కార్యం తప్పదన్నట్లు గాంధర్వ కళ ఒప్పడం, నెల తప్పడం, ఇంతవరకూ మామూలే!-" అని!

- అయితే, - ఈ 'మామూలు' యితివృత్తం శాస్త్రిగారి చేతిలో అద్భుతంగా మలచబడింది.

అక్కగారు మరిదితో చీకటి తప్పు చేసిన మాట నిజమే! అయితే అందులో కారణం కందకావరం కాదు. కొత్తగా కాపురానికి వచ్చిన చెల్లెలు అస్వస్థురాలయి మంచాన పడివుంటే, పనిమనిషితో సరదాలు ప్రారంభించిన మరిదిగారిని సరి అయిన మార్గంలో వుంచడంకోసం ఆమె తనను తాను కాల్చుకున్నది అంటే ఎవరైనా నమ్ముతారా? ఆఖరికి చెల్లెలైనా హర్షించిందా?

అందరూ ఆమెను తప్పు పట్టినవారే. అతడిని పల్లెత్తుమాట అన్నవారెవరూ లేరు. అంతే కాదు- చేసిన పనికి కడుపు వస్తే- అతగాడు పురుటికి రహస్యంగా ఏర్పాట్లుచేసి, ఖర్చంతా భరించాడని అంతా మెచ్చుకున్నారు. ఇలాంటి చెల్లెలు వున్నందుకు అన్నగారిపై కొండంత సానుభూతి చూపించారు.

పుట్టిన బిడ్డను వదిలించుకుని యింటికి తిరిగి వచ్చిన ఆమెను "బాలింతరాలు"గా గుర్తించి గారం చేసేదెవరు? సాటి ఆడది వదినెగారు బిడ్డ నెత్తుకుని తిరిగివస్తే బాలింతరాలిగా మర్యాదలు.

"నేను బాలింతరాలిని కాదూ? నా ముద్దు ముక్కలు చూసేది ఎవరు.. వేకువవేళ లేవకుండా కొంచెం బద్ధకించి మూలిగానో... ఇక అవి దెప్పుళ్ళు కావు, నా తల్లో గుండె చిట్టెం కట్టి పోయింది-" అంటుందామె తనని కడుపులో దాచుకోబోతున్న గంగమ్మ తల్లితో! ఇంతటితో అయిందా- చెల్లెలు జానకి పండంటి బిడ్డను ప్రసవిస్తే- ఏదో జ్ఞాపకం వచ్చి కళ్ళల్లో నీళ్ళు తిరిగితే "చూడలేక నిప్పులు పోసుకుంది" అని చెల్లెలిచేతే నిందలు.

ఇవన్నీ సరే- ఇంత జరిగాకా కూడా- ఇంకా సిగ్గు లేక రాత్రిపూట కాలు గీరిన "మరిది గారిని" ఆమె పిడి గుద్దు గుద్దిందంటే తప్పేముంది? ఆర్థికంగా అసహాయురాలయిన ఆమె ఇక ఎక్కడా తల దాచుకోలేక గంగమ్మ వడిని ఆశ్రయించక తప్పేదేముంది?

జీవితంలో ఆమె అన్ని విధాలా అభాసుపాలయింది. నిజమే! కాని, ఆమెకు ఎవరిమీద ద్వేషం లేదు. చెల్లెలు జానకిని తలుచుకుని "నామీద కోపం దానికి మొగుడిమీద ప్రేమ పుట్టిస్తుంది" అప్పుడు గానీ, "ఆడదానికి తానే సర్వాపోశనం పట్టాలనే తహతహ పుట్టదు. అంతకన్నా మరి నాకు కావలసింది ఏముంది?" అనడం హృదయాలను ద్రవింపచేయదూ?

కోరికలు తీరని ఒక విధవరాలు లోనయిన చీకటి కార్యంలో వున్నది స్వార్థమా? త్యాగమా? అనే సున్నితమైన ప్రశ్నను సమకాలీన ఆర్థిక, సామాజిక సమస్యల లోతుల్లోంచి- హృదయాంతర ఆర్ద్రతలను స్పృశిస్తూ అద్భుతంగా చెబుతుంది ఈ కథ. మృత్యువు ఒడిలో ఒరగబోతున్న ఒక అబల అంతరంగ ఆవేదనగా కథ అంతా ప్రథమపురుషలోనే నడుస్తుంది.

---

# 9

## మునిమాణిక్యం - "బద్‌నసీహత్"



"-దారి పొడుగునా గుండెనెత్తురులు తర్పణం చేస్తూ పదండి ముందుకు అంటారు ఆయన. మీరేమంటారు అని నన్ను ఒకరు అడిగారు. నేను ఎక్కడికీ పొమ్మనను. యింట్లోనే వుండమంటాను. ఒకవేళ ఎక్కడికయినా పనిమీద వెళ్లినా సాయంత్రానికి ఇంటికి వచ్చి ఆవిడ ఇచ్చే కాఫీ పుచ్చుకుని కాసేపు పిల్లలతో హాయిగా ఆడుకుంటూ కాలం గడపమంటాను-" అనే మునిమాణిక్యం నరసింహారావుగారి సాహిత్య దృక్పథం ఈనాటి అభ్యుదయ దృక్పథానికి చాలా దూరంగా కనబడవచ్చు.

"జీవితంలో సుఖదుఃఖాలు ఈనాడు కొత్తగా రాలేదు. ఎప్పుడూ వున్నవే. ఏడ్చి ఏం లాభం?- లభించిన ఆనందంలోనే తృప్తి పడదామంటాను నేను. --- ఏదో కలో అంబలో, త్రాగి ప్రతివారూ తృప్తితోనూ ఆనందంతోనూ జీవిస్తున్నట్లు తోస్తున్నది నా మనస్సుకు-" అంటూ మునిమాణిక్యంవారు 'అల్లుళ్లు' ఉపోద్ఘాతంలో రాసిన మాటలు చాలాకాలం క్రితానివి.

మునిమాణిక్యంగారు కలం పట్టి కాంతం కథలు రాసే సమయానికే- ప్రపంచంలోనూ దానితో బాటుగా ఆంధ్రదేశంలోనూ ఆర్థిక, సాంఘిక, సమస్యల స్వరూప స్వభావాలు మారిపోతూ వచ్చాయి.

అయితే- మునిమాణిక్యంగారు వాటి గురించి అంతగా పట్టించుకోలేదు (ఏవో కొన్ని రచనల్లో తప్పితే!) -- ఆయన దృష్టి అంతా 'యింటిమీదే!

అయితే అది నాలుగు గోడలకు పరిమితం అయిన మునిమాణిక్యంగారి యిల్లే అని అనుకోవాల్సిన అవసరం లేదు. కాంతం కథల్లోని కాంతం మునిమాణిక్యం అర్ధాంగా?- లేక కాల్పనిక పాత్రా?- అనే విషయంలో బుర్రబద్దలు చేసుకోనవసరంలేదు.

కాంతం కాపురంలాగానే (పోనీ- కాంతం మొగుడిగారి సంసారంలాగానే-) ప్రతి యిల్లూ ఆనందంతో కలకలలాడుతూ వుండాలని ఆయన కోరుకున్నాడు. ఇంటిపేరు చెప్పేసరికి మనకు జ్ఞాపకం రావలసినవి పాలవాడికి, కిరాణాకొట్టు వాడికి, తీర్చవలసిన

బాకీలు, చంటాడి జ్వరం, పెద్ద పిల్ల పెళ్ళి, ఇవి కావని- వీటన్నింటికీ అతీతమైన ఆనందాన్ని ప్రతి గృహస్తు తన యింటిలో తనకు తాను కల్పించుకోవలసి వున్నదని- ప్రతి కథలోనూ గిలిగింతలు పెట్టే ధోరణిలో చెబుతారు మునిమాణిక్యం. ఇవాళ మనోవైజ్ఞానిక శాస్త్రవేత్తలు చెబుతున్న హితవు యిందుకు భిన్నమైంది కాదు. 'యింటావిడతో పోట్లాట'ను కూడా సరసజన మనోభిరామంగా చూడగలిగి, "--మొగుడూ పెళ్లాల మధ్య పోట్లాట తప్పనపుడు విసుక్కుంటూ పోట్లాడుకునే దానికన్నా అది ఒక ఉదాత్తమైన ప్రదర్శనలాగా జరగాలనీ, సంగీత కచ్చేరీ లాగా జరగాలనీ,"- కోరుకున్న మునిమాణిక్యం రసహృదయానికి జోహార్లు అర్పించకుండా ఎలా వుండగలం?-

మునిమాణిక్యంగారు కథలతోబాటుగా హాస్య ప్రధానమైన నాటికలు, వ్యాసాలు, నవల, కూడా రాశారు. కాని ఆయన పేరు చెప్పే సరికి మనకు జ్ఞాపకం వచ్చేది కాంతం కథలు మాత్రమే!- 'నేను- మా కాంతం; 'కాంతం కైఫీయత్', 'కాంతం కాపురం', మొదలుకొని- 'కాంతం వృద్ధాప్యం' వరకు ఎన్నో సంపుటాలలో కాంతం కథలు వెలువడ్డాయి.

మునిమాణిక్యం కాంతం ఒక తరం భారత స్త్రీకి ప్రతినిధి. "-రేపు యుద్ధం ఒక గంటసేపు ఆపి నవరసులు చౌకగా అమ్ముతారు-" అంటే నమ్మగల అమాయకత్వం ఆమెకు ఎంత వున్నదో- మేడమెట్ల దగ్గిర భార్యాభర్తలిద్దరూ ఒకరికొకరు ఎదురుపడినప్పుడు కాంతానికి దోవ యివ్వకుండా భర్త- "ఫూల్స్‌కు దారి యివ్వను." అని హాస్యమాడితే. "-నేను యిస్తాను-" అని తప్పుకుని చల్లగా మాటకు మాట అంటించగల మాట నేర్పరితనం వున్నది. భోజనాల సమయంలో వాళ్ళాయన బుగ్గలకు పెరుగు రాసి సరసమాడితే- అది చూచి వేళాకోళం చెయ్యబోయిన వదిన గారితో "మీ తమ్ముడు సరిగా భోజనం చెయ్యక లేచి పోయినందున వారి కొరకు పెరుగు బుగ్గలకు రాసుకున్నా"-నని చెప్పగల జాణతనం కూడా ఆమెలో వున్నది.

మునిమాణిక్యంగారి కథల్లో నాకు "బద్‌నసీహత్" నచ్చుతుంది. ఇందులో కాంతం గడుసుతనం లేదు గానీ- కాంతంగారి భర్త సుఖప్రదమైన సంసారంకోసం తయారుచేసిన "ఫార్ము లా" ఒక ముసలి దంపతుల విషయంలో బెడిసికొట్టిన వైనం వుంది. భార్యని భర్త పెట్టుకునే 'ముద్దు' సహజమైన ఆవేశంలో కాక, శాస్త్ర పరమైన ధోరణిలో జరిగినప్పుడు జరిగే అవాంతరాలను హాస్య ధోరణిలో చెబుతారు ముని మాణిక్యం ఈ కథలో.

రచయిత ఓ రోజున స్కూలు నుంచి ఇంటికొచ్చేసరికి ఆయన కోసం ఎదురుచూస్తూ ఓ ముసలాయన కూర్చుని వున్నాడు. కాంతం కథలు రాసిన రచయితను, అతడి అర్ధాంగి 'కాంతాయమ్మ రావుగారిని' (తన విజయనగరం మర్యాదకు తగినట్టుగా!-) దర్శించడానికి వచ్చానని ముందు కాసేపు అన్నప్పటికీ చివరికి అసలు సంగతి బయట పెట్టాడు.

అతడికీ, అతని భార్యకూ ఎడ్డెం అంటే తెడ్డెం అన్నట్టుగా వుంది వ్యవహారం. పోట్లాటలేని రోజు లేదు. అందుచేత- కాంతం దంపతులలాగా సుఖ సంసారం చెయ్యడానికి రచయిత దగ్గిర 'ఉపదేశం' పొందడానికి వచ్చాడతడు.

పరిస్థితి అంతా విని- ఆలోచించి, - రోజుకు అధమపక్షం మూడు సార్లయినా భార్యను ముద్దు పెట్టుకోమని సలహా యిచ్చాడు రచయిత. ఇది విని ఆయన మొహం అదోలా పెట్టి - "చికిత్సకు యిలాంటిది కాక మరో అనుపానం చెప్పమని" అడిగాడు కాని- చివరకు "చిత్తం, మా ముసలి దానిని త్రికాలములయందనూ ముద్దు పెట్టుకోమని సెలవాండీ-" అనక తప్పలేదు.

ముద్దు ఒక్కటే కాదు చికిత్స. రోజుకు నాలుగయిదు సార్లు భార్యతో "నిన్ను నేను ప్రేమిస్తున్నాను." అని చెప్పమన్నాడు. ఆవిడ ముఖాన్ని, శరీరాన్ని, పొగడమన్నాడు. ముసలాయన మరీ యిబ్బంది పడిపోతే- "తప్పదండీ. నిష్కామకర్మ చెయ్యాలె-" అని నచ్చజెప్పాడు.

ముసలాయిన సలహాలన్నీ ఓపిగ్గా విని వెళ్ళాడు. దీనితో ఆ యింటిలో తగువులన్నీ తీరిపోతాయనుకున్నాడు రచయిత. "-మీరు చేసే పిచ్చి చేష్టలన్నీ అందరినీ చెయ్యమంటారేం ఖర్మ? - నేను కాబట్టి భరించి ఊరుకుంటున్నాను గానీ - ఏ యిల్లాలు భరించి ఊరుకుంటుందండీ-" అని కాంతం వేసిన వేళాకోళాన్ని రచయిత పట్టించుకోలేదు.

రోజులు గడుస్తున్న కొద్దీ- మందు పుచ్చుకున్న రోగి ఆరోగ్యం గురించి వైద్యుడు ఆదుర్దా చెందినట్టుగానే ముసలి దంపతుల దాంపత్యం ఎలా వుందో అని రచయిత కూడా ఆదుర్దా చెందుతూ వచ్చాడు. చివరకు ఓ రోజున రచయితను చూడ్డానికి అవ్వగారు వచ్చారు.

"నువ్వేనా నాయనా మా కాంతం మొగుడివీ-" అంటూ మొదలుపెట్టి ఆవిడ తన గోడునంతా చెప్పడం ప్రారంభించింది. "మొన్న ఆయన యింటికి రాగానే కాంతం మొగుడిగారి దగ్గిర ఉపదేశం పొందానూ, నీకూ నాకూ పోట్లాటలు వుండవూ ఆ మాట అన్నారు. ఏమిటో అనుకున్నాను--- శుక్రవారం రాత్రి నుంచి మొదలు నాయనా పిచ్చి చూపులూ పిచ్చి మాటలూను.--- నా బ్రతుకంతా కడిగిపారేస్తున్నారు నాయనా. నా ముఖం చంద్రుడిలాగా వుంటున్నదట-- నా గొంతు పట్టుకుంటారు నాయనా-శంఖంలా వున్నదీ అంటారు. నా గొంతు కొయ్య!- యిలా అయింది బ్రతుకు-" అంటూ ఆవిడ కళ్ళమ్మట నీళ్లు పెట్టుకుంది.

"-ముప్పయేళ్ళు కాపురం చేశాను. ఎప్పుడూ యిలాంటి పిచ్చి మాట వినలేదు. ---రోజల్లా యిలా మాటాడరు. మధ్య మధ్య బాగానే వుంటారు. గుబులు క్రింద వస్తుందో

ఏమిటో రోజుకు నాలుగయిదుసార్లు యిలా అంటారు తిక్కలేనప్పుడు బాగానే వుంటారు. --- ముసలిదాన్ని పట్టుకుని ముద్దు ముద్దు అంటారమ్మా ఎక్కడ చచ్చేదే!" అంటూ ఆవిడ కాంతంతో- ఒక డాక్టరమ్మతో రోగి తన బాధ చెప్పుకున్నట్టుగా గోడు వెళ్లబోసుకోవడం వింటే నవ్వుతో బాటు బాధ కూడా కలుగుతుంది.

కాంతం భర్త చెప్పిన మంత్రం బెడిసికొట్టిందనీ- విరుగుడు మంత్రం ఉచ్చరించమనీ, ఆవిడ చేసిన అభ్యర్థన హాస్యాస్పదమైన దయినప్పటికీ- రచయిత ఆవిడకు అభయ హస్తం యివ్వక తప్పలేదు. విరుగుడు మంత్రం ఉచ్చరిస్తానన్నంతవరకూ ఆమె కదలదు. "నసీహత్ ఫలితం యిదా" అని రచయిత గొణుక్కోవడం మాత్రమే మిగిలింది.

సాంసారిక జీవితాన్ని సుఖమయం చేసుకోవడానికి కావలసింది యాంత్రికమైన చిట్కాలు కావనీ- హృదయంలోంచి పుట్టుకు వచ్చిన ఆత్మీయతలు, ఆర్ద్రతలు, మాత్రమేననీ- హాస్యధోరణిలో మనకు మరోమారు జ్ఞాపకం చేస్తుంది ఈ కథ.

---

# 10

## శ్రీశ్రీ - "కోనేటిరావు కథలు"



"-హీనంగా చూడకుదేన్నీ కవితామయమే నోయ్ అన్నీ! -" అంటూ తెలుగు కవిత్వానికి ఒక కొత్త ఊపిరిని పోసిన శ్రీశ్రీ కృషి కేవలం కవితా రంగానికి మాత్రమే పరిమితం అయింది కాదు. శ్రీశ్రీ కలం నుండి జాలువారిన కథలు కూడా యిందుకు తార్కాణంగా నిలుస్తాయి.

నిజానికి-శ్రీశ్రీ రాసిన కథలు తక్కువే. వాటి నిడివి కూడ పలు సందర్భాలలో తక్కువే. ఒక విధంగా చెప్పాలంటే- సాధారణంగా కథలలో కనబడే యితివృత్తంగాని, కథా కథనం గాని వాటిల్లో కనబడదు."- కొంతమంది ఒక చిటికెడు కథా వస్తువుని తీసుకొని గంగాళాలకొద్దీ కషాయాన్ని నింపుతారు. మరి కొంతమంది చవగ్గా దొరికింది కదా అని గంగాళమంత కథావస్తువుని తీసుకుని చెమ్చాలో యిమిడిపోయేంత చిన్న కథ రాస్తారు. తేనె కలుపుకుని ఔషధప్రాయంగా దానిని దిగమ్రింగాలి -" అంటారు శ్రీశ్రీ "అనామిక' కథలో . ఈ రెండో తరహాకు కొంచెం సన్నిహితంగా కనబడతాయి శ్రీశ్రీ కథలు కొన్ని సందర్భాలలో. మిగతా సందర్భాలలో అవి స్కెచ్‌గానో, వ్యంగ్య రచనలుగానో మిగిలిపోయి, సానబట్టని జాతి వజ్రాలుగా దర్శనమిస్తాయి.

శ్రీశ్రీ కథలు చదివిన పాఠకులు 'హేమంతం' కథలో 'ఆంధ్రజ్యోతి' ఉగాది సంచికలోంచి జారిపడ్డ 'భిక్షూ వర్షీయసి' అవ్వను మరిచిపోతారంటే నేను నమ్మలేను. "-నా అక్క తేగ లమ్ముకుంటే నేం?- దాని కూతురు రంకుముండ అయితేనేం?- మా జీవితాలను, మా స్వార్థాలను, మా నైచ్యాలను, మా దారిద్ర్యాన్ని మీ మీద సవాలుగా వదులుతున్నాం. నీకు తెలుసునో లేదో నేను ఒక రకం రమణమహర్షిని-" అని అవ్వ అంటే మనం అవుననుకోమూ?-

'అశ్వమేధ యాగం' కథ జ్ఞాపకం వుందా?- తల్లి చావుబ్రతుకుల మీద వుందని టెలిగ్రాం వస్తే- దానిని తన ఆర్థిక యిబ్బంది గడుపుకోవడం కోసం మిత్రులకు చూపించి, డబ్బులు చేసుకుని, ఆ డబ్బుతో గుర్రప్పందాలు కాసి జేబులో డబ్బులన్నీ పోగొట్టుకున్న

ఆసామి కథ యిది. ఈ కథలో వున్నది ఇది కరుణ రసమో, బీభత్స రసమో, లేక మరే రసమో లెక్కగట్టి చెప్పగల షరాబు ఎవడు?-

ఈ కథలన్నీ ఒక ఎత్తు. కోనేటి రావు కథలు మరొక ఎత్తూను. మూడు భాగాల కథ యిది. (అవి విడికథలు కావు- భాగాలు మాత్రమే అనుకుంటే-) కోనేటి దినం, కోనేటి రాత్రి, కోనేటి జన్మ, అనే మూడు భాగాల్లోనూ వున్నది 'కోనేటి జన్మ' మాత్రమే!- మహారాజశ్రీ జటావల్లభుల కోనేటిరావు పంతులుగారి కలలు, కన్నీళ్లు, వారి యిన్ఫీరియారిటీ కాంప్లెక్సులు,-అన్నట్టు- చిన్న చిన్న రొమాన్సుపరమైన ఊహలు- వీటన్నింటి మధ్యలో పంతులుగారూ బాకీ చెల్లించారు కాదు. వొచ్చే ఫస్టుకి తప్పకుండా-' అనే పలకరింపుల ఆర్థిక నేపథ్యంలోంచి- 'నా ఎడం కాలు ఎక్కడికో వెళ్లిపోయింది- సాయంత్రం దాకా సెలవిచ్చేశాను. ఈ మరలో భాగాల ఎక్కడికక్కడ ఊడిపోతున్నాయి-' అనే యంత్రపు గరగలనూ, చైతన్య స్రవంతిని డోలికలుగా- చెప్పడం ఈ కథలోని ప్రత్యేకత.

పాశ్చాత్య సాహిత్య రంగంలో జేమ్సు జాయిన్, వర్జీనియావుల్ఫ్ వంటి మహారచయితలూ, రచయిత్రులూ ప్రయోగించిన 'చైతన్య స్రవంతి' (స్ట్రీమ్ ఆఫ్ కాంషస్‌నెస్) శిల్ప విధానాన్ని ఆ ధోరణిలో కాకపోయినా- కొంతవరకూ శ్రీశ్రీ యిందులో ఉపయోగించారు; చలం 'అమీనా'లో (అది నవలా? లేక కథా?- అనే చర్చను ప్రస్తుతానికి వదిలేద్దాం) తళుక్కుమని మెరిసిన 'చైతన్య స్రవంతి' విధానం మరి కొంచెం ప్రస్ఫుటంగా కనబడుతుంది కోనేటి రావుగారి కథలో!-

"-గుమాస్తా కోనేటి హెడ్డు పదకొండు గంటలు కొడుతున్నారు. ఆఫీసువేళ కోనేటి గంటల గందరగోళం, తొందర భోజనం ముగించుకుని, "ఒసే కుర్రాళ్ళు జాగ్రత్త, మిలిటరీ కార్లు జాగ్రత్త, చిల్లర డబ్బులు ఏమన్నావుంటే...." అంటూ 'చైతన్య స్రవంతి' ధోరణిలో ప్రారంభం అవుతుంది ఈ కథ.

"--ప్రపంచంలో వున్న చిత్తు కాగితాలన్నింటినీ చింపి వాటినన్నింటిని వరుస క్రమం లేకుండా ప్రచురిస్తే 'చైతన్య స్రవంతి' అనిపించుకుంటుంది."

- అని బుచ్చిబాబు హాస్యానికే అన్నప్పటికీ- (బుచ్చిబాబు 'చైతన్య స్రవంతి' పేరుతో దాదాపుగా యిలాంటి 'భయం' కలిగించే కథే ఒకటి రాశాడు) ఈ తరహా రచనా విధానం వెనుక మనో వైజ్ఞానికపరమైన ఒక శాస్త్రీయ దృక్పథం వున్నది. ఫ్రాయిడ్ సిద్ధాంతాలలో చెప్పబడే యిడ్, యిగో, సూపర్ యిగోల మధ్య జరిగే సంఘర్షణకు 'ఎక్సురే' ఫోటోగ్రాఫు అని చెప్పదగ్గ ఈ తరహా రచనల్లో గతం, వర్తమానం, భవిష్యత్తు, అన్నీ ఏక కాలంలో నడుస్తాయి. ఒక పొందిక లేని వాక్యాలు - (పొందిక లేకపోవడమే ఒక పొందిక అని అనేటప్పటికీ-) వాటిల్లో దాపరికంలేని మనసులోని భావాలు - (అసభ్యమైనవాటితో

సహా-) పాఠకుడికి గజిబిజిగా దర్శనం యిచ్చి, ఒక్కొక్కప్పుడు గాభరా పెట్టడం కూడా కద్దు.

లియాన్ ఎడిత్ చెప్పినట్టుగా "-ఛాయా మాత్రంగా కనబడి లాస్యమాడుతూ వుండే చైతన్య భావాన్ని పరిశీలించేందుకయి కృషి చేసిన రచయితలు వచనానికై ప్రార్థించి, కవిత్వాన్ని తయారుచేశారు.-" అనే మాటను బేషరతుగా ఒప్పుకుంటే- 'చైతన్య స్రవంతి' రచనలు 'పొయిట్రీ'కి సన్నిహితంగా కనబడతాయి.

ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే- జటావల్లభుల కోనేటిరావు పంతులుగారి జన్మానికి వెనుక యింత కథ వుంది. వారు ప్రభుత్వ యంత్రాంగంలో ఒక సాధారణమైన గుమాస్తా అయినప్పటికీ, వారి జన్మ దినోత్సవాన్ని రచయిత "నేడు సుదినం' అని ముక్తసరిగా చెప్పి వూరుకున్నప్పటికీ, - ఆయనకి కూడా కొన్ని 'ఫేంటసీస్' (పోనీ- పగటి కలలు లేదా రాత్రి కలలు) వుంటాయని గుర్తించకపోతే అది పొరబాటు.

ఓ రోజు రాత్రి- అదే 'కోనేటి రాత్రి' ఏమైందంటే కోనేటిరావు పంతులుగారు హఠాత్తుగా సినిమా హీరో అయిపోయి, దుర్గమారణ్యాలలో అష్టకష్టాలూ పడుతున్న హీరోయిన్‌ను తన వీర పరాక్రమంతో రక్షించి- ఆ పైన సరదాకి ఒక యుగళ గీతం కూడా పాడుకున్నాడు. అయితే - పాట పూర్తి కాకుండానే చంటివాడు ఏడుపు ప్రారంభించడంతో కల కరిగిపోయిందనుకోండి, అది వేరే సంగతి:-

కోనేటి రావుగారికి దేశభక్తి మెండు. బ్రిటీషు వారి పాలనను- ఒక దొర చేత చివాట్లు తినే గుమాస్తాగా ఆయన ఖండించాడు. (మనసులోనే అనుకోండి)- దాని ఫలితంగా ఓ రాత్రిపూట కలకని 'కమాండర్ జటావల్ కోనేట్'గా అవతారం ఎత్తాడు. బ్రిటిష్‌వారికి విరోధులయిన జర్మన్ వారి భాషను గడగడా మాట్లాడడమే కాకుండా, బ్రిటీష్ వారి ఓడను, అందులోని నావికుల్ని దయాదాక్షిణ్యాలు లేకుండా నాశనం చేసేశాడు.

ఇంతటితో ఆగక- 'టెర్రరిస్ట్' అవతారం కూడా దాల్చి బ్రిటిష్ ప్రభుత్వానికి చెందిన ఆఫీసు బీరువాలు విరక్కొట్టేస్తాడు. ఆఫీసు కాగితాలు సిరాబుడ్లు నాశనం చేసేస్తాడు. పేపర్ వెయిట్‌తో గురిచూసి కొట్టి గోడ గడియారాన్ని ధ్వంసంచేసి పారేస్తాడు. ఈ బాపతు కలలన్నీ మధ్యలో ఆగిపోక పోయి వుంటే - అతను యింకా చాలా కలల్ని కని స్వతంత్రం మనకి యింతకన్నా ముందు వచ్చేందుకు సర్వవిధాలా సహాయ పడివుండేవాడు!

సరే- ఎవరివల్లనయితేనేం స్వతంత్రం వచ్చింది. యిక- కోనేటి రావుగారు సర్వస్వతంత్రులయి పోయినట్టేనా?- అబ్బే- అలా జరగలేదు. ఇది వరకు అతడిని విదేశాలలో తయారయిన సంకెళ్లు కట్టి పడేస్తే- యిప్పుడు స్వదేశీ సంకెళ్లు కావలించుకుని

వున్నాయి. అప్పుడూ- యిప్పుడూ- ఎప్పుడూ అతనిది ఒకే బ్రతుకు.

నిశ్శబ్దంగా పనిచేసే ప్రభుత్వ యంత్రంలో ఓ నిర్ణీత స్థానం కోనేటి కళేబరానిది. అందుకే ఆఫీసుకు వెళ్లగానే అతని చేతులు స్క్రూ తిప్పి మెడకి తలకాయని తగిలించుకుంటాయి. ఈ యంత్రానికి గడియారానికి వున్నట్టు, కడుపులో చక్రాలు. పైకి మాత్రం సున్నటి ముళ్ల గాజు, ముఖం- కోనేటి రావుగారు సముద్రాన్ని ఈదుతూనే వుంటారు. మధ్యలో ఆకలి వేస్తే - "ఈ కడుపుకి గళ్లా తగిలించి కాఫీ పోసి, గళ్లా పారేసి, కడుపుని దాచేసి చర్మం తలుపు మామూలుగా మూసేసి, లాల్చీ బొత్తాయిలూ, ఆఖరి కోటు బొత్తాయిలూ పెట్టుకుని కోనేరు వెళ్ళి మళ్ళీ కుర్చీలో కూలబడ"తాడు.

అతగాడి చెమటతో తడిసిన రూపాయికి అర్థం లేకపోవడం ఎందుచేత? అతగాడి జుట్టు వూడిపోయి తెల్లబడ్డానికీ, అతడి ఆశలన్నీ 'కాంకరింగ్ హీరో డ్రీమ్స్'లాగా (ఆల్‌ఫ్రేడ్ ఆడ్లర్ సిద్ధాంతం ప్రకారం) మిగిలిపోవడానికీ, కారణం ఏమిటి?-

- సమాధానం దొరికినా దొరకనట్లు కనబడే ప్రశ్నలవి.

ఈ కథలోని కోనేటిరావు బ్రతుకు-నానాటికీ యాంత్రికంగా మరల్లా మారిపోయిన మనుషుల కథకు ఓ దర్పణం. ఈ కథలో కనబడే వ్యంగ్యం వెనుక వినబడే విషాద సంగీతం- కోనేటిరావు జీవితానిది కాదు. కోనేటి వ్యవస్థది.

అయితే- ఈ కథ కంచికి వెళ్ళేదెప్పుడు?- కోనేటిరావు పారేసుకున్న ఎడం కాలు తిరిగి దొరికిందాకా అనుకుంటాను.

---

# 11

## వేలూరి శివరామశాస్త్రి - 'చెంబు'



**"రా**మారావు లిటరేచర్ ఆనర్స్ ఫస్టుగా ప్యాసయి, నాలుగయిదు నెలలు జుట్టు జాడించి తిరిగెను. పిదప రామారావు ద్వివేది బిఏ (ఆనర్స్) అనుగిల్టు అక్షరముల బారెడు బల్ల తయారుచేయించి, మంచి ముహూర్తమున గోడకు తాపడము వేయించి విశ్రమించెను."

దశాబ్దాల క్రితం-1934 ప్రాంతాలలో వేలూరి శివరామశాస్త్రిగారు రచించిన "డిప్రెషన్-చెంబు" కథ ప్రారంభ వాక్యాలివి. వ్యావహారిక భాష తెలుగు సాహిత్యానికి జీవనాడిగా వున్న ఈ రోజులలో ఈ కథ ప్రారంభంలోని వాక్యాలు కొంచెం ఇబ్బందిగా అనిపించవచ్చు. అంతే కాదు, కథను మొదలుపెట్టి కొంత దూరం వెళ్ళాక, నేటి వాతావరణానికి ఈ కథ దూరంగా వుందనికూడా అనిపించవచ్చు.

నిజమే- ఈ కాలంలో మన దేశంలో ఆర్థికంగా, రాజకీయ పరంగా ఎన్నో మార్పులు వచ్చాయి. "-ఇప్పుడు సింహాసనం మీద కూర్చున్న చక్రవర్తిని లేపి పారేసి డిప్రెషన్ కూర్చున్నది. బస్తా రెండు రూపాయిలకు అమ్మించుచున్నది-" అంటూ ఈ కథలో ఒక పాత్ర వ్యక్తీకరించిన భావాల బట్టి ఆలోచిస్తే - ఈవేళ చక్రవర్తి లేదు, సింహాసనమూ లేదు. ఒకవేళ సింహాసనాలు మరో రూపంలో వున్నాయని ఒప్పుకున్నా దానిమీద 'డిప్రెషన్' కూర్చుని లేదు (అందామా?)

శాస్త్రిగారు ఈ కథను రాసేనాటికి 1930 ప్రాంతాలలో ప్రపంచ వ్యాప్తంగా వచ్చిన ఆర్థిక మాంద్యం భారత దేశాన్ని కూడా పలుకరించింది. నానాటికీ పడిపోతున్న ధరలు పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థను కూకటి వేళ్ళతోసహా పెకిలించి - ఏనాడో మార్క్స్ చెప్పిన జోస్యం అమలు జరుగుతుందేమోనని ఒక వైపు నుంచి బడా బాబులు "భయ" పడుతుంటే - ఆర్థిక మాంద్య వాతావరణంలో ఉద్యోగాలు కరువై, బ్రతుకు దుర్భరమై సామాన్యులు మరొకవైపు నుంచి అల్లాడిపోతున్న రోజులవి.

**ఉద్యోగాలు** దొరకని బి.ఏ., ఎం.ఏ.ల కథ నాటిదీ, నేటిదీ కూడా అయినప్పటికీ ఆర్థిక వ్యవస్థ సృష్టించిన విషవలయాలలో చిక్కుకున్న మధ్య తరగతి మానవుల బడుగు

మనస్తత్వం ఈ పాత కథలో సజీవంగా నిత్య నూతనంగా కనబడుతుంది. శాస్త్రిగారి కథలలో "డిప్రెషన్ - చెంబు" కథ నాకు నచ్చడానికి ఇది కూడా ఒక కారణం అనుకుంటాను.

ఒక విధంగా చెప్పాలంటే శాస్త్రిగారి కథలు చాలా వాటి విషయంలో మౌలికమైన ఈ గుణం కనబడుతుంది. మాటవరుసకు శాస్త్రిగారి "అరాచకం" కథనే తీసుకోండి. ఈ కథ నేపధ్యంలో వున్న జమీందారీల రద్దు బిల్లు నాటి వాతావరణం. ఈ బిల్లు వెనుక వున్న ఆర్థిక, సాంఘిక, పరమార్థాలు ఏమైనప్పటికీ, ప్రతిదాన్నీ స్వప్రయోజనానికి వాడుకోగల రాజకీయ శక్తులు ఈ బిల్లును ఆసరాగా తీసుకుని పబ్బం గుడుపుకోడానికి ఎంతటి అరాచకాన్ని సృష్టించారో శాస్త్రిగారు కథగా చెబుతూంటే బాధతో కూడిన నవ్వు పెదాల మీద మెరవదూ? "-కాంగ్రెసనియూ, కమ్యూనిష్టనియూ ఎరుగని నాడే సుభిక్షమయిననూ, కుబిక్షమయిననూ పోరును పొక్కును లేక గ్రామములు సుభిక్షముగా వున్నవి. మన ఈ కుగ్రామములకు కాంగ్రెస్సూ వద్దు, కమ్యూనిస్టు వద్దు. ఎవరి దారిన వారు పొండు" అనే మాటను రాజకీయాల హోరులో వినేదెవరు?

శాస్త్రిగారి కథల్లోని శైలి ఒక చలంలా, ఒక సుబ్రహ్మణ్య శాస్త్రిలా, సోయగాలు సంతరించుకుని వుండకపోవచ్చు. (ఆయన కొన్ని కథలు వ్యావహారికంలో రాసినప్పటికీ) కాని, జీవితం పట్ల ఆయనకున్న లోతయిన అవగాహన, నిశితమైన పరిశీలన మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది. శాస్త్రిగారు ఒకనాటి రజాకార్ల దురంతాలకు కథా రూపం ఇచ్చినా (నకల్ హైదరాబాద్), జైళ్ళలోని ఖైదీల విషాద గాథ వినిపించినా, (వివాహబలి) దారిద్ర్యపు బూర్జువా మనస్తత్వానికి అద్దం పట్టినా (ఒక్కటే చీర) అన్నింటా ఇదే ధోరణి కనబడుతుంది. కథ ఇతివృత్తం విషయంలో గొప్ప వైవిధ్యాన్ని చూసిన కథకుడు ఆయన.

అంతేకాదు - గాంధేయ ఉద్యమపు ప్రభావంతో తెలుగులో తొలి నవల రాసిన ఘనత కూడా శాస్త్రిగారిదే. 1920 ప్రాంతాలలో వెలువడిన వేలూరి వారి "ఓబయ్య" నవల తెలుగునాట జరిగిన సత్యాగ్రహోద్యమాల ప్రభావాన్ని వెలుగు నీడల్తో సహా చూపుతుంది. - శాస్త్రిగారి రచనలు పాతకాలానికి చెందినవే అయినా, పాతబడిపోయినవని కావని చెప్పడానికి మాత్రమే ఇదంతా రాశాను.

వేలూరి వారి "డిప్రెషన్ - చెంబు" కథలోని రామారావు ఒక మధ్య తరగతి మానవుడు. అనేక ఇబ్బందులు పడి తల్లి అతన్ని ఎం.ఏ. వరకూ చదివించింది. పెద్ద చదువులు చదివిన తన కొడుక్కు మంచి ఉద్యోగం వస్తే సంసారం వొడ్డున పడుతుందనీ, మిగతా పిల్లల బ్రతుకుతెరువుకు ఒక మార్గం దొరుకుతుందనీ, ఆమె ఆశించింది. "ఈ నాణెము చదువుల టంకసాలలో తప్ప మరియొక చోట చెల్లదు" అనే విషయం

తెలిసినప్పటికీ, రామారావు తల్లి సంతృప్తికోసం దివానుగిరీకి మొదలుకొని పోలీసు డిపార్టుమెంటు ఉద్యోగాల వరకూ దరఖాస్తులు పంపుతుండేవాడు.

ఆ ఉద్యోగాలు వచ్చేవికావని అతడికి తెలుసు. అయినా - తమ డిప్యూటీ కలెక్టరుగారి అల్లుడాయే నెలకు ఇరవై ముప్పై రూపాయిల జీతం వచ్చే ఉద్యోగాలు ఎలా చెయ్యగలడూ? కనీసం నెలకు అరవై రూపాయిలన్నా వుండొద్దూ? డిప్యూటీ కలెక్టర్ గారి అమ్మాయి "రామారాయ్ ద్వివేది" అనబడే ద్వివేదుల రామారావు అర్ధాంగి అయిన తులసి మొగుడుచేసే నిర్వాకం అంతా ఎరుగును. "ఎంత దప్పిక అయినా చాతకం ఆకాశగంగ కెదురు చూస్తుందిగాని చెరువులకు ఎగబడదు" అంటూ దిగిరాని ఆకాశ గంగకోసం ఎదురుచూస్తూ అతడు కట్టే గాలిమేడల కథ ఆమెకు తెలుసు.

అంతేకాదు ఆర్థికంగా ఇంటి పరిస్థితి నానాటికీ దిగజారిపోతున్నా - అత్తగారి నగలు, తన నగలు, దినభత్యాలు కోసం మాయమైపోతున్నా, చీమ చిటుక్కుమన్నట్టు కూడా అనిపించని భర్త అంటే ఒక్కొక్కప్పుడు ఆమెకు అసహ్యం కూడా వేసేది.

ఇంతకన్నా బాధాకరమైన విషయం ఏమిటంటే - తన కొడుకు ఇవాళ కాకపోతే రేపయినా పెద్ద ఆఫీసరు కాకపోతాడా అనే ఆశతో రామారావు తల్లి తన మిగతా పిల్లల కడుపు మాడ్చి - పెద్దకొడుకుకి, కోడలికి నెయ్యి, పెరుగు, కూరలు వేసి ప్రత్యేకంగా అన్నం పెట్టేది. పెరుగుకోసం ఏడ్చే పిల్లలకి "-పెరుగుపోసుకుంటేపిలక పెరగదు" అని బుజ్జగించి నచ్చజెప్పేది. ఇంతేకాదు - వీళ్ళు అన్నం తింటున్నప్పుడు చూస్తే అవన్నీ కావాలని గోలపెడతారని, వాళ్ళని గదిలో పెట్టి తాళం వేసేది. ఆ గదిలో కూర్చుని వంటగదిలోంచి వస్తున్న వాసనలని బట్టి అన్నయ్య, వదిన ఏం తింటున్నారో ఊహించుకునే వాళ్ళు పిల్లలు - అన్నయ్యకు ఉద్యోగం వస్తే తాము కూడా అవన్నీ రోజు తినవచ్చునేది మనసు చేసే ఊరడింపు. ఎంతటి దయనీయ దృశ్యం?

కాని రామారావుకు మాత్రం వీటన్నింటినీ పట్టించుకునే తీరిక లేదు. అతనికి సమయం దొరికితే చాలు అర్ధాంగితో సరాగాలు జరుపుదామన్న తపన తప్ప మరొకటి లేదు. ఆపైన - తీరిక ఏమైనా దొరికితే "మూర్తి ది నాన్ కో ఆపరేటర్, సుందరంది లాయలిస్ట్, శర్మా ది నిహిలిస్ట్" మొదలయిన వారితో బాతాఖానీ వుండనే వుంది. తమ్ముళ్ళ ఆకలినీ, తల్లి పెట్టుకున్న ఆశల వెనుక ఆవేదననూ గమనించే అవకాశం ఏదీ?-

అందుకే అంటుంది తులసి "డొక్క కరువు వస్తే మొగవాళ్ళు ముందర తల్లుల్నీ, ఆ తరువాత పెళ్ళాల్నీ విరుచుకు తినేస్తారు. హిందూ దేశంలో పెళ్లి అనే ఆచారం ఎప్పుడు అంతరిస్తుందోకదా" తన భర్త పలాయన తత్వంపైనా, స్వార్థంపైనా అసహ్యం, అత్తగారి

పట్ల జాలి అణువణువునా ప్రతిధ్వనిస్తున్నాయి ఈ మాటల్లో. ఈ బాధతోనే చివరకు ఓ దశలో కోపాన్ని అణచుకోలేక మొగుడికి ఓ లెంపకాయ కొట్టడానికి కూడా తులసి వెనుకాడలేదు. అప్పటికి కూడా సిగ్గులేక అదొక శృంగార చేష్టగా సరిపెట్టుకుని, ఆ రోజు ఇంటి భత్యాలకోసం వాళ్ల అమ్మ అమ్మడానికని ఇచ్చిన మంగళసూత్రాల పొట్లం ఇమ్మని అడిగితే తులసి అంటుంది కదా – "నేను చచ్చిననూ ఈ మంగళసూత్రములను ఈయను– కాని నా తాళి ఇస్తాను" అని పుస్తెను పుట్టుక్కున తెంచి రామారావు మీద పడేస్తుంది!

ఇంత గ్రంథం జరిగిన తర్వాత రామారావు కాలేజీలో ట్యూటరు పనికోసం ఇంటర్వ్యూకు వెడతాడు గానీ అరవై రూపాయిల ఉద్యోగాన్ని నలభై రూపాయిల జీతంతో చేస్తామని జనం ఎగబడుతున్నారు. నువ్వెంత తక్కువకు పనిచేస్తావని అడుగుతుంది ఆ కాలేజీ ప్రిన్సిపాల్ అంబుజమ్మ. ఈ పరిస్థితిలో అతనికి వాకిట్లో "భిక్షాందేహీ" అనే పిలుపు వినబడుతుంది.

తళతళలాడే రాగిచెంబు ఈ చెంబుమీద "డిప్రెషన్ చెంబు. మిసెస్ రామారాయ్ ద్వివేదీ బి.ఏ. ఆన్స్" అని రాసివున్న అక్షరాలు ఆ చెంబు పట్టుకున్న సాక్షాత్తు అతని భార్య తులసి – ఇదీ కంటికి కనబడిన దృశ్యం. కథకు ముగింపు.

నిజమే! బ్రతుకుతెరువును ఇవ్వలేని ఆనర్స్ డిగ్రీకన్నా అర్థాకలినయినా తీర్చే "చెంబు" మేలు కాదూ? పెద్ద ఉద్యోగాల మీద ఆశతో "ఆకాశగంగ" కోసం ఎదురుచూచే విద్యావంతుల కథ ఇవాళ్టిది మాత్రమే కాదు.

ఉద్యోగాల వేటలో అలిసిపోయిన నిర్భాగ్యులచేత – సగం జీతానికీ, నాలుగోవంతు జీతానికి పని చేయించుకోవాలని చూచే ప్రవృత్తి కూడా ఈనాటిది కాదు. సమస్యలు ఏ కాలానికి చెందినవయినా, వాటికి పరిష్కారం మాత్రం ఎప్పుడు ఒక్కటే. గాలి మేడల్లో కాపురం చెయ్యకుండా – జీవితాన్ని యథాతథంగా ఎదుర్కొని చెయ్యగలిగిన పనిచేసి పొట్టపోసుకోవడానికివినా గత్యంతరం లేదు. ఈ "చేదు" సత్యాన్నే మనకు మరోమారు జ్ఞాపకం చేస్తుంది "డిప్రెషన్ చెంబు" కథ. అయితే – అందరూ 'చెంబు' పట్టుకుని అడుక్కోవాలని కాదు ఈ కథ యిచ్చే సందేశం.

———

# 12

## అడవి బాపిరాజు - "ద్వేషము"



"---బియ్యం కోసం దాచిన పాతిక రూపాయిలతో తటస్థపడితే చక్కని పరిమళం గల అత్తరు కొని పస్తుండడానికే యిష్టపడే తత్వం బాపిరాజు గారిది. బాల్యం తాలూకు ఉత్సాహం, సౌకుమార్యం చివరి వరకూ బాపిరాజు గారిలో వుండిపోయాయి. ఆయన ఎదగలేదు. నది ఒడ్డున ఇసుకలో పిల్లనగ్రోవిని తుంచి దూదుంపుల్ల ఆడుకునేవాడు. వరదలొచ్చి వెళ్ళాయి. ఇసుక పాదాలకింద కదిలి పూడుకొని గడ్డ కట్టింది, నదే క్రొత్త దోవలోకి పారింది. ఇంకా బాపిరాజుగారు దూదుంపుల్లల్ని ఏరుకొని తుంచిన రెంటిని కలిపి పిల్లనగ్రోవి మ్రోగించాడు. అది ధ్వనించదు. కాని, గానం ఏ కొండ లోయలోనో మార్మ్రోగినట్లు అనిపిస్తూ వుంటుంది."

చాలాకాలం క్రితం బాపిరాజుగారి గురించి బుచ్చిబాబు వెలిబుచ్చిన అభిప్రాయం ఇది. బాపిరాజుగారి సమగ్ర చిత్రాన్ని ఈ మాటలు మన ముందు వుంచవుగానీ, ఆయన వ్యక్తిత్వంలోని ఒక చిన్న భాగానికి ఇది వ్యక్తీకరణగా అని చెప్పవచ్చు.

బాపిరాజుగారి పేరు చెప్పేసరికి బౌద్ధారామాలలో కళా తపస్సులో మునిగిపోయిన శిల్పాచార్యులు, నీలాకాశంలో తేలిపోయే తెల్లని పక్షి గొంతుకలోంచి విడిపోయి, ఆ నీలంలో తొణికిసలాడే పాటలాంటి అందం కలిగిన 'కల్హారమాల' లాంటి అమ్మాయిలూ మదిలో మెదులుతారు. 'భోగీరలోయ' కథానాయిక అందం 'వెన్నెల ప్రసరింపు జిడ్డుగల తీపి'తో వాసికెక్కడం ఒక ఎత్తు - రాగమాలికలు పాడుకుంటూ ప్రవహించే భోగీర సొగసులు మరొక ఎత్తును. ఇక - పారిజాతాలు, అడవిమల్లెలు, ఇప్పచెట్లు - ఇవన్నీ దిట్టంగా వున్న నీలాల శిఖరాల సంగతి సరేసరి.

బాపిరాజుగారు కథ రాసినా, నవల రాసినా - యితివృత్తం రాయల కాలానికి చెందినా, సమకాలానికి చెందినా, ఈ సరంజామా దాదాపుగా అన్నింటిలోను వుంటుంది.

"నువ్వటే, నువ్వటే
పువ్వు వంటి వయసు
నవ్వు లంటిన సొగసు
దువ్వి నా యెదపైన
పర్వులెత్తావటే!"

అంటూ కలవరించే భావకవి గుండెలోని రౌద్ర-చిత్రకారుడి కుంచెల కదలిక, ఆయన రచన లన్నింటిలోనూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సాక్షాత్కరిస్తూ వుంటుంది. యిలా రాసినంత మాత్రాన, యిలను మరిచిపోయి కేవలం కలలలోనే బ్రతికిన భావుకుడు కాదు బాపిరాజు. బుచ్చిబాబు అనుకున్నట్టుగా అతని ఎదుగుదల ఆగిపోయిందనడానికీ వీలులేదు. సాహిత్యం ద్వారా రాజకీయ రంగంలో చైతన్యం తీసుకురావాలనే ఉద్యమం ఉప్పెనలాగా పైన పడుతూంటే దానిని ఎలా ఆపుచెయ్యాలి అని బుచ్చిబాబులాంటి వాళ్లు మధనపడితే – 'ఆపుచెయ్యడం ఎందుకూ-మనమూ అలాగే రాద్దా'మని బాపిరాజు అనుకోవడమే ఇందుకు తార్కాణం.

'సోమసుత' కథ జ్ఞాపకం లేదూ? అందులోని కథానాయిక స్వాప్నికుడయిన కళాకారుణ్ణి నిలదీసి "-స్వప్నాలు ఎప్పుడూ నిద్దురపోయేవారికే. ఈనాడు దేశంలో కాటకం. దేశం అవతల భయంకర యుద్ధం- ప్రపంచం అంతా ఆర్తనాదాలు. ఆర్తనాదాలలోను, మహా ప్రళయంలోనూ, అందం ఎక్కడ? ఆనందం ఎక్కడ? ..... కష్టలూ, కాటకాలూ లేని రోజులలో కూడా కలలు కనడానికి తావులేదే?....." అనడమూ, ఆ కథలోని ఈ వాక్యాలు మరచిపోయేందుకు వీలులేదు.

బాపిరాజుగారు చక్రవర్తుల ప్రణయగాథలు రాసిన చేత్తోనే - నిమ్న జాతుల దయనీయ జీవితాన్ని (నరసన్న పాపాయి) ముష్టివాళ్ల బ్రతుకుల్నీ (తిరుపతి కొండమెట్లు, కన్ని, గుడ్డి పిల్ల), కథలుగా మలిచారు. అయితే, ఆయన వాళ్ల దారిద్ర్యానికి గల ఆర్థిక కారణాలతో గాక వాళ్ల హృదయపు ఆర్ద్రతలతోనే సంబంధం పెట్టుకుంటాడు. మొండిచెయ్యి బిచ్చగాడి చేతిలో పిల్లనగ్రోవి పెట్టి, పదాలు పలికించి వాడినొక కళాజీవిగా తీర్చిదిద్దితేగాని బాపిరాజుగారికి సంతృప్తి వుండదు. భూమిని 'లచ్చిమి'గా నమ్ముకున్న రైతుల గురించి-భూమిపట్ల వారికున్న "సెంటిమెంటల్ ఎటాచ్‌మెంట్" గురించి చాలామంది రాసి వుండవచ్చు.

కాని, నాగలితో రైతు భూమి దున్నడాన్ని- "హృదయంలో కల్మషాన్ని ఈవలకి త్రోసివేసి, దాగివున్న సౌందర్యాన్ని బయటకు పెట్టే మంచి పాటలాగా నాగలి సాగిపోతున్నది...." అని వర్ణించగల కథకులు తక్కువే అనుకుంటాను. ఇదే

బాపిరాజుగారిలోని ప్రత్యేకత. ఒకనాడు రాజమండ్రిలో కూల్డ్రే దొరగారు బాపిరాజు అనే కళారాధకుని గుండెలలో వెలిగించిన దీపపు కాంతులే యివన్నీ....

బాపిరాజుగారి కథలలో నాకు "ద్వేషము" కథ బాగా యిష్టం. జాతీయతా భావానికి, అంతర్జాతీయ భావానికి – తనను, తనజాతిని ప్రేమించి, ఇతరులను, ఇతర జాతులను ద్వేషించే సంకుచిత తత్వానికి-మధ్య వారధిలాగా బాపిరాజుగారు ఈ కథలను అల్లారనిపిస్తుంది. "హ్యూమన్ సైకిల్' అనే గ్రంథంలో అరవిందులు "ట్రూ సబ్జెక్టివిజమ్", "ఫాల్స్ సబ్జెక్టివిజమ్"లకు మధ్య చేసిన విభజన జ్ఞాపకం వచ్చింది. తన సంస్కృతిని తాను నిజంగా గ్రహించగలిగిన జాతి – ఇతర జాతులపట్ల, సంస్కృతుల పట్ల విద్వేషాన్ని కోల్పోయి – పరస్పర అవగాహనకు, ఏకత్వానికి ఎలా ఎదగగలదో చెప్పిన తీరు స్ఫురణకు వచ్చింది. ఈ కథలో మనకు బాపిరాజులోని కళారాధకుడు, చిత్రకారుడు మాత్రమేగాక – స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని జెయిలు శిక్ష అనుభవించిన దేశభక్తుడు కూడా కనబడతాడు.

"ద్వేషము" కథానాయకుడు బాపిరాజుగారి అనేక పాత్రల మాదిరిగానే చిత్రకారుడు, శిల్పి. గాంధీ మహాత్ముని పిలుపు విని విశ్వేశ్వరరావు చదువు మధ్యలోనే ఆపేసి జెయిలు పాలవుతాడు. జెయిళ్లలో విశ్వేశ్వరరావు అనుభవించిన కష్టాలు అతని స్వాతంత్ర్య పిపాసను అణచివెయ్యలేదు గాని– బ్రిటిష్‌వారిపట్ల తీవ్రమైన విద్వేషాన్ని, గాంధీజీ సిద్ధాంతాలపట్ల అపనమ్మకాన్ని రగిలించాయి.

ఇలాంటి సమయంలోనే రామప్ప గుడిలో అతనికి బ్రిటిష్ వనిత 'మేరీ టెంపుల్' పరిచయం అవుతుంది. భారతీయ కళాసంపదమీద మక్కువతో మన దేశానికి యాత్రికులుగా వచ్చిన మేరీ టెంపుల్ బృందాన్ని మొదటిలో విశ్వేశ్వరరావు అపార్థం చేసుకుని, అకారణంగా తగువు పెట్టుకుందామనకుంటాడు గాని-చివరికి అది మేరీ, విశ్వేశ్వరరావుల ప్రణయ కథగా ముగుస్తుంది. "హైందవ జాతికన్నా ఆంగ్ల జాతి ఉత్తమమైనదా, కాదా?" అనే ప్రశ్ననుంచి ఎదిగి మేరీ– 'విశ్వేశ్వరరావు విశాల ఫాలంలో వేద ఋక్కులు పదాలు పాడుతున్నట్టు' అనుభూతినందే స్థితికి వచ్చింది.

ఇక – విశ్వేశ్వరరావు "––ఎవరామె భారతీయ మహాశిల్ప సత్యాన్ని గోచరింప చేసుకునే అధికారం సంపాదించడానికి?.... దేశంలోని సువర్ణ రాసులు, స్వేచ్ఛగా తస్కరించుకుపోయింది గాక – ఈ కజిన్సులు, ఈ పోవెల్సులు, ఈ క్రామరెస్టులు, ఈ కూల్డ్రేలు, ఈ గిల్లులు, ఈ మేరీలు మా శిల్పం కూడా తస్కరించుకు పోవాలీ?...." అనుకునే 'గొణుగుడు' మేరీ పట్ల 'ద్వేషం' లోంచి వచ్చింది కాదు. హృదయంలో పెంచుకున్న సాన్నిహిత్యానికి మరొక విధమైన భావ వ్యక్తీకరణ మాత్రమే. లేకుంటే భారతీయ కళా

సంపదను ఆరాధించిన మహనీయ మూర్తుల సరసన మేరీ నామాన్ని అతడు స్మరించుకుంటాడా?....

ఈ కథ చదువుతున్నప్పుడు నాకు ఈ ఎమ్ ఫార్‌స్టర్ రచించిన "ఏ పేసేజ్ టు ఇండియా" నవల జ్ఞాపకం వచ్చింది. ఆ నవలలో 'అదేలా' 'అజీజ్'కు సన్నిహితం కాలేకపోయింది.

అయితే ఒకటి మాత్రం నిజం. మేరీ కన్య విశ్వేశ్వరరావును వివాహమాడుతానని అన్నప్పుడు..... "ఇది నిజమా మేరీ బాలిక! ..... ఆంగ్లేయ యువతి ఈ దీనుణ్ణి ప్రేమించడం అసంభవం కాదూ? నేనిది మహా స్వప్నం అనుకుంటున్నాను...." అనడమూ, "నిన్ను ముద్దు పెట్టుకుని నీకు నల్లదనము ఇస్తానేమోనని భయం...." అనడము, అతనిలోని 'ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు'కు చిహ్నాలు.

ఫార్‌స్టర్ నవల చివరిలో ఫీల్డింగ్ ఆజీజ్‌కు స్నేహ హస్తాన్ని చాచినప్పుడు "..... మా దేశంలోని ప్రతి ఆంగ్లేయుణ్ణి తరిమివేసేంతవరకూ యిది సాధ్యం కాదు...." అనే 'అజీజ్' మాటలలో వున్న నిరాశ బాపిరాజుగారి కథ ముగింపులో లేదు. దేశాలు, సంస్కృతులు, సమస్యల స్వరూపాలు వేరయినా, మనుషుల గుండెలలోని ఆర్ద్రత ఒక్కటే అనే ఆశాభావాన్ని అందిస్తున్నారు బాపిరాజుగారు ఈ కథలో.

ఒక కథ మంచి కథ అనిపించుకోడానికి ఇంతకన్నా అర్హత అక్కర లేదనుకుంటాను.

---

---

# 13

# కరుణకుమార - "పోలయ్య"



ఇరవయ్యవ శతాబ్దం అడుగుపెట్టిన ఏడాదికి- అంటే 1901లో జన్మించిన 'కరుణకుమార' ఈ శతాబ్దపు తెలుగు కథ తొక్కిన క్రొత్త రీతులకు ఒక తొలి వెలుగుగా గుర్తు పెట్టుకోదగ్గ మంచి రచయిత. కరుణ కుమార కథల్లో ఒకనాటి గ్రామీణ ప్రజా జీవితంలో నిత్యకృత్యాలుగా వుండే జమీందారుల, గ్రామ పెత్తందారుల దారుణ కృత్యాలు, అగ్రజాతుల అక్రమాలు పుష్కలంగా కనబడతాయి. బడాబాబుల ఇనప పాదాల క్రింద నలిగిపోతూ బడుగు జీవి బాధతో చేసే ఆక్రందన దయనీయంగా వినబడుతుంది.

చెప్పుల జత కుట్టి తీసుకురావడం ఒక రోజు ఆలస్యం అయిన నేరానికి కర్రతోకొట్టి ఖామందులు చంపిన ఉదంతాలు (క్రొత్త చెప్పులు) నిమ్న జాతికి చెందిన ప్రేయసీ ప్రియులు పెళ్ళి రోజున గుర్రమెక్కి ఊరేగుదామని ముచ్చట పడితే జరిమానా చెల్లించమని చేసే దౌర్జన్యాలూ (పశువుల కొట్టం' కథలో) ఈ తరం పాఠకులకు వింతగా అనిపించవచ్చు. ఒకనాడు ఇవి కఠోర సత్యాలు.

నిజానికి ఈ రోజున ఆనాటి జమీందారీ వ్యవస్థ, పరదేశీయుల పరిపాలన లేవు. కాని రంగులు మార్చుకున్న భూస్వామ్య వ్యవస్థ వికృత రూపాలు పొందుతూ ఏదో రూపంలో బడుగు జీవుల్ని పీడిస్తూనే వున్నాయి. ఏనాడో 30 లలో రాసిన ఈ కథలు ఈనాటికీ సజీవంగా వుండడానికి ఇది కూడా ఓ కారణం.

'కరుణ కుమార' అసలు పేరు కందుకూరి అనంతం. రెవిన్యూ అధికారిగా ఆయన గ్రామీణ ప్రాంతాలను సందర్శించేటప్పుడు తన హృదయాన్ని కదిలించిన ప్రతి సంఘటననూ తనలోని రచయితకు ముడి పదార్థంగా అందించారనిపిస్తుంది ఈయన కథలు చదివితే. క్రిస్టఫర్ ఇషర్ వుడ్ అనే పాశ్చాత్య సాహిత్య విమర్శకుడు కాల్పనిక సాహిత్య రచయితను - అదును చూసి ఫోటో తీసే ప్రెస్ ఫోటోగ్రాఫర్‌తో పోల్చి చెప్పిన వాక్యాలు కరుణకుమారగారి విషయంలో సార్థకమయ్యాయనిపిస్తుంది. వీరు రచించిన 'మొక్కుబడి' కథ చదివిన వాళ్ళు

ఈ విషయాన్ని తప్పక అంగీకరిస్తారని నా అభిప్రాయం. మన దేశంలో మొక్కుబడుల రూపంలో అమ్మవారి గుడుల దగ్గర జరిగే దారుణ జీవహింసాకాండను ఇంతకన్నా గొప్పగా ఏ భారతీయ రచయిత తన కథలో వర్ణించి వుండడు.

కరుణకుమార కథల్లో వున్న మరో ప్రత్యేకత నాజూకయిన వ్యంగ్యం. తన జమీలోని ప్రజల సంగతిపట్టించుకోకపోయినా కుక్కల పెంపకం పట్ల ఎంతో శ్రద్ధ వహించి వాటికి ప్రత్యేకమయిన గదులు కట్టి ముద్దుమురిపాలు చూచిన కుక్కల జమిందారుగారి కథ "జాకీ" జ్ఞాపకం వుందా? జమిందారు గారి ముద్దుల కుక్క జాకీ చనిపోతే దాని జ్ఞాపకార్థం పంచలోహ విగ్రహం చేయించడం కోసం ... ప్రజల కష్ట సుఖాల విచారణ అనే నెపంతో ఎస్టేటంతా పర్యటించి రైతుల నోళ్ళు కొట్టి చందాలు వసూలుచేసిన దివాన్జీగారిని ఆ కథ పాఠకులు మరిచిపోలేదు. ఇదంతా ఒక ఎత్తు. కుక్క బొమ్మకోసం ఎత్తిన చందాలు గుటకాయస్వాహా కావడం మరొక ఎత్తు. కాలాలు మారితేనేమి ఇలాంటి 'కుక్క వ్యవహారం' ఎప్పుడు మాత్రం లేదు గనుక?

ఇక...గ్రాంధిక భాషలో తప్ప వ్యవహారిక భాషలో మాట్లాడేది లేదని భీష్మించుకుని కూర్చున్న పెద్దమనిషి హఠాత్తుగా తేలుకుడితే ('గ్రాంధిక భాషావాది' కథలో) "నీ వ్యవహారికం, నీ శ్రాద్ధం తర్వాత చూసుకోవచ్చునని..." వ్యావహారికంలోనే కుయ్యోమొర్రో అనడం ఒక తరంనాటి 'జోక్' అయినా, ఇప్పుడు కూడా చదువుకోడానికి హాయిగా వుండదూ...? అన్నట్టు ఊళ్ళో ఎవరికో, ఎక్కడో కలరా తగిలిందని అనుమానం వచ్చి ... తనకు వాంతులూ, విరోచనాలు పట్టుకున్నాయని అకారణంగా భయపడి మంచం ఎక్కి సంధి ప్రేలాపనలు వరకూ వెళ్ళిన మునజబుగారి కథ (అంటుజాడ్యం) సరే సరి...

కరుణ కుమార కథల్లో "పోలయ్య" కథ చాలా బాగుంటుంది. ఈ కథ వర్ణాశ్రమ ధర్మాల పేరుతో సమాజంలో పాతుకుపోయిన కొన్ని మూఢ ఆచారాలను గేలిచేసి వాటి అసలు బండారం బయటపెడుతుంది. ఈ కథలోని వెంకటశాస్త్రి బాగా శ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబంలో పుట్టినవాడు. ఆపైన కాశీకి వెళ్ళి పండితుల దగ్గర సంస్కృతాన్ని, సనాతన ధర్మాల సారాన్ని కూలంకషంగా నేర్చుకున్నవాడు. ఇదంతా బాగానే ఉంది గాని ఇంతలోనే అతని తెలివి వెర్రితలలు వేసింది. అంటరానివాడుగా పరిగణించబడుతున్న హరిజనులు హిందూమతానికి సంబంధించిన వారు కాదని ఆయన ఒక సిద్ధాంతాన్ని తయారుచేసుకున్నాడు. గాంధీజీ హరిజనోద్ధరణకై కంకణం కట్టుకుని వారిని దేవాలయాల్లోకి ప్రవేశపెట్టడానికి ప్రయత్నిస్తున్న రోజులలో, తన సిద్ధాంతాన్ని నలుగురికీ ప్రచారం

చేయవలసిన అవసరం వుందని ఆయన భావించాడు. హరిజనోద్ధరణ ఉద్యమాన్ని వ్యతిరేకిస్తూ ... దేశంలోని పలు ప్రాంతాలలో ఉపన్యాసాలివ్వడానికి నడుం బిగించాడు.

శాస్త్రిగారు తన కార్యక్రమంలో మునిగి దేశాటనం చేస్తున్న సమయంలో అతనికి మనుమడు పుట్టాడు. మనుమడి బారసాలకయినా తప్పకుండా రావలసిందని కొడుకు టెలిగ్రాముల మీద టెలిగ్రాములు ఇవ్వడంతో తన కార్యక్రమాన్ని తాత్కాలికంగా వాయిదావేసుకుని స్వగ్రామం బయలుదేరాడు. వాళ్ళ వూరు వెళ్ళడానికి "పుంజూరు" స్టేషనులో రైలు బండి దిగాడు గాని అప్పటికి రాత్రి పదకొండు గంటలయింది. ఒంటెద్దు బండిమీద వాళ్ళవూరు చేరుకోవాలి.

కాని, ఆ రాత్రి శాస్త్రిగారికి బండి ఏదీ దొరకలేదు. ఎముకలు కొరికే చలిలో ఈ అర్ధరాత్రి పూట ఎలా గడపాలని శాస్త్రిగారు బెంగపెట్టుకునే సమయంలో ... అపద్బాంధవుడులాగా ఒక బండివాడు కనపడ్డాడు. కాని ... వాడు ఈ రాత్రిలో ససేమీరా బండికట్టనన్నాడు. శాస్త్రిగారు వాడిని నానా విధాల బ్రతిమాలి ఎక్కువ డబ్బు ఇస్తానని ఆశచూపి, చివరకు బండి కట్టించారు.

బండివాడి పేరు పోలయ్య. వాడే మన కథా నాయకుడు. బండి నడస్తుండగా పోలయ్య శాస్త్రిగారికి ఎన్నో విశేషాలు చెబుతాడు. చెంచునాయుడు అనబడే మోతుబరి గ్రామానికి బస్సు వేయించి బండివాళ్ళ నోళ్ళు కట్టించిన వైనము, కడుపు మండిన బండివాళ్ళు చెంచునాయుడు ధాన్యం కొట్లమీదపడి దోచుకోవడము, ఆ పైన నాయుడు ఆడా మొగా తేడా లేకుండా అందరినీ జైయిళ్ళలోకి తోయించడము, అన్నీ శాస్త్రిగారికి బండివాడివల్ల తెలుస్తాయి. బండివాడికి ఆ చెంచునాయుడు శాస్త్రిగారు మంచి మిత్రులన్న సంగతి తెలియదు. కాని శాస్త్రిగారికి మాత్రం మాటల సందర్భంలో బండివాడు మాలవాడన్న సంగతి తెలుస్తుంది.

దానితో శాస్త్రిగారికి వళ్ళంతా తేళ్ళు, జెర్రులు పాకుతాయి. తనశాస్త్రం, సంప్రదాయం, చెంబులో కాశినుంచి అతిపవిత్రంగా తెచ్చుకుంటున్న గంగాజలం, అన్నీ గంగలో కలిసిపోయాయని మనసులోనే భోరుమని ఏడుస్తాడు. మార్గమధ్యంలో బండివాడిని ఏమన్నా అంటే వాడికి కోపం వచ్చి అర్ధరాత్రి చిమ్మచీకట్లో రోడ్డుమీద వదిలేసిపోతాడని భయం.

అందుచేత ఊరు వచ్చేదాకా వూరుకుని ఆ తర్వాత చెంచునాయుడిని పిలిపించి బండివాడి మీద పంచాయితీ పెట్టిస్తాడు. మాలవాడయి వుండి వెంకట శాస్త్రిగారివంటి సనాతనుడికి అసలు సంగతి చెప్పకుండా బండి ఎక్కించిన నేరానికి వాతలు పెడదామని అనుకుంటారు.

పోలయ్యను చెట్టుకు కట్టేశాడు. వాతలు పెట్టడానికి ఇనుప కడ్డీ కాలుతోంది. ప్రాణభయంతో పోలయ్య ... తన పేరు 'పౌలయ్య' అని తాను క్రైస్తవుణ్ణి అని అబద్ధం ఆడతాడు. అంతేకాదు. ... "మా ఫాదరీకి ఈ విషయం తెలిసిందంటే మీరు ఇంతకు ఇంతా అనుభవిస్తారు" అని భయపెడతాడు.

దాంతో నాయుదు, వెంకటశాస్త్రి హడిలిపోతారు. క్రైస్తవ ప్రభువులు పరిపాలిస్తున్న దేశంలో క్రయిస్తవుణ్ణి హింసిస్తే మనుగడ వుంటుందా? ... వెంటనే వెంకటశాస్త్రి ప్లేటు ఫిరాయించి "ప్రభువుల మతాన్ని హింసిస్తే ప్రభువును అవమానపరిచినట్టే... ప్రభువుల మతంలో కూడా విష్ణువు అంశ వుంటుంది" అంటూ వాడికి కట్టిన కట్లు విడదీయిస్తాడు. అంతేకాదు. వాడికి భోజనం పెట్టించి, బండి బాడుగ ఒప్పుకున్న దానికంటే ఎక్కువ ఇచ్చి పంపుతాడు.

పదవి, అధికారం వీటిముందు ఎటాంటి సనాతన ధర్మం, సంప్రదాయం అయినా తలదించుకుని నిలబడవలసిందే అనే ఎత్తిపొడుపు ఈ కథలో ఉంది. సంప్రదాయానికి తప్పుడు వ్యాఖ్యానాలు చేసి, కుహనా విలువలను ప్రచారంచేసే పెద్ద మనుషుల అవకాశవాదాన్ని పిరికిదనాన్ని గేలిచేస్తాడు కరుణకుమార ఈ కథలో. ఇవాళ ... హరిజనులను అంటరానివారంటే చట్టరీత్యా అది నేరం కావచ్చు. ఒంటెద్దు బండికీ, బస్సుకు మధ్య జరిగిన సంఘర్షణ పెట్టుబడిదారీ సమాజాల చరిత్ర గర్భంలో కలిసిపోయివుండవచ్చు. కాని వీటన్నింటికీ మూలమైన మానవ ప్రవృత్తిలోని సంకుచితత్వం చెక్కుచెదరకుండా అలాగే వుంది.

---

## 14

# మా. గోఖలే - 'బల్లకట్టు పాపయ్య'



"ఏకువ జామున తొలికోడి కూసేవేల మిట్టపల్లి, పొట్టపల్లి మయాన పార్తుండ కిట్ట కాలువ గెట్టు మీన్నుంచి ఎవరయినా నిలబడి సూత్తా యిటుంటే మిట్టపల్లి ఏపుల్నించి సీకట్లో బజన పాటలు యినిపించి యింకూసేపటికి డొంకల్లోంచి సేతికర్ర పొడుసుకుంటూ నల్లయిగ్రహం మిట్టపల్లాలు ఎక్కిదిగుతా వొచ్చి కిట్టకాలవ గెట్టెక్కి ఆడ గొలుసుతో కట్టేసుండ బల్లకట్టు కాడికొచ్చి నిలబడ్డం తెలుసుద్దన్నమాట. ఆ యిగ్రహం బల్లకట్టు పాపయ్య"

కథకుడు చిత్రకారుడు అయిన మాధవపెద్ది గోపాలకృష్ణ గోఖలే (1917-1981) దశాబ్దాల క్రింద రాసిన 'బల్లకట్టు పాపయ్య' కథ ప్రారంభ వాక్యాలు యివి. యివాళ యిరవై ఒకటో శతాబ్దంలో వున్న మనకు బ్రిడ్జీలు, బ్రిడ్జిల మీద పరుగెట్టే బస్సులు, సామాన్యమైన విషయాలు అని అనుకుంటే - బల్లకట్టు కథ నిన్నటి కథే అవుతుంది. యిది నిజమే కాని - "బ్రిడ్జిలు యాడ బద్దే యాడ ఎక్కడుంటై? యిట్లాంటి కిట్ట కాలవకు బల్లకట్టు లేకపోతే జనం అల్లాడి పోవల్సిందే ఎప్పటికయినా..." అనే మాటను కూడా తీసిపారెయ్య దానికి వీలులేదు.

సరే - ఈ కథ అంతా అలా వుండనివ్వండి. మిట్టపల్లి, పొట్టపల్లి, మధ్యన ఉండే కృష్ణ కాలవ మాట ఏమోగాని - ఏ కాలవ దగ్గిర ఏ బల్లకట్టును చూచినా - బల్లకట్టు నడపేవాడు చుట్టకాల్చనివ్వండి, కాల్చకపోనివ్వండి. (పొగాకు కాడలు ఎవరు యిచ్చారన్న ప్రసక్తి అసలేవద్దు) అతగాడికి భజన పాటలు రానివ్వండి, రాకపోనివ్వండి - నా కళ్ళకు వాడుపాపయ్య - బల్లకట్టు పాపయ్య!

గోఖలే పేరు చెబితే నాకు ఒకనాటి గ్రామీణ వాతావరణం అంతా కళ్ళముందు మెదలుతుంది. నాట్లు నాటడం, కోతలు కోయడం, తిండి గింజల్ని మార్కెట్‌లో అమ్మడం, తోలుబొమ్మలాటలు, తిరునాళ్ళూ, యివన్నీ గోఖలేకు యితివృత్తాలు. అయితే - అతి సామాన్యమైన ఈ యితివృత్తాల వెనుక నిన్నటికీ - నేటికీ - బహుశా రేపటికీ (మనం

ఆశావాదులం కాదనుకుంటే!-) చెందిన ఒక నిరంతర కథ నేపథ్యం కనబడుతుంది. ఈ కథల్లో కనబడే కోటాయ్, సూరాయ్, ముసలాయ్, సీతాం, రత్తాం, సుబ్బాం యివాళ గ్రామసీమల్లోనూ, పట్టణాల్లోనూ యింకో విధంగా వుండవచ్చు. ఎంకట సుబ్బయ్యగారు, కిష్టమ్మగారు, యింకో రూపంలో మరో అవతారాన్ని దాల్చి వుండవచ్చు. "- ఒక పక్క బియ్యం లేవు. రేసను మూసేసామంటండిరీ - యింకో పక్క రంగయ్యలూ, గంగయ్యలూ రూపాయకు తవ్వెడు బియ్యం పబిలీగ్గా అమ్ముకుంటు డిరీ! ఎవురా మొగోడు వూళ్ళో వుండే పెద్ద మనుషుల్ని నిలేసి అడిగిందీ? "(పిప్పిదంట్లు' కథలో) అనే 'సీతాం' గోడులో పెద్ద మార్పు వచ్చిందనుకోను. కాకపోతే - ఈ ద్రవ్యోల్బణపు రోజులలో రూపాయి పావలాకు 'తవ్వెడు సోలెణ్ణర గిద్దెడు' పెసలు రాకపోవచ్చును. అది వేరే విషయం.

చాలామంది అభ్యుదయ కథకుల ఒరవడిలోనే గోఖలే కథలు రాసినప్పటికీ - గట్టుమీద కూర్చుని, నీట్లో మునిగిపోతున్నవాడిని చూచి 'అయ్యో పాపం' అనే ధోరణి కాదు అతనిది. గోఖలే కథల్లో వాళ్ళ గుండె చప్పుడు, ఆ చప్పుడు లోంచి వినవచ్చే విషాద సంగీతమూ (దానిని 'సంగీతం' అన్నందుకు క్షమించగలిగితే-) చాలా స్పష్టంగా, సన్నిహితంగా వినబడుతుంది. అంతేకాదు - వాళ్ళ భాషలో, వాళ్ళ యాసలో వినబడుతుంది.

మాండలిక భాషలో తొలిసారిగా కథలు రాసిన ఘనత ఎవరిదనే విషయానికి సంబంధించిన చర్చను అలా వదిలిపెట్టి చూచినా - మాండలికాన్ని యింత శక్తివంతంగా ఉపయోగించగలిగిన తొలి తెలుగు కథకుడుగా గోఖలేకు పెద్ద పీట వేస్తే అభ్యంతరం వుండదనుకుంటాను. నిన్న మొన్నటి దాకా 'ఎనికతోకల' జెడలు వేసుకుని ఏదాది తిరిగే సరికి ఎర్రకోక ఎగ్గెట్టి (మరిచిపోయాను-'జేజి' యిచ్చిన!) తెల్లగన్నేరు పూలు కొప్పులో దోపుకుంటూ నాట్లకి వెళ్తాంటే రత్తిని 'సూత్తా కూకుండేవోరి' మనసులోని గుబులును మాండలికంలో రాయకపోతే ఆ కథ షోకు ఏముందీ?- ('రత్తి కోక కట్టింది' కథలో.)

మాటవరసకి - 'కిష్టమ్మగారి పెద జీతగాడు' కథే తీసుకోండి. కిష్టమ్మగారు ఒక మోతుబరి భూస్వామి. అతనికి రత్నాలు కురిపించే భూమి వుంది. - తన కాయకష్టంతో ఆ భూమిలో పండే రత్నాలను గుప్పిట పోయగల పెద్ద జీతగాడు సూరాయ్ వున్నాడు. కిష్టమ్మగారికి ధాన్యరాసులు తెచ్చే నోట్ల కట్టలను చూచి గర్వించే తత్వం వున్నదిగాని - 'పల్లకి మోసే బోయీ అయిన సూరాయ్ గురించి జాలీ లేదు. సానుభూతి లేదు - వుంటే ఆయన కిష్టమ్మగారెలా అవుతాడు? యిందులో వున్న కథ యింతే. - "కాత్తె పెద్ద జీతగాణ్ని గందా అప్పుడప్పుడు మడిసిని నమ్మగూడదా అనిపిచ్చుది. పెల్లిజేసుకున్నా, పెల్లాం కాపురానికొచ్చిందీ. అయినా మడిసిని కనిపెట్టి చూడ్డే ఈ కిష్టమ్మ దొంగల్తోలా!-" అనుకునే

సూరాయ్ అమాయకత్వము - తన కష్టంతో 'కోటయకొండ పెబ' ల్లాగా పెరిగిన ధాన్యం కుప్పలు తనవే అయితే తన పెళ్ళాం 'సుబ్బాం'ను 'సికరం' మీద కూర్చోబెడదునన్న అతని కల-కథకొక ప్రత్యేకతను తెచ్చి పెడతాయి. కలలో 'రతనాలకి మల్లే రాల్తుండయి గింజలు" యిలలో మాత్రం మిగిలింది 'నిదుర మొగం నాయాల'కు తన్నులే!

గాంధీగారి జీవిత చరిత్రను రాసిన 'రోమారోలా' ఎప్పుడో 1895లో డైరీలో వ్రాసుకున్న "-ప్రస్తుతపు సంక్షోభం నుంచి యూరోపు బయటపడాలంటే ఒక్కటే ఆశ వుంది. అది సోషలిజమ్-" అనే వాక్యాలను యిండియాకు అన్వయించుకుని, నిన్నటి తరపు ఈ కథల్ని యివాళ కూడా చదువుకుని ఆనందించగలం.

ఇంతకూ-బల్లకట్టుమీదే పాపయ్యను కృష్ణ కాలువ దగ్గిర వదిలేసి యింత దూరం వచ్చాం. ఇప్పుడు ప్రస్తావించుకున్న 'సోషలిజమ్'కు, పాపయ్య కథకూ మధ్యగల సంబంధాన్ని అలా వుండనిచ్చినా- నా కళ్ళకు పాపయ్య ఒక గొప్ప 'కర్మయోగి' లాగా కనబడతాడు. పెద్ద మనిషి, నమ్మకస్తుడు, ఎవరి జోలికీ పోడు, రాత్రి పదింటిదాకా భజన పాటలు పాడుకుంటూ వుంటాడు అని పదిమందీ అనుకుంటా వుంటే నెలకు ఆర్రూపాయల పావలా జీతంతో పాపయ్యకు బల్లకట్టు ఉద్యోగం అయింది.

ఆ క్షణం నుంచి అతనికి అదే జీవితం అయి పోయించి, బల్లకట్టు మీదకు పదిమందీ వస్తుంటారు. కాబట్టి అందరి దగ్గిరా తలొక కాణీ, అర్ధణా రాబట్టుకున్నా నాలుగు రాళ్ళ పైరాబడి వుంటుందని పాపయ్యపెళ్ళాం బూసమ్మ ఆశపడ్డంలో తప్పులేదు.

కాని.... "ఆరోరికి తోస్తే ఏమన్నా, యిచ్చి పోతుండాల్సిందే గాని గెట్టిగా ఎవుల్ని మటుకేం నిలదీస్తాం. తప్పుకాదూ? బల్లకట్టు ఎక్కనియ్యకుండానికి నా యబ్బసొమ్మేట్టా బల్లకట్టు?-" అనే పాపయ్య మాట కూడా తీసిపారెయ్యడానికి వీలులేదు.

ఒకవేళ, పాపయ్య నోరుతెరిచి అడిగినా బాలకృష్ణయ్యలాగా కానీ డబ్బులు 'రేపు' యిస్తామనే వాళ్ళే ఎక్కువ. ఆఖరికి - పెరుగు ముంతలు నెత్తిన పెట్టుకుని తొలి కోడి కుయ్యడానికి ముందే తయారయ్యే గొల్లభామలు నాగరత్తి, అచ్చుమ్మ, ఎంకాయి సిన్నాంలు కూడా సర్దన్నంలోకి మజ్జిగ చుక్కలు కూడా రాల్చరు కదా- యిక, కూలీజనం దగ్గిర ధాన్యం గింజలు, మిరపకాయలు రాల్తాయా? వాళ్ళది మాత్రం రెక్కాడితేగాని డొక్కాడని బ్రతుకు కాదూ?

ఇలాంటి బ్రతుకలేని పాపయ్యమీద, అతని బల్లకట్టు మీదా బూసమ్మకు ఈసడింపు వున్నా- వేకువ జామునుండి రాత్రి పొద్దుపోయేవరకు అందరి సేవలోనూ పాపయ్య వుంటాడు. చీకటిపడినా - బల్లకట్టు కట్టేసినా, 'బాబ్బాబు' అంటే పాపయ్య తయారు.

ఇలాంటి పాపయ్యకు చేబదులు కావలసి వస్తే, చెయ్యి విలిదించకపోగా- రత్తయ్య పెళ్ళాం కాంతమ్మ 'ఈరబెమ్మం'తో లేచిపోయిన ఉదంతాన్ని, రంగయ్య బూసెమ్మను ఎవరూ లేని సమయంలో చుట్ట ముట్టించుకోవడానికి నిప్పు అడిగిన ఉదంతాన్ని కలబోసి చెప్పి - పాపయ్య కాపురంలో 'నిప్పు' పెట్టాడు సుబ్బయ్య. దాంతో పాపయ్యకు, అతని పెళ్ళాం బూసెమ్మకు పోట్లాటలు నిత్యకృత్యం అయ్యాయి.

ఇదంతా కళ్లారా చూస్తున్నాడు గనుకనే - పాపయ్య కొడుకు కొండయ్య బల్లకట్టు పని వద్దన్నాడు. "నా పెళ్ళాం బల్లకట్టు పని వద్దంటున్నది-" అనేది సాకు మాత్రమే! ఎవరికి తప్పినా - ఎవరు కాదన్నా, -పాపయ్యకు మాత్రం బల్లకట్టు తప్పదు. అది అతని కడుపు నింపకపోవచ్చు. నలుగురూ ఒలకపోసే ఆప్యాయత, నాలుగు పొగాకు కాడలు తప్ప ఆ వృత్తిలో అతనికి దొరికేది ఆట్టే లేకపోవచ్చు. కాని - నలుగురికి ఉపయోగపడుతున్నానన్న సంతృప్తి, తను లేకపోతే ప్రజా జీవితం స్తంభించి పోతుందేమోనన్న భ్రాంతి, పాపయ్యను గడియారం ముల్లులా నిర్విరామంగా తిప్పుతున్నాయి. అతడిని కర్మయోగిగా చేస్తున్నాయి. నడిపేది బల్లకట్టు అయినా, విమానం అయినా - నడిపేవాడికి ఈ నిజాయితీ ఏనాడూ అవసరమే.

అందుకే - ఇరవై ఒకటో శతాబ్దంలో 'బల్లకట్టు' కనబడకపోయినా, పాపయ్యలు మాత్రం ఎప్పుడూ వుండాలని అనుకుంటాను. (వాళ్ళ జీతం ఆర్రూపాయల పావలా కాకపోయినప్పటికీ.) కాకపోతే - ఆ పాపయ్యలు 'బూసమ్మ'ల్ని తన్నకూడదని కోరుకుంటాను.

---

# 15

## విశ్వనాథ - "మాక్లీ దుర్గంలో కుక్క"



"-వందలాది విలక్షణమైన పాత్రలను నేను సృష్టించితిని, కథ, కథ చెప్పెడి సొగసు, శిల్పము-బూడిద, బుగ్గి, ఒక గొప్ప నవలకు కావలసిన సామగ్రి యంతయూ ప్రతి నవలలోనూ సమగూర్చితిని కల్పనా వైవిధ్యమునకు అంతులేదు.... నా గద్య ప్రపంచమెట్టిదో, నేను నిర్మించిన పద్య ప్రపంచము అట్టిదే-ఎంగిలి కూడు లేదు.... యిటు చూస్తే వేదాలు, ఉపనిషత్తులు, భాష్యాలు, తర్కాలు, వ్యాకరణాలు- అటు చూస్తే పాశ్చాత్య సాహిత్యములో నేను నిద్రాహారాలు మాని సేకరించిన విషయాలు...." అంటూ విశ్వనాథవారు ఈ మాటల్ని తన నవలల్ని దృష్టిలో వుంచుకుని అన్నప్పటికీ-చిన్న కథలు యిందుకు మినహాయింపు కాదు.

"-నేను ఆమూలాగ్రం మానవ ప్రవృత్తిని పరిశీలించి తెలుసుకుని స్టడీ చేశాను. నేనేది వ్రాసినా తెలిసి వ్రాసాను. నేను 'కాన్షస్ ఆర్టిస్ట్'ని. 'యిన్స్పయిర్డ్ ఫూల్'ని కాను, '-నేను పూర్వాచార పరాయణుడను, ఆధునికుడను కాను. ప్రవాహమునకు ఎదురీదు వాడను-' ఈ మాటలు నా గురించి అజ్ఞానులు చెప్పుకొందురు. .... లోకం యింత మారుతూ వుంటే వీడెందుకు మారడు?- కొండలు, నదులు, మారవు-" అని, - విశ్వనాథ వారు ఏనాడో చెప్పుకున్న విషయాలకు విశ్వనాథ సత్యనారాయణగారి కథలు కూడా తార్కాణంగా నిలుస్తాయి.

విశ్వనాథ చేపట్టిన యితర సాహిత్య ప్రక్రియల సంఖ్యతో పోల్చి చూస్తే-రాశిలో ఆయన కథలు తక్కువే అయినప్పటికీ-, వాసిలో అవి విశ్వనాథ సాహిత్య సృష్టి వేటికీ తీసిపోవు. ఈ కథల్లో వున్న మరో ప్రత్యేకత ఏమిటంటే - ఆయన "వేయి పడగలు" నవల చదివి అందులోని భావాలకు గాభరాపడిన వాళ్ళు ఈ కథలు చదివి కాస్త హాయిగా ఊపిరి పీల్చుకోవచ్చు. కొండలు, నదులు, మారవు నిజమే. పుణ్యక్షేత్రాల వొద్దున స్నాన ఘట్టాల దగ్గిర దర్శనమిచ్చే నది, కొండల నడుమ ప్రవహించేనది వొక్కటే-కాని,-ఒకచోట బురద వున్నట్టు అనిపించవచ్చు. అది వేరే విషయం.

విశ్వనాథ కథల్లోని ఇంకో ప్రత్యేకత-యితివృత్తాలలోని వైవిధ్యం. జీవితాన్ని నాలుగు కోణాల్లోంచి పరిశీలించడంలో విశ్వనాథ వారికి గల అపురూపమైన శక్తికి ఆయన కథలు కూడా అద్దం పడతాయి. రథం క్రింద కుక్కపడితే చాలా బాధపడిపోయి దానికి వైద్యం చేయించి, - ఆనక అది వచ్చిపోతే సమాధి కట్టించిన రాజుగారి కథ జ్ఞాపకం వుందా?- ఢిల్లీ, నుంచి మక్కాకు, రామేశ్వరం నుంచి కాశీకి రోడ్డు వేయించి నలుగురుచేత దర్మ ప్రభువు అనిపించుకున్న ఈ రాజాగారి అసలు రంగును 'అల్లాకే ఫకీర్' కథలో బయట పెట్టిన విశ్వనాథ వారు-'య్యో-ర్ఫీషీఖెయ్' కథలో దేశం పొలిమేర దాటి అన్ని దేశాలకూ వర్తించే కథ చెబుతారు. 'య్యోర్ఫీషీకెయ్' ఒక గొప్ప నీగ్రో కవి. కాంగో బిడ్డ. ప్రజలలో స్వాతంత్ర్య భావాలను ప్రదీప్తం చేస్తూ కవితలల్లిన నేరానికి పరాయి ప్రభుత్వం అతడిని జెయిల్లోపెట్టి హింసించి మృత్యువు కోరలకు ఎరవేస్తుంది.

కాని- అతడు మరణించినా అతని గీతం చిరంజీవిగా మిగిలిపోతుంది. విశ్వనాథ వారి నిన్నటి ఈ కథ- యివాళ కూడా ఆఫ్రికన్ దేశాలలో నడుస్తున్న చరిత్ర. నీగ్రో కవి కథను అద్దం పెట్టుకుని విశ్వనాథవారు ఈ కథలో ప్రచారం చేసిన స్వాతంత్ర్య పిపాస ఒక ఎత్తూ నీటి గుర్రం (హిప్పోపోటమస్) ఉదంతం మరొక ఎత్తూను. వందలాదిమంది నీగ్రోలు సమిష్టిగా కృషి చేసి ఉచ్చులు వేసి పెద్ద నీటి గుర్రాన్ని బయటకు లాగగా లేనిది, లక్షలాది ప్రజలు ఏకత్రాటిపై నడిచి కలిసికట్టుగా పనిచేస్తే పరపీడన నుంచి (దాని స్వరూపం ఏదయినప్పటికీ) విముక్తి ఎంతసేపు?- యిక- 'ముగ్గురు బిచ్చగాళ్ళు' కథలో విశ్వనాథవారు "రాజ్యం చేసే వాడంటే మొదట బిచ్చగాడు. తర్వాత దొంగ-' అనడాన్ని కొందరు ఓట్ల బిచ్చగాళ్ళకు అన్వయించవచ్చునా?-

ఇతి వృత్తం ఏదయినప్పటికీ సమర్థుడయిన కథకుడు పాఠకుల ఆలోచనలను లోతుగా తీసికెళ్ళగలడని చెప్పడానికి 'జీవుడి యిష్టము' కథ కూడా ఓ ఉదాహరణ. కట్టుకున్న భర్త, కన్నబిడ్డలు, తనను కామించిన వాడి దౌర్జన్యానికి బలి అయిపోతే- మనసు చంపుకుని శరీరాన్ని ఆ కాముకుడికి అర్పించి ఒక అందాల రాశి జీవచ్ఛవంగా బ్రతకాలా?- లేక ఆత్మహత్య చేసుకోవాలా?- అనే ప్రశ్న వచ్చినప్పుడు' 'జీవుడి యిష్టము' ప్రధాన మంటూ ఆస్తిత్వవాద దృక్పథాన్ని.స్ఫురణకు తెస్తారు విశ్వనాథ ఈ కథలో.

విశ్వనాథ రాసిన మంచి కథలు యిన్ని వున్నప్పటికీ- "మాక్లీ దుర్గంలో కుక్క" కథ నాకు నచ్చడానికి కొన్ని కారణాలున్నాయి. కుక్కను అద్దం పెట్టుకుని విశ్వనాథ వారు మనుషుల్లోని కుక్క బుద్ధులకు నషాళం అంటేలా మరకలు అంటించడం యిందుకు ఒక ప్రధానమైన కారణం అనుకుంటాను. ఇది వ్రాస్తుంటే నాకు చాగంటి సోమయాజులుగారి "బూర్జువా కుక్క", రావిశాస్త్రి "కుక్కపిల్ల" కూడా జ్ఞాపకానికి వచ్చాయి. ఈ మూడు కథల్లోనూ

కుక్కగారు కథానాయక పాత్ర వహించడం ఒక్కటే యిందుకు కారణం కాదు. ఈ మూడు కథల యితివృత్తాలు, ఆ కథలను అల్లిన రచయితల దృక్పథాలు, ఒక్కటే అని చెప్పడం కూడా నా ఉద్దేశం కాదు. మానవ మనస్తత్వాన్ని అందులోని బలహీనతలను హిపాక్రసీలను- అద్దం పట్టి చూపడానికి ఈ మూడు కథలూ సన్నిహితంగా కనబడతాయి.

ఈ కథలోని మాక్లీదుర్గం గుంతకల్లు నుంచి బెంగుళూరుకు పోయే దోవలో వున్న ఒక చిన్న రైలు స్టేషను. ఆ రైలు స్టేషన్‌లో ఒక చిన్న ఫలహారశాల. ఆ ఫలహారశాలలోని మిఠాయిల వంక ఆశగా చూస్తూ కూర్చున్న ఒక ఊరకుక్క ఇదీ- కథ మొదటిలో మనకు కనబడే దృశ్యం. మనకథానాయకుడయిన కుక్క శాంతమూర్తి. దానిని డొక్కలో బూటు కాలుతో తన్నినా, కర్రతో బాదినా, 'కుయ్యో, మొఱ్ఱో' అంటుందేగాని తిరగబడదు. రైలు స్టేషనుకు ఎదురుగా వున్న కొండల్లో వేగోలాలు వున్నాయని భయం కాబోలు అటువేపు వెళ్ళనే వెళ్లదు. దాని మకాం ఎప్పుడూ ఫలహారశాల దగ్గిరే. పోనీ- కుక్క ఇంత ఆశపడుతోంది కదా అని దుకాణంవాడు చెయ్యి విదులుస్తాడా అంటే- ఎప్పుడో గాని అదీ లేదు.

కథ ఇలా వుండగా- ఆ వూరి స్టేషన్‌కి రైలు బండిలోంచి ఒక పెద్ద మనిషి దిగాడు. అతడితోబాటు ఒక అందమైన సీమకుక్క కూడా వుంది. మన కథానాయకుడయిన ఊరకుక్క, అతగాడి సీమకుక్క తొలిచూపుల్లోనే ప్రేమించుకున్నాయి. సీమకుక్క యజమాని కబుర్లు చెప్పడం వరకూ చాలా అభ్యుదయవాది. వర్ణ వ్యవస్థ సంఘంలో వేర్లు పాతుకుపోయి వున్న ఒక సాంఘిక దురాచారం అనేది అతని అభిప్రాయం. వర్ణాంతర వివాహాలు, వర్ణాంతర భోజనాలు జరిగితే గాని ఈ సాంఘిక దురాచారానికి విముక్తిలేదని స్టేషన్ మాస్టర్‌తో అతడు వాదిస్తాడు.

మన పూర్వులు వర్ణాశ్రమ వ్యవస్థను దుర్బుద్ధితో ఏర్పాటు చెయ్యలేదని స్టేషన్ మాస్టర్ వాదింపబోతాడు గానీ మన అభ్యుదయవాది అతడిని మాట్లాడనివ్వడు. అభ్యుదయ వాది తన ఉపన్యాసాన్ని దంచుతున్న సమయంలోనే సీమకుక్క, ఊరకుక్కల ప్రణయం ముదరి - ఆ రెండింటి మధ్యా వర్ణ సంకరం జరిగిపోతుంది! ఇది చూచిన ఆ పెద్దమనిషి తన జాతి కుక్క అభిజాత్యం మంటగలిసిపోయిందని లబోదిబో మంటాడు. ఊరకుక్క తుంటిమీద గట్టి దెబ్బ కొట్టి తన ముద్దు కుక్కను మలినం చేసిన పాపం పోవడానికి స్నానం చేయించి రైలుబండిలో ఎక్కిస్తాడు. అది మాత్రం తన ప్రియుడు ఊరకుక్క కోసం ఎదురుచూస్తూ కంపార్ట్‌మెంట్‌లోంచి తొంగిచూస్తుంది. కాని - ఆ ఆశ ఫలించదు.

సీమ కుక్క హృదయేశ్వరుడయిన తర్వాత కుక్క జీవితంలో మరికొన్ని సంఘటనలు జరిగాయి. ఓ రాత్రిపూట కొండమీద నుంచి వేగోలం వచ్చినప్పుడు దాన్ని చూచి మొదట్లో మన కుక్క భయంతో ఫలహారశాల బల్ల కింద దాక్కుంది గాని, ఆ తర్వాత అదును చూచి

దాని పీక పట్టుకుని చంపేసింది. తాను చేసిన ఘనకార్యంతో ఊరకుక్క స్టేషన్ మాస్టర్‌తో సహా అందరి మన్ననలూ పొందింది. ఇలాంటి కుక్కకు నెల్లాళ్ళనుంచి నిలవవుండిపోయిన ఫలహారాన్ని పెట్టి దానికి చచ్చేంత అనారోగ్యం చెయ్యడానికి కారకుడయ్యాడు కేంటిన్ యజమాని. అనారోగ్యంతో కుక్క చిక్కి శల్యమైపోతే గజ్జి కుక్క అంటూ అందరూ దాన్ని అసహ్యించుకున్నారు. చివరకు రైలు క్రింద పడి చనిపోవడమే దానికి గతి అయింది.

కుక్క కథను ముగించడానికి ముందు విశ్వనాథ వారు భూతదయ గురించి, ధర్మబుద్ధి గురించి లెక్చర్లిచ్చిన విద్యాధికులు ఆకలితో మల మల మాడిపోతున్న కుక్కకు ఒక చిన్న పకోడి ముక్కను కూడా వెయ్యకపోగా చావగొట్టిన ఉదంతాన్ని కూడా చెబుతాడు.

"మాక్లీదుర్గంలో కుక్క" నిజానికి ఒక కుక్క కథ కాదు. మూడు వర్గాలకు చెందిన పెద్ద మనుషులచే పీడించబడుతున్న సమాజం కథ ఇది. పేదవాళ్ళ తరపున అరవడం మినహాగా ఆచరణలో సమత, దయ లేని జనం ఒక రకం - కులంగాడి కోరలు పీకెయ్యాలని కబుర్లు చెప్పి ఆవరణలో మాత్రం మనసునిండా కులతత్వం నింపుకున్న పెద్ద మనుషులు రెండో రకకం - పేరు కోసం పనికిరాని దానాలు చేసే నకిలీ దానకర్ణులు మూడో రకం.

ఈ కథలో కుక్కను తన్నిన విద్యావంతులను, కుక్కకు జాతి సంకరం అయిపోయిందని విలవాల్లాడి పోయిన పెద్దమనిషిని, పాచిపోయిన కూడును కుక్కకు వేసిన దుకాణం యామానిని జ్ఞాపకం చేసుకుంటే ఈ దుష్ట గ్రహాల కథ తెలుస్తుంది.

ఈ పెద్ద మనుషుల నుంచి జాతికి విముక్తి లభిస్తే - ప్రగతి గురించి ఉపన్యాసాలు అక్కరలేదు. ప్రగతే జాతికి జీవనాడి అవుతుంది. మనుషులలోని 'జెకిల్'ను 'హైడ్'ను బయటపెట్టి 'హిపోక్రసీ' అసలు బండారాన్ని బజారుకు ఈడ్చిన కథ 'మాక్లీ దుర్గంలో కుక్క!'

అన్నట్టు- ఈ కథకు ఓ కొసమెరుపు కూడా వుంది. సీమ కుక్కకు ఊరకుక్క వల్ల పుట్టిన కుక్కకు మనుషులంటే అసహ్యం. వేగోలాలతోనే నేస్తం. ఇది నిరాశావాదం కాదు. 'మనుషులను మనుషులుగా బ్రతకమనే హెచ్చరిక మాత్రమే!' - కథకుడుగా విశ్వనాథం ఆశించింది అదే -

---

# 16

## కవి కొండల వెంకటరావు -' 'లి' గాడు'



కవికొండల వారిపేరు ఈ తరం పాఠకులకు అంతగా పరిచితం కాకపోవచ్చునేమోగాని, వెనుకటి తరం సాహిత్యాభి మానులకు ఆయన కవిగా, కథకుడుగా, సుపరిచితుడు. తెలుగు కవితా సీమను భావ కవిత్వం ఏలుతున్న రోజులలో 'ఆంధ్రా వర్డ్స్ వర్త్‌గా' వినుతికెక్కిన వెంకటరావు (1892-1966) ఈనాటికీ మనం జ్ఞాపకం పెట్టుకోదగ్గ కథలు కొన్నింటిని వ్రాశారు. ఒకప్పుడు రాజమహేంద్రవరం ప్రభుత్వ కళాశాలలో ఆచార్యుడుగా పనిచేసిన కూల్డ్రే దొరగారు- దామెర్ల రామారావు, అడవి బాపిరాజుల వంటి కళాతపస్వులను తీర్చిదిద్దినట్టుగానే వెంకట్రావుగారిలోని రస హృదయానికి కూడా ఉద్దీపన కలిగించాడు. దీనికి తోడుగా - గోదావరి నీళ్ళు వుండనే ఉన్నాయి.

కవిగా వెంకటరావుగారు కళ్లంలో ధాన్యం గింజ కోరుకునే వృద్ధురాలినీ, అంట్లు తోముకుని జీవాన్ని గడుపుకునే బీదరాల్ని, కవితా వస్తువులుగా తీసుకోగలిగినట్టుగానే - కథారచయితగా అతి సామాన్యుల జీవిత కథలకు కూడా కథా రూపం యిచ్చారు. "మొగమున ముచ్చెమటలొల్కుచు, మూపులను పెనుమూపు లీడ్చుచు, మడమలెత్తున మన్ను లేచుచు" బ్రతికే కూలీ జనం వెంకట్రావు గారి కవితల్లోనే కాదు, కథల్లో కూడా కనబడతారు. పొగాకు కంపెనీలో పనిచేసే పొలలి పోలమ్మ- "మొగుడికి ప్రొద్దునే జావ కాచి, పోసి, వణ్ణంమూట చేతికిచ్చి, తానో వణ్ణంమూట చేతికెత్తుకుని అడవిలో పుల్లలేరుకోడానికి వెళ్ళే పల్లమ్మ- 'యిలాంటి కష్ట జీవులు వెంకట్రావుగారి కథల్లో ఎందరో -

కవి కొండల వారి పరిభాషలో వీళ్ళంతా 'లి'గాళ్ళు. 'వన్నెకాడు', 'అందగాడు' అన్నట్టుగానే 'లి'గాడు అని కూడా అనవచ్చునంటారాయన. కష్టజీవుల పనిముట్లు కొడవలి, గొడ్డలి, నాగలి - యివి అన్ని 'లి' అనే పదాన్ని కలిగినవే! మరి వాళ్ళు త్రాగే కలి, అంబలిలోనూ, వాళ్ళ బ్రతుకంతా నిండి వున్న ఆకలి, చలి, అనే వాటిలోనూ 'లి' వున్నది కాబట్టి వాళ్ళంతా 'లి' గాళ్ళే! ఇక వాళ్ళ భార్యలు 'లి' కత్తెలు. వెరసి - అంతా 'లి' గాడు

ప్రజ! "ఆనందం అనేది వాళ్ళ కళ్ళలో మృగ్యం. ఎలా ఉంటుంది? వాళ్ళ బ్రతుకూ, పట్నవాసపు రోడ్డు ప్రక్కన నాటబద్ద చెట్టుక్రిందే వాళ్ళ విడిది అయినప్పుడు?" ఎప్పుడో 1938లో 'లి'గాడు కథలో ఆయనరాసిన ఈ వాక్యాలు, ఏళ్ళు ఇన్ని గడిచినా పాతబడ్డాయనుకోను.

వెంకటరావుగారి 'లి' గాడి గురించి రాసినా, కలిగిన వాడి గురించి రాసినా – అన్నింటా రవ్వంత వ్యంగ్యం తళుక్కు మంటూనే వుంటుంది. మొగవాళ్ళ "సూట్‌కేస్" పుంలింగమయితే – ఆడవాళ్ళ సూట్‌కేస్ స్త్రీ లింగంమై "గౌను కేసు" కావాలని భావించిన పదతి ప్లీడరుగారి గౌనుతో పడిన తబ్బిబ్బును ('ప్రయాణపుటుద్ది') కథలో ఎలా చెబుతారో సారాపీపాకు కన్నంపడితే ఆత్రంతో సారాతాగడానికి లారీ దగ్గరకు వచ్చిన తాగుబోతుకు సీసాల వెనుక భార్య శవం కనబడినప్పటి విషాద గాథను కూడా వ్యంగ్య వ్యాఖ్యలలో చెప్పగలరు. ('పుల్లమ్మ' కథలో) వెంకటరావుగారి కథల్లో చురుక్కమనిపించే వ్యంగ్యానికి 'ఉద్యోగపుటుద్ది' కథను జ్ఞాపకం చేసుకోవచ్చు. భార్యాభర్తల మధ్య సమానత్వాన్ని గురించి విద్యాధికులు ఎన్నయినా ఉపన్యాసాలు ఇవ్వవచ్చు. కాని అది 'లి' గాళ్ళలో ఆచరణలో వున్నట్టు కలిగిన వాళ్ళలో లేదనిపిస్తుంది. ఆ కథ చదివితే!

'లి' గాడి ప్రస్తావన వచ్చింది. కాబట్టి మరో విషయాన్ని కూడా చెప్పాలనిపిస్తోంది. 'లి'గాడు అంటే చెట్టుక్రింద బ్రతికే వాడే అనుకోనవసరం లేదు. అనేక మధ్య తరగతి సంసారాల్లో కూడా పూర్తిగా కాకపోయినా – కొంత వరకూ 'లి'గాళ్ళు కనబడుతూ ఉంటారు. (వాళ్ళు నాగలి, కొడవలి, వాడక పోయినప్పటికీ) ఉధృతంగా వచ్చిన గోదావరి వరదలో యిల్లు మునిగిపోయి కట్టుకున్న యిల్లాలు నీటిలో కొట్టుకునిపోతే నీటి లోంచి ఆమెను బయటకు తియ్యడానికి పడవవాళ్ళు అడిగిన డబ్బు యిచ్చుకోలేక, నిస్సహాయుడై ఆమె శవాన్ని మాత్రమే దక్కించుకోగలిగిన మధ్యతరగతి సంసారి మాత్రం ఓ విధంగా 'లి' గాడు కాదూ? ('కంఠధ్వని' కథలో) "ఆనాడు గోదావరికి కాదు గండ్లుపడతా! వెల్లువలై ప్రవహించింది నీరు కాదు, కన్నీరు. అని నేనిప్పుడంటే నమ్మే దెవరు? – అయినా నా కలం యిప్పటికీ కన్నీట ముంచే వ్రాస్తున్నాను" అనేది గోదావరి తల్లి అగ్రహాల కథలన్నింటి విషయంలోనూ వాస్తవం. యిలాంటి అగ్రహాలను తట్టుకోగల శక్తి కాయకష్టం చేసే శ్రమజీవికి వున్నట్టుగా – మధ్య తరగతి మానవుడికి వుండదేమో! – 'మట్టెల రవళి' కథలో నాగడు వరద నీటి ప్రవాహాన్ని ఎదురీది యిల్లాలిని చేరుకోగలిగాడంటే – చేపలమ్ముకోడానికి వెళ్ళిన ఆ యిల్లాలి నడకలో వినిపించిన 'మట్టెల రవళి' అనేది కవితాత్మకమైన ఊహ అయినా – వాస్తవంలో అక్కరకు వచ్చింది వాడి భుజశక్తే!

'లి' గాడి ప్రజ గురించిన ఈ చర్చ అంతా సరే "లి"గాడు కథలోని 'లి'గాడు యిందాకటి నించి చెట్టు కిందే వుండిపోయాడు. యింతకూ అసలు కథ ఏమిటంటే – పల్లెటూరి నుంచి పొట్టచేత్తో పట్టుకుని ఉపాధి వెతుక్కుంటూ గోదావరి ఒడ్డున వున్న ఓ పట్టణానికి (రాజమండ్రి అనుకుందాం) వచ్చారు. వాళ్ళు ఓ చెట్టుక్రింద తలదాచుకుంటారు. పిల్లవాడు ఏడుస్తూంటే గుడ్డ ఉయ్యాల చెట్టుకు కట్టి 'లి' కత్తె నిద్రబుచ్చుతున్న సమయంలో 'లి' గాడు చల్లగా అక్కణ్ణుంచి జారుకున్నాడు. కల్లు పాక ఎక్కడైనా కనబడుతుందేమోనని వాడి బాధ. వాసనను బట్టి వాడుకల్లు పాకను కనిపెట్టి గలిగాడు గాని – చేతిలో పైసా లేకుండా కల్లు పోసేదేవరు? వాసనలు మాత్రం ఆఘ్రాణించుకుంటూ రోడ్డమ్మట తిరుగుతున్న ఆ 'లి' గాడికి – ఓ క్లబ్బులోంచి మందు వాసన లొస్తూంటే దానిని అనుభవిస్తూ ఆ క్లబ్బు ముందర చతికిలబడి అక్కడే నిద్రపోయాడు.

యీ కథ యిట్లాఉండగా – బాగా రాత్రి అయినా చెట్టు దగ్గరకు చేరుకోని 'లి' గాడి మీద 'లి' కత్తె మండిపడి పోతోంది. రాగానే చెట్టుకు కట్టి బుద్ధి చెప్పాలని ఆవిడ సంకల్పం. సరిగ్గా యిలాంటి సమయంలో "బ్లడీహూమ్" అనుకుంటూ ఓ ఆసామి తూలుకుంటూ చెట్టుదగ్గరకు వచ్చాడు. నల్లగా వున్న ఆ త్రాగుబోతును చూడగానే – వాడు తన భర్తే అని భావించి ఆ చీకట్లో వాడిని చెట్టుకు కట్టేసి తగు రీతిన సత్కరించింది ఆ యిల్లాలు. అయితే జరిగిన పొరబాటు ఏమిటంటే – ఆ త్రాగుబోతు మనకథానాయకుడయిన 'లి'గాడు కాదు. మెయిలు బండిలో బొగ్గువేసే 'మిస్టర్ ఎలూఫ్' అనబడే తెల్లదొరగారు అతడు. బాగా త్రాగి వుండడం చేతను, రైలు యింజన్‌కు బొగ్గువేసి వేసి తెల్లదొర నీగ్రోలా తయారవడం చేతనూ – ఆ చీకట్లో అతగాడు ఆ యిల్లాలికి 'లి'గాడు లాగా కనబడ్డాడు.

"మిస్టర్ ఎలూఫ్" సతీమణికి క్లబ్బుజీవితం అంటే యిష్టం. అర్ధరాత్రి వరకూ ఆవిడ క్లబ్బులో కాలక్షేపం చేస్తూంటే – అర్ధరాత్రి వరకు త్రాగి ఏ రోడ్డుమీదో పడుకోవడం ఇతగాడికి మామూలు. క్లబ్బులో డాన్సులు పూర్తి అయిన తర్వాత కూలీని వెంట బెట్టుకుని ఆవిడ రోడ్లన్నీ గాలించి మొగుడిని పట్టుకుని కూలీ వాడి చేత మోయించి యింటికి తీసుకుని వస్తుంది. యిదీ ఆ దంపతుల దిన చర్య. ఈ దిన చర్యలో భాగగానే ఎలూఫ్ దొరగారు చెట్టు దగ్గర దొరికిపోయారు.

ఒక క్లబ్బులోంచి వస్తున్న 'మిసెస్ ఎలూఫ్'కు "లి" గాడు క్లబ్బు ముందు తారసిల్లాడు. చీకట్లో చూడక మిసెస్ ఎలూఫ్ వాడిని తన్నినప్పటికీ, ఆ తర్వాత వాడికి రొట్టి పాలు

యిచ్చి వాడిని తనతో రమ్మంది. దొరగారిని వెతకడం కోసం, చిరవకు యిద్దరూ కలిసి చెట్టుకింద 'కుయ్యో, మొర్రో ' అంటున్న దొరగారిని పట్టుకోవడం, జరిగిన పొరబాటును గ్రహించి 'లి' కత్తెవర ఆకలితో వున్న దొరగారికి గంజి నీళ్ళు పొయ్యడం, ముగింపున జరిగేకథ.

ఆర్థిక స్థోమతుల్లో తేడా ఉన్నప్పటికి అలవాట్లలో, బలహీనతల్లో దొరగారికి, 'లి' గాడికి పెద్ద తేడా ఏమీలేదు. 'లి' కత్తె యిచ్చిన ఉప్పులేని గంజి గడగడాత్రాగేసి "థాంక్స్" అన్న దొరగారికి, "కమ్మని రొట్టి పెట్టారు అమ్మగారు" అన్న 'లి' గాడికి- "ఆకలి" అనేది ఒక్కటే! - మనుషుల మధ్య ఆర్థికపరమైన అంతరాలు ఎన్నయినా ఉండవచ్చు. కాని మనుసుల్లోని ఆర్ద్రతలు మనుషుల్లోని బలహీనతలు ముమ్మార్తులా ఒక్కటే అని మనకు మరో మారు జ్ఞాపకం చేస్తుంది ఈ కథ. "లిగాడు" అనబడే వాడు ఒక వ్యక్తి కాదనీ – ఒక వ్యవస్థ అనీ మనం అనుకుంటే, వ్యవస్థకు అతీతమైన రీతిలో ఒక వ్యక్తి కథను చెప్పడమే "లిగాడు" కథలోని ప్రత్యేకత.

"కల్లు లొట్టయిక సెల్లు" అనేది ఒక 'లి'గాడి త్రాగుబోతు మాట కాదనుకంటే – 'ఉషఃకాంతులు చిరునవ్వు నవ్వినాయి" అంటూ కథ చివర్లో వున్న మాట వాస్తవం ఎందుకుకాదు? –

---

# 17

## మొక్కపాటి నరసింహ శాస్త్రి - "న్యాయం"



**మొ**క్కపాటి నరసింహశాస్త్రి పేరు చేప్పే సరికి మొగల్తూరు చిన్నవాడు బారిస్టర్ పార్వతీశం జ్ఞాపకానికి వస్తాడు. మనం ఎంత చదువుకున్నా, ఎంతటి ప్రపంచజ్ఞానం ఉన్నవాళ్ళమని అనుకుంటున్నప్పటికీ, తెలియని ప్రదేశానికో, పరిచయంలేని పరిసరాలకో వెళ్ళినప్పుడు బారిస్టర్ పార్వతీశం పద్ద అవస్థలో పద్దామని అనుకోవడమూ ... మనకు అక్కరలేని వస్తువేదయినా విడవకుండా వెంటబడినప్పుడు పార్వతీశంగారి టోపిని జ్ఞాపకం చేసుకోవడమూ హాస్యరసజ్ఞులైన తెలుగు సాహితీ ప్రియులకు మామూలే! తెలుగువారికి ఇంతటి మరువరాని హాస్య నవలను అందించిన శాస్త్రిగారు (వీరి ప్రథమ రచన 'పిలక' అనబడే హాస్యరస ప్రధానమైన స్కెచ్ కావడంలో ఆశ్చర్యం లేదు) మంచి కథలనుకూడా వ్రాశారు.

"సాహిత్యానికి జీవితాన్ని ప్రతిబింబించదం కూడా ఒక ముఖ్యమైన ప్రయోజనం అయితే, ఈనాటి కథాసాహిత్యం కవిత్వం మాట ఎలా వున్నా ఈనాటి జీవితాన్ని ప్రదర్శించక తప్పదు. దాని కవసరమైన రూపం, రీతి కథకుని ప్రత్యేకత" అనే మొక్కపాటివారిలో ఈ ప్రత్యేకత కొరవడలేదు. శాస్త్రిగారు కథలు వ్రాసేనాటికి తెలుగు కథలకు చింతా దీక్షితులు, త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి, కొడవగంటి వెంకటసుబ్బయ్య, వఝ్ఝు బాబూరావు (వీరి 'అరిసె ముక్కలు' కథ జ్ఞాపకం ఉందా?) మొదలుగువారు ముఖ్యలుగా వుంటున్నప్పటికీ చలం దిద్దే కొత్త ఒరవడి కూడా మొదలైంది. 1926లో శాస్త్రిగారి 'చిత్తరువు' కథ 'సఖి' అనే సాహిత్య మానసపత్రికలో ప్రచురితమైనప్పుడు దానిని చదివి త్రిపురనేని వీర రాఘవస్వామి గారు "మీరు కూడా వెంకటచలంగారి అడుగు జాడలలో నడుస్తున్నారా ఏమిటి?" అని 'హెచ్చరించారట' నవ్వుతూనే! ఆ 'హెచ్చరింపు'కు మొక్క పాటివారు చలం రచనలు చదవలేదని సమాధానం చెప్పినప్పటికీ - కథల మాట ఎలా ఉన్నా చలం భావాల వినికిడి చాలు బుర్రను జిద్దుగా పట్టుకోవడానికి!

'చిత్తరువు' కథలో నారాయణరావు రుక్మిణి చేసిన తప్పును క్షమించడానికి కారణం చలం దృక్పథ ప్రభావమే అనుకోనక్కరలేదు. మొదటి భార్య చనిపోతే ఆమె ఆఖరి కోరిక

తీర్చాలనుకుంటూ కాస్త పెద్ద వయస్సులో రెండో పెళ్ళి చేసుకున్న నారాయణరావుకు రుక్మిణి ద్రోహం చేసింది నిజమే! కాని, కృష్ణమూర్తితో కలిగిన అక్రమ సంబంధానికి ఆమె కుమిలిపోయింది. ఫలితమే నారాయణరావు క్షమార్పణ. ఇందులో వున్నది ఔదార్యము, మానవతా దృక్పథము మాత్రమే! కాని చలం కోరుకున్న స్వర్గానికి మూలస్తంభాలు వ్యక్తి స్వేచ్ఛ, స్త్రీ, పురుష సమానత్వాలు. అక్కడ క్షమించమని అడిగే రుక్మిణిలూ ఉండరు. నారాయణరావు లాంటి వాళ్ళకు ఆ అవకాశమూ ఉండదు.

'ఏది ఏమైనా, ఈ మానవతా దృక్పధం మాత్రం ఏకసూత్రం'గా మొక్కపాటివారి చాలా కథలలో కనపడుతుంది. అంతేకాదు, మనిషినీ, మనిషినీ వేరుచేసే కుల ద్వేషాల, మత ద్వేషాల అసలు కథను బయటపెట్టి అందరినీ ఏకం చేసే మనిషి కథ చెబుతాడాయన. మాట వరుసకు "చావు తెలివి" కథనే తీసుకోండి. అగ్ర కులం యజమాని దగ్గర పాలేరు కుర్రాడుగా పనిచేసిన హరిజన బాలుడు పెరిగి పెద్దవాడై అదృష్టవశాత్తు చదువు, సిరి సంపదలూ పొందాడు. అంతవరకూ బానే ఉంది. కాని అతనిలో ఆ అగ్రకుల కుటుంబం మీద ద్వేషం కూడా పెరిగింది. కాని చివరకు బ్రద్దలయింది విష భాండం కాదు. అమృత భాండం మాత్రమే! మనిషి, ఆ తర్వాతే ఏదైనా అని మరోమారు జ్ఞాపకం చేసే కథ ఇది.

ఇక 1940 ప్రాంతాలలో మతం పేరుతో కలకత్తాలో జరిగిన దారుణ మారణకాండ గురించి చెబుతూ, "దారినపోయే ఆడవాళ్ళను మానభంగం చెయ్యమనీ, నిర్హేతుకంగా నిరపరాధులను చంపమనీ ఏ ధర్మశాస్త్రం చెబుతుంది, ఏ మత ప్రవక్త చెబుతాడు" అంటూ ఏనాడో మొక్కపాటివారు అడిగిన ప్రశ్నలకు ఇప్పటికీ సమాధానం లేదు. ప్రఖ్యాత చరిత్రకారుడు 'టాయన్ బీ' ఒక్కొక్క మతం అందించిన సందేశాన్ని ఒక్కొక్క సంగీత ధ్వనితో పోలుస్తూ, ఈ సంగీత ధ్వనులన్నింటినీ ఒక్కసారి పలికించినా అస్తవ్యస్త సంగీతం వినబడదు. దివ్య సంగీతం మాత్రమే వినబడుతుందన్నారు. కాని, రాజకీయ శక్తులు 'మతం' ముసుగు వేసుకుంటే వినబడేది దివ్య సంగీతం కాదు. తుపాకుల మోత మాత్రమే! 'మతం' సోదరుడు 'కులం గాడి' కథలో జస్టిస్ పార్టీ కాంగ్రెస్ పార్టీ వాళ్ళ ధర్మమా' అని ఒక పల్లెటూళ్ళో బ్రాహ్మణులు, ఆ బ్రాహ్మణులు అకారణంగా ఒకర్నొకరు పొడుచుకోవడం ఆయన కథల పాఠకులకు జ్ఞాపకం వుందనుకుంటాను.

మొక్కపాటివారి కథలలో "న్యాయం" కథ నన్ను బాగా ఆకట్టుకుంది. ఈ కథకు కథానాయకుడు ఒక రిక్షావాడు. వాడి పేరు కుప్పడు. పాతికేళ్ళ రిక్షా సర్వీసుతో కద్దీబారిన కాయ శరీరం, అయిదారు భాషలలో వ్యవహార జ్ఞానం, రాత్రిపూట రిక్షా ఎక్కి, సరదాలు కొనుక్కుందామని ఉవ్విళ్ళూరే పెద్దమనుషుల కథలు – ఆ సరదాలు దొరికే చోట్లకు సంబంధించిన పరిజ్ఞానం, సంక్షిప్తంగా చెప్పాలంటే కుప్పడి పరిచయం ఇది. కుప్పడు

రిక్షా తొక్కుతూ వుంటే వాడి పెళ్ళాం వేరుశెనగపప్పు అమ్ముతూ వుంటుంది. పెళ్ళాం బిడ్డలతో వాడు రోడ్డు ప్రక్కన వున్న చింతచెట్టు క్రింద కాపురం వుంటున్నాడు.

ఇలాంటి కుప్పడు రచయితకు మద్రాసు వీధులలో ఓ వేసవి మధ్యాహ్నం పరిచయం అయ్యాడు. ఆ పరిచయం కాస్త పెరిగి పెద్దదవుతూంటే కథ కూడా ముందుకు సాగుతూ ఉంటుంది. కుప్పడి కథ ఇలాగే సాగిపోతే కలో గంజో త్రాగుతూ వాడి మానాన వాడు సుఖంగా వుంటే వాడేమో కాని, ఆ అవకాశం వాడికి లేకుండా వాడి జీవితంలోకి ఇద్దరు తెల్లదొరలు జొరబడ్డారు. ముందు మొదటి దొర గారి సంగతి చెబుతాను.

ఈ దొరగారు ఓ ఇంగ్లీషు మోటారుకార్ల కంపెనీలో మెకానిక్, ఓ రోజు రాత్రి ఈ మహానుభావుడు చిత్తుగా త్రాగి మద్రాసు వీధులలో నడుచుకుంటూ పోతూవుంటే రోడ్డు ప్రక్కన ఇరవైఏళ్ళ లేత యౌవనంతో నల్ల ముత్యంలా మెరిసిపోతున్న ఆడపిల్ల, శనగపప్పు అమ్ముకునే అమ్మాయి కనబడింది. త్రాగివున్న దొరగారు రాత్రిపూట అవసరానికి పనికివస్తుందని ఆ పిల్ల చెయ్యి పట్టుకోబోతే ఆ పిల్ల కోపంతో మండిపడి దొరగారి గూబ గుయ్ మనిపించింది. నల్లపిల్ల అహంకారానికి మండిపడి ఆ దొరగారు బలవంతాన ముద్దు పెట్టుకోబోతే ఆ అమ్మాయి లబోదిబోమని గోలపెట్టింది కాని, తెల్ల దొరగారనే భయంచేతనో, చోద్యం చూద్దామనే సరదా చేతనో ఎవరూ అడ్డుపడలేదు. ఇలాంటి పరిస్థితిలో అపద్బాంధవుడిలా కుప్పడు అక్కడికి వచ్చి దొరగారికి చెయ్యవలసిన దేహశుద్ధి అంతా చేశాడు. ఇందుకు కారణం కుప్పడికి స్త్రీ జాతి పట్ల వున్న అపారమైన గౌరవం అని చెప్పలేము కాని ఆ వేరుశెనగపప్పు పిల్ల వాడి పెళ్ళాం కావడం చేత అని మాత్రం చెప్పగలం.

కారణం ఏదయితేనేం, కుప్పడు దొరగారిని చితగ్గొట్టడం యదార్థం అని కోర్టువారు నమ్మారు. మిగతా విషయాలు పట్టించుకోదగ్గవిగా వారు భావించలేదు. ఫలితంగా కుప్పడు శ్రీకృష్ణ జన్మస్థానాన్ని దర్శించి, రెండేళ్ళు వుండి, ఆ తర్వాత విడుదల అయ్యాడు. జెయిలు నుంచి బయటకు వచ్చాక కుప్పడు నానాబాధలు పడి చివరకు ఓ రిక్షా కొనుక్కున్నాడు.

సరిగ్గా ఇలాంటి సమయంలోనే రెండో దొరగారు సీమ నుంచి దిగారు. ఈయన మొదటి దొరగారిలా మెకానిక్ కాదు. గ్రంథాలు వ్రాసే మేధావి! ఎవరికయినా శరీర బాధలు ఒకటే కాబట్టి ఓ రాత్రిపూట కుప్పడి రిక్షా ఎక్కి రాత్రి సరదాలు తీర్చే ఇళ్ళకు పోనివ్వమన్నాడు. ఇలాంటి బేరాలలో డబ్బు బాగా దొరుకుతుంది. కాబట్టి కుప్పడు హుషారుగా రిక్షా లాగుతున్నాడు. దొరగారికి ఏ వాడలోని పిల్లా నచ్చడం లేదు. చివరకు మంగంబాకంలో ధర్మరాజు జాతర చూసివస్తున్న అమ్మాయి అతడికి నచ్చింది. ఆ పిల్ల మరెవరో కాదు కుప్పడి పెళ్ళామే! అది అలాంటి మనిషి కాదని కుప్పడు బ్రతిమాలుకున్నాడు. దొరగారు వినకుండా నోట్లు విసరడం ప్రారంభించాడు. దాంతో కుప్పడు రెచ్చిపోయి దొరగారికి దేహశుద్ధి చేయబోతే ఆయన తుపాకి తీసి కుప్పడిని కాల్చి చంపాడు.

అయితే, దొరగారు సత్యశీలుడు కనుక తాను హత్య చేసినట్టు పోలీసులకు స్వయంగా తెలియబరచాడు. డబ్బు కక్కుర్తితో రిక్షావాడు తన దగ్గిర పర్సు లాక్కోబోతే బెదిరించడానికి తుపాకీ తీసాననీ పెనుగులాటలో అది పేలి వాడు చచ్చాడని కాస్తంత అసత్యాన్ని మాత్రం ఆయన చెప్పక తప్పలేదు. దొరగారు అబద్ధం ఆడరు కనుక, కోర్టువారు ఆయన మాటలు నమ్మారు. అయితే కుప్పడు దొంగ బుద్ధి కలవాడయినప్పటికీ చచ్చిపోయాడు కనుక వంద రూపాయలు అతడి భార్యకు నష్టపరిహారంగా ఇమ్మని జడ్జిగారి తీర్పు. శెనగపప్పు అమ్ముకునే ఆడ మనిషి కుప్పడి భార్యేనని ఋజువు చేసుకున్నప్పుడు మాత్రమే ఈ నష్టపరిహారం లభిస్తుంది.

పెద్ద మనుషులందరూ ఈ తీర్పు విని చాలా "న్యాయం"గా వుందన్నారు. ఆ రిక్షావాడు బ్రతికి వుండి రిక్షా ఎన్నాళ్లు లాగితే వంద రూపాయిలు సంపాదించగలుగుతాడు? బ్రతికి వున్నదానికంటే చచ్చాక ఎక్కువ డబ్బు సంపాయించేడు" అని వారందరూ అభిప్రాయపడ్డారు.

'బ్రతుకు జీవుడా' అనుకుంటూ దొరగారు ఉరిత్రాడులోంచి బయటపడి, స్వదేశానికి తిరిగివెళ్లి భారతీయులు ఎంతటి పిరికివాళ్లో, చవటలో చెబుతూ ఒక పెద్ద పుస్తకాన్ని వ్రాశారు!

మొక్కపాటివారు ఈ కథను వ్రాసేనాటికి – మనకింకా స్వతంత్రం రాలేదు. ఇప్పుడు మన దేశంలో తెల్లదొరలకు ఆ అధికారాలు కాని, గౌరవాలు కాని లేవు. వాళ్ళు మనల్ని తిడుతూ వ్రాసిన పుస్తకాలకు విలువ అంతకన్నాలేదు. (శాస్త్రిగారు ఈ కథను మేయో "మదర్ ఇండియా" పుస్తకాన్ని వ్రాసి అలజడిని సృష్టించిన రోజులలో వ్రాసి వుంటారు)

కాని, కుప్పడు మాత్రం మరో రూపంలో వున్నాడు. శెనగపప్పు అమ్ముకునేవాడి పెళ్లాం వుంది. చెట్టుకింద సంసారం కూడా వుంది. సామాజిక న్యాయంతో సహా, వివిధ తరహాల న్యాయాలు డబ్బుకీ, అధికారానికీ అమ్ముడవుతున్నంత కాలం "న్యాయం" కథ ఒక అన్యాయానికి ఆక్రందనగా సజీవంగానే వుంటుంది.

---

**18**

# చింతా దీక్షితులు "శిలా ప్రతిమ"



"నేను వ్రాసిన ఈ కథలన్నీ దీక్షితులు గారికి చదివి వినిపించాలి. ఏమంటారో. ఆయన ఇదివరకు చాలా కథలు ప్రచురించారు. ఆయనకే తెలుస్తున్నది వీటి విలువ-" ఈ మాటలను వ్రాసింది గుడిపాటి వెంకటచలంగారనే విషయం "ప్రేమలేఖలు" చదివిన వాళ్ళకి వేరే చెప్పనవసరంలేదు.

ఒక గొప్ప కథకుడికి స్ఫూర్తినిచ్చిన మరో గొప్ప కథకుడి గురించి చెప్పాల్సి వచ్చినప్పుడు చింతా దీక్షితులుగారికన్నా మంచి ఉదాహరణ మరొకటి దొరకదనుకుంటాను. ఈ సందర్భంలోనే మరో మాట కూడా చెప్పాల్సి వుంది. అభిప్రాయాలలో ఆమడ దూరం వున్నా - మనుషుల్లో ప్రేమించగల హృదయం వుండాలిగానీ, ఆత్మీయతకు అడ్డం వుండదని చెప్పడానికి కూడా - దీక్షితులు, చలంమైత్రి తార్కాణంగా నిలుస్తుంది. "-అభిప్రాయాలలో, ఆచారాలలో ఏ సంబంధంలేని ఆయనకు, నాకు ఈ స్నేహం విచిత్రంగా వుంటుంది-" అనే చలం మాటతోమనం ఏకీభవించడం మాత్రమే కాదు- "ముందు తరాలవాళ్ళు మిమ్మల్ని తిడతారులెండి. వాళ్ళకు ఒక కథకుణ్ణి ఇచ్చినవారు, ఆ కథకుణ్ణి చంపినవారు మీరేనని-" అనే చలం అభిప్రాయాన్ని అవునంటాం కూడా-

(దీక్షితులుగారు చలాన్ని రమణమహర్షి దగ్గరకు తీసుకురాకపోతే - చలంలోని మరో చలం బయటపడే వాడా అని?-)

దీక్షితులుగారి గురించి ఆలోచించేటప్పుడు చలం జ్ఞాపకం రావడానికి ఇన్ని కారణాలున్నాయి. ఒక్క చలం మాత్రమే కాదు. దీక్షితులుగారి గురించి ఆలోచించేటప్పుడు శివశంకరశాస్త్రిగారి "సాహితీ సమితి" వెలుగు రేఖలు జ్ఞాపకానికి వస్తాయి. గురజాడ అప్పారావుగారు ఊపిరి పోసిన తెలుగు కథను సజీవంగా వుంచే కృషిలో సాహితి, సఖి, కళ, భారతి, వంటి పత్రికలకు తొలిరోజుల్లో వినిపించిన కథలు జ్ఞాపకం వస్తాయి. చలం అనే పెనుగాలి తెలుగు సాహిత్యాన్ని పలుకరించడానికి ముందు వీచిన గాలుల్లో (దానిని మలయ మారుతం అందామా?-) దీక్షితులు ఒకరు మాత్రమే కాదు. ముఖ్యులు కూడా.

దీక్షితులుగారు కథకులుగా కలం పట్టేనాటికి మన దేశంలో పరాయి ప్రభువుల పాలన పాతుకుపోయి వుంది. రాజకీయంగానే కాదు - సాంస్కృతికంగా కూడా మనం బానిసల్లాగానే బ్రతుకుతున్నాం. విదేశీ నాగరికతా వ్యామోహం పెచ్చు పెరిగిపోతున్నది. ఈ వాతావరణంలో దీక్షితులుగారు సంప్రదాయాన్ని సమర్థించారన్నా, వెర్రి తలలు వేస్తున్న పాశ్చాత్య అనుకరణలను వెక్కిరించారన్నా ఆశ్చర్యపోనక్కరలేదు.' "చిన్న" కథ జ్ఞాపకం వుందనుకుంటాను. ఈ కథలోని చిన్న (మహాలక్ష్మి)ని - కాకినాడ కాలేజీలో చదువుతున్న ఆమె బావ రామారావుకు ఇచ్చి పెళ్ళి చేద్దామనుకుంటే - క్రాపు, ఇంగ్లీషు చదువూ వున్న పెళ్ళికొడుకు ససేమిరా వద్దని ఆ పిల్ల మొరాయించి కూర్చుంది. అప్పుడు ఆ రామారావు ఇంగ్లీషు చదువు మానేసి విస్సన్నశాస్తుర్లుగారి దగ్గర సంస్కృతం నేర్చుకుని దానికి తగ్గట్టుగా జుట్టు కూడా పెంచుకోవడమూ, ఆపైన "చిన్న" హృదయేశ్వరుడై ఆ పిల్ల ప్రేమతో ఇచ్చిన పువ్వు జుట్టులో పెట్టుకోవడమూ, - ఈనాడు మహా ఛాందసంగా కొందరికి అనిపించవచ్చునేమో కాని - ఈనాటికీ మన దేశంలోని ఆడపిల్లలకు పెళ్ళి విషయంలో లేని స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలను ఏనాడో 1921లో వ్రాసిన కథలో "చిన్న" సాధించిందని తెలుసుకోవడం కుతూహలదాయకంగానే వుంటుంది.

ఆధునిక నాగరికతా వ్యామోహంలోపడి సంప్రదాయాన్ని విస్మరిస్తున్నందుకు గాను సమకాలీన ప్రపంచంలోని కొందరు భామల్ని దీక్షితులుగారు వేళాకోళం పట్టించిన తీరు "వటీరావు కథలు" చదివినవాళ్ళు మరిచిపోలేరనుకుంటాను. (ఆవిడ పేరు కళావతి. ఇంగ్లీషులో రాస్తే 'కళావటి' - ఇక, ఇంగ్లీసు సంప్రదాయంలో మొగుడి పేరు తోకగా చేరిస్తే 'వటీరావు"!-) మహానగరాల్లో క్లబ్బు భామల్ని చూసినప్పుడు నాకు ఇప్పటికీ వటీరావు జ్ఞాపకానికి వస్తూనే వుంటుంది!-

-ఇవన్నీ అలా వుంచండి- "-గొల్ల పిల్లలతో బయలుదేరి పశువులను తోలుకుంటూ వెళ్ళి ఏ చెట్టు నీడలోనో కూర్చుని ప్రకృతితో ఊసులాడుతూ వుంటే ఎంత బాగుంటుంది? - చద్ది మూట విప్పుకుని చెట్ల నీడల్లో తిని, పశువులతోబాటు ఆ గోదావరి నీరు త్రాగి, ఆ చెట్ల నీడల్లో ఆడుకుంటూ వుంటే!- ఆ ప్రకృతి ఒళ్ళో అక్కడే నిద్రపోతే!-" (గోదావరి నవ్వింది' కథలో-) వంటి భావాలు షెల్లీ, వర్డ్స్‌వర్త్, టాగూర్ చదివిన పాఠకులకు ఏదో సమయంలో కలుగుతూనే వుంటాయని నా నమ్మకం. లేకుంటే ఈ యాంత్రిక యుగంలో ఆనందానుభూతికి తావేదీ?-

దీక్షితులుగారు సంప్రదాయంలోని భారతీ యాత్మను ప్రేమించిన వ్యక్తేగాని, - సంప్రదాయం పేరుతో బడుగు ప్రజలను అణగద్రొక్కే బావాలను ప్రచారం చేసిన వ్యక్తికాదు. దీక్షితులుగారి 'అభిప్రాయం భేదం', 'పెద్ద గోడ', 'దాసరి పాట' వంటి కథలు చదివితే -

కథకుడుగా ఆయనకు బీద ప్రజల పట్ల వున్న ప్రేమ, ఆదర్శాలు అర్థం అవుతాయి. 'అభిప్రాయం భేదం' కథలో ఎప్పుడూ కూతుర్ని తంగేడు పువ్వుల్తో అలంకరించే ముష్టిది కూతురుకు బంగారు కంటె పెడితే ఎలా వుంటుందో అని ముచ్చటపడి - షావుకారు గుమాస్తా కూతురు మెడలోని కంటెను కూతురుకు అలంకరిస్తే - జెయిల్లో పెట్టడం పెట్టుబడిదారీ సమాజపు న్యాయం కావచ్చునేమోకాని, "-తంగేడు పువ్వు వల్ల కలిగే ఆనందం కంటె - ఈ కంటెవల్ల ఏమి ఎక్కువ ఆనందం కలిగింది.- ఎందుకు ఈ భాగ్యవంతులు ఇలాంటి నగలు పెట్టుకుంటారు?" అని దీక్షితులుగారు సృష్టించిన ముష్టిది అనుకోవడం ఆయనలోని రస హృదయానికి తార్కాణం. - ప్రకృతినీ, పువ్వుల్నీ ప్రేమించే ఈ హృదయమే లేకపోతే - దీక్షితులుగారి మనసులో శిశువుకు చోటెక్కడ దొరుకుతుంది? - పిల్లలతో పాటు మనం కూడా ఏనాటికీ మరిచిపోలేని "లీలా సుందరి", "బంగారు పిలక" వంటి రచనలలో ఆయన 'బాలవాఙ్మయ బ్రహ్మ' ఎలా అవుతాడు?- అందుకే కాబోలు అంటారు చలం "- నా మార్గం స్త్రీ అయినట్లే, మీ మార్గం శిశువు కాబోలును-" అని!-

- దీక్షితులుగారి కథల్లో (వీరు వందదాకా కథలు వ్రాశారట) శిల్పరీత్యా "శిలాప్రతిమ" కథ బాగుంటుంది. ఇంతకూ ఇందులోని కథ ఏమిటంటే - భైరవశాస్త్రి అనే పండితుడిని ఒక శిష్యుడిలాంటి ఆసామీ "త్యాగం అంటే ఏమిటండీ-" అని ప్రశ్నిస్తే, ఆయన భుక్తాయాసం తీర్చుకుంటూ ఓ కథ చెప్పడం ప్రారంభించాడు. అదే ఈ కథ. ఇక, కథలోని కథ.

రాఘవ రాజు అనబడే బందిపోటు యాభైమంది అనుచరులతో వీరాపురం పరిసరాల్లో బందిపోటు దొంగతనాలు చేస్తూ గ్రామస్తులను నానా బాధా పెడుతూ వుంటాడు. ఆ దేశాన్ని పరిపాలిస్తున్న రాజుగారు కూడా ప్రజలను ఈ బందిపోటు నుంచి రక్షించలేకపోతారు. ఇటువంటి పరిస్థితుల్లో పరిసరగ్రామాల్లో వున్న బుద్ధిమంతులు అందరూ ఒకచోట సమావేశమై - రాజుగారు తమను ఎలాగూ రక్షించలేకపోతున్నారు కనుక ఈ బందిపోటు దొంగగారినే ప్రభువుగా చేసుకుంటే దొంగతనాల బెడద లేకుండా హాయిగా వుండవచ్చునని తీర్మానించుకుంటారు. ఫలితంగా పెద్దమనుషుల రాయబారం రాఘవరాజు దగ్గరకు వెళ్ళింది.

"-తమరు పాలించగల సమర్థులై వుండీన్నీ, రాజనీతి పారంగతులై వుండీన్నీ ఎందువల్లనో గ్రామాలను పాలించకపోవడం-" బాధ కలిగిస్తోందంటూ కాకా పురాణాన్ని ప్రారంభించి, - తమ మనసులోని కోరికను బయటపెట్టారు.

చేతికి అందిన అవకాశాన్ని రాఘవరాజు వదులుకుంటాడా?- సరే- తక్షణం

పన్నులు కట్టమన్నాడు. గ్రామస్తులందరూ కలిసి తనకు కోట, కందకం, బురుజులు కట్టి ఇవ్వమన్నాడు. ప్రజలను సైన్యంలో చేరమన్నాడు. కష్టం అంతా ప్రజలదే! - పెత్తనం మాత్రం రాఘవరాజుది.

ప్రజలు బుద్ధిగా పన్నులు కట్టేశారు. (వాళ్ళు ఎప్పుడూ బుద్ధిమంతులే - పాపం!) బలహీనుడయిన ఆ దేశపు రాజుగారితో దొంగగారు ఒప్పందం కుదుర్చుకుని సార్వభౌముడయిపోయాడు. కోట పని ప్రారంభం అయింది. మూడు దిక్కులా బురుజులు తయారయ్యాయి. నాలుగోవైపు బురుజు తయారవుతోంది. ఇక ఒక్క పనే మిగిలివుంది. అది, నరబలి - ఇలాంటి పుణ్యకార్యాలకు ఎవరో ముందుకు వచ్చి ప్రాణాలు వదిలెయ్యొద్దూ?- ఎవరు ముందుకు వస్తారు?-

ఇంతకూ-ముందుకు వచ్చినవాడు మంచి కండపుష్టిగల యువకుడు. మంచి భవిష్యత్తు వుంది. ప్రాణప్రదంగా ప్రేమించే భార్య వుంది. కాని - ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే - "దేశ క్షేమం" కోరి ఆమె అతడిని ప్రోత్సహించింది. భర్త కోట బురుజు పునాదిలో సమాధి అయిపోతే - ఆ దుఃఖాన్ని భరించలేక, శిలగా మారిపోయి శిలాప్రతిమగా మిగిలిపోయింది - రెండు వందల ఏళ్ళ క్రిందటి కథ యిది - ఆ రాజ్యాలూ పోయాయి. ఆ రాజులూ, వాళ్ల కోటలూ ఇవాళ లేవు. కాని - త్యాగానికి మారు రూపుగా "శిలా ప్రతిమ" వుంది!-

అది "త్యాగం" - నిజమే! కాని, ఆ త్యాగానికి అర్థం ఏమిటి? - ఒక అసమర్థుడయిన రాజుకు, ఒక బందిపోటుకు మధ్య జరిగిన ఒప్పందం వెనుక వున్నది దేశ క్షేమం కాదు - ప్రజల పిరికితనం మాత్రమే! అనేక గ్రామాలలో వుండే ప్రజలు కేవలం యాభై మంది బందిపోట్లకు భయపడి ప్రభుత్వం అప్పజెప్పిన పిరికితనం ఈనాటిది కాకపోవచ్చు. కాని - ఈ పిరికితనాన్ని పోగొట్టడం కోసం "కండలు తిరిగిన" ఆ యువకుడు త్యాగం చేసి వుంటే - ఆ 'త్యాగం' కథ చిరస్మరణీయమై వుండేది. శిలాప్రతిమ కథ మరపురానిదై వుండేది-

కాని, మించిపోయింది లేదు. అది నిన్నటి పొరపాటుగా అర్థం చేసుకునేందుకు పాఠకులకు ఈ కథ ఉపయోగపడితే - అలాంటి అవగాహనను పాఠకులు పెంపొందించుకోగలిగితే - నిస్సందేహంగా "శిలాప్రతిమ" మరపురాని కథగా నిలుస్తుంది. నిన్నటి కథల నుంచి నేడు నేర్వగల నిరంతర సత్యాలు ఇవే అనుకుంటాను.

---

# 19

## భమిడిపాటి కామేశ్వరరావు "సమస్య"



"–అసలే కోతి. అందులోనూ కల్లు త్రాగింది. ఆపైన తేలు కుట్టింది. దరిమిలానూ దెయ్యం పట్టింది. పైగా ఎన్నికలకి అభ్యర్థిగా నిలుచుంది. అంటూ కొందరు సామ్యం పారేస్తూ వుంటారు. అల్లా నే అసలే మాష్టరు. అందులోనూ తెలుగు మాష్టరు... తెలుగుదేశపు ఇంగ్లీషు బళ్ళో తెలుగు మాష్టరుగా వున్న జీవుడు తోటకూర కాడలో పురుగు కంటే తీసికట్టు, మనవర్తిలేని వెధవాడబడుచుకంటె కనిష్టం... ఎన్నికలలో ఓడిపోయాక తర్వాత నామినేట్ చేయబడిన అభ్యర్థి కంటె లొగసాను–" అంటూ చాలాకాలం క్రితం భమిడిపాటివారు తెలుగు మాష్టరు గురించి చెప్పిన మాటలు యిప్పుడు నిజమవునో కాదో తెలియదు గానీ – 'ఎలక్షన్లో ఓడిపోయి నామినేట్ చెయ్యబడిన అభ్యర్థి' ఉదంతం ఎక్కడయినా, ఎప్పుడయినా, వినడం తటస్థిస్తే భమిడిపాటివారు జ్ఞాపకం రాక మానరనుకుంటాను.

'హాస్యబ్రహ్మ' గా వినుతికెక్కిన భమిడిపాటి కామేశ్వరరావుగారి పేరు చెప్పేసరికి శానయ్య, మాలోకం, వంటి పాత్రలే కాదు– ప్రేక్షకులను గిలిగింతలు పెట్టే ఎన్నో హాస్య నాటికలు జ్ఞాపకానికి వస్తాయి. అంతేకాదు – భమిడిపాటి వారికి అంతటి హాస్యస్ఫూర్తిని యిచ్చిన ఫ్రెంచి నాటక కర్త 'మోలియర్'ను–మోలియర్ రచనల పట్ల భమిడిపాటి వారికి ఆసక్తిని కలిగించిన భాగవతుల అప్పారావుగారిని – కామేశ్వరరావుగారి హాస్య నాటికలన్నింటినీ ప్రదర్శించి అందరిచేతా 'బాగు బాగు' అనిపించుకున్న రాజమండ్రి ప్రభుత్వ ఆర్ట్సు కళాశాల పూర్వ విద్యార్థి సంఘాన్ని (వీరే భమిడిపాటి వారి మొదటి హాస్య నాటిక 'బాగు బాగు'ను 1923 ప్రాంతాల్లో ప్రదర్శించారు) జ్ఞాపకం చేసుకోవాలనిపిస్తుంది.

అయితే–భమిడిపాటి వారి హాస్య రచనా కృషి కేవలం నాటికలకు మాత్రమే పరిమితం కాలేదు. ఆయన వ్యాసం రాసినా, కథ రాసినా, ఏం రాసినా– ఏం మాట్లాడినా, అంతా నవ్వుల మయమే!– సమాజంలో పేరుకుపోయి వున్న స్వార్థం, అసూయ, మొదలయిన అవగుణాలను, బలహీనతలను, ముడి పదార్థాలుగా తీసుకుని నవ్వుల హరివిల్లు

సంధించాడాయన. ఒక నిర్దుష్టమైన సామాజిక ప్రయోజనం కోసం గురి చూసి సంధించిన బాణాలు కావవి. కాని-ఎవరి మటుకు వారు 'నా మీదే నర్రోయ్' అని గోల పెడితే ఆయన పూచీలేదు!- నామీదే నర్రోయ్' విషయమే తీసుకోండి- (ఓ యింట్లో అద్దెకున్న ఆసామీ, ఆ యింటి యజమాని, అతగాడి అర్ధాంగి, ఓ రిటైర్డ్ ఇన్‌స్పెక్టర్, ఉద్యోగంలో వున్న యిన్‌స్పెక్టర్, 'నామీదేవర్రోయ్' అని గోల పెట్టడమూ-ఆ పైన, 'నీ మీద కాదు. నా మీదే' అని పోట్లాడుకోవడమూ-హాస్యరస ప్రియులు మరిచిపోగలరా?-)

అన్నట్టు- "మదత పేచీ" కథ జ్ఞాపకం వుందా? మునిసిపాలిటీ వాళ్ళు డ్రయినేజీ ఏర్పాటు చేస్తామని బయలుదేరి గోతులు తవ్వేసి వూరుకుంటే - ఆ గోతిలో పడి నడ్డి విరగ్గొట్టుకున్న ఆసామీ దాన్ని తిరిగీ మునిసిపాలిటీ వాళ్ళ ధర్మమా అని చెత్తా చెదారంతో నిండిన రోడ్డుమీద వెళ్లి వదిలించుకోవడం తలుచుకుని ముసి ముసి నవ్వులు నవ్వుకోమూ?

మునిసిపాలిటీ గోతిలో ఆ పెద్ద మనిషి పడే సమయానికి అతగాడు త్రాగి వున్నాడని 'గిట్టనివాళ్ళు' చెప్పే మాటల్ని ప్రస్తుతానికి వదిలేద్దాం. కారణమేదయితేనే- ఆ బాధ తగ్గడం మాత్రం మునిసిపాలిటీ వాళ్ళు వేసిన రోడ్డు వల్లే జరిగింది. నడుం నొప్పి రోగిగారు కారులో వెడుతున్నప్పుడు రోడ్డు ఎలా వుందంటే-

-"గాలివానా, అధికార్లు, మధ్యవర్తులు, అందినంత మేరకు రక్తం పీల్చేసుకుని వదిలేసిన శవాల్లాగా కంకరరాళ్ళు, కతకలూ, గోతులూ, కయ్యలూ, రొంపి, దిబ్బలూ దిరుగుండాలూ, మట్టీ మశాణం, పెంట దబ్బా, -దాని చుట్టూ శాఖోపశాఖలుగా వ్యాపించి వున్న తుక్కు సంతానం - ఇల్లాగా భయమేస్తూ ఆ రోడ్డు జీభూతంలా వుంది. ఆ డ్రయివరు తెలివి ఏమిటో గాని కారు వెనక్కీ ముందుకీ కూడా నడిచింది. అది ఒక్కొక్కసారి కప్పలా దాటేది. ఒక్కొక్కసారి పీతలా నడిచేది. వుండివుండి పొట్టేలులాగా కొన్ని గజాలు వెనక్కి పోయేది. మరొకసారి తూటాలాగా వున్న చోటనే గిజగిజా కొట్టుకునేది-" ఈ బాధ తట్టుకోలేక, -నడుం నొప్పితో బాధపడుతున్న రోగి వళ్ళంతా పచ్చదయిపోయి, 'కుయ్యో మొర్రో' అని గోల పెట్టడమూ,- ఆపైన కారు బోల్తా పడితే 'చచ్చాను, నీతాదు తెగా' అని ఏడవడమూ వాస్తవమే కావచ్చు. కాని-యింత మర్దనా అయిన తర్వాతే కాదూ అతగాడి నడుం నొప్పి చిటికలో మాయం అయిందీ?- మహామహా వైద్యులు తగ్గించలేని నడుం నొప్పిని- ఒక మునిసిపాలిటీ రోడ్డు సునాయాసంగా తగ్గించిందన్న వాస్తవాన్ని మరిచిపోగలమా?- నడుం నొప్పి తగ్గించడానికి బయలుదేరి రోగితోబాటు కారులో కూర్చున్న డాక్టరుగారి ఫీజు ఒక్క పైసా కూడా ముట్టి వుండకపోవచ్చు. కాని- "మదతపేచీ"లో రవ్వంత న్యాయం కూడా లేకపోలేదు.

-యిలాంటిదే "తోదు దొంగలు" ఉదంతం కూడా!- ఈ కథ చదివితే రచయితల్లో వుండే పరస్పర సహకార దబ్బా సంఘాలు చిరకాల చరిత్ర గలవి అనిపిస్తుంది. అంతేకాదు - బేరం చెడినప్పుడు పరస్పర దబ్బా-పరస్పర నిందారోపణగా మారిన వైనం పాఠకులను గిలిగింతలు పెడుతుంది. దిగజారిన యిట్లాంటి మనుషుల గురించి తలుచుకునేటప్పుదు కామేశ్వరరావుగారే వ్రాసిన 'పురపాలక సంఘాలలో ఎన్నికల మజా' జ్ఞాపకం వస్తోంది. (దీన్ని 'కథ' అనదానికి వీల్లేక పోయినప్పటికీ-)

ఎలక్షన్ రోజులలో 'త్రాగుడాస్పత్రికి' బయలుదేరిన భీమయ్య పార్టీ మనిషి తుమ్మయ్యను కారు మీద ఎక్కించుకుని లేవదీసుకుని పోయి (కామేశ్వరరావుగారన్నట్టు ఎలక్షన్ నాటకంలో రాక్షస శృంగారం) - 'పీపా నివాసం' ఏర్పాటుచేస్తే బాహ్యాంతరాలలో కలిగిన 'అమృత స్పర్శ' ఫలితంగా ఆ అపస్మారక స్థితిలోనే రెండో పార్టీలోకి గెంతెయ్యదాన్ని ('పురపాలక సంఘాల్లో ఎన్నికల మజా' అనే రచనలో) - రాజకీయమనో, అవకాశవాదమనో, అంటాం. మరి- 'తోదు దొంగలు' వంటి దూప్లికేటు రచయితల "విలువలను" ఏమనాలి?-

భమిడిపాటి వారి కథల్లో నాకు "సమస్య" కథ అంటే యిష్టం. ఈ కథను భమిడిపాటివారు వ్రాసి చాలా ఏళ్ళు అవుతోంది. ఆ రోజులతో పోల్చి చూస్తే-ఈనాడు మనుషుల కోరికల్లో చాలా మార్పులు వచ్చాయి. కాని - ప్రతి కోరిక వెనుకా వుండే మనిషిలోని దాంబికం, యితరుల ఎదుట గొప్ప చాటుకోవాలనే తాపత్రయం-ఎదిగీ ఎదగని మనస్తత్వానికి అద్దం పదుతూ అలాగే వుంది. "సమస్య" కథలోని "సమస్య" నన్ను ఆకట్టుకోవదానికి కారణం యిదే అనుకుంటాను.

ఈ కథలోని మధ్యతరగతి గృహస్తుకు గ్రామఫోను ఓ సమస్య అయి కూర్చుంది. ఏనాటి నుంచో యిల్లాలు ముచ్చటపడి అదుగుతున్న గ్రామఫోనును అతగాదు తెచ్చి యివ్వకపోగా - ప్రక్క యింటి వాళ్ళు దానిని కొనుక్కుని అదే పనిగా రికార్డుల మోతను వినిపిస్తుంటే ఏ యిల్లాలికి మాత్రం పుందు మీద కారం జల్లినట్టుగా వుందదు కనుక?-

ప్రక్క యింటి వాళ్లు కొనుక్కున్న రికార్డులు వీనుల విందు కలిగించేవే కాబట్టి - దమ్మిడీ ఖర్చు లేకుండా, గ్రామఫోను పిన్ను మార్చే శ్రమ కూడా లేకుండా - సంగీతం విని ఆనందిద్దామంటాదు భర్త. ప్రక్కవాళ్ళు భోంచేస్తే మన కదుపు నిండుతుందా అంటుంది భార్య.

సరే-ఎలా అయితేనేం- మన కథానాయకుదు గ్రామఫోను కొన్నాదు- అదీ పాతిక రికార్డులతో సహా!- సరికొత్త గ్రామఫోనుని చూచి అతని భార్య తెగ ముచ్చట పడింది కాని,- కొత్త సమస్య వచ్చి పడింది. ప్రక్క యింటి వాళ్ళు ఎప్పుదూ గ్రామఫోను మోగిస్తూనే వుంటారు కాబట్టి - వీళ్ళు కూడా గ్రామఫోను పెడితే- రొదలో రొద కలిసి పోయి

భయంకరమైన శబ్దంగా తయారవుతుందేమోనని భయం. అందుచేత, ప్రక్క యింటి వాళ్ళకు రికార్డులు వేసే అవకాశం యివ్వకుండా ప్రొద్దున్న ఏడు గంటల నుంచి విరామం లేకుండా సంగీత కార్యక్రమం ప్రారంభిస్తారు. ప్రక్క యింట్లో జరుగుతున్న ఈ "యజ్ఞం" సంగతి తెలుసుకుని- ప్రక్క యింటి ఆడవాళ్ళు వీళ్ళ యింటికి వస్తారు గ్రామఫోను చూడడానికి.

మన కథానాయకుడి గ్రామఫోను చాలామంచిదని ఆ యింటి ఆడవాళ్ళు మెచ్చుకుంటారు. కాస్త ఆలస్యం అయినా ప్రక్క వాళ్ళకు బుద్ధిచెప్పేలా మంచి గ్రామఫోను కొన్నందుకు భార్యా భర్తలిద్దరూ మురిసిపోతారు. అయితే-వీళ్ళ ఆనందం ఎక్కువ కాలం వుండదు.

ప్రక్క యింట్లో ఎలాగూ సంగీత కార్యక్రమం జరుగుతోంది. కాబట్టి-మళ్ళీ తమ యింట్లో కూడా గ్రామఫోను ఎందుకని వాళ్ళు దానిని అమ్మేస్తారు. పాత గ్రామఫోనుని వదిలించుకోవడం మంచిదని వాళ్ళు భావించడం కూడా యిందుకు ఓ కారణం. ఈ వార్త మన కథలోని ఇల్లాలికి చాలా ఘోరమైన దుర్వార్తలాగా వినిపించింది. తమ కొత్త గ్రామఫోనును చూసి ప్రక్క యింటివాళ్ళు ఈర్ష్య పడాలని వాళ్ళు కోరుకున్నారు గాని- తమ ఖర్చుతో వాళ్ళు ఉచితంగా "ఎంటర్‌టైన్‌మెంట్" పొందాలని వారు కోరుకోలేరు!-

"-నీ మూలానే వెధవ గ్రామఫోను కొన్నాను. వాళ్ళ గ్రామఫోను రోజూ వింటూ వుంటే సరిపోతుందని ఎంత చెప్పినా నువ్వు వినలేదు. నీకన్నా ఆమె ఎంతో తెలివైంది. మనచేత గ్రామఫోను కొనిపించి మన ఖర్చుమీద సకుటుంబంగా ఆనందిస్తోంది!-" అని ఉసూరుమంటాడతడు. అదంతా విని అతగాడి అర్ధాంగి - "పోనీ వెధవ గ్రామఫోను అమ్మేయ్యండి!-" అంటుంది!- ఈ కథ అంతా ఒక ఎత్తూ- ఈ కథలోని ఈ చివరి వాక్యం మరొక ఎత్తూను-

నిజమే మరి - మనం కొనుక్కునే వస్తువులు కేవలం మనకోసమేనా?- యిరుగు పొరుగువాళ్ళు వాటిని చూసిపడే ఈర్ష్యను వాళ్ళ కళ్ళల్లో చూసి ఆనందించకపోతే - యింత డబ్బూ ఖర్చుపెట్టి ప్రయోజనం ఏముంది?- ఎన్నో ఏళ్ళ క్రిందటి గ్రామఫోను కథే కాదు- కంచి పట్టుచీర దగ్గర నుంచి కలర్ టి.వి. వరకూ మధ్య తరగతి కుటుంబాలలో చాలా వస్తువుల కథ యింతే!- కాకపోతే- ఓ తేడా వుంది. గ్రామఫోను శబ్దాన్ని యిరుగుపొరుగు వాళ్ళు పంచుకున్నట్టుగా మిగతా వస్తువుల వల్ల వచ్చే ఆనందాన్ని వాళ్ళు పంచుకోలేరు. అందుచేత - "సమస్య" యింత జటిలంగా వుండదనుకుంటాను - ఏమంటారు?-

---

# 20

## పిచ్చేశ్వరరావు- "జీవచ్ఛవాలు"

మెదడును పదునుపెట్టే మంచి కథలను కోరుకునే పాఠకులు పిచ్చేశ్వరరావును మరచిపోలేరనుకుంటాను. తెలుగు కథ ఏపుగా ఎదిగి మంచి పువ్వులు పూస్తున్న తొలి రోజులలో ఎర్రటి మందార పూలను అందంగా గుదిగుచ్చిన జాతి కథకుడు పిచ్చేశ్వరరావు. అతని సమకాలీన కథకులు చాలామందితో పోల్చిచూస్తే పిచ్చేశ్వరరావు వ్రాసిన కథలు బహుకొద్ది మాత్రమే. కాని, కాల ప్రవాహానికి నిలబడి అతనిని 'చిరంజీవి'గా చేసే కథలవి. ''-అతను కథలు రాయాలని కనిపెట్టుకుని ఏ కథా వ్రాయలేదు. స్వదుఃఖ ప్రయోజనాన్నిమటుకే మనసులో పెట్టుకుని కథలు వ్రాశాడు-" అటూ కొడవటిగంటి కుటుంబరావుగారు వెలిబుచ్చిన అభిప్రాయాన్ని చదివితే- రచయితగా అతడిలోని నిజాయితీ అర్థం అవుతుంది.

పిచ్చేశ్వరరావు కథల్లో రెండో ప్రపంచ యుద్ధంనాటి వాతావరణం, స్వాతంత్ర్య సమరం, తెలంగాణా పోరాటం, స్వాతంత్ర్యానంతరం ఉపన్యాసాల విన్యాసాలలో నేతి బీరకాయలా మిగిలిపోయిన ప్రగతి, సామ్రాజ్యవాదం చెప్పిన పాఠాలను అవగతం చేసుకుని- కొత్త వేషాలతో, మార్చుకున్న రంగులతో జనాన్ని పీక్కుతింటున్న పరపీడనా ప్రవృత్తి- ఇవన్నీ బహుముఖంగా దర్శనమిస్తాయి. పిచ్చేశ్వరరావు నావికులు, రైతులు, స్త్రీలు, బర్మా కాందిశీకులు, ఎవరి గురించి చెప్పినా సరే- వాళ్లకు జరిగిన అన్యాయానికి ఆక్రందిస్తాడు. ఆవేశంతో ఊగిపోతాడు. - "కలాన్ని ఇంకుబుడ్డిలో ముంచినప్పుడల్లా తన శరీరంలోని ఒక్కో మాంసం ముక్కను అందులో వదిలిపెట్టగలిగినప్పుడు మాత్రమే రచన చేసేందుకు ఉపక్రమించాలి-" అనే 'లియో టాల్‌స్టాయ్' పలుకులు జ్ఞాపకం వస్తున్నాయి ఇది వ్రాస్తుంటే. పిచ్చేశ్వరరావు కథలు చదువుతున్నప్పుడు ఒకనాటి చరిత్ర అంతా కళ్ళ ముందు కదులుతుంది. లేకుంటే- కుటుంబరావు గారు 'నెత్తురుకథ' గురించి చెబుతూ "అయిదు పేజీలు పూర్తిగాలేని ఈ కథలో ఒక జీవితమే కాదు. ఎంతో చరిత్ర వున్నది" అని అంటారా?

ఈ కథలోని ఎర్రజెండా మామూలు రాజకీయ జెండా కాదని, నెత్తురు జెండా అని ఆ కథ పాఠకులకు జ్ఞాపకం వుందనే అనుకుంటాను. ఒక నల్లవాడు శాంతి, భద్రతలను కాపాడడంకోసం కాల్చిన తుపాకీ చిందించిన ఈ రక్తం వెనుక ఎంతో కథ వుంది. గాంధీజీని

కొలిచి స్వాతంత్ర్యం కోసం భర్తను తెల్లవాడి తుపాకీకి బలి ఇచ్చిన వీరపత్ని కథ వున్నది. స్వాతంత్ర్యం వచ్చినా ఆకలి తీరక, ఆవేదనలతో అలమటించిన దయనీయ గాథ వున్నది.

"ప్రేమతో పొంగి, దుఃఖంతో కరిగి, క్షోభతో కుమిలి, కోపంతో కమిలిన నెత్తురు" కథ ఇది!

ఈ కారణంచేతనే పిచ్చేశ్వరరావు ఓ ఆగస్టు 15న కొట్లమీదా, కాఫీ హోటల్సుమీదా, మూడు రంగుల జెండాలు ముచ్చటగా రెపరెపలాడుతూ వుంటే–

"పొట్ట కదిలింది. పొట్టమీద ఇనుప చువ్వల మొనలు మొలిచాయి. మొనల మధ్య నడిబొడ్డు ద్వారం విచ్చుకుంది... చీకటి వెనుక కారుచీకట్లు తారట్లాడుతున్నవి. టోపీలు, లాఠీలు, బాయ్‌నెట్‌లు, తుపాకులు...." అంటూ 'సర్రియలిస్ట్' ధోరణిలో కథను వ్రాశాడు. (ఆగష్టు 15 కథలో) పిచ్చేశ్వరరావుకు 'ఆకలి దారిద్ర్యాలతో నిండిన 'నేడు' ను 'నిన్న'గా మార్చాలని వున్న తపన– అతను వ్రాసిన "గడవని నిన్న" కథ చదివితే తెలుస్తుంది. ఈ కథలోని "విన్నీ" ఒక వ్యభిచారిణి కావచ్చు. (పోర్చుగీస్‌వాళ్ళు 'సినోరిటా' అనీ, అమెరికన్లు 'జానీ' అని, మరికొంతమంది 'హసీనా' అని పిలువవచ్చు. అది వేరే విషయం) కాని– ఆమెకీ ఓ మనసుంది. అయినా, 'మార్స్' చాక్లెట్లు నములుతూ హాయిగా కూర్చోక అతనికి 'విన్నీ' గొడవ ఎందుకు? విమానాలమీద వెళ్ళే వాళ్ళని బాంబులు వెయ్యొద్దని, సింహాసనం మీద కూర్చున్న వాళ్ళని ఉపన్యాసాలు దంచొద్దనీ చెప్పడం పిచ్చి కాదు?– ఇవి అన్నీ మారిననాడు నేనూ కనిపించను అంటుంది 'విన్నీ'. అలా మారిన దేశాలకు అదంతా 'నిన్న'– మరి మనకు 'నిన్న' గడిచేదెప్పుడు?

ఈ 'గడవని నిన్న' గురించిన తాపత్రయం పిచ్చేశ్వరరావు నావికుల జీవితాలను నేపథ్యంగా తీసుకుని వ్రాసిన 'చిరంజీవి' వంటి కథల్లో కూడా కనబడుతుంది. తెలుగులో 'నేవీ' వాతావరణంతో వచ్చిన కొద్ది కథల్లో పిచ్చేశ్వరరావు కథలు ముఖ్యంగా పేర్కొనదగ్గవి. 'చిరంజీవి' కథలోని చిరంజీవి రంగూన్ నుంచి పారిపోయి వచ్చేటప్పుడు చాలా కష్టాలు పడ్డాడు. మంటల్లో బూడిద అయిపోతున్న ఇంటినీ, చచ్చిపోయిన చెల్లెల్ని, విడిచిపెట్టి– జపాన్ విమానాన్ని తప్పించుకుంటూ పరుగెత్తాడు. జపాన్ వాళ్ళమీద కసితో ఇండియాలో 'నేవీ'లో చేరాడు. కాని, సామ్రాజ్యవాదుల కథ ఎక్కడయినా ఒక్కటే! చిరంజీవిలో వున్న అన్యాయాన్ని ఎదిరించే మనస్తత్వాన్ని అధికార్లు అణగదొక్కుదామని విశ్వప్రయత్నం చేశారు. పాకీ పని చేయించారు. చివరికి తుపాకీ గుండుతో పొట్టన పెట్టుకున్నారు. కాని, కథ చివర్లో ఉప్పెనలాగా గోడలు దూకి వస్తున్న జనసమూహాన్ని చూస్తూ డాక్టర్ అన్నట్టు "చిరంజీవి చనిపోలేదు, ఈ జనమంతా చిరంజీవులే!"

పిచ్చేశ్వరరావు కథల్లో కనబడే మరొక ముఖ్యమైన విషయం 'వ్యక్తివాదం' పట్ల 'సెటైరు'! "నాకు కావలసింది నేనే– బ్రతికినా నేనే" అనే ఒక అసామీ– "నా ముందు

మీరెత్తగలిగిన మాట వ్యక్తిస్వాతంత్ర్యం. ఈ వ్యక్తిస్వాతంత్ర్యం ముందు మీరంతా గడ్డిపరకలు... ఈ విశాల విశ్వం అంతా ఆ వ్యక్తిస్వాతంత్ర్యం పుక్కిలించి వూసే వెలుగులో ఓ పెద్ద 'నీడ' "అని అంటాడు పిచ్చేశ్వరరావు వ్రాసిన ఓ కథలో. ('వెర్రికాదు-వేదాం తం' అనే కథలో)

'వ్యక్తి స్వాతంత్ర్యం' ముసుగులో సమసమాజాన్ని అవరోధించే పెద్ద మనుషుల కుహానా విలువలపట్ల వైముఖ్యమే పిచ్చేశ్వరరావుచేత ఇలా వ్రాయించింది. అమెరికన్ బ్రాండు 'వ్యక్తి స్వాతంత్ర్యా'న్నే కాదు - అమెరికా స్వేచ్ఛాదేవతను కూడా పిచ్చేశ్వరరావు హేళన చేశాడు.

"జీవచ్ఛవాలు" కథ జ్ఞాపకం వుందా?

ఈ కథకు నేపథ్యంలో అమెరికా దేశ సంస్కృతి, "స్టేట్యు ఆఫ్ లిబర్టీ" దర్శనమిస్తాయి. "స్టేట్యు ఆఫ్ లిబర్టీ" పేరు చెప్పేసరికి న్యూయార్క్ ఓడరేవులో బానిసత్వపు చీకట్లను చీలుస్తూ, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు ఊపిరిని వెదజల్లుతున్నట్టుగా దర్శనమిచ్చే ఓ అపురూపమైన దేవతా శిల్పం స్మృతి పథంలో మెదులుతుంది. అంతో ఇంతో చారిత్రక జ్ఞానం వున్నవాళ్ళకు ఆ శిల్పాన్ని తీర్చిదిద్దిన ఫ్రెంచి శిల్పకారుడు ఆగస్ట్ బార్తోల్డీ, ఆ శిల్పంమీద చెక్కబడిన 'ఎమ్మా లాజరస్' వాక్యాలు కూడా జ్ఞాపకానికి రావచ్చు. అది వేరే విషయం. పిచ్చేశ్వరరావు కథకూ ఈ బాపతు 'వ్యవహారానికి' సంబంధం లేదు.

ఒకానొక రేవు పట్టణంలో 'టావెడో' అనే ఒక అపురూపమైన ఓడ వచ్చిందని విని ఇద్దరు మిత్రులు చూడడానికి వెడదామనుకుంటారు. ఓడను చూడడం అవకపోయినా, ఆ ఓడ నావికుడు 'డిక్' పరిచయం అయింది. అదీ ఓ 'వేసైడ్‌యిన్'లో బుడ్డీమీద బుడ్డీ బీరు పట్టిస్తుండగా!

"మీ స్వాతంత్ర్య దేవతను చూడాలని వుందండి" అంటాడు "అమెరికా పిచ్చి" వున్న సుబ్రహ్మణ్యం. అదిగో అక్కడ నుంచి అసలు కథ ప్రారంభం అయింది. స్వాతంత్ర్య దేవతని తలుచుకుంటూ, అమెరికన్ జీవన విధానం కోసం లొట్టలు వేసే సుబ్రహ్మణ్యం "దివ్యమాతృ విగ్రహం.... మీ దేశంలోని తల్లులందరిలోనూ..." అంటే, 'సెయిలర్ డిక్' అంటాడు కదా.

"నాకు తల్లి ప్రేమంటే ఏమిటో తెలియదు. పక్షిలా పెరిగాను. నేను డబ్బు సంపాయిస్తేనే గొప్ప వాణ్ణట. లేకపోతే కొడుకునే కాదు పొమ్మంది. డాలరు తెస్తే ముద్దు, లేకుంటే మొట్టు!" అని!

(ఆగస్టు బార్తోల్డీ తన కన్న తల్లిని నమూనాగా తీసుకుని స్వేచ్ఛా దేవత శిల్పాన్ని చెక్కాడంటారు. ఇంతకూ ఆ "తల్లి" అమెరికన్ తల్లి అయినా, ఫ్రెంచి తల్లి అయినా, బార్తోల్డీ కన్నతల్లి మాత్రం "తల్లి" కుండవలసిన లక్షణాలుగానీ, స్వేచ్ఛా దేవత శిల్పంలో

మనం ఊహించుకునే ఉదాత్త లక్షణాలు గానీ లేవు అని, కేవలం కొడుకుకుతల్లి పైగల 'లిబిడినల్ ఎటాచ్‌మెంట్' వల్ల మాత్రమే ఆమెను నమూనాగా తీసుకోవడం జరిగిందని అంటారు కొందరు)

అమెరికాలో మాతృత్వమే డబ్బుతో కొలిచే వస్తువు అయినప్పుడు ఇక, స్నేహితుల సంగతి చెప్పాలా? "మా దేశంలో స్నేహం లేదు. వున్నా స్నేహంలో లోతు లేదు, ఎవరూ ఎవరికీ స్నేహితులు కారు" అంటూ ఉస్సురంటాడతడు.

ఇక, ఓడ పనిలో ఎందుకు చేరావంటే 'చావడానికి' అని అంటాడు. "నాకు చావాలని వుంది. చచ్చిపోలేను. ఎవరయినా చంపుతారేమోనని అనుకుంటాను... యుద్ధంలో చేరితే ఎవళ్ళో ఒకళ్ళు చంపుతారు" అనే మాటలు చదివితే ఒళ్ళు గగుర్పొడుస్తుంది.

రాత్రిళ్ళు రోడ్డమ్మట తిరిగేటప్పుడు "ఎంత మంది పెళ్ళాల మెడలపై చేతులు వేసుకుని నిద్రపోతున్నారో అని ఆలోచిస్తా- అప్పుడు బార్‌లో దూరతా" అనే మాటల్లో 'ఎనక్లిటిక్ డిప్రెషన్' కనబడుతుంది.

'డిక్' అనబడే ఈ సెయిలర్ కథ కల్పితమే కావచ్చు. అమెరికన్ల కుహానా విలువల పట్లగల వైముఖ్యంతోనే పిచ్చేశ్వరరావు ఈ కథను వ్రాసి వుండవచ్చు. కాని, మెటీరియలిస్ట్ ధోరణులు పెచ్చుపెరిగిపోతున్న దేశాలలో ప్రతిదాన్నీ డబ్బుతో మాత్రమే కొలిచే సంస్కృతిలో- అది అమెరికా కానివ్వండి, మరొక దేశం కానివ్వండి, ఒక సగటు మనిషి హృదయ ఆవేదన ఎలా వుంటుందో ఈ కథ చెబుతుంది.

'డెమొక్రసీ అండ్ సైంటిఫిక్ టెక్నిక్' అనే రచనలో బెర్‌ట్రాండ్ రసెల్ "పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో ఆకలి భయం మనిషికి 'ఇన్‌సెంటివ్'గా పని చేస్తుంది. కమ్యూనిస్ట్ వ్యవస్థలో పోలీసులు విధించే శిక్షలు 'ఇన్‌సెంటివ్'గా పనిచేస్తాయి" అని అంటాడు. ఈ కథలోని 'డిక్' యంత్రంలోని మరలాగా మారిపోయానని గగ్గోలు పడడం- పోటీ ఆర్థిక వ్యవస్థ ఇచ్చిన విష ఫలితమే!

మనిషిని ఒక బోల్టుగానో, స్క్రూగానో చూడక అతనినొక సజీవ పదార్థంగా చూడగలగాలంటే- మన విలువల్లో, నమ్మకాల్లో మార్పు రావడం ఎంతయినా అవసరం. ఆ విలువలు భారతీయమైనవా, రష్యన్లవా, అమెరికన్లవా అనేది కాదు ప్రశ్న. మనిషికి అవి ఎంతవరకు ఉపయోగపడుతున్నాయన్నది మాత్రమే ప్రశ్న. ఈ ప్రశ్నకు జవాబు దొరికితే "జీవచ్ఛవాలు" వుండవు. ప్రాణంతో ఉట్టిపడే మనుషులు కళకళలాడుతూ కనబడతారు. పిచ్చేశ్వరరావు కోరుకున్న స్వర్గం ఇదే అనుకుంటాను.

---

# 21

## చా.సో. 'జంక్షన్‌లో బడ్డీ'



పదిమంది మంచి తెలుగు కథకుల పేర్లు చెప్పవలసి వస్తే అందులో చాగంటి సోమయాజులుగారి పేరు వుండి తీరుతుంది అని అన్నారట ఆచార్య రోణంకి అప్పలస్వామిగారు. అప్పలస్వామిగారు ఊరికే ఒకర్ని పొగిడే మనిషి కాదు. చా.సో.గారు ఊరికే కాలక్షేపానికి కథలు రాసిన కథకుడూ కాదు. పట్టుమని పది రోజులు కూడా జ్ఞాపకం వుండని వందలాది కథలను గుమ్మరించిన కథకులు గజ ఈతగాళ్ళమని తమను చూసి తామే మురిసిపోతున్న ఈ రోజులలో– పది కాలాలపాటు నిలవగల ఆణిముత్యాల్లాంటి కథలు రాసిన చా.సో. గారిని మరిచిపోయే వాళ్ళుంటారంటే నమ్మడం కష్టం. విజయనగరం పేరు చెప్పేసరికి గంట స్తంభం, రాజుగారి కోట జ్ఞాపకానికి ఇవచ్చినట్టుగా 'తెలుగు కథ' పేరు చెప్పేసరికి 'చా.సో'గారు జ్ఞాపకానికి వస్తారు. మరి చా.సో. గారి పేరు చెప్పేసరికి జ్ఞాపకం వచ్చే ఆయన చిరుదరహాసం, నోట్లో చుట్ట, వగయిరాల గురించి ఇక్కడ ప్రస్తావించను.

కథకుడుగా చా.సో.కు ఒక ప్రత్యేకత వుంది. ఏదో ఒక మూసకు లోబడి కథలు రాసే కథకుడు కాదాయన. కొన్ని సందర్భాలలో ఆయన కథల్లోని వైవిధ్యం పాఠకుణ్ణి ఆశ్చర్యంలో ముంచెత్తివేస్తుంది. 'కంకుదాకు', 'ఎంపు' వంటి కథలు రాసిన చా.సో.గారు – 'వాయులీనం', 'ఏకరువు' నంటికథలు రాసిన చా.సో.గారు ఒక్కరే అంటే నమ్మడం కష్టం. ఇందుకు కారణం ఆయనలో వచ్చిన భావ పరిణామ క్రమం మాత్రం కాదు. నిజానికి ఆయనలోని భావ పరిణామక్రమాన్ని అంచనా వెయ్యడం కూడా అంత సులువైన విషయం కాదు.

ఇక్కడే ఒక సంగతి చెప్పాలి. ఆయన మధ్య తరగతి మానవుడి కుహనా విలువల్ని వెక్కిరించినా పురుడు రాక పెళ్ళాం చచ్చిపోవాలని, ఆపైన తను కోరుకున్న అందాల రాశి 'చిట్టి'ని కట్నం లేకుండా పెళ్ళాడాలని కలలు గన్న సంస్కరణాభిమాని కథను చెప్పినా, అట్టడుగు ఆర్థికస్థాయి మనిషి కథను తెలియచెప్పినా, ఆయన 'మనిషి' తోటి సంబంధాన్ని పెట్టుకున్నాడే కాని, అతడి ఆర్థిక వర్గంతో కాదు. వర్గ సంఘర్షణ గురించి రాసే గాలి

కబుర్లు గాని, ప్రచార ధోరణి కాని ఆయన కథల్లో కనబడదు. మనిషి గుండెల్లోని బొమ్మ, బొరుసుల గురించి, మనిషిలోని అంతర్వైరుధ్యాలను గురించి తెలిపేటప్పుడు వర్గ సంఘర్షణ కథ నేపథ్యంలో కనబడవచ్చు. అది వేరే విషయం. 'పీడన'కు గురి అవుతున్న సగటు మనిషిలో కూడా 'పరపీడనా ప్రవృత్తి' వుంటుందనే విషయాన్ని గ్రహించిన కొద్దిమంది అభ్యుదయ రచయితల్లో చా.సో.గారు ఒకరు. అందువల్లనే ఆయన కథలు ఏ వర్గంవారి మీదా ద్వేషాన్ని ప్రేరేపించవు. ఆలోచించమని హెచ్చరిస్తాయి. అంతే.

మాట వరుసకు 'బొండు మల్లెలు' కథనే తీసుకుందాం. ఈ కథలోని కథానాయకుడు పెరట్లో మల్లెపూల తోట వేసి పువ్వుల్ని అమ్ముదామనుకున్నప్పుడు ధనికులే ఎక్కువగా పువ్వులు కొంటారు కాబట్టి దోపిడీ చేస్తున్నవాళ్ళని పువ్వులతో దోపిడీ చేయవచ్చునని అనుకున్నాడు. అతగాడి 'మల్లెపూల సామ్యవాదం' (జాస్మిన్ సోషలిజమ్) బాగానే వుంది కాని, తన లాభాల వేటలో అతగాడు తోటలో పనిచెయ్యడానికి కుదిరిన ఒక ముసలివాడిని అతి తక్కువ కూలీ ఇచ్చి దోచుకుంటున్నానన్న సంగతి మరిచిపోయాడు. కడుపు కాలుతున్న ముసలివాడు మధ్యాహ్నం పూట కాసిన్ని గంజినీళ్ళు పోస్తే సంతృప్తిపడడం ఆకలి రాజ్యంలో సామాన్యమైన విషయమే కావచ్చు. పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో అది యజమాని ఉదార గుణానికి సంకేతమే కావచ్చు. ఇక– డబ్బు తెస్తేనే గాని తండ్రికి తిండి పెట్టనన్న ముసలివాడి కూతురు ప్రవర్తన ఆధునిక ప్రపంచంలో సామాజిక న్యాయంగానో, ఒక బీదరాలి ఆర్థిక ఇబ్బందిగానో సమర్థించుకోవచ్చు. కాని కథ చివరిలో ముసలివాడు జబ్బుచేసి దిక్కులేని స్థితిలో చనిపోతే, "దోపిడీ చేస్తున్నవాళ్ళకి బొండు మల్లెలు అమ్మి దోపిడి చేస్తున్నాననుకున్నాను కాని, తాతని పెద్ద దోపిడీ నేనే చేశాను" అంటూ కథానాయకుడైన ఆ గృహస్తు పొందిన ఆవేదన 'స్మశాన వైరాగ్యాన్ని' దాటి ఎదిగే అవకాశం తక్కువ, చా.సో.గారు 1943లో ఈ కథ రాసి ఇన్ని దశాబ్దాలు దాటిపోయినా మానవ ప్రవృత్తి మాత్రం అంతే!

ఈ కథ గురించి రాస్తున్నప్పుడు నాకు రా.వి. శాస్త్రిగారి 'పువ్వులు' కథ జ్ఞాపకానికి వచ్చింది. అది కూడా చాలా మంచి కథ. అయితే ఆ కథలో పూల మొక్కల్ని పెంచిన అమ్మాయి, వాటిని దర్జాగా కారులో వచ్చి కోసుకునిపోయిన యజమానురాలు, రెండు వర్గాలకు సంకేతాలుగా కనబడతారు. కాని 'బొండు మల్లెలు' కథలో ఈ రెండు వర్గాలూ బొమ్మా, బొరుసుగా కనబడడం జీవిత వాస్తవానికి అద్దం పడుతుంది.

ఇదొక్కటే కాదు. చాసో కథల్లోని వర్గ వైషమ్యం కథా అంతే. 'కుంకుడాకు' కథ చదివారా? 'మునేలం పులుసు, వొరన్నం' తిన్న అప్పలనాయుడు కూతురు పారెమ్మ, గింజలు లేక 'రేత్రి అగ్గి చేసు' కోలేని చినదేవుడు కూతురు గవిరితో పోల్చి చూసినప్పుడు ఆర్థికంగా ఉన్నత వర్గానికి చెందింది కాదూ? వెండి కడియాలు వున్న పారెమ్మ, ముక్కులో రాగి కాదలున్న గవిరిని ఈసడించి తీసిపారేసిందంటే తప్పేముంది? పశువుల పేడ దాచిందని అన్యాయంగా చెయ్యని నేరానికి 'భుక్త'గారు కొడితే "లమిడీ కొడకా! నీ సింత కంప

లెవడికీ అక్కరలేదు' అంటూ కన్నీళ్ళు తుడుచుకుంటూ కుంకుడాకులు మాత్రమే తీసుకెళ్ళిన గవిరిలోని ఆత్మాభిమానం ఎవడిక్కావాలి? 'భుక్త'గారు గవిరికన్నా మరో నాలుగంతస్తులు ఎత్తున వున్నవాడు కాదూ?

సమాజంలో వున్న ఈ ఆర్థికపరమైన హెచ్చు తగ్గులు, పరపీడన పోయి సామ్యవాదం స్థాపించబడితే కొంప మునుగుతుందని టాటాలు, దాల్మియాలు బెంగెట్టుకుంటే అర్థం వుంది. కాని, ప్లీడర్ గుమస్తా గవరయ్యగారు గాభరా పడడంలోనే అసలు కథ వుంది. 'భల్లూక స్వప్నం' కథలో, కోర్టుకొచ్చిన గవరయ్య జడ్జిగారు వచ్చేలోపున ఓ కునుకు తీస్తే ప్రపంచం అంతా రష్యా సోషలిస్టు విధానానికి లోబడి 'ఎర్ర'బడిపోయినట్లు 'పీడకల' వచ్చింది. దీన్నిఇ 'పీడకల' అని ఎందుకనాల్సి వచ్చిందంటే డబ్బున్న వాళ్ళే లేకపోతే కోర్టులేం కావాలి? ప్లీడరు గుమస్తాల బ్రతుకేం కావాలి? అదలా వుంచండి. సమశానపాలెం జమీందారుగారు వ్యవసాయదారుడని రుజువయితేనే కదా తనకు నూట పదహార్లు దొరికేది? ఇక పెళ్ళాం మెడలోని బంగారం, దాచుకున్న రెండువేల రూపాయల మాటేమిటి? ప్లీడరు గుమాస్తాలుఐనా, కాకపోయినా మనలో ఎంతమందిలో గవరయ్యవున్నాడనే వాస్తవాన్ని మనకే వదిలిపెడతారు చా.సో. గారు.

డబ్బు కేంద్రంగా ఏర్పడిన వ్యవస్థలోని వాణిజ్య విలువలు మనుషుల్ని 'గవరయ్యలు'గా మార్చేస్తాయి. వాడు ఏ ఆర్థిక వర్గానికి చెందినవాడన్నది కాదు ప్రశ్న. 'ఎంపు' కథలో 'ఎర్రి' అనబడే ముష్టిది తాను మనసుపడిన కుంటివాణ్ణి పెళ్ళాడాలా? మనసు చంపుకుని, నాలుగురాళ్ళు ముష్టెత్తి తెచ్చుకునే గుడ్డివాణ్ణి పెళ్ళాడాలా? అనే ప్రశ్న వచ్చినప్పుడు, ఎర్రి తండ్రి అయిన కుష్ఠురోగి గుడ్డివాణ్ణి పెళ్ళాడి 'హాయి'గా బ్రతకమని సలహా చెబుతూ "గుడ్డోడు మారాజు. ఇంత తెస్తాడు. నీమీద ఆధారపడి నీ సెప్పు సేతల్లో వుంటాడు. నువ్వెక్కడికి వెళ్ళినా సూడరాడు. నీకు మనసుయిందీ యిష్టమొచ్చినట్టు తిరుగు" అని చెప్పడమూ, ఆ 'సలహా'ను కూతురు పాటించడమూ ఈ వ్యవస్థకు చెందిన న్యాయమే!

ఇక ఇలాంటి వ్యవస్థలోని 'రాజకీయం' గురించి, ఆ రాజకీయాన్ని భుజాన వేసుకుని తిరిగే ప్రజాప్రతినిధుల లౌక్యాన్ని గురించి వేరే చెప్పనవసరం లేదు. 1969లో చా.సో.గారు ప్రచురించిన 'జంక్షన్‌లో బడ్డీ' అనేక కథ ఈ వాస్తవాన్నే అందంగా చెబుతుంది. చా.సో. కథల్లో ఈ కథంటే నాకు బాగా ఇష్టం.

ఈ కథలోని రామునాయుడు ఓ వూళ్ళో మునిసిపల్ కౌన్సిలర్. కులపోళ్ళ నందరినీ కూడగట్టుకుని ఆ పదవిలోకి వచ్చాడు. పదవిలోకి రాకముందు గోచీ కట్టుకుని ఎడ్లు తోలిన రాము నాయుడు కౌన్సిలర్ అయిన తర్వాత చిలక్కట్టు పంచె, జలతారు కండువాల్లోకి ఎదిగాడు. ఇంటి రూపు కూడా మారిపోయింది.

ఇలాంటి రామునాయుడుకు రామయ్యతో దోస్తీ. అతగాడిని 'దద్దా' అంటూ ఆప్యాయంగా పిలుస్తాడు. ఇంతకీ ఈ రామయ్య ఎవరయ్యా అంటే ఓ కిళ్ళీ బడ్డీ యజమాని. గూడెం మధ్యలో వున్న రోడ్ల జంక్షన్‌లో కిళ్ళీ బడ్డి పెట్టుకుని అదే జీవనాధారంగా

ముప్ఫయ్యేళ్లుగా బ్రతుకుతున్నాడు. నాలుగు రాళ్ళు కూడగట్టాడు కూడా. ఇలాంటి రామయ్యకు హఠాత్తుగా ఓ ఆపద వచ్చి నెత్తిమీద పడింది. రోడ్డు వెడల్పు చేసే పథకం క్రింద రోడ్డుకడ్డంగా వున్న రామయ్య బడ్డీని పీకెయ్యమన్నారు. బడ్డీ లేకపోతే బ్రతికే లేదని గగ్గోలు పెడుతూ రామునాయుడి సహాయం కోరాడు రామయ్య.

ఇంతవరకూ కథ బాగానే వుంది. అయితే క్రిందనుంచి పై వరకూ 'తడుపుకు' రాకుండా పనులు జరుగుతాయా? ముందు రెండువందలతో ప్రారంభించాడు రామునాయుడు. ఆ తర్వాత ఆ డబ్బు మళ్ళీ తిరిగి తెచ్చేశాడు పని అవనప్పుడు డబ్బు ఖర్చు దండుగ ఎందుకని? అప్పుడు మొగుడూ పెళ్ళాలిద్దరూ మొర్రో, మొర్రో అని గోలపెడితే రామునాయుడు ఓ ధర్మసూక్ష్మం చెప్పాడు. బడ్డీని పది అడుగులు వెనక్కు గొందిలోకి జరిపి కాలవ మీద పెట్టుకోమన్నాడు. ఇందుకు సంబంధించిన అనుమతికి ఏడువందల దాకా ఖర్చు అవుతుందన్నాడు. బడ్డీ గూడెం మధ్యలోనే వుంటుంది కనుక బేరం ఎక్కడికీ పోదనే ఆశతో రామయ్య ఆ ముడుపు చెల్లించుకున్నాడు (ఊళ్లోవాళ్ళ దిష్టి తగలకుండా అప్పు తెచ్చామని అబద్ధం చెప్పినప్పటికీ).

రామునాయుడి ధర్మమా అని రామయ్య బడ్డీ కాలవమీద ఏ ఆటంకం లేకుండా జోరుగా సాగిపోతోంది. ఇటువంటి పరిస్థితిలో రామునాయుడు మరో వార్త మోసుకొచ్చాడు. కొత్తగా వచ్చిన కమీషనర్‌ని ఒప్పించి రామయ్య బడ్డీ ఇదివరకటి జంక్షన్ వుండే ఏర్పాటు చేస్తానని, ఇందుకు ఓ రెండు వందలుంటే సరిపోతుందనీ చెప్పాడు. ఇంతకు ముందు జరిగిన బడ్డీ వ్యవహారంలో రాము నాయుడు డబ్బు తినేశాడని నలుగురూ అనుకోవడం వల్లనూ, కాలవ మీద వున్నా వ్యాపారం ఢోకా లేకుండా సాగిపోతున్నందువల్లనూ రామునాయుడు ఇచ్చిన అవకాశాన్ని రామయ్య వదులుకున్నాడు.

ఇది జరిగిన కొన్నాళ్ల తర్వాత రామయ్య బడ్డీ వున్న జంక్షన్‌లో ట్యూబ్‌లైట్ల వంటి హంగులతో అందమైన బడ్డీ ఒకటి కొత్తగా వచ్చింది. దాని ప్రొప్రైటర్ రామునాయుడు మేనల్లుడు! ఈ కొత్త బడ్డీ రావడంతో గొందిలో కూరుకునిపోయినట్టు వున్న రామయ్య బడ్డీ 'పని' అయిపోయింది. కొత్త బడ్డీలో నాటుసారా అమ్మకం కూడా వుండడంచేత దానికి సమస్తమైన హంగులూ సమకూరాయి. పోటీని తట్టుకోలేక రామయ్య వ్యాపారం మానుకుని వూరికి దూరంగా ఓ రోడ్డువార గ్రామానికి తరలి వెళ్ళిపోయాడు.

ఈ కథలో రామునాయుడు ముందు నుంచీ ప్లాను వేసి రామయ్యను జంక్షన్‌లోంచి గెంటేసి మేనల్లుడిచేత బడ్డీ పెట్టించుకున్నాడా? లేక, తెలివి తక్కువతోరామయ్య వచ్చిన అవకాశాన్ని జారవిడుచుకున్నాడా? అంటే అదొక భేతాళ ప్రశ్న. ఈ ప్రశ్నకు బదులు చెప్పగలిగిన విక్రమార్కుడు తన ఖడ్గాన్ని లంచగొండి 'విక్రమార్కు'లపైనే దూస్తాడనుకుంటాను. అయితే ఈ కథలోని రామునాయుడు నా కంటికి 'నిమిత్త మాత్రుడి'లాగానే కనబడతాడు. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి 'కలుపు మొక్కలు' తర్వాత 'కరప్షన్' మీద వచ్చిన మరో మంచి కథ ఇది.

---

# 22

## శిష్టా - 'సిపాయి కథలు'



"ఏ దేశంలోనైనా యుద్ధం వస్తే ఆ యుద్ధం నుంచి సాహిత్యంలో కొన్ని నూతన మార్గాలు రావడం యుద్ధానికి వుండే ఒక విశిష్టత. మన దేశంలో యుద్ధం కాలు పెట్టినా విశాఖపట్నం, కాకినాడలు బాంబులకు ఆహుతయినా రచయితలకు చీమ కుట్టినట్టయినా లేదు...."

ఎప్పుడో చాలా సంవత్సరాల క్రితం - 1946 జూన్ నెల 'భారతిలో.... "సిపాయి కథలు తెలుగు కథా సాహిత్యానికి అలంకారం" అంటూ శ్రీరంగం నారాయణబాబు వ్రాసిన వాక్యాలివి.

నిజమే- ఇతర భాషా సాహిత్యాలతో పోల్చి చూస్తే తెలుగు సాహిత్యంలో యుద్ధకాలపు వాతావరణంలో వచ్చిన రచనలు చాలా తక్కువే అని చెప్పాలి. నారాయణబాబు అన్నట్టు రెండో ప్రపంచ యుద్ధ సమయంలో విశాఖపట్నం, కాకినాడ 'ఆహుతి' అయినా, కాకపోయినా- యుద్ధ జ్వాలలు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఆనాటి పౌర జీవనంపై దారుణమైన ప్రభావాన్ని చూపాయి. రెండో ప్రపంచయుద్ధ కాలానికి తెలుగు కథ ఎదుగుదల చెప్పుకోదగ్గ స్థాయిలో వున్నప్పటికీ- ఏ కారణం చేతనో రచయితలను ఈ తరహా వాతావరణం అంతగా ఆకట్టుకోలేకపోయింది.

ఇలాంటి పరిస్థితిలో మనం గుర్తు పెట్టుకోదగ్గ కథలుగా శిష్టా ఉమా మహేశ్వరరావు (1912-52) రచించిన "సిపాయి కథలు" పలువురి ప్రశంసలు పొందడంలో ఆశ్చర్యం లేదు. "వస్తువులోను, కథనంలోను, సిపాయి కథలు నవ్యమార్గమునకు చెందినవి" అంటూ "నవ్యాంధ్ర సాహిత్య వీధులు" రచయితలు (కురుగంటివారు, పిల్లల మర్రివారు) ఇచ్చిన 'సర్టిఫికెట్'లో అతిశయోక్తిగాని, అసత్యంగాని ఏదీ లేదు. ఆనాటికి గోఖలే, చాగంటి సోమయాజులు వంటి 'యువకులు' (నారాయణబాబు అన్నట్టు) వ్రాస్తున్న తీరులోనే 'శిష్టా' కూడా ఈ కథల్ని గ్రామీణులైన సిపాయిల భాషలో వ్రాయడం ఈ కథలకు మరింత ప్రత్యేకతను తెచ్చి పెట్టింది.

-'యుద్ధం' అనే పేరు చెప్పేసరికి సర్వ సాధారణంగా మనకు బాంబులు, మెషిన్ గన్నులు, అవిచేసే విధ్వంసక కాండ జ్ఞాపకానికి వస్తాయి. ఈ మారణాయుధాల వెనుక,

వాటి ఫలితమైన బీభత్స విషాధ గాధల వెనుక, 'సైనికుడు' అనబడే ఒక జీవి వుంటాడు. అతను ఈ ఉద్యోగంలో 'దేశభక్తి'తో చేరాడా లేక జీవనం గడవడానికి జీతం రాళ్ళకోసం చేరాడా అనే విషయం ఎలా వున్నప్పటికీ- అతనికీ ఓ హృదయం వుంటుంది, ఆ హృదయంలో ఆర్ద్రతలు వుంటాయి, అతనికీ ఓ శరీరం వుంటుంది, అందులో మోహంతో సహా చాలా కోరికలు వుంటాయి అనీ తరుచూ మరిచిపోతుంటాం.

యుద్ధ బీభత్సం సృష్టించిన అలజడిని ఆర్థిక, సాంఘిక నేపథ్యాల్లోంచి పరిశీలిస్తూ... కథలు, నవలలు, కవితలు వ్రాసిన రచయితల సాహితీ ప్రపంచంలో చాలామంది వుండవచ్చు. కాని సిపాయి కథను- అతడి ఆశలు, ఆవేదనలు, కోరికలు (అవి సభ్యమైనవా, కాదా, అనే ప్రశ్న వద్దు) వీటన్నింటినీ - అతడి గుండె చప్పుడు వినిపించేలా ఆతని భాషలోనే కథలుగా వినిపించిన రచయితలు వివిధ భాషా సాహిత్యాల్లో కూడా తక్కువే అనుకుంటాను.

'వార్ అండ్ పీస్' నవల ముగింపు అధ్యాయంలో జాతులను నడిపించిన శక్తి ఏది? అనే ప్రశ్నకు సమాధానం చెబుతూ లియో టాల్‌స్టాయ్ 'జాతులను నడిపించిన శక్తి నెపోలియన్, అలెగ్జాండర్ మొదలైన మహాపురుషులు అనుకుంటూ వుంటారు కొందరు చరిత్రకారులు. కాని అది సరిఅయింది కాదు. ప్రజలు తమ సామూహిక ఐచ్ఛిక శక్తిని తమ నాయకులలో వ్యక్తం చేయడం వల్లనే ఆ నాయకులు అంతటి ఘనతను పొందగలిగారు' అని అంటారు. జాతుల విషయంలో ఏది సత్యమో, దేశాల మధ్య జరిగే యుద్ధాల విషయంలో కూడా అదే వాస్తవం. ఒక యుద్ధం ముగిసిన తర్వాత మనం ఒక మహా సేనానినో, ఆనాటి ప్రధానమంత్రినో, రక్షణ మంత్రినో గుర్తు పెట్టుకున్నంతగా ఒక సాధారణ సైనికుడి త్యాగాన్ని, అతడి కన్నీళ్ళను గుర్తుంచుకునే ప్రయత్నం చెయ్యం.

అయితే ఈ కన్నీళ్ళు విరోధి సైనికుడు తుపాకీ గుండు చేసిన గాయం వల్ల వచ్చింది మాత్రమే అనుకునేందుకు వీలులేదు. యుద్ధ సమయంలో సైనికుడు అనుభవించే ఏకాకితనం, భద్రతా రాహిత్యం, సెక్సుపరమైన కోరికలు తీరక గుండెల్లో నుంచి వచ్చే అలజడి - ఇవన్నీ వారి మానసిక పరిస్థితిపై ప్రభావాన్ని చూపుతాయి. ఈ పరిస్థితులలోనే సైనికులందరూ ఒకరికొకరు ఎంతో సన్నిహితులైపోతారు. ఓ పూట సెలవు దొరికినప్పుడు వచ్చే ఆనందం, కలిసి మందు కొట్టేటప్పుడు వుండే మజా వాళ్ళు మాత్రమే అర్థం చేసుకోగలరు.

దాదాపుగా ఈ భావాలన్నీ మనకు శిష్ట్లా రచించిన 'సిపాయి కథలు' చదివినప్పుడు కలుగుతాయి. అయితే శిష్ట్లా కేవలం కథకుడు మాత్రమే కాదు. కవి కూడా. బహుశా ఈ కారణంచేతనే అనుకుంటాను. ఈ కథల్లోన్ని కొన్ని వాక్యాలు సాధారణ వచనం నుంచి ఎదిగి కవిత్వానికి సన్నిహితంగా కనబడతాయి. 'ఆ ఊరు!' అనే మాటతో ప్రారంభమై, 'ఆ

ఊరు!' అనేమాటతో ముగిసే 'సిపాయి పెళ్లాం' కథలో సిపాయి భార్య 'రోసీ' గురించి చెబుతూ.... 'రోసీ' గుట్టు కలది, చిరుగు చిరుగుల మధ్య తొడలూ, పిక్కలూ కనబడుతున్నా 'రోసీ' గుట్టు కలదే! - అనడమూ, మరోచోట 'బార్బుడు వైరులాంటి కనుబొమ్మ'లను వర్ణించడమూ- శిష్టా లోని విలక్షణమైన కథకుడిని మాత్రమే కాదు, కవిని కూడా జ్ఞాపకం చేస్తాయి. (అతడి 'ప్రాహ్లాద కవిత్వం'తో సహా!) ఇంక అక్కడక్కడా 'ఇంటర్నల్ మొనోలాగ్'లాగా దర్శనమిచ్చే వాక్యాలు సరేసరి!

శిష్టా కథా ప్రపంచంలో "మొన్న షిల్లాంగు కాన్వాయి పోతే రెండు రోజులున్నాం గందా! రెండు గంటలైనా లీవిచ్చారూ? ఆ 'ఖసియానీ' గుంటలు గుడ్లు తిపకుంటూ పోతుంటే లారీ విడిసిపోడానికి వీల్లేదాయె. గుండెల్లోని కులాసా గుండెల్లోనే కూరుకుపోయింది-" అంటూ ఉస్సురనే 'లమ్డికె' లచ్చన్న ('నేను - నా కెప్టెన్' కథలో) - చిత్తుగా త్రాగి రోడ్డుమీద నానా అల్లరీ చేసి పోలీస్ స్టేషన్ లాకప్పులో దూరి ఆ ప్రక్క రోజున తీర్పు చెప్పడానికి కూర్చున్న మేజిస్ట్రేట్‌తో "ఎంపీగాడ్లు నన్ను సానా మర్యాదగా సూశారు సార్. గదీ గిదీ ఇచ్చాడు సార్. ఆళ్లదేం తప్పులేదు సార్. నాదే తప్పు, చమించండి" అని చెప్పుకున్న 'అబ్బాయిగారి సుబ్బాయి' ('మొదటి తప్పు' కథలో)- ఇలా ఎంతమంది మనకు పరిచయం అవుతారని? ఇక పెదబొండాయిగాడు, గూడ గోసాయిగాడు, వీళ్ల సంగతి సరేసరి.

'పడిపోయిన సిపాయి' కథలో కంకిపాడు కామాయి-అదే 68910 నెంబరు సిపాయి తన కంపెనీతో గౌహతి నుంచి 'నవుగాం' వచ్చి, అక్కడి నుంచి 'మణిపూర్' వెడుతుంటే కాలికేదో తగిలి అంత ఎత్తు కొండమీంచి కిందపడడమూ, పడేటప్పుడు క్రిందనున్న చెరువు, వరి పొలం, కంకిపాడును జ్ఞాపకం చెయ్యడమూ హృదయాలను కదిలించదూ? మృత్యువు కౌగిలిలో ఒరిగిపోయే ముందు ఆ సిపాయికి తల్లి, చిన్న తమ్ముడు, చెరువు గట్టు దగ్గర కూర్చుని చిన్నప్పుడు తిన్న 'వణ్ణమూ', మిరపకాయల కారము, కాల్చిన రొయ్యలు జ్ఞాపకం వచ్చాయంటే ఆశ్చర్యం ఏముందీ?

జీవితంలో వున్న ఈ అనిశ్చితత్వం సైనికుడికి తరుచూ తన వాళ్ళ గురించి ఆరాటపడేటట్టు చేస్తుంది. 'వెండిపొడుం డబ్బీ' కథలో బోడి రాముడనే సైనికుడికి 'జోరాఖాట్' కాంప్‌లో పెరేడ్ గ్రౌండ్ దగ్గర వెండి పొడుం డబ్బీ దొరికితే దానికి పావలా దగ్గరనుంచి రెండు రూపాయిల దాకా వేలంపాట పెరిగింది. కాని బోడిరాముడు దానిని గడియారం జేబులో పెట్టుకుని "యమదరమరాజు వచ్చినా నేనివ్వను పొండి. నా భార్యకు నేనింతవరకు సొమ్ము పెట్టలా. ఆయిడ పొడుం పీలుతుంది. ఇదాయిడకు పంపిత్తా" అంటాడు. కాని ఈ యుద్ధంలోంచి బ్రతికి బయటపడి బోడిరాముడు పెళ్ళాం దగ్గరకు వెళ్ళగలుగుతాడా? ఆవిడ పొడుం డబ్బీ తీసుకుని పొంగిపోయే రోజు వస్తుందా? అనే ప్రశ్నలకు కాలమే బదులు చెప్పవలసి వుంటుంది.

సిపాయిల కథల్లోని విషాదం ఎంతటిదో వినోదం కూడా అంతే వుంటుంది. మాట వరసకి 'ఫిడేలు మేజరు' కథనే తీసుకుందాం. ఈ కథలోని మేజరు గారికి ఫిడేలు వాయించడం అంటే చాలా సరదా. అయితే 'అవుల్దార్ ఎంకన్న' భాషలో చెప్పాలంటే అతగాడు 'రోజంతా టెంటులో కూర్చుని వాయించడమే గాని యారిముందరా వాయించలేదు. చకండ్ యిన్ కమాండ్ క్యాప్టెన్ ముందు కూడా యెప్పుడూ వాయించలేదు' ఇలాంటి మేజరుగారికి సంగీత కచ్చేరి చేయాలని బుద్ధి పుట్టడానికి కారణం 'షిల్లాంగ్'లో పరిచయం అయిన నర్సుపిల్ల. ఆ పిల్ల పియానో పాండిత్యానికి తగినట్టుగా ఫిడేలు విద్వాంసుడవ్వాలని, ఆపైన ఆ పిల్ల మనసు కాస్తా దోచుకోవాలని మేజరుగారు వేసుకున్న పథకంలోని భాగమే ఈ సంగీత కచ్చేరీ! మరి మేజరుగారు ఫిడేలు వాయిస్తాను వినమంటే సోల్జర్లు చచ్చినట్టువినక ఛస్తారా? కాని ఫిడేలు చేత్తో పట్టుకుని వేసే 'సుత్తి'ని ఎంతకని భరించగలరు? మూలిగారు. దగ్గారు. చీదారు. చివరకు వుండబట్టలేక ఒకడు గొణిగాడు కూడాను– "మిచిన్ గన్లు పట్టుకునేవోళ్ళు ఫిడేళ్ళు పట్టుకుంటే ఎలారా?" అని.

ఇలాంటిదే పేకాట ఉదంతం కూడా ('పేకాట పేకాడించడం' కథలో). మిలిటరీ రూల్సు ప్రకారం సైనికులు డబ్బు పెట్టి పేకాడకూడదు. అందులో రాత్రిపూట లైట్సాఫ్ అయిన తర్వాత కొవ్వొత్తుల వెలుగులో పేకాడడం అంటే పెద్ద నేరమే. హవల్దార్ మేజర్ చూశాడంటే గార్డ్ రూమ్‌లోకి తోసేసి శిక్షించడం ఖాయం. ఇలాంటి స్థితిలో కాలక్షేపానికి సైనికులు పేకాడుతూ వుంటే హవల్దార్ మేజర్ వచ్చి (అతగాడు ముంద దగ్గరకెళ్ళి తిరిగివస్తున్నప్పుడే అనుకోండి) ఏమీ అనకుండా పేకాటలో కూర్చోవడం ఆనందమే కాని, ఆటలో డబ్బంతా కొట్టేసి ఆట అర్థాంతరంగా ఆపేసి లేచిపోతూ "ఇక సాల్రా లేవండి. లైట్సాఫ్ అయి మూడు గంటలైయింది. కిక్కురుమన్నారా రెండు ఛార్జీల మీద బంద్ చేస్తాను. పేకాడినందుకు, మేలుకున్నందుకు" అనడం – 'జేబులు ఖాళీ చేసే' వ్యవహారమే అయినా అందులో సైనికులు చెప్పుకుని నవ్వుకునే ఉదంతం లేదూ?

– ఇలా నవరసభరితమైన సైనికుల జీవితాలలోని ఒక్కో ఉదంతం ఒక్కో కథగా గుదిగుచ్చి కథామాలగా అందిస్తాడు శిష్ట్లా. ఇందులోని ఏ ఒక్క కథా, ఏ ఒక్క పాత్రా విడిగా జ్ఞాపకం వుండకపోవచ్చు. సిపాయి జీవితంలోని ఏ ఒక్క ఉదంతం సిపాయి కథ కాకపోవడమే ఇందుకు కారణం అనుకుంటాను.

– దేశాలు వేరైనా, కాలాలు వేరైనా యుద్ధాలు వచ్చినప్పుడు అన్నిచోట్లా సిపాయిల కథ, వ్యథ ఇంచుమించు ఒకేలా వుంటుందనుకుంటాను. బహుశా ఈ కారణం చేతనే నాకు ఈ కథలను అంతర్జాతీయ కథలు అనాలనిపిస్తున్నది!

---

## 23

# పిలకా గణపతి శాస్త్రి-"బహువ్రీహి"



"-గత కాలమే మేలు. వచ్చు కాలము కంటె' - అనేది తిరోగమన వాదుల నినాదం. 'వెనుకచూసిన కార్యమేమోయ్, మంచి గతమున కొంచెమేనోయ్, మందగించకముందు అడుగేయి-' అనే గురజాడ అడుగుజాడ అభ్యుదయవాదుల ఆదర్శం. ఇదంతా నిజమే!- తిరోగమవాదుల 'బాధ'ను పక్కకు నెట్టి, అభ్యుదయ దృక్పథంతో ఆలోచించినప్పుడు కూడా- గతంలో వున్న ఆ 'కొంచెం' మంచి, అవి అందిచ్చే సంస్కృతీ ప్రభలు, వాటి అందచందాలు జ్ఞాపకం రాకమానవు. గణపతి శాస్త్రిగారి వంటివారు పాత సీసాలో కొత్త సారాలాగ ఒకనాటి ప్రాచీన గాధలను ఈనాటి ఆధునిక కథా ప్రక్రియ రూపంలో అందివ్వడానికి బహుశా ఇలాంటి కారణమే వుండి వుండాలి. పావు శతాబ్దం క్రితం ఒక వారపత్రికలో ధారావాహికంగా వెలువడి ఆనాటి పాఠకుల విశేష మన్ననను పొందిన 'ప్రాచీన గాధాలహరి' కథలు ఒకప్పుడు వారపత్రికలు చదివే పాఠకులకు ఇంకా గుర్తున్నాయనే అనుకుంటాను.

గణపతి శాస్త్రిగారి పేరు చెప్పేసరికి చాలా మందికి "విశాల నేత్రాలు", "మీనాంబిక" వంటి చారిత్రాత్మక నవలలు జ్ఞాపకానికి వస్తాయి ఇక, కవిగా గణపతి శాస్త్రిగారి విషయానికి వస్తే ప్రేయసిని తలుచుకుని కలవరించే భావ కవిని జ్ఞాపకం చేసుకునేవారు కూడా వుండవచ్చు. ఇక, కవిగా గణపతిశాస్త్రిగారి విషయానికి వస్తే (అందరు భావకవులూ ప్రేయసిని 'నీవు' అంటూ ఏకవచన ప్రయోగం చేస్తే - గణపతి శాస్త్రిగారు మాత్రం 'మీరు' అంటూ మర్యాద ఇచ్చారని- నారాయణరెడ్డిగారు వ్రాశారు. ఇలా 'గౌరవించిన' వారు వీరొక్కరేనట!-)

వీటన్నింటి మాటా ఎలా వున్నా, - కథా సాహిత్య ప్రియులకు మాత్రం "ప్రాచీన గాధాలహరి" పన్నీటి జల్లుగా అనుభూతినిస్తుంది.

1964 ప్రాంతాలలో గాధాలహరి పుస్తక రూపంలో వచ్చినప్పుడు ఆ సంపుటులకు ముందుమాట వ్రాస్తూ శాస్త్రిగారు- "ప్రాచీన గాధా లహరి కథ లేవీ పురాతన సంస్కృత

వాఙ్మయంలోని కథానికల కనువాదాలుగాని, అనుసరణలుగానీ కావు. అయితే - మన పురాతన సంస్కృతాది సారస్వతాల్లో అక్కడక్కడ గోచరించిన చిన్న చిన్న సన్నివేశాలు, సంఘటనలు, కథలు, కొన్ని వేర్వేరు రూపకల్పనలతో వివిధ పాత్ర చిత్రణలతో విశిష్టంగా కూర్చి ఈ రచనలు కొనసాగించాను-" అని వ్రాసుకున్నారు.

ఈ కథలు చదువుతుంటే మనం శ్రావస్తీపుర వీధుల్లో తిరుగాడతాం. ఉజ్జయనీ పుర వేశ్యా వాటికలలో వారకాంతల వయ్యారాలు, నెరజాణతనాలు, అనుభూతి నందుతాం. ఒకనాటి ప్రభువుల రాజసాలు, భేషజాలు, ఔదార్యాలు అవగతం చేసుకుంటాం. ఇక వశిష్ఠుల వంటి మహర్షులు చేసే తత్వబోధలు, గురుకులాశ్రమాలలో గురువులు శిష్యులకు పెట్టే పరీక్షలు, సరేసరి-ఒక్క మాటలో చెప్పాలంటే ప్రాచీన కాలపు భారతదేశమంతా మన ముందు వుంటుంది. శాస్త్రిగారు చెప్పే కథ రామాయణ కాలానిదయినా, భారతకాలానిదయినా- కొన్ని శతాబ్దాల క్రిందటి తెలుగు చక్రవర్తుల పరిపాలనా కాలానిదయినా-ఒకనాటి సంప్రదాయం, సంస్కృతి, నవరసభరితంగా దర్శనం ఇస్తుంది. ఈ సందడిలో శృంగారం పాలు అప్పుడప్పుడూ రవ్వంత ఎక్కువ అయినా దాని వెనువెంటనే వేదాంత చర్చ వుండనే వుంటుంది. సంగ్రహంగా చెప్పాలంటే శాస్త్రిగారి ప్రాచీన గాథల స్వరూపం ఇది.

'కవి చక్రవర్తి' అవుదామనుకుని కలలుగన్న ఒక మహాకవి కవిత్వం మాట ఎలా వున్నా, దేశానికి నిజంగా చక్రవర్తి అయి అది రుచించక సన్యాసాన్ని స్వీకరించిన కథను చదివి ('కవి చక్రవర్తి' కథలో-) ఒకనాటి ప్రజల జీవిత విలువలకు, ప్రభువుల ఔదార్యానికి, నివ్వెరపోతాం. నగర నర్తకి తరళిక తాను వలచిన నవ మన్మథుడు నాగవర్మకు చెలికత్తె చతురిక ద్వారా రాయబారం పంపిస్తే ఆ పిల్ల రాయబారం నడిపేది పోయి అతగాడితో శృంగార వ్యవహారం సాగించిన ఉదంతం విని ('దూతీ చాతుర్యం' కథలో-) ముసిముసి నవ్వులు నవ్వుకుంటాం. భర్త తనకు దూరం అవుతాడేమోనన్న భయంతో అతడిని వేశ్యాపరిష్వంగం నుంచి తప్పించడానికి యుక్తిగా వలవేసి పెట్టిన ఒక ఇల్లాలి ప్రణయ కథ చదివి ('గృహిణీ ప్రణయం' కథలో) ముచ్చట పడతాం. అందుకే అన్నాను శాస్త్రిగారి కథలు నవరసభరితం అని! - ఆ కథల్లోని ఇతివృత్తం ఏదయినా హాయిగా మనల్ని చదివింపజేస్తాయి.

మాట వరుసకు - 'ఛత్రపాణి' కథనే తీసుకుందాం. శ్రావస్తీ నగరానికి తథాగతుడు విచ్చేసినప్పుడు ఆయనను సేవించుకోడానికి 'త్రిపిటక' విద్వాంసుడు, ధర్మమూర్తి అయిన 'ఛత్రపాణి' వెడితే ఇంచుమించుగా అదే సమయానికి చక్రవర్తి కూడా అక్కడకు వచ్చాడు.

తథాగతుని పాదసన్నిధిలో చక్రవర్తి, పౌరుడు అందరూ ఒక్కటే!- ఈ ధర్మసూక్ష్మం తెలుసుకోకుండా తనని గౌరవించి నమస్కారం చెయ్యలేదని చక్రవర్తి ఛత్రపాణిపై ఆగ్రహిస్తే అందులో అర్థం ఏముంది?- ఆ తర్వాత, చక్రవర్తి ఛత్రపాణిని తనవద్దకు రప్పించి అధికార దర్పం చూపిస్తూ ఎత్తిపొడవబోతే ఛత్రపాణి అంటాడు కదా "క్షణభంగురాలయిన భోగభాగ్యాలను చూచి అహంకరించవలసిన అవసరం ఏమున్నది మహారాజా?..... శాక్యసింహులు వారి సన్నిధికి వెళ్ళినా ఇంకా క్షుద్రాహంకారాల ఆర్భాటమేనా? -" అని!.... ఆ తర్వాత కథ ఏం కానివ్వండి... ఈ వేళ మనకు ఈ కథలోని చక్రవర్తులు లాంటి 'కొత్త ప్రభువులు' చాలామంది వున్నారు. కాని ఛత్రపాణి లాంటి ఆత్మగౌరవం వున్న విద్వాంసులు ఎంతమంది వున్నారు?- బ్రతుకు తెరువు ముసుగులో విద్యకు, విద్వాంసులడికీ, గౌరవం ఎక్కడ?-

గురజాడవారిని ఆకర్షించినట్టుగా గణపతి శాస్త్రిగారిని కూడా జ్ఞాన వాశిష్టంలోని లవణోపాఖ్యానం ఆకర్షించింది. ("మంచి చెడ్డలు మనుషులందున ఎంచి చూడగ రెండు కులములు - మంచి యన్నది మాలయైతే మాలనేనగుదున్' అని చెప్పడానికి గురజాడవారు 'లవణరాజు కల' కథను ఉపయోగించుకున్న తీరును సాహిత్యాభిమానులకు ప్రత్యేకించి గుర్తు చెయ్యనవసరం లేదు). మూల కథలో మనస్సుకు గల శక్తిని చెప్పడానికి - యోజనాల దూరాన్ని గోష్పాదతుల్యంగాను, క్షణమును కల్పముగాను, కల్పమును క్షణంగాను, మహాశక్తితో ఎలా మలుచుకోవచ్చో చెప్పడానికి వశిష్ఠుడు శ్రీరాముడికి ఈ కథ చెబుతాడు. శాస్త్రిగారి కథ కూడా ఈ పని అంతా చేస్తుంది. కథ చివర్లో రాగద్వేషాదిద్వంద్వాల అంధకారం పటాపంచలయిన తర్వాత లవణుడు రాజ్యాన్ని వశిష్ఠుల వారికి అప్పగిస్తే ఆయన సర్వసంగపరిత్యాగి నయిన నాకెందుకు పరిపాలన అని అంటాడు. అప్పుడు లవణుడు "-కనుకనే ఈ ప్రజా పరిపాలన అప్పగించి పోతున్నాను!-" అనడం -ఆదర్శ ప్రభువుకు వుండవలసిన లక్షణాన్ని చెప్పక చెబుతోంది. సర్వ సంగ పరిత్యాగి అంటే కాషాయ వస్త్రాలు ధరించనవసరం లేదు! మనసులో రాగద్వేషాది మలినాల మాలిన్యం అంటకుండా వుంటే చాలు.

గణపతి శాస్త్రిగారి కథల్లో నాకు "బహుబ్రీహి" కథంటే ఇష్టం. ఈ కథలో విద్యానాథుడు అనబడే పండితుడు గోదావరీ తీరాన విడిది చేసివున్న ప్రతాపరుద్ర చక్రవర్తి దర్శనానికి వెడితే మంత్రిగారు దానిని పడనివ్వరు. దానికి-విద్యానాధుడు ఆగ్రహించి చక్రవర్తికి వినపడేలాగ గుడారం ముందు-

"- నవలక్ష ధనుర్ధరాధి నాధీ
పృధివీం శాసతి వీర రుద్రదేవే
అభవత్పర మగ్రహార పీడా-" -అని అరుస్తాడు.

(నవలక్ష ధనుర్ధారులకు అధినాయకుడయినటువంటి వీర ప్రతాపరుద్ర దేవమహిపతి పరిపాలన చేస్తుండగా అగ్రహారీకులకు వల్లమాలిన పీడ కలిగింది- అని అర్థం!-)

-ఇది విని ప్రతాపరుద్రుడు ఆశ్చర్యపోయి వెంటనే అతడిని లోపలికి రమ్మంటాడు. చక్రవర్తి దగ్గిర వున్నవాళ్లందరూ ఆ పండితుడి పొగరుబోతనాన్ని నిందిస్తారు. అప్పుడు విద్యానాధుడు తాను చదవదలచిన శ్లోకం పూర్తి కాలేదని చెబుతూ-

"-నవలక్ష ధనుర్ధరాధి నాధే
పృధివీంశాంపతి వీరరుద్రదేవే
అభవత్సర మగ్రహార పీడా
కుచకుంభేషు కురంగలోచనామ్-" అని పూర్తి చేస్తాడు.

(వీర ప్రతాప రుద్రమహీపతి పృథ్విని పరిపాలిస్తుండగా కురంగలోచనులైన అంగనల కుచకుంభముల మీది అగ్రహారాలకు, అంటే ముందున్న ముత్యాల హారాలకు పీడనం కలిగింది)

విధ్యానాధుడు చేసిన సవరణతో చక్రవర్తికి అతని విద్యా వైదుష్యం అవగతం అయి - 'తటాకోత్తరభూమి'ని (తటాకం యొక్క ఉత్తర దిశలో వున్న భూమి) దానం ఇచ్చాడు. అయితే తటాకానికి ఉత్తరంగా వున్న భూమి కన్నా, దక్షిణంగా వున్న భూమి సారవంతమైనది. అందుచేత విద్యానాధుడు దక్షిణంగా వున్న భూమిని ఆక్రమించుకున్నాడు. దాన పట్టాకు వ్యతిరేకంగా విద్యానాధుడు భూమిని స్వాధీనం చేసుకున్నాడని విని చక్రవర్తి అతడికి కబురంపాడు. అప్పుడు విద్యానాధుడు చక్రవర్తితో తాను 'నేరం చెయ్యలేదు 'తటాకోత్తర భూమి' అంటే తటాకం యొక్క ఉత్తర భూమి మాత్రమే కానక్కరలేదనీ "తటాకం ఉత్తరముగా కలిగిన భూమి" అని కూడా అన్వయం చేయవచ్చుననీ అంటాడు. అనగా - షష్ఠీతత్పురుషగా కాకుండా 'బహువ్రీహిగా' చూడవచ్చునని భావం.

అదివిని చక్రవర్తి నవ్వి - "బహువ్రీహా? -" అని అంటారు. అప్పుడు విద్యానాధుడు "ప్రభువులు దానం చేసింది బహువ్రీహి కాక అల్పవ్రీహి ఎలా అవుతుంది? -" అని

అంటారు! ('వ్రీహి' అంటే ధాన్యం అని కూడా అర్థం ఉంది. 'బహువ్రీహి' అంటే ఎక్కువ ధాన్యం పండేది అని అర్థం చెప్పవచ్చును.)

విద్యానాధుడు చేసిన ఈ వ్యాఖ్యానికి చక్రవర్తి మరింత సంతోషించి అతడిని త్రిలింగ సామ్రాజ్యానికి విద్యాధికారిగా నియమిస్తాడు.

ఈ కథ నిజంగా జరిగిందా లేదా అనే ప్రశ్న వదిలెయ్యండి. ఈ కథలోని పండితుడి లౌక్యము, బ్రతకనేర్పరితనము మాత్రమే గుర్తు పెట్టుకోదగ్గవి. అయితే వాటి వెనుక అఖండమైన అతడి పాండితీగరిమ కూడా వున్నది. ఇదిలేని 'లౌక్యం' మనుషులను కేవలం సగటు స్థాయికి మాత్రమే దిగజారుస్తుంది. ఒక తరంలో వెల్లివిరిసిన పాండితీ ప్రభల ప్రత్యేకత ఇదే అనుకుంటాను.



# 24

## జరుక్ శాస్త్రి - "అనుమానం"

**కో**ర్టులో 'కాతం-కథల' కేసు నడుస్తోంది.

నిజమే మరి - కాంతం కథల రచయిత సాంసారిక జీవితంలోని హాస్యాన్ని రసగుళికల్లాంటి కథలతో పాఠకుల గుండెలపై పన్నీటి జల్లుగా అలరిస్తే బాగుందని మెచ్చుకోవాలి. నవ్వుకుని మురిసిపోవాలి అంతేగాని, వెక్కిరించడమో, అనుసరించడమో, చేస్తే ఎలా? పింగళి నాగేంద్రరావుగారి 'కాంతం డైవోర్స్'లోను, వెంపటి నాగభూషణంగారి 'చిన్న కథలు'లోను లక్ష్మణరావుగారి, 'మన మాష్టరుగారు' వ్యాసంలోను; ఈ ధోరణి కనబడినందువల్లనే జరుక్ శాస్త్రి, (హాస్యధోరణిలోనే అనుకోండి) 'లిటరరీ కోర్టు' పెట్టి 'వ్యవహారం' రచ్చకీడ్వవలసి వచ్చింది.

లిటరరీ కోర్టులో న్యాయం చెప్పడానికి శ్రీనివాస శిరోమణి, శివశంకరశాస్త్రి, ముద్దుకృష్ణ - అన్నట్టు మరచిపోయాను. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వీళ్ళంతా 'తగు' మనుష్యులు'గా కూర్చున్నారు. వాదోపవాదాలన్నీ విన్న తర్వాత తీర్పు చెప్పడం ప్రారంభమైంది. (అనగా శిక్షలు చెప్పడం అని అర్థం)

"మొదటి ముద్దాయి నాగభూషణంగారు కాశీకి పోయి ధృవాగారిని దర్శించి గంగలో స్నానం చేసి, (ధైర్యం వుంటే ఈదొచ్చు) ఎద్దుబండి కట్టించుకుని సారనాథ్‌కు పోయి బౌద్ధమత గ్రంధాలు, త్రిపీటకాలు, చదివి పద్మశ్రీ రాసిన నాగసర్వస్వాన్ని ఒక్కసారి అంటే ఒక్కసారి చదివి, దానిమీద రివ్యూ ఒకటి ఇంగ్లీషులో 'త్రివేణీ'కి, తెలుగులో 'కృష్ణా పత్రిక'కు రాసి అక్కణ్ణించి దీక్ష పుచ్చుకుని బౌద్ధ భిక్షువు అయిపోవాలి" లేకపోతే 'సంసారం విషయంలో అనుభవం లేకపోయినప్పటికీ' కాంతం కథల్ని అనుసరిస్తే ఊరుకుంటారా?

మరి నాగేంద్రరావుగారినీ విడిచిపెట్టేది లేదు. ఆయన "నాటకాల విషయంలో తప్ప బందరు పొలిమేర దాటిపోరాదు. బందరులో కూడా గొడుగుపేట, రాబర్ట్సన్‌పేట, దాటిపోరాదు. సాయంత్రం 'టీ' కూడా 'ఆనందభవన్'లోనే త్రాగాలి. అప్పుడప్పుడు 'కృష్ణాపత్రిక' ఆఫీసుకు పోవచ్చును.

ఇక మూడో ఆయన మాట ఏమిటి?

"– 'మా' మాష్టరుగారు' అనే వ్యాసం రాసి 'నేనూ–మా కాంతం', పుస్తకాన్ని రాసిన రచయితకు మనస్తాపం తెప్పించినందుకు ముందు "కరావూరు చెరువులో పడిపోవాల్సిందని తీర్పు చెప్పడం జరిగింది కాని, జీవహత్య జరగడానికి వీలులేదని కాంతం కథలకథకుడు పట్టుబట్టడంతో మాధవరాయశర్మగారి 'ఉషస్సు' పత్రికకు యాభైమంది చందాదారులను చేర్పించే శిక్షగా దానిని సవరించాడు.

ఇదంతా చదివి ఇలాంటి కేసు, తీర్పులు, నిజంగా జరిగాయని అనుకునేరు ఉత్తది. జలసూత్రం రుక్మిణీ నాథశాస్త్రిగారి 'లిటరరీ కోర్టు' అనబడే కథ కాని కథలోని భాగాలు ఇవన్నీ, ఓ తరానికి చెందిన పాఠకులకు ముసిముసి నవ్వులు తెప్పించే ఛలోక్తులు ఇవి.

జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి (1914–1968) గారి పేరు చెప్పేసరికి ఆయన పేరడీలు, ఛలోక్తులు, జ్ఞాపకానికి తెచ్చుకునేవారు 'పేరడీ శాస్త్రి' అని ఆప్యాయంగా ఆయన్ని పిలుచుకుంటారు. సంస్కృతాంధ్రాలలో పాండిత్యాన్ని, ఆంగ్ల సాహిత్యంలో పరిచయాన్ని కలిగిన శాస్త్రిగారు మనం జ్ఞాపకం వుంచుకోతగ్గ కథలు కూడా కొన్నింటిని వ్రాశారు.

అయితే అవి కేవలం హాస్య ప్రధానమైన కథలు మాత్రమే కాదు.

"చల్లని తల్లి చానమ్మవారు ప్రశాంతమైన ముఖంతో తల్లి కూతుర్ని పుట్టింటికి తీసికెళ్ళడానికి వచ్చినట్టు వస్తుంది. జాలిగా శిరస్సుపై చెయ్యి వేస్తుంది. కళ్ళనీళ్ళు తుడుస్తుంది. మారాం పెట్టే పిల్లలకు తల్లి వాయినం పెట్టినట్టుగా ముద్దుగా 'రా' అని తన వొడిలోకి తీసుకుంటుంది" అనే పాత్రలూ ('స్వర్గాదపి' కథలో) "రాక్సీలో 'ది వే ఆఫ్ ఫ్లష్ అండ్ బ్లడ్', ఎలిఫిల్‌స్టన్‌లో 'ది లిటిల్ ఫాక్సెస్' ఎక్కడికి పోయినా రంగనాథరావు తయారు, అతను రాగానే అర్థాంగ్లాంగనలు ఎడాపెడా ఊపిరి సలపకుండా తయారు–నా పక్కనో గబ్బువాసన కొట్టే మురికి అవ్వా, తప్పితే సోల్జర్లు...." అంటూ వాపోయే పాత్రలూ ('ఏం ఘోరం' కథలో) కూడా జమిలిగా కనబడతాయి.

భర్త చనిపోయి బ్రతుకు బజారున పడితే ఒక్కగానొక్క కొడుకును పట్నం పంపి స్కూల్లో చదివిద్దామని ఆశపడింది. పాచిపని చేసుకుని పొట్ట గడుపుకునే బీదరాలు, కాని సత్తుగిన్నెలో అన్నం తెచ్చుకున్నాడని తన కొడుకును, వాడి పేదరికాన్ని స్కూల్లో పిల్లలు గేలిచేస్తే జరిగిందేమిటి? "బళ్ళో ఫస్టున పాసయినట్టూ" కలలు కన్న కొడుకు "నేను స్కూలుకు పోనే" అని ఏడిస్తే ఆ లోపం వున్నది ఆ తల్లిలోనా? ఆ తల్లి దారిద్ర్యానికి కారణమైన ఆర్థిక వ్యవస్థలోనా? అనే ఆలోచనలను చెలరేపే కథలు ఒక వైపు ('నేను పోనే' కథలో) బాపిరాజుచేత బొమ్మల్ని, కవికొండల వారిచేత' పద్యాల్ని వ్రాయించి (చలం రచనలు వద్దు బాబూ తట్టుకోలేము అనే మాటొకటి మధ్యలో!) పత్రిక పెట్టేస్తున్నానని ఊరేగి అది విడుదల కాకపోయినప్పటికీ చేతి చమురు వదలి "కాలమే తరిమినా కన్నీళ్ళు రాల్చకే కలుషమెరుగని చెలీ" అని ఉస్సురుమనే సంపాదక మహాశయుడి కథ మరొకవైపు

('సంపాదకీయ రాజు' కథలో) జరుక్ శాస్త్రి, కథల్లో సమకాలీన ప్రపంచం ఇంద్ర ధనస్సులా కనబడుతుంది. ఈ కథలలో చాలా భాగం ముప్ఫైలలోను, నలభైలలోను అచ్చయినవి. అప్పటికీ ఇప్పటికీ స్థూలమైన కొద్ది మార్పులు మినహాగా ప్రపంచం పెద్దగా మారిపోయే 'ప్రమాదం' ఏర్పడలేదు కాబట్టి ఇప్పటికీ శాస్త్రిగారి కథలు చదువుకోడానికి బాగానే వుంటాయి.

"స్త్రీల విషయంలో మనుషులు ఆచరించని దోషం ఏదయినా వుందా? నిజం చెప్పండి" అంటూ ఏనాడో వరాహమిహరుడు తెలిపిన సూక్తితో జరుక్ శాస్త్రి ఒక కథను ప్రారంభిస్తాడు. ('హోమగుండం' అనే ఆ కథలో మొదటి భార్య చితాగ్ని నుంచే రెండో పెళ్ళి హోమానికి తయారయిన ఓ మహానుభావుడు 'సంస్కరణ' అనే ముసుగులో ఓ విధవరాలిని పెళ్లాడి ఆమెను ఆ తర్వాత మానసికంగా హింసిస్తాడు.) ఈ కథే కాదు - జరుక్ శాస్త్రివ్రాసిన మరికొన్ని కథల్లో కూడా స్త్రీల పట్ల ఈ విధమైన 'సానుభూతి' ధోరణి కనబడుతుంది. చలం ప్రభంజనం వీస్తున్న రోజులలో కథలు వ్రాసిన వాళ్ళకు ఆ ప్రభావం అంతో ఇంతో తప్పదనుకుంటాను. (చలానికి-స్త్రీల పట్ల వున్నది కేవలం 'సానుభూతి' మాత్రమే అని చెప్పడం ఆతని సాహిత్య అసమగ్రచిత్రణ అయినప్పటికీ, 'సానుభూతి' అనే మాటలో వున్న చప్పదనం తెలిసినప్పటికీ-)

"ఒక్క దణ్ణం" కథ చదివారా?

ఈ కథ చదివినప్పుడు నాకు "నేను స్త్రీగా జన్మించినచో స్త్రీని ఆట బొమ్మగా చూసే-పురుషునిపై తిరుగుబాటు చేయుదును" అనే గాంధీ గారి మాటలు జ్ఞాపకానికి వచ్చాయి. అంతేకాదు. "అహింసాతత్వము జీవన విధానము అయిననాడు భారతదేశపు భవిష్యత్తు స్త్రీలపై ఆధారపడివుంది" అనే మాటలు కూడా జ్ఞాపకానికి వచ్చాయి. జరుక్‌శాస్త్రితో ప్రారంభించి గాంధీగారి గురించి చెప్పడానికి కారణం వుంది. ఈ కథ చివర్లో "వైధవ్యం వచ్చినా సంతోషిస్తాను. ఈ కాపరానికి ఒక్క దణ్ణం" అని లెంపలు వేసుకున్న రామసీత జ్ఞాపకానికి వచ్చి ఇదంతా వ్రాస్తున్నాను.

చదువూ, సంధ్యలు, కుదురు కుంపటి లేని ఆంజనేయులు-గాంధీ పటం పెట్టుకోవడం, రాట్నం వడకడం, మినహాగా గాంధీతత్వ అవగాహనలో ఎత్తుకు ఎదగలేని ఆంజనేయులు-పుట్టింట్లో నాలుగు రోజులు ఎక్కువ వున్న కారణంగా తన భార్యకు అదే "ఆడముండ"కు "రంకు" కట్టాడంటే ఆశ్చర్యం ఏముంది?

గాంధీగారి సిద్ధాంతాలలోని అసలు తత్వాన్ని ఆకళించుకోగలిగిన రామసీత "సాటి మనిషిని హింసించి ఎన్ని యజ్ఞాలు చేస్తే ఏం లాభం నాన్నా?" అని తండ్రిని ప్రశ్నించిందన్నా, పెళ్ళాన్ని నీచంగా చూచే భర్తకి "ఒక్క దణ్ణం" పెట్టిందన్నా విచిత్రం ఏముంది? జరుక్‌శాస్త్రి కథ చదివినప్పుడు గాంధీగారు జ్ఞాపకం వచ్చింది అందుకే!

ఈ కథను ఆనుకునే "అనుమానం- ప్రాణసంకటం" కథ గురించి చెప్పాలనిపిస్తోంది.

ఈ కథలోని సత్యం అనే ఆసామికి ఓ మహానుభావుడు "నీవు ఎవరి మీద ప్రేమ కురిపిస్తావో ఆ స్త్రీ హృదయం నీ మీద వుండదు. నిన్ను మనసారా కోరుకునే స్త్రీని నువ్వు కన్నెత్తి చూడవు" అని జ్యోతిష్యం చెప్పాడు. దాంతో ప్రారంభమైంది అసలు కథ.

పెళ్లి అయిన ప్రతి మగవాడు తన భార్యకు తన మీద ప్రేమ వుండి తీరాలని కోరుకుంటాడు. మరి ఆ 'భార్య'కు తన మీద ప్రేమ లేదని తెలిస్తే అంతకన్నా ప్రమాదం ఏముంది? ఇది సరే- తన మీద మనసు పెట్టుకుని ఎదురు తెన్నులు చూస్తూ బ్రతుకుతున్న భామ ఎవరని? ఆమెను తాను 'ఆదరించ' వద్దా?

తెచ్చిపెట్టుకున్న ఈ రెండు సమస్యలతో సతమతమయిన సత్యం తన భార్య సీతకు, ఆమె మేనమామకు, "రంకు" వుందని ఊహించుకుని గాభరాపడిపోయాడు. అంతటితో ఊరుకోకుండా తనతో కాస్త సన్నిహితంగా వుండే తన భార్య తరపు బంధువుల అమ్మాయి జానకి జ్యోతిష్యుడు చెప్పిన "అబల" అనుకుని అపోహపడి అభాసుపాలయ్యాడు. "అయిన వాళ్లతో కూడా చనువుగా మాట్లాడకూడదు అని తెలిసింది" అని జానకి పుల్ల విరుపుగా అనడంతో కుక్కకాటు పడకుండానే చెప్పు దెబ్బ పడింది. అప్పటికి జ్ఞానోదయం అవడంవల్ల కాబోలు మేనమామ విషయంలో సీతపై వున్న అనుమానం పటాపంచలయిపోయింది. తనమీద ఆమెకు ఎంత ప్రేమో తెలిసివచ్చింది. కథ సుఖాంతం.

నిజానికి ఈ కథను జరుక్ శాస్త్రి "సీరియస్" ధోరణిలో వ్రాయకపోయి వుండవచ్చును గాని, "సీరియస్"గా ఆలోచించవలసిన ఎన్నో ప్రశ్నలని ప్రేరేపిస్తోంది ఈ కథ, సత్యానికి చెప్పినట్టే సీతకు కూడా ఏ జ్యోతిష్కుడో జ్యోతిష్యం చెబితే ఆమె ఏం చేయాలి? "నా బ్రతుకు ఇంతే" అని ఓ విషాద గీతి పాడుకుని ఊరుకోవాలా? తన మీద మనసుపడ్డ మగవాణ్ణి వెతుక్కోవాలా? ప్రేమించని మొగుణ్ణి వదిలెయ్యాలా? - సమాధానం దొరకని చిక్కు ప్రశ్నలు ఇవి. విశ్వనాథవారి 'పునర్జన్మ' అనే నవల రాశారు. ఆ నవలలోని అరవై ఏళ్ళ నీలకంఠ శాస్త్రి చచ్చి స్వర్గాన వున్న తన మొదటి భార్యలా వున్నదని ఇరవై ఏళ్ళ కాలేజి అమ్మాయిని పెళ్ళి చేసుకున్నట్టే (విశ్వనాథ వారి థియరీ ప్రకారం పాపం ఆ అమ్మాయికి ముసలాడి మీద 'ఏకాగ్రత' వుందనుకోండి - అది వేరే విషయం) ఓ అరవై ఏళ్ళ ముసలామె తన మొదటి భర్తలా వున్నాడని ఓ ఇరవై ఏళ్ళ కాలేజి కుర్రాడిని పెళ్ళాడతానంటే అతగాడు ఒప్పుకుంటాడా?

సరదాగా చెప్పుకునే ఈ ప్రశ్నల వెనుక చాలా 'కథ' వుంది. ఆ కథలోనే మనలో మారీ మారని సాంఘిక విలువల అసలు కథ దర్శన మిస్తుంది. జరుక్ శాస్త్రి కథ తాళంచెవి అక్కడే వుందనుకుంటాను!

---

# 25

## రావూరి భరద్వాజ - "మొనలేని శిఖరం"



"-మనుషుల జీవితాలలో సంభవించే నిమ్నోన్నతా లన్నింటితోనూ రచయిత స్వయంగా అనుభూతి నందాలి. మేధావిగా, దర్జీగా, సైనికుడుగా, అతను ఎన్నో వృత్తులు చెయ్యాలి. అతడిని ప్రేమించమనీ, త్రాగమనీ, ఆకలితో అలమటించమనీ, - 'శాన్ ఫ్రాన్సిస్కో'లోని రౌడీలతో పేకాడమనీ - న్యూయార్క్‌లోని గుర్రపు పందాలగాళ్ళతో పందెం కట్టమనీ - 'బాన్'లోని తత్వవేత్తలతో తాత్త్విక చర్చలు చెయ్యమనీ - అంటాను-" అని 'రైటర్స్ నోట్‌బుక్'లో సోమర్ సెట్ మామ్ రాసిన వాక్యాలు చదివినప్పుడు నాకు రావూరి భరద్వాజగారు జ్ఞాపకం వచ్చారు.

- ఇలా వ్రాయడానికి కారణం ఆయన ఈ పనులన్నీ చేశారనికాదు. ప్రసిద్ధ రష్యన్ రచయిత గోర్కీలాగా జీవితంలోని చేదును, తీపిని, ('చేదు' అనే మాటను అండర్‌లైన్ చేసేటప్పటికీ-) పుష్కలంగా రుచి చూసిన రచయిత ఆయన కావడమే యిందుకు కారణం అనుకుంటాను. అంతేకాదు. "-దరిద్రం చాలామందికి పిరికిపాలు పోస్తుంది. నాకూ పోసింది. కాని - ఆ పిరికిపాలు త్రాగి నేను రాటుదేలాను. నా చిన్నతనంలో అన్ని బాధలు, కష్టాలు, అవమానాలు, ఈసడింపులు అనుభవించకపోతే నేను రచయితనయ్యేవాణ్ణి కాదు-" అని భరద్వాజగారి మాటలు 'సరళరేఖ' జీవితాలను గడిపినవాళ్ళకు ఆశ్చర్యాన్ని కలిగించడంలో ఆశ్చర్యం లేదు! - అందుకే అనిపించింది భరద్వాజగారి జీవితమే ఓ కథ - ఓ నవల - అని!-

ఈ సందర్భంలో మరోమాట - "-నా జీవితానికొక స్థిరత్వం లేనట్లే నా రచనా పద్ధతికి కూడా స్థిరత్వం లేదు-" అని భరద్వాజగారు వ్రాసుకున్న మాటలు కూడా గమనించదగ్గవి. తెలుగు కథకుడు బుచ్చిబాబులా 'ఫినిష్‌డ్ ప్రోడక్ట్' రచయితలుకనబడడం అరుదయిన విషయం అయినప్పటికీ - భరద్వాజలోని వైవిధ్యం చాలా ఎక్కువ. చలంగారు మొదలుకొని - బాల్జాక్ వంటి రియలిస్ట్‌లు - ఆపైన అస్తిత్వవాదులు (ఆ అస్తిత్వ వాదాన్ని భారతీయం చేద్దామా, - లేక కాఫ్కా, కేమూలతో ముడిపెడదామా అనే ప్రశ్న

వదిలేసినప్పటికీ-) - ఆ తర్వాత సామ్యవాదులు, కొద్దో, గొప్పో, (చలం ప్రభావాన్ని 'గొప్ప'లో జమచేసి నప్పటికీ-) భరద్వాజగార్ని కదిలించాయి.

- ఒకనాటి తెలుగు కథకుడు 'జీవన ప్రభాత్' - భరద్వాజగారికి చలం రచనల 'రుచి' చూపడంతో అసలు కథ మొదలైంది. వీరి కారుణ్యం' కథ చదివారా?-

ఈ కథలోని కథానాయిక - ప్రతిరోజూ తన కోసం గుడికి వచ్చి ఆరాధనా భావంతో చూసే యువకుడికి తన శరీరాన్ని అర్పించాలనుకుంటుంది. ఆమె పెళ్ళి అయి కాపురం చేసుకుంటున్న స్త్రీ కావడంచేత - సంఘం దీన్ని 'కండకావరం' అనే అంటుంది. కాని - ప్రియుడి మీది 'దయ'తో ఈ పని ఆమె చేసిందంటే లోకం అంగీకరిస్తుందా?- "- అన్నిటిల్లోనూ దయ వుండవచ్చు. అన్నిటి కంటె మహోన్నతమైన జన్మకు సాఫల్యాన్ని, సార్థకతను ఇచ్చే ఈ మాధుర్య కార్యానికి దయ పనికి రాదు. మిగతావన్నీ పుణ్యం. ఇదొక్కటే పాపం-" ('కారుణ్యం' కథలో-) అనేది ఈ కథ వెనుక వ్యథ. 'ఆకలి'తో అలమటించే బిడ్డకు అన్నం పెట్టాలని ఆరాటపడే తల్లిలా - 'మరో ఆకలి'తో తనకోసం అలమటించిపోతున్న వ్యక్తికోసం - ఈమె 'దయ' చూపించిందంటే సభ్యసమాజం నవ్వు కోదూ?-

ఈ కథ చదువుతూంటే నాకు చలం నవల 'మైదానం' లోని రాజేశ్వరి జ్ఞాపకానికి వచ్చింది. "-పిచ్చి తండ్రీ! - నిన్ను గురించి మరిచిపోయి నా ఆనందంలో నేనున్నానా? - నిర్భాగ్యురాల్ని - ఏం చెయ్యను?- నీ బాధ తీర్చడానికి-" అంటూ 'మీరా' మీది ప్రేమతో - దయతో - అతడి కామాన్ని తీర్చడానికి సిద్ధపడిన రాజేశ్వరి కథ కొంతవరకు యిలాంటిదే అనిపించింది. అవునుమరి. 1950లో భరద్వాజ రచించిన 'రాగిణి' పుస్తకానికి ముందు మాట వ్రాస్తూ చలం - "ఈ పుస్తకాన్ని పొగిడితే చలం పుస్తకాన్ని పొగడడమే అవుతుంది-" అని ఊరికే అంటారా?-

తెలుగు సాహిత్యంలో 'స్త్రీ' గురించి చలం పొందినటువంటి ఆవేదన, తపన, మరొక రచయిత పొందలేదనేది ఇవాళ కొత్తగా చెప్పవలసిన విషయం కాదు. అందుచేతనే - ఆయనను ఆదర్శంగా పెట్టుకుని భరద్వాజ వ్రాసిన కథలు కొన్నింటిలో ఈ ఆవేదన మనకు కనబడుతుంది. అయితే - "ఆహుతి" కథలోని డాక్టరుచేత భరద్వాజగారు చెప్పించిన మాటలు చలం భావాల 'గీత'కు ఒక మంచి పొడిగింపు. 'వ్యక్తి'కీ, 'వ్యవస్థ'కీ జరిగే పోరాటంలో - 'వ్యక్తి' నోరును వ్యవస్థ యినుప హస్తాలతో నొక్కేసినప్పుడు 'వ్యక్తి' చేసే ఆక్రందన వినబడుతుంది ఆ మాటల్లో - "-ఒక మగవాడు, ఒక ఆడది ఒకచోట

వుండడమంటే వాళ్ళు నైతికంగా పతనమైపోయినట్టే అని ఈ గుంపు చూస్తుంది. ఆ కామ సంబంధం లేకుండా హాయిగా, సుఖంగా, నిర్మలంగా వుండగలరని వీళ్ళు అనుకోరు. అట్లా అనుకునేవాళ్ళకు ఖర్మం చాలక అలా వుండడం తటస్థిస్తే ఆ స్త్రీ పురుషుల మధ్య ఒక్క కామ సంబంధం తప్ప మరేమీ వుండదేమో అనుకుంటాను-" అంటాడు ఆ కథ ('ఆహుతి') లోని డాక్టరు. నిజమే - ఈ కథలోని జానకిని మొగవాళ్ళు తమ అవసరానికి వాడుకుని పతితను చేస్తే దాన్ని తప్పుగా భావించలేదు సంఘం. కాని - గర్భవతి అయి దిక్కులేని స్థితిలో వున్న ఆమెను ఆదరించి - బ్రతుకు తెరువు చూపించి, ఆదరిద్దామనుకున్న నేరానికి - అతడికీ, ఆమెకూ 'రంకు' కట్టి కసితీర్చుకుంది సంఘం. చివరకు ఆమెను జీవితంలో మరిన్ని మెట్లు దిగజార్చి ముష్టిదానిగా చేసేంతవరకూ సంఘానికి తృప్తిలేదు. ప్రపంచ ప్రఖ్యాత తత్వవేత్త బెర్ట్రాండ్ రసెల్ - అంతరాత్మ మెచ్చకుండా - నలుగురు మెచ్చే "మంచి" పని (ఆబ్జెక్టివ్ రైట్‌నెస్) కన్నా - నలుగురూ "చెడు" అన్నప్పటికీ మానవతా విలువలతో నిండిన "అంతరాత్మ" చెప్పే - "సబ్జెక్టివ్ రైట్‌నెస్" గురించి ఆరాటపడింది యిందుకే!-

భరద్వాజ కథల్లో ఈ "అంతరాత్మ గోల" చాలాచోట్ల అందంగా వినబడుతుంది. - "నువ్వేం చేస్తున్నావ్?-" కథలోని మాధవరావు తన ఆఫీసులో ఉద్యోగానికై వచ్చిన 'రమణి' తనకు తాను శరీరాన్ని అర్పించడానికి సిద్ధపడ్డా (బలమైన ఆర్థిక కారణాల వత్తిడివల్లే అనుకోండి-) ఆమె పొందుకోసం ఎంతగానో పరితపించి కూడా ఎందుకు అంగీకరించలేకపోయాడు?- 'స్వయంభువు' కథలోని రామదాసు 'కపాడియా' యిచ్చిన నోట్లకట్టను తీసుకుని (భార్యకు నెక్లెస్ చేయించడంకోసం-) కూడా ఎందుకు తిరిగి ఇచ్చేశాడు?- లంచం పుచ్చుకున్నానన్న భయంతో తన నీడను చూసి తానే వణికిపోతున్న భర్తతో అతగాడి అర్థాంగి - "పోనిద్దురూ వెధవ పీడ. ఇన్నాళ్లూ ఈ డబ్బుతోనే బతికామంటారా?- రేపు వెళ్ళి వాడిది వాడికి ఇచ్చెయ్యండి-" అనడంలో 'నెక్లెస్' కన్నా 'భర్త' ముఖ్యం అనే గ్రహింపు వున్నట్టుగానే - 'భార్య ముచ్చట' కన్నా తనలోని 'మరో మనిషి' ముఖ్యం అనే గ్రహింపు రామదాసులో వున్నది. ఈ కథలోని యితివృత్తం ఒక ఎత్తు - 'గిల్టీ కాంషస్' ఫలితంగా వచ్చే 'హెల్యూసినేషన్స్'ను, 'డెల్యూజన్స్ ఆఫ్ పెర్సిక్యూషన్స్'కు అక్షరం రూపం యిచ్చిన తీరు మరొక ఎత్తూను-

-యితివృత్తం ఏదయినా గాని - కథా రచయితగా భరద్వాజ మనచేత చివరి దాకా చదివింపచేస్తారు. "-పదిహేనేళ్ల అమ్మాయి తనకంటె నాలుగురెట్లు వయస్సున్న వాడికి వొళ్ళప్పగించడం వెనుక వున్న నిజం... ఓ విద్యావంతుడు రైలుకింద పడి ఆత్మహత్య

చేసుకున్న నిజం..." ('పేద నిజం కథ' కథలో-) ఏ 'నిజం' గురించి వ్రాసినా పాఠకుడు హాయిగానే చదువుకుంటాడు. 'నిజా'ల వెనుక వుండే 'యిజా'లను తవ్వడం నాపని కాదు గానీ - ఇక్కడ ఇంకొక్కమాట వ్రాయాలనిపిస్తోంది. "-నా మిత్రులలో చాలామంది కడుపు నిండా భోజనం చేస్తున్న సమయంలో నాకు పిడికెడు మెతుకులు లేకపోవడానికి కారణం ఏమిటి?-" అని జీవితపు తొలి దశల్లోనే ఆలోచించగల భరద్వాజగారు వ్రాసిన 'పరదృష్టి' అనే కథలో - రైతుకూలీస్థాయి నుంచి ఫ్యాక్టరీ యజమాని స్థాయి వరకూ ఎదిగిన శరభయ్య పెట్టుబడిదారు అవతారంలో శ్రామికులను పీడించడం ఆ 'వర్గపు' స్వభావం కావచ్చునేమో గాని - ప్రజల కోసం ప్రాకులాడే ముకుందాన్ని 'చెల్లని నాణెం'లా మిగల్చడం కొంత నిరాశను కలిగిస్తుంది. (అది జీవిత వాస్తవమే అయినప్పటికీ!-). -"తిండికి నకనకలాడిపోయే స్వేచ్ఛ, నిరుద్యోగులుగా వుండే స్వేచ్ఛ, పడుపు వృత్తి చేసుకుని పొట్టపోసుకునే స్వేచ్ఛ"- అక్కర లేదనే గ్రహింపు ('ఒక చిలుక కథ' కథలో-) వచ్చిన కొద్ది కాలానికి మనిషి తాను కోరుకున్న స్వర్గాన్ని పొందగలడనుకుంటాను

భరద్వాజ కథల్లో 'మొనలేని శిఖరం' కథ నాకు బాగా నచ్చింది. పెచ్చుపెరిగిపోయిన పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ ఇచ్చే విషఫలాలు ఎలా వుంటాయో ఈ కథ జ్ఞాపకం చెయ్యడమే ఇందుకు కారణం అనుకుంటాను. నిజానికి - ఇది అస్తిత్వవాద దృక్పథంతో వ్రాయబడిన కథ. అయితే - ఈ కథ తనకు నిర్దేశించబడిన పరిధికి మించిన ఫలితాన్ని సాధించింది.

ఈ కథలోని జనార్ధనానికి చెప్పుకోదగ్గ సమస్యలు ఏవీ లేవు. లక్షలకొద్దీ ఆస్తి వుంది - అనుకూలవతి అయిన భార్య - ప్రయోజకులయిన పిల్లలు - ఇన్ని వున్నా అతగాడి మనసులో ఏదో దిగులు. ఏదో అన్వేషణ. "-కోరడానికి గాని, కలలుగనడానికి గాని నాకు అవకాశం లేదు. ఒడుదుడుకులు లేని ఈ ఎడారి జీవితం నాకు విసుగెత్తింది-" అనుకున్న జనార్ధనం "-నన్ను నేను వెదుక్కొంటున్నాను. నేనెక్కడో తప్పిపోయాను. ఎక్కడ తప్పిపోయానో తెలియడం లేదు. తప్పిపోయానని మాత్రం రూఢిగా తెలుసు-" అని అంటాడు మిత్రుడయిన కథకుడితో - ఇది ఒక 'అస్తిత్వవాది' వేదన అని ప్రత్యేకించి వ్రాయనవసరం లేదు.

ఆస్తిపాస్తులతో కళకళ లాడిపోతున్న జనార్ధనాన్ని చూస్తే మిగతావాళ్ళకు అసూయ. అతగాడు కనబడగానే "ఆప్యాయతను అద్దెకు తెచ్చుకుని ఆదరాన్ని అరువు పుచ్చుకుని, మందహాసం ముఖాన తగిలించుకుని-" - మనకు కథను చెప్పే వ్యక్తి మాత్రమే తెగ బాధపడిపోయాడని అనుకోనవసరం లేదు. సగటు మానవులందరి ప్రవర్తనా యింతే! -

జనార్ధనాన్ని చూసి ఇంతమంది ఇన్ని విధాల 'బాధ' పడిపోతూంటే – అతగాడు మాత్రం వీళ్ళందరిని చూసి అసూయపడేవాడు. "జీవితం గానుగెద్దులా నడిచిపోతోంది. మార్పు లేదు. సంఘర్షణ లేదు. ఉత్సాహం లేదు – అదే ఆఫీసు, అదే తిండి, అదే నిద్ర.... కడచిన సంవత్సరాల్లాగే రానున్న జీవితం గడపడం ఎందుకు?–" – ఇదీ అతని సమస్య. ఇవాళ అత్యధిక జాతీయాదాయంతో వున్న కొన్ని పెట్టుబడిదారీ దేశాల్లో కోట్లకు పడగెత్తిన శ్రీమంతులను వేధిస్తున్న సమస్యలు జనార్దనం సమస్యకు భిన్నమైనవి కావు. మనిషి యంత్రంలోని మరలాగా జీవిస్తున్నప్పుడు జీవితంలో సంతృప్తి, ఆనందం వుండవు. ఆ యంత్రం డబ్బును తయారుచేసే కర్మాగారానికి చెందినప్పుడు – ఇక – ప్రత్యేకించి చెప్పనవసరం లేదు.

'మర'లాగా బ్రతకడానికి ఇష్టపడని జనార్దనం తన జీవితాన్ని బలవంతంగా ఆత్మహత్యతో ముగించుకున్నాడు. చావుతో జనార్దనం తనని తాను అన్వేషించుకున్నాడని చెప్పలేము. కాని – అతని మరణం మనిషి నిజజీవితంలో ఎదుర్కొనే ఎన్నో సందేహాలకు, భ్రమలకు మూలకారణాన్ని స్పష్టం చేస్తోంది. "– జనార్దనం శిఖరం లాంటి వాడు. కాని – ఆ శిఖరానికి మొనలేదు–" అంటాడు రచయిత. శిఖరం వరకూ ఎదగగలిగిన మనిషికి "మొన"ను సమకూర్చుకొనడం కష్టం కాదు. కాని – ఆ గ్రహింపు రావడమే కష్టం. ఆ రోజున జనార్ధనంలుండరు. రచయితగా భరద్వాజగారు ఆశించేది అదే అనుకుంటాను–

---

# రాచకొండ విశ్వనాథశాస్త్రి - 'మాయ'



సారా కథల్లో ముత్యాలమ్మ అన్నట్టు-

"ఈ నోకంలో దబ్బు, యాపారం తప్ప మరేట్నేదు. పశువులు-నోర్లేని సొమ్ములు ఆటికి నీతుంది. సదువు లేన్దాన్ని నాకూ లేదు. సదువుకున్నోడివి నీకూ లేదు. దబ్బుకోసం నోకం నోకం అంతా అమ్ముడయిపోతోంది. నువ్వు, నాను, ఈ బాబు, అందరం అమ్ముడయిపోతున్నాం. అమ్మకం! అమ్మకం. అమ్మకం తప్ప మరేట్నేది ప్రపంచంలో...."

ఈ 'అమ్మకపు' ప్రపంచంలో ఒకడినొకడు సాధ్యమైనంత వరకూ దోచుకుందామనే ప్రయత్నిస్తూ ఉంటాడు. తనకన్నా చిన్నవాడు అనువుగా దొరికితే మింగుదామని తహతహ. తనకన్నా పెద్దవాడు తనని మింగితే-మొర్రో మొర్రో అంటూ 'న్యాయం' 'ధర్మం' ప్రేలాపనలు. బూర్జువా సమాజంలోని వ్యక్తి ఆర్థికంగా ఏ తరగతికి చెందినవాడయినా ఈ వ్యాపార సూత్రానికి [illegible] ప్రవర్తిస్తూ ఉంటాడు.

యిట్లాంటి సమాజంలోని చేదు వాస్తవాలను తలుచుకున్నప్పుడు (అవి 'సారా'కు సంబంధించినవి గానీ, మరొక 'సారో'కు సంబంధించినవి కానీ) హృదయం వున్న వాడికి అసహ్యం కలుగుతుంది. ఆగ్రహం కలుగుతుంది. జాలిపుదుతుంది. నవ్వు కూడా వస్తుంది. యిట్లాంటి విచిత్ర భావసమ్మేళనాన్ని కథల్లో యిమడ్చగల సత్తా రచయితకు వుండాలిగాని గొప్ప కథకు అంతకుమించిన ఉదాహరణ మరొకటి వుండదు. అందుచేతనే రాచకొండ విశ్వనాథశాస్త్రిగారికథలు 'అయ్యో' 'అయ్యో' కథలుగానో 'ఛీఛీ' కథలుగానో వుండకుండా పదికాలాలపాటు నిలిచే గొప్ప కథలు కాగలిగాయి. (రావిశాస్త్రీయం ప్రకారం జీవితంలోని అన్యాయాల్ని, దారిద్ర్యాన్ని, జాలిపడేవి 'అయ్యో' 'అయ్యో' కథలు. సంఘంలోని దురాచారాలనో దుష్టశక్తుల్నో దుయ్యబట్టిన కథలు ఛీఛీ కథలు- ('మెరుపు మెరిసింది' 'జరీ అంచు తెల్లచీర' మొదలయిన తన ప్రసిద్ధ కథల్ని శాస్త్రిగారు 'అయ్యో అయ్యో' కథల జాబితాల్లోకి నేర్చుకున్నారు)

రావిశాస్త్రిగారి కథలను చదివినవారికి ఆయన కథల్లోని ప్రత్యేక శైలి సుపరిచితమే! వ్యంగ్యంతో హృదయాన్ని పులకింపచేసే కవితాత్మకమైన పలకరింపులు, సరే-మధ్య మధ్యలో

అధిక ప్రసంగాలు- వీటన్నింటితో రావిశాస్త్రిగారి కథలను సలువుగానే గుర్తుపట్టెయ్యవచ్చు. లౌక్యంతో పండిన కథలు ఆయనవి. అయితే లోకంలో జరిగే సంఘటనల బాహ్య స్వరూపాన్ని మాత్రమే వర్ణించకుండా ఆ సంఘటనలు హృదయంలో కలిగించే స్పందనకు అక్షర రూపం యివ్వడంలోనే శాస్త్రిగారి ప్రత్యేకత కనబడుతుంది. యిట్లాంటి ప్రత్యేకత చలంగారి కథల్లో కూడా కనబడుతుంది. దృక్పథంలోను, శైలిలోను, చలంగారికి, రావిశాస్త్రిగారికి చాలా తేడా వుండవచ్చు. అది వేరే విషయం.

శాస్త్రిగారి కథలు చాలా సందర్భాలలో నవ్వు తెప్పిస్తాయి. కాని అవి హాస్య కథలుకావు. కళ్ళమ్మట నీళ్ళు తెప్పిస్తాయి. కాని కరుణ రసప్రధానమైన కథలుకావు. (సారా కథల గురించి చెబుతూ వాటిలోని 'రసన' గురించి శ్రీశ్రీ చెప్పదాన్ని ఎవరు మర్చిపోగలరు?) మాటవరసకు 'మామిడిచెట్టు' 'పువ్వులు' కథలనే తీసుకుందాం. మామిడిచెట్టు కథలో- తనింటిలోని మామిడి చెట్టునీడ ప్రక్కయింటివాళ్ళకి, వీధిలో 'గింజలు అమ్ముకునే ముండ' - ముసలమ్మకి, దక్కకూడదనే ఉద్దేశంతో పచ్చని చెట్టును నరుక్కున్న 'నీలమణి' గారిని తలుచుకున్నప్పుడు నవ్వు, జాలి కూడా వస్తాయి. "నా కొమ్మలు నాకు లేవు. నా ఆశలు నాకు లేవు. నా నీడ నాకు లేదు. నాకు దక్కన్ది నేన్నీకు ఉండనివ్వను" అనే నీలమణి- స్వార్థం కథను శాస్త్రిగారు తన సహజ ఫక్కీలో చెబుతున్నప్పుడు గిలిగింతలు కలగవచ్చు. నిజమే! కాని, అందులో వున్నది హాస్యరసం మాత్రం కాదు. కథ చివర్లో - "మరి లాభం లేదు. ఈ మనిషి వెధవలు మరింక బాగుపడరు" అనే నిరాశకలిగినా - ఏదో ఆశ కూడా మిగులుతుంది. ఆవేదనా కలుగుతుంది.

ఇక "-పువ్వులు" కథలో "మేడ యింటి మీద మేడ అంచు ఎగువకి వచ్చిన చందమామ- "చక్కనివి చిన్న చిన్నవి పువ్వులు యెన్నెన్నో పీకి పారేస్తూనే వున్నారు." కాని కమలబాల కళ్ళు తుడుచుకుంది. తుడుచుకుంటూనే ఉంది. నిజమే మరి- మేడ యింటి ఔట్‌హవుస్‌లో అద్దెకు వుంటున్న సామాన్య గృహస్తుల అమ్మాయి రెండిళ్ళ మధ్యా వున్న తోటలో బంతిమొక్కల్ని ఎంతో ఆశతో, ప్రేమతో , పెంచితే కారులో సరదాగా వచ్చిన యింటి వాళ్ళమ్మాయి ఆ పువ్వులన్నీ కోసేస్తే కాదనే హక్కు ఈ కమలబాలకు వుంటుందా? ఈ వ్యవస్థలో ఆస్తి యిచ్చే అధికారం ముందు శ్రమ విలువ అల్పంగా కనబడదూ? వర్గ సంఘర్షణకు కారణమయ్యే పరిస్థితులు గురించి యింత అందంగా కళాత్మకంగా చెప్పిన కథ మరొకటి లేదు. ఈ కథలో కమలబాల తుడుచుకున్న కన్నీరు పాఠకుల హృదయాలలో ఒలికించేది కరుణరసం మాత్రం కాదు.

"నా కోపం తాపం, నా దుఃఖం, నా క్యూరియాసిటీ, వగయిరాలు యితరులకు తెలియచెయ్యడానికి కూడా నేను కథలు రాసేననుకుంటున్నాను. నామీద నాకుండే అసహ్యం

కొన్నీ కూడా నేను రచన చేసేను-" అని చెప్పుకున్న శాస్త్రిగారు రాసిన కథలు దాదాపుగా అన్నీ మంచి కథలు. కొన్ని చాలా గొప్ప కథలు. 'విలువలు' 'న్యాయం' కథలనే తీసుకుందాం. ఈ రెండు కథల్లోనూ డబ్బుకు స్త్రీ శరీరాన్ని కొనుక్కున్న మగవాడి కథ వున్నది. కాని 'ఫోకస్' చేసిన విషయాలు మాత్రం వేరు.

"విలువలు" కథలో రూపాయిన్నరకు బజారు స్త్రీని అనుభవించిన పురుషుడు తనని చూసి తాను సిగ్గుపడే ఉదంతం వున్నది. వెళ్ళే ముందు ఆమె ఆఖరిసారిగా ముద్దు పెట్టుకుంటే తనని మంటల్లోకి విసిరి భస్మం చెయ్యడానికి బదులు స్త్రీ సహజమైన లక్షణంతో ఆదరించిందని' అధోస్థానంలో ఉంటూ ఇంకా క్రిందికి జారిపోతున్న తనపై వెన్నెల వర్షం కురిపించిందని పరితపిస్తాడు.

మరి, "-న్యాయం" కథలో అమెరికన్ షిప్ నావికులు ఒక సాని పాపను అనుభవించి, పూటుగా త్రాగించి, వంటిమీద బట్టలు లేని స్థితిలో రోడ్డుమీద వదిలేసిన ఉదంతం వున్నది. రోడ్డుమీద త్రాగి తందనాలాడినందుకు ఆ పిల్లపైన నిజమైన కేసు, సారా అమ్మిందని దొంగ కేసు బనాయించి 'న్యాయం' కోసం పోలీసులు మేజిస్ట్రేట్ కోర్టు దగ్గరకు తీసుకువస్తారు. ఆ సాని పాప కోర్టులో "నిన్నరాత్రి ఎంతమంది ఉన్నారు? ఎలా వున్నారు? మరి తాక్క చచ్చిపోమ్మాంటావా? ఒక్క రాత్రికి ఇంతమంది కరిచేసి, రక్కేసి, రక్తం గీరేసి, ప్రాణాలు తీసేస్తే, ఇందరు ప్లీడరు బాబులు, ఇందరు ధర్మ ప్రభువులు, ఇంతమందీ వున్నారు - ఎవరు వచ్చి ఆదుకున్నారు?" అనడం ఈ కథ చదివినవాళ్ళు మరిచిపోరు.

ఈ రందు కథలూ హృదయాన్ని ద్రవింపచేసేవే! అయితే 'న్యాయం' కథలోని 'న్యాయం' కాల్పనికతలోంచి పుట్టుకొచ్చింది కాదు. యదార్ధ విషాద వాస్తవాల్లోంచి ఉద్భవించింది. మంచి కథకూ, గొప్పకథకూ ఇదే తేడా అనుకుంటాను. అది సరేకాని 'న్యాయం' మాట ఏమిటి? అని అంటే అవి వేరే విషయం. హెడ్ కానిస్టేబుల్‌గారు కోర్టు వరండాలో గొణిగినట్టూ, 'కేసుల్లో న్యాయం వుంటే ఈ పోలీసులం మేమెందుకు? ఇంతమంది ప్లీడర్లు అంతా ఎందుకు? ఈ కోర్టులన్నీ ఎందుకు?" ('న్యాయం' కథలో)

శాస్త్రి గారి గొప్ప కథల్లో "ఆరు సారా కథలు" ఆణిముత్యాలవంటివి అయినట్టుగానే ఆ కథల్లో 'మాయ' కథ అంటే నాకు చాలా ఇష్టం. సారా కథల పేరు చెప్పేసరికి రాకెట్ అప్పారావు, నీలయ్యగాడు, రామదాసు, పోలమ్మ మొదలయిన సారా ప్రపంచపు మనుషులు జ్ఞాపకానికి వచ్చేటట్టుగానే, "ఇంత చదువు చదువుకొని, ఇంత ఉద్యోగం చేస్తూ నేనే ఇంత దొంగవెధవని కదా! మరింక ముద్దాయిలు వెధవలు కాకపోతారా" అనే 'నమ్మకం'తో కోర్టుకొచ్చిన ప్రతీముద్దాయికీ ఆరు నెలలు శిక్షను గుచ్చేసే మేజిస్ట్రేటులు కూడా జ్ఞాపకానికి వస్తారు. ఇక ప్లీడర్ల సంగతి సరేసరి.

ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే– "న్యాయం, ధర్మం, సత్యం అనే మాటలు పేలించుగాని అంతా మాయే' అని తెలుసుకో. పాపాలన్నీ జడ్జీలని, ఖర్చులన్నీ పార్టీలవి, అబద్దాలన్నీ సాక్షులవి, గుమస్తాలవి. ఫీజులన్నీ మనవి" అని పెద్ద ప్లీడరుగారు చేసిన హితబోధ వింటాడు. క్రొత్తగా న్యాయవాద వృత్తిలో ప్రవేశించిన ఓ కుర్ర ప్లీడరుగారు ('మాయ' కథలో). ఈ కథలోని ముత్యాలమ్మ ఒక సారా వ్యాపారస్తురాలు. ఈ వ్యాపారంలో ఆర్థికంగా ఆమె బాగుపడలేకపోయింది. మామూళ్ళు గుంజుకుంటున్న పోలీసులు మాత్రం బాగుపడ్డారు. "నా మొగుడు సారాపాలైపోనాడు. నా యాపారం పోలీసోళ్ళ పాలైపోనాది. నా కూతురు కుక్కల పాలైపోనాది. సీ! ఏటీ బతుకు?" అని రోదించే నూకాలమ్మ కన్నీటికి ఈ 'రూపాయిల' ప్రపంచంలో విలువలేదు. ఎంత దూరం నించి పోలీసులు వస్తున్నా ముత్యాలమ్మ ఆరేళ్ళ చిన్నకూతురు గుర్తుపట్టి "అమ్మా కుక్కలొస్తున్నాయే!" అని సిగ్నల్ ఇస్తే ముత్యాలమ్మ గబగబా సారా ట్యూబులు దాచేసేది. ఇలాంటిది నిజంగానే ఒక రోజున ముత్యాలమ్మ కూతుర్ని కరవడానికి వెర్రికుక్క వచ్చినప్పుడు ఆ పిల్ల ఏడుపు విని పోలీసులొస్తున్నారనే 'సిగ్నల్' అనుకుంది గాని ప్రమాదాన్ని గ్రహించలేక పోయింది. 'సారా టూబులూ, గాజు గలాసులూ' దాచుకుందిగాని, కూతుర్ని రక్షించుకోలేకపోయింది. తన మీద ముత్యాలమ్మ విరుచుకుపడిందని పోలీస్ కానిస్టేబుల్ దొంగ కేసు బనాయించాడు. ముత్యాలమ్మ దగ్గిర సారా దొరకకుండానే దొరికిందని కేసు పెట్టి జెయిల్లో తోయించాడు. ముత్యాలమ్మ కేసును కొత్త ప్లీడరు మూర్తి తీసుకున్నప్పుడు మధ్యవర్తిగా వచ్చిన మనిషి డబ్బు బాగా గుంజమని సలహా యిచ్చాడు. కానీ, ముత్యాలమ్మ కథ విన్న ప్లీడరుగారు జాలిపడి కొంచెంగా మాత్రమే 'గుంజాడు'. కానిస్టేబుల్ సాక్ష్యాన్ని క్రాస్ ఎగ్జామినేషన్‌లో తేలగొట్టేసి ముత్యాలమ్మను విడుదల చేయించాడు.

తను సాధించిన ఘనకార్యానికి కుర్రప్లీడరుగారు మురిసిపోతూంటే, అసలు విషయం తెలిసింది. కోర్టులో కేసు నడుస్తుండగా కానిస్టేబుల్, ముత్యాలమ్మ ఒప్పందం చేసుకున్నారు. కానిస్టేబుల్ తనకు రావలసిన మామూలును వసూలు చేసేసుకుని సాక్ష్యం చెప్పేటప్పుడు కావాలనే కేసు ఎగరగొట్టేశాడు. అప్పుడు తెలిసింది కుర్ర ప్లీడరుగారికి 'మాయ' అంటే ఏమిటో. "సారా దొరకలేదు. దొరికిందని కేసు పెట్టారు. జరగని విషయం జరిగిందన్నారు. జరిగినదని చెప్పబడిన జరగని విషయం జరగలేదన్నారు. వుంది, లేదు. అంతా మాయ" అని జుట్టు పీక్కున్నాడతడు.

పెద్ద ప్లీడరుగారికి 'మాయ' గురించి తెలిసినట్టుగా ఆ 'మాయ' వలన కలిగే బాధ తెలియదు. మన కుర్రప్లీడరుగారికి, మాయలో ఎంతటి బాధ వున్నదో తెలిసినట్టుగా ఆ బాధను నివారించడం ఎలాగో తెలియదనుకోవాలా? నాకు మాత్రం ఈ కథ చివర్లో వున్న "గుడ్ గాడ్! ఎందుకు తెలీదు? తెలిసే పట్టించుకోరంతే!" అనే వాక్యంలో ఈ 'మాయా జగత్తుకు తాళంచెవి వున్నదనిపిస్తుంది. ఆ తాళం చెవి తలుపు వెయ్యడానికా, తియ్యడానికా అనేది వేరే సంగతి.

---

# 27



## మధురాంతకం రాజారాం
## "పిచ్చి వెంకట్రావు"

"ఇన్నాళ్లకు తెలుగునాట మధ్య తరగతి జీవితాన్ని బహుముఖంగా కథలలో రూపొందించగల ప్రతిభావంతుడు అవతరించాడు. ఆయనపేరు రాజారాం. ఈ కథలను చదువుతూంటే మనలను మనం బాగా అర్థం చేసుకోగలుగుతాం. మనలో వున్న పిచ్చి ప్రవృత్తులను చూచి నవ్వగలుగుతాం. మన అవివేకాన్ని తలుచుకుని జాలి పడగలుగుతాం-"

ఈతరం కథకుల్లో ప్రముఖుడుగా చెప్పదగిన మధురాంతకం రాజారాంగారి గురించి పాలగుమ్మి పద్మరాజుగారి ప్రసంశ యిది. చాలాకాలం క్రితం కథలు వ్రాయడంలోని మెళకువల గురించి చెబుతూ-"జీవితం బంగారంలాంటిదయితే అందులో కావలసినంత మాత్రమే తీసుకుని రమణీయంగా తయారుచేసుకునే ఆభరణం కథ-" అని వివరించిన రాజారాంగారు తన 'ఆభరణాల'కు కావలసిన ముడి సరుకునంతా మధ్యతరగతిలోనుంచే తీసుకున్నారు.

అయితే, ఒక విషయం. రాజారాంగారు మధ్యతరగతి మానవుడి గురించి వ్రాసినా, మరో తరగతి మానవుల గురించి వ్రాసినా ఆయన తన కథలోని పాత్ర ఏ ఆర్థిక వర్గానికి చెందింది? ఆ వర్గానికీ, యితర వర్గాలకూ గల సంఘర్షణ ఎటువంటిది?- అనే విషయాన్ని గురించి అంతగా ఆలోచించడు. ఆయన దృష్టి అంతా కేవలం 'మనిషి' మీదనే. ఆ మనిషికిగల పిడికెడు హృదయం గురించి, అందులో గల ఆర్ద్రతల గురించి, విచిత్ర ప్రవృత్తుల గురించి ఆయన ఆలోచిస్తాడు.

బ్రతకడానికి మరో మార్గంలేక- బడిపంతులు వృత్తి స్వీకరించి ఓ కుగ్రామానికి వచ్చిన ఆసామీ కూలిపోయిన పశువుల పాకలో పాఠం చెప్పడం సాధ్యం కాక, మనిషికి మనిషి చూసే కనీస మర్యాదలు కూడా లేని ఆ గ్రామంలో ఇమడలేక, పడిన అవస్థను రాజారాంగారి కథలో చదివినప్పుడు ('వెలుగు సముద్రంలో చీకటిదీవి' కథలో) పాఠకులుగా

మన దృష్టి ఇన్ని దశాబ్దాల స్వాతంత్ర్యం సాధించలేని విషయాలపై ఓ క్షణం పడేటప్పటికీ అంతలోనే మన దృష్టి మరో చోటకు పరిగెడుతుంది. నరసయ్యగారి కోడలిమీది సానుభూతితో గుండె రెపరెపలాడుతుంది. ఇక 'కోరిన కోనలో కురవని వాన' కథ చదివినప్పుడు మన దేశంలోని ఆకలి సమస్య ఎంత భయంకరమైనదో జటిలమైనదో ఓ క్షణం జ్ఞాపకానికి వచ్చి గుండె బరువెక్కుతుంది. దేవదారు ఆకు, ఈత గడ్డలు కాలే కడుపును కన్న తల్లిలా ఎలా ఆదుకుంటాయో తెలుసుకోవడం ఓ అనుభవం. ఇలా ఆకలితో అలమటించిన మనిషి చివరకు మిలటరీ హోటల్ ప్రొప్రయిటర్ స్థాయికి ఎదగగలిగినా ఆరోగ్య కారణాల దృష్ట్యా కోరిన తిండి తీరని కోరికగా మిగిలిపోవడం కథకు ముగింపు. ఒకప్పటి ఆకలి సమస్యకన్నా, అతడి ఈ వ్యక్తిగత దురదృష్టమే మనల్ని ఎక్కువగా బాధిస్తుంది. బంగారంతో తనకు నచ్చిన ఆభరణం చెయ్యడం అంటే యిదే-

తాను చెప్పదలుచుకున్న విషయాన్ని శక్తివంతంగా హృదయానికి హత్తుకునేలా చెప్పడం రాజారాం గారికి తెలుసు. మాటవరసకి 'హాలికులు కుశలమా' కథనే తీసుకోండి. తెలుగు పండితుడుగా, కవిగా, నలుగురి మన్ననలు పొందుదామని ఆశపడి అది తనకు అలభ్యం అని నమ్మకం కుదిరిన తర్వాత చేస్తున్న ఉపాధ్యాయ వృత్తిని వదలి వ్యవసాయంలో స్థిరపడిన సాహితీ ప్రియుడి కథ యిది. బొప్పాయిచెట్లు పారిజాతాపహరణంగాను, నిమ్మచెట్లు మను చరిత్రగాను, చూచుకొని బ్రతికిన ఆ కృషీవలుడు జీవన సంధ్యలో తాను ఎంతో పదిలంగా దాచుకున్న పుస్తకాలను తన పూర్వ విద్యార్థి 'రాజు'కు యిస్తూ "నాకు వయసు ఉడిగిపోయింది. నన్ను నమ్ముకున్న వాళ్ళందరికీ ఆశ్రయాన్ని చూపవలసిన సమయం ఆసన్నమైంది. నాకా బిడ్డలు లేరు. మా ఆవిడకు పొలాన్ని అప్పగించి వెడుతున్నాను. పుస్తకాలను నీకు అప్పగిస్తున్నాను. ప్రాణప్రదంగా చూచుకుంటావా రాజూ?" అనడం చదివితే సాహితీ ప్రియుడన్న ప్రతీవాడి హృదయం జలదరించదూ? మామూలు కంటికి ఎంతో విలువయినవిగా కనబడే ఆస్తిపాస్తులు కన్నా సాహితీ ప్రియుడికి పుస్తకాలు ఎంతో విలువయినవి కావూ?

రాజారాంగారి కథల్లో నాకు "పిచ్చి వెంకట్రావు", "తాను వెలిగించిన దీపాలు" కథలు బాగా నచ్చుతాయి. ఈ రెండు కథల్లోనూ ఉపాధ్యాయుడే కథానాయకుడు అయినప్పటికీ ఈ కథలు చదివిన తర్వాత పాఠకుడికి కలిగే అనుభూతుల్లో, పొందే సంతృప్తుల్లో, తేడా వుంది. 'తాను వెలిగించిన దీపాలు' కథ విషయం తీసుకుంటే అతగాడొక బీద బడిపంతులు. రిటైరైపోయిన తర్వాత ఆర్థిక ఇబ్బందుల్ని తట్టుకోలేని స్థితిలో ఏదయినా సహాయం దొరకుతుందేమోనని ఇది వరలో పనిచేసిన స్కూలుకు చాలా కాలం తర్వాత వచ్చాడు. అప్పటికి ఆ స్కూలు బాగా మారిపోయింది. అతడికి సుపరిచితంగా చెక్కు చెదరకుండా వున్నది బెంచీలు, క్లాస్ రూములు మాత్రమే. ఎరిగిన ముఖం ఒక్కటీ కనబడకపోవడంతో పాతికేళ్ళు పనిచేసిన స్కూలుకు ఆతడు అపరిచితుడుగా మిగిలిపోయాడు.

కొత్తగా వచ్చిన హెడ్‌మాస్టరు మాస్టరుగారికి భోజనం చెయ్యడానికి కేరియరు తెప్పించగలిగాడు కానీ – అంతకు మించిన సహాయం ఏదీ చెయ్యలేకపోయాడు.

– యిలాంటి పరిస్థితిలో రిక్త హస్తాలతో ప్రయాణం చెయ్యవలసివచ్చి, టికెట్ లేకుండా రైలు ఎక్కితే "పెద్దవాడివి బుద్ధిలేదు?" అని టికట్ కలెక్టర్‌చేత తిట్లు, ప్రయాణం మధ్యలో ఊరుగాని ఊరులో ప్లాట్‌ఫారమ్ మీదకు నెట్టి వేయబడిన ఈ బీద బడిపంతుల్ని ఎవరో అపరిచిత వ్యక్తి గౌరవంతో పలకరించి తన పూర్వ విద్యార్థినని గుర్తుచేస్తే – యింటికి తీసుకెళ్లి ప్రేమతో భోజనం పెట్టి టికెట్ కొని రైలు ఎక్కిస్తే – ఎంత ఆనందం? ఎంత గర్వం?

యింటికి రాగానే ఈ గర్వంతోనే మనుమరాలికి సలహా యిచ్చాడు. "అమ్మాయీ నీకు నేను పెళ్ళి చెయ్యలేను. టీచర్ ట్రయినింగ్‌కు పంపిస్తాను" అని! ఉపాధ్యాయుడు తన జీవితంలో ఆశించే పెన్నిధి ఏమిటో శక్తివంతంగా తెలియజెప్పే కథ ఇది. అనేక సందర్భాలలో ఉపాధ్యాయులు ఇతర వృత్తులలో వున్న వారివలె వేతనపు స్కేళ్ళు, ప్రమోషన్లు, వీటి గురించి పోరాడతారు. నిజమే! కాని భౌతికమైన ఈ విషయాలన్నింటికీ అతీతంగా ఉపాధ్యాయుడు ఆ వృత్తిలో పొందే ఆనందాన్ని, సంతృప్తిని మనకి మరోమారు ఈ కథ జ్ఞాపకం చేస్తుంది.

యిక– 'పిచ్చి వెంకట్రావు' గారి సంగతి ఏమిటంటే– ఆయన ఒక పల్లెటూరి హైస్కూలు ప్రధానోపాధ్యాయుడు. చింపిరి జుట్టు, నలిగిపోయిన దుస్తులు, మిట్టమధ్యాహ్నం ఎండలో తారురోడ్డు మీద కూడా చెప్పుల్లేకుండా నడవడం, యిత్యాదులు వెంకట్రావుగారి గురించి తెలిసిన వాళ్లకీ తెలియని వాళ్లకీ తెలిసిన విశేషాలు. వెయ్యిమంది విద్యార్థులు దాకా వున్న పెద్ద హైస్కూలు హెడ్ మాస్టర్ గిరీ నిర్వహించి–సాక్షాత్తూ జిల్లా పరిషత్ ఛైర్మన్ అంతటివాడు వచ్చినప్పుడు నానా గాభరా పడిపోయి, ఆయన కారు దగ్గిరకు వెళ్ళి చేతులు కట్టుకు నిలబడలేదన్న నేరానికి ఒక చిన్న గ్రామంలోని చిన్న హైస్కూలుకు హెడ్ మాస్టర్‌గా బదిలీ చేసేశారు. (యింతకన్నా పెద్ద శిక్ష వేసే అవకాశం లేనందువల్ల)

వెంకట్రావుకి యింత కష్టం వచ్చిందని ఎవరన్నా సానుభూతి చూపిద్దామని తాపత్రయపడినా ఆయన కొత్తగా వచ్చిన వూళ్ళోని కొండల్ని, ప్రకృతిని చూచి పులకించిపోతాడే తప్ప "అసలు విషయం" పట్టించుకోడు. అంతటితో అయిందా– వెంకట్రావుగారి "లీలలు" చాలా వున్నాయి. స్కూలు తప్ప మరో లోకం లేదనుకుంటూ ప్రొద్దస్తమానూ పిల్లకు పాఠాలు చెప్పే వెంకట్రావును, ఏ మాస్టరు ఎప్పుడు సెలవుపెట్టినా తగుదునమ్మా అని అన్ని క్లాసులకు తానే వెళ్ళి పాఠాలు చెప్పే వెంకట్రావును, సమయానికి ప్యూను అక్కడ లేకపోతే తన హోదా, పరువు అన్నీ మంటలో కలిపేసి బెల్లు కొట్టడానికి వెనుకాడని వెంకట్రావును, నలుగురూ "పిచ్చి వెంకట్రావు" అని గేలి చేశారంటే ఆశ్చర్యం

ఏముంది? వెంకట్రావు గారి లీలలు చెప్పుకుంటే చాలు 'స్టాఫ్ రూమ్'లో పకపకలు వికవికలు.

వెంకట్రావుగారికి తన వృత్తి దైవం. మనిషి ముఖ్యం. సర్కారువారు జారీచేసిన రూల్సును ఆయన అంతగా పట్టించుకోడు. "బోడి రూల్సు సంగతి నాతో చెరప్పొద్దు. మొదట మనిషి. తర్వాత రూల్సు" అంటాడాయన. అంతేకాదు. తెలివైన కుర్రవాడు అనే నమ్మకంతో సర్కారువారి రూల్సుకు వ్యతిరేకంగా ఒక కుర్రవాడిని పరీక్ష పాస్ చేయించి డిపార్ట్‌మెంట్‌లో నానా కలకలం సృష్టించాడు కూడా. యిలాంటి వెంకట్రావుగారు జబ్బుతో ప్రమాద స్థితిలో వున్న ఉపాధ్యాయుణ్ణి వైద్యం కోసం అర్జెంటుగా పట్నం తీసుకెళ్లాల్సి వచ్చినప్పుడు నడుస్తున్న రైలును ఆపడం కోసం అడ్డం పరిగెడితే అది చూచినవాళ్లు మొదట్లో పిచ్చికి అది పరికాష్ఠ అనుకున్నారు. రైలు ఆగిన తర్వాత అది వెంకట్రావుగారి ఆత్మ బలానికి నిదర్శమనుకున్నారు. రైలు యింజన్ డ్రయివర్ వెంకట్రావుగారి పూర్వ విద్యార్థి కావడంచేత 'పిక్కర్' జారిపోయిందనే నెపంతో గురువుగారికోసం రైలు ఆపడం నిజం అయితే కావచ్చుగాక- అది వేరే విషయం. ఒక మనిషి నిండు ప్రాణాన్ని కాపాడడం కోసం ఏమైనా చెయ్యాలనే ఆయన ధృడ సంకల్పంతో పోల్చి చూస్తే మిగతావన్నీ అత్యల్ప విషయాలు.

చలిలో వణికిపోతున్న బిచ్చగత్తెకు అమ్మవారి చీర కట్టబెట్టిన వేమన్న, అణ్వాయుధాల యుద్ధాన్ని నివారించడంకోసం తొంభైఏళ్ళ వయస్సులో అరెస్ట్ కాబడిన నోబెల్ బహుమతి గ్రహీత బెర్‌ట్రాండ్ రసెల్ పిచ్చివాళ్లయితే వెంకట్రావుగారిది కూడా నిస్సందేహంగా పిచ్చే! అయితే - అలాంటి పిచ్చిని మించిన అదృష్టం ప్రపంచానికి మరొకటి లేదు.

ప్రభుత్వం వారి రూల్సును అక్షరాలా పాటిస్తూ కాంపోజిషన్ పుస్తకాలలో ఎర్రటి గీతలు పెట్టడం మాత్రమే ఉపాధ్యాయుడి బాధ్యత అయినప్పుడు వెంకట్రావుగారు మంచి ఉపాధ్యాయుడు కూడా కాకపోవచ్చు. "ఉపాధ్యాయుడు ఒక తత్వవేత్త. కళాకారుడు. ఏ విధమగు అధికార వత్తిడి లేకుండా తనలోని సృజనాత్మక శక్తిననుసరించి తన బాధ్యతను సమర్ధవంతంగా నిర్వహించవలసి వుంది" అనే బెర్‌ట్రాండ్ రసెల్ అభిప్రాయంతో పోల్చి చూచినప్పుడు వెంకట్రావుగారు మానవత మూర్తీభవించిన ఒక గొప్ప తత్వవేత్తగా కనబడతాడు. అంతేకాదు, ఒక్కొక్కప్పుడు గాంధీకి నిజమైన వారసుడిలా కూడా అనిపిస్తాడు.

రవీంద్రుడు అన్నట్టు "విద్య అనేది సమగ్రతకు, సమైక్యతకు అన్వేషణ" అయినట్టయితే ఆ విద్యలో వెంకట్రావుగారు గొప్ప పండితులు. ఆయన చేసిన "పిచ్చి" పనులన్నీ ఆ "అన్వేషణ"లో భాగాలే!

- లోకంలో పిచ్చి వెంకట్రావులు మరికొంత మంది వుంటే ఎంత బాగుండును?

---

# 28



# ఇల్లిందల సరస్వతీదేవి 'ముత్యాలు మనసు'

**"మ**నుషులలో ఒక చిత్రమైన మనస్తత్వం వుంది. అది ఏమిటంటే, తాము బలంగా అణగదొక్కిన వ్యక్తుల్లో వున్న ప్రజలకన్నా స్త్రీలను బాగా అణచిపెట్టారు. స్త్రీని సౌందర్యాధిదేవత అని అంటారు. తల్లిగా, భార్యగా ఆమె స్థానం అసమానమైంది అని అంటారు. ఉన్నత గుణాలు రాశి, సహనశీలి అంటారు. యింతాచేసి – మీకు పురుషులకన్నా తక్కువ వేతనాలు ఇస్తాం, – ఓటు హక్కు కూడా యివ్వం అని అంటారు. యిది ఎలాంటిదంటే రెడ్ ఇండియన్ల దగ్గర అమెరికా భూభాగం అంతా లాక్కొని ఆటవికుల మనస్తత్వం ఎంత గొప్పది అని మెచ్చుకొనడం లాంటిది–"

ఒకనాటి బ్రిటిష్ సమాజం గురించి హేళనగా ప్రపంచ ప్రఖ్యాత తత్వవేత్త బెర్ట్రాండ్ రసెల్ అన్న మాటలు యివి. 'అన్ పాప్యులర్ ఎస్సేస్'లో రసెల్ వెలిబుచ్చిన ఈ భావాలు నాకు తరుచూ అనేక సందర్భాలలో జ్ఞాపకం వస్తూ వుంటాయి. మనుషులలోని 'హిపోక్రసీ' అనేక సందర్భాలలో వికృత రూపంలో దర్శనమివ్వడమే యిందుకు కారణం అనుకుంటాను. ఇల్లిందల సరస్వతీదేవిగారి "పరోక్షము-సమక్షము" కథ చదివినప్పుడు కూడా ఈ వాక్యాలు జ్ఞాపకం వచ్చాయి.

సమక్షంలో సాధారణంగా అందరూ అందరి గురించీ మంచిగానే మాట్లాడతారు. అవతలి వ్యక్తితో అంతో, యింతో అవసరం వున్నా- తమ ఔదార్యాన్ని ప్రకటించుకోవాలనిపించినా-సంభాషణల్లో అతిశయోక్తులను, అధిక ప్రసంశలను, పులమడానికి కూడా సందేహించరు. కాని – పరోక్షంలోనే అసలు కథ బయటపడుతుంది. 'మహానాయకుడు' అని సమక్షంలో పొగడిన నోర్లు పరోక్షంలో 'అవకాశవాది' అని తీర్పు యిస్తాయి. సమూహంలో మహా రచయిత అయినవాడు పరోక్షంలో 'ఏదో రాస్తాడు' అనే స్థాయికి దిగజారిపోతాడు. యిదంతా 'మామూలు కథే' అయినా సరస్వతీ దేవిగారి కథ చదివినప్పుడు మరోసారి మానవ ప్రవృత్తి జ్ఞాపకానికి వస్తుంది.

ఓ రోజున కలకత్తా మెయిల్ రాత్రిపూట ఓ చిన్న స్టేషన్‌లో ఆగింది. యిద్దరు ఆడవాళ్ళు రైల్లోకి ఎక్కారు. వీళ్ళు వున్న కంపార్ట్‌మెంట్‌లోనే ఓ పెద్ద మనిషి తన మిత్రుల్ని రాత్రంగా 'జోక్'లతో నవ్విస్తున్నాడు. ఈయనగారి జోకుల్లో చాలాభాగం సంఘసేవ చేసే ఆడవాళ్ళమీద వేసినవే. యిలాంటి మహానుభావుడు తెల్లవారిన తర్వాత కంపార్ట్‌మెంట్‌లోని ఈ యిద్దరు ఆడవాళ్ళను చూచి, వాళ్ళ పెట్టెల మీద వున్న పేర్లను బట్టి మహిళా మండలి కార్యకర్తలని అర్ధంచేసుకుని - హఠాత్తుగా ప్లేటు ఫిరాయించేస్తాడు. అంతేకాదు- "- మీకు ఎంతటి సామర్థ్యం లేకపోతే మీ యిళ్లతోబాటు సంఘాన్ని దిద్దగలుగుతారు?- నా విచారం అల్లా ఒక్కటే- మన సంఘం స్త్రీ మూర్తుల విలువను ఇంకా గ్రహించలేకపోతున్నది"- అని కూడా అంటాడు. పాపం-అతగాడికి తెలియదు. రాత్రల్లా ఆ 'స్త్రీ మూర్తులు' అతగాడు వాగిన 'వాగుడు' విన్నారని'- ఒకవేళ విన్నారని తెలిసినా అంతలోనే ఏదో ప్రమాదం జరిగిందని అనుకోడు. 'చిన్న పొరపాటు జరిగింది' అని అనుకుంటాడు అంతే!- ఒక చిన్న కథలో కనబడే మనిషిలోని బొమ్మా బొరుసుల కథ యిది-

'ఇల్లిందల సరస్వతీదేవి గారి కథలన్నింటిలోనూ మనిషి బొమ్మ యథాతథంగా కనబడుతుంది. ఆమె కథలలో స్త్రీలకు జరుగుతున్న అన్యాయాన్ని పలు సందర్భాలలో చెప్పడం జరిగేటప్పటికీ-ఆ విషయాన్ని ఆమె ఆవేశంగా చెప్పరు. స్త్రీల తరఫున వకాల్తా పుచ్చుకుని పురుషులను నిందించవు ఆమె కథలు. అంతేకాదు- ఆమె కథల్లో సామాజిక, ఆర్థిక, అసమానతల అవగాహన కనబడుతుంది గాని విభిన్న వర్గాల మధ్య సంఘర్షణ కనబడదు. యిలా రాసినంత మాత్రాన-ఆమె కథలు 'పిప్పరమెంట్' సాహిత్యానికి (కొ.కు గారి భాషలో-) కూడా ఉదాహరణలు కావు. కాస్త ఆలోచించమని చెప్పే కథలు ఆమెవి. కొన్ని సందర్భాలలో ఆమె కథలు 'మనసులోని ఇజం'ను బయటకు తీసి కొందరు భుజాలు తడుముకునేలా చెయ్యవచ్చు' కూడా-

(కథల్లో గొప్ప 'మానవత- సమ సమాజం' పట్ల తపన కనబరిచే రచయిత నిజ జీవితంలో కనీస సమానత్వాన్ని కూడా కలిగి లేదని తెలుసుకుంటే ఎంత ఆశ్చర్యంగా వుంటుంది? నిజం తెలిసాక సీతాపతిలాంటి వాళ్లు ఆ రచయితను అసహ్యించుకున్నారంటే అందులో తప్పేముంది?- 'మనసులోని యిజం'కు సంబంధించిన కథా కమామీషూ యిదంతా-)

1949లో రచనా వ్యాసంగాన్ని చేపట్టి, కీర్తిశేషులు కురుగంటి సీతారామయ్య గారి ఆశీస్సులతో కథా రచనను చేపట్టిన సరస్వతీ దేవిగారి శతాధిక కథల్లో సమకాలీన ప్రపంచం ఎన్నో రంగులలో కనబడుతుంది.

కొత్తగా అద్దె యింట్లో దిగిన వాళ్ళకు- ఆ ఇంటి గది అలమారాలో ఉత్తరాల కట్ట దొరికి మాజీ ప్రేయసీ ప్రియుల ప్రేమ కథను తెలియజెప్పిన ఉదంతాన్ని రాసినా ('ప్రణయ లేఖలు' కథలో-)- కట్నాల బజారు సృష్టించిన విష వలయాల్లో చిక్కుకుపోయిన అబల కన్నీటి గాథ రాసినా (-పెళ్లి కాలేదంటే నలుగురూ ఎగతాళి చేస్తారని-మెళ్ళో మంగళసూత్రం వేసుకుని, కట్నం కూడబెట్టడం కోసం లెక్చరర్ ఉద్యోగం చేస్తూ వుంటే, - కూడబెట్టిన డబ్బు కంటే వేగంగా మార్కెట్‌లో 'కట్నం రేటు' పెరిగిపోతూ వుంటే ఉస్సురన్న ఓ చిన్నారి కథ- 'పరకాంత' కథలో జ్ఞాపకం లేదూ?-) సరస్వతీ దేవిగారి కథల్లో 'రీడబులిటీ'కి లోపం వుండదు.

ఆమె కథల్లోని మరొక ప్రత్యేకత - హైదరాబాద్ నగరం ప్రజల కలలు, కన్నీళ్ళతో సహా, ఈమె కథల్లో ఈ మహానగరం విచిత్ర వాస్తవాలను దర్శనమిస్తుంది. 'జమరుద్ మహల్' అగ్ని ప్రమాదం దగ్గర నుంచి, మతం పేరిట జరిగే మారణహోమాల వరకూ ఎన్నో ఉదంతాలు-బడా రాజకీయ నాయకుల శారీరక అవసరాలు తీర్చే 'సూర్యా మహల్ యజమానురాలి కథ' మొదలుకొని, సగటు మనిషి జీవితయాత్ర వరకూ ఎన్నెన్నో గాథలు- వెరశి సరస్వతీ దేవిగారి కథలు. అయినా - వెతికి పట్టుకోగల నేర్పు వుండాలిగాని, మహా నగర జీవితాల్లో యితివృత్తాలకు ఏమి కొదవ?-

సరస్వతీదేవిగారి కథల్లో "ముత్యాలు మనసు" కథ బాగుంటుంది. 'ముత్యాలు' అనబడే ఆరేళ్ళ చిన్నపిల్లవాడి మనసు ఈ కథ అద్దం పడుతుంది. అయితే - యిందులో వున్నది ఒక తల్లి-పిల్ల వాడి కథ మాత్రమే కాదు. ఆలోచించగలిగితే మన ఆలోచనలను చాలాదూరం తీసుకువెళ్ళే కథ యిది. పెట్టుబడిదారీ సమాజంలో బీదవాళ్ల ఆకలిని, అసహాయతను, ఆసరాగా తీసుకుని వాళ్ల బ్రతుకును, ధనస్వామ్యం అనేక విధాల దోచుకొనడం అనాదిగా జరుగుతున్న విషయం!- అయితే- ఒక పసిబాలుడి దగ్గర నుండి తల్లి ప్రేమను దోచుకొనడం సాధారణమైన విషయమా?- ఆకలిని తీర్చే పిడికెడు అన్నానికి తల్లి ప్రేమ మారకం కావడం హృదయ విదారకమైన విషయం కాదూ?- పసి మనస్సుకు అది ఘోరమైన శిక్ష కాదూ?-

'ముత్యాలు' తల్లీదండ్రీ పల్లెటూళ్ళో వాళ్ల పెద్దమ్మగారి యింటి దగ్గర వుండేటప్పుడు కడుపు నిండకపోయినా తల్లి ప్రేమ వాడికి పుష్కలంగా దొరికేది. తల్లి ఎప్పుడూ వాడి దగ్గరే వుంటూ 'ముత్తిగా' అంటూ లాలించేది. ఎత్తుకునేది. నిద్రబుచ్చేది. కాని-నగరంలో ఒక శ్రీమంతుల యింటిలో తల్లి పనిమనిషిగా, తండ్రి తోటమాలిగా కుదిరాక వాడికి కష్టాలు ప్రారంభం అయ్యాయి. తల్లికి ఎప్పుడు యింటివాళ్ళ అబ్బాయిని ఆడించడంతోనే సరిపోయేది. ముత్యాలుతో సరదాగా మాట్లాడడానికే తీరిక వుండేది కాదు. యింటి వాళ్ళకు లంకంత అందమైన భవంతి వున్నా తాము అక్కడ వుండడానికి వీల్లేదు. చిన్న కుర్చీలో

సరదాగా కూర్చోడానికి వీల్లేదు. ఎప్పుడూ చీకటి గుయ్యారంలాంటి 'ఔట్ హౌవుస్'లో పడి వుండమని తల్లీతండ్రీ శాసించేవారు.

యింటివాళ్ళ అబ్బాయికి అంత ప్రేమగా బిస్కెట్లు, చాక్లెట్లు తినిపించే తల్లి తనకు అవేమీ పెట్టదేం?– వాడికి అన్ని చాక్లెట్లు వుండగా తనకు ఒక్కటీ లేదేం?– అమ్మ కూడా అంత అన్యాయంగా ఎలా వుంటుంది?– ముత్యాలు అనబడే పసిపిల్లవాడి బుర్రను అనుక్షణం దొలిచే ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పగల శక్తి ఆ బీద తల్లికి లేదు. మనసు చంపుకున్న వేశ్య శరీరాన్ని అమ్ముకున్నట్టు–ఆమె తన తల్లి ప్రేమను శ్రీమంతుల యింటికి అమ్ముకున్నది. రూపాయికున్న విలువ మనిషికి లేని పెట్టుబడిదారీ సమాజంలో ఆమె చేసింది త్యాగం కాదు. చేస్తున్నది కూలి పని మాత్రమే!–

వీటన్నింటినీ అర్థం చేసుకోగల వయస్సులేని ముత్యాలు వళ్ళు తెలియని జ్వరంతో తల్లిప్రేమకు పలవరించిపోతూ యిల్లు విడిచి వెళ్ళిపోయాడు. కాలు జారి తూములో పడ్డాడు. మరో రెండు నిముషాలలో సారా బట్టీలో నుంచి పొగలు గక్కుతున్న వేడినీళ్ళు ఆ తూములో ప్రవహించాయి.

చివరి క్షణం వరకూ ఈ కథలోని ముత్యాలు వాళ్లమ్మ ఆప్యాయత కోసం పడిన ఆరాటం చదువుతూంటే (సరస్వతీదేవి గారే రాసిన–) "స్వర్ణ కమలాలు" కథలో– మునసబుగారి వినాయకచవితి పూజకోసం రక్తంతో, చెమటతో తడిసిన తామర పువ్వు కోసిన పాలేరు కుర్రాడు చివరకు ఆ పూలతో తానే పూజ చేసుకోవాలనుకోవడం జ్ఞాపకానికి వస్తుంది.

కూలీల శ్రమను చాలీచాలని వేతనాలతో మిల్లు యజమానులు దోచుకున్నట్టే– తెల్లవారుజామునుంచి బారెడు ప్రొద్దు ఎక్కే వరకూ వర్షంలో, చలిలో,–జలగలతో బాధపడుతూ– చెరువులో తామర పువ్వులు కోయడం కోసం పాలేరు కుర్రాడు పడిన శ్రమను పెద్దమ్మగారు ఒక పూట భోజనంపెట్టి దోచుకుందామనుకున్నారు. మునసబుగారి ఆజ్ఞను ధిక్కరించి పాలేరు కుర్రాడు తామర పువ్వులను స్వంతం చేసుకోవడం శ్రామిక శక్తి చైతన్యానికి ప్రతీకగా వ్యాఖ్యానించవచ్చు.– మరి– "ముత్యాలు మనసు" కథలోని ముత్యాలు మాట ఏమిటి?

ముత్యాలు కథ విషాదాంతం అని నాకు అనిపించదు. తూములో పడిన ముత్యాలు రేపటి ఉదయం కోసం ఎదురు చూస్తూనే వుంటాడు. ఆహ్వానం పలుకుతూనే వుంటాడు– అనిపిస్తుంది. ఒక కథ రచయిత ఆశించిన పరిధికి మించి ప్రయోజనం సాధించడం అంటే యిదే అనుకుంటాను!–

---

# 29

## వీరాజీ-'లక్ష'



మధ్యతరగతి కుటుంబాల మానవులది ఓ విచిత్ర ప్రవృత్తి. మనసులో వుంచే దగుల్బాజీ ఆలోచనలకీ, పైకి చెప్పే కబుర్లకీ మధ్యన వుండే వ్యత్యాసం మధ్య తరగతి కుటుంబాల్లో కనబడినట్టుగా మరెక్కడా కనబడదనుకుంటాను. ఆర్థికంగా అట్టడుగు వర్గానికి చెందినవారిలా వీరు ఆకలితో మాడినవాళ్ళు కారు. అలా అని- ఏ రోజుకారోజు ఏవో తడుములాటలు లేకుండా కడుపు నిండుతుందన్న గ్యారంటీ లేదు. అదీగాక మనిషికి వుంచే సవాలక్ష కోరికల్లో తీరిన కోరికలకన్నా తీరని కోరికల లిస్టు చాలా పెద్దది కాబట్టి ఎప్పుడూ ఏదో నిరాశ, నిస్పృహ. ఇది ఇల్లా వుండగా, జీవితంలో తాము ఎక్కలేని ఎత్తులు, ఎక్కినవాళ్లు ఏదో అడ్డతోవ త్రొక్కి వుంటారన్న అనుమానం. గట్టి నమ్మకం. పోనీ తాము ఆ దోవలో పోదామంటే అడ్డువచ్చే "ఫాల్స్ ప్రెస్టేజి," ఫలితంగా ఏడుపు- జెలసీ- ఇలా చెప్పుకుంటూ పోతే కథ చాలా దూరం వెడుతుంది.

మధ్యతరగతి కుటుంబాలలో వుండే ఈ మనస్తత్వాన్ని, వాళ్ల అభిమానాన్ని, ఆప్యాయతల్ని, ముడి పదార్థాలుగా చేసుకుని తెలుగులో ఎందరో కథకులు ఎన్నో కథలు రాశారు. నిజానికి నిన్న మొన్నటివరకు తెలుగు కథకులు మధ్యతరగతి కుటుంబ జీవిత చిత్రణకు ఇచ్చిన ప్రాధాన్యత బడుగువర్గ ప్రజల సమస్యలను 'ఫోకస్' చెయ్యడానికి ఇవ్వలేదనే విమర్శ వినబడుతూ వుండేది. ఈ విమర్శ ఎలా వున్నా కలం పట్టిన కథకుడిలో సత్తా వుండాలి కాని, తాను చేపట్టిన ఏ ఇతివృత్తాన్నయినా గుండెలకు హత్తుకునేలా మన ముందు వుంచగలుగుతాడనేది నిర్వివాదాంశం.

ఆధునిక తెలుగు కథా సాహిత్యంలో పాఠకులకు సుపరిచితమైన పేరు 'వీరాజీ' గారిది. అప్పుడప్పుడు ఇతివృత్తంలో మార్పు కనిపించేటప్పటికీ మొత్తం మీద వీరాజీ కథలు మధ్యతరగతి కుటుంబాల జీవన విధానం చుట్టూ అల్లుకుంటాయి. అయితే, ఆ కుటుంబాలకు చెందిన ఆర్థిక, సాంఘిక, సమస్యల గురించి, వాటిల్లో వున్న చిక్కు ప్రశ్నల

గురించి వీరాజీ బుర్రబద్దలు కొట్టుకోరు. అందులో వున్న విడీవిడని చిక్కుల్ని రవ్వంత వ్యంగ్య ధోరణిలో మన ముందు వుంచుతూ ఆలోచించగలిగితే ఆలోచించమని, లేకుంటే హాయిగా నవ్వుకోమనీ చెబుతారు. వీరాజీ కథల్లో విమర్శకులు చెయ్యిజేసుకుంటేనేగాని పాఠకులకు అందనంత లోతయిన భావాలు లేకపోవచ్చు. కాని, వాటిని కాలక్షేపం బఠానీలుగా కొట్టి పారేసేందుకు వీలులేదు. అతని కథల్లో అబ్బాయిలూ, అమ్మాయిలూ, ప్రేమాయణాలు, పుష్కలంగానే వుంటాయి. మొహంమీద తేనెరంగు పుట్టుమచ్చ వున్న పార్వతిలాంటి చక్కని చుక్కపైన రాజేంద్రలాంటి యువకులు తీర్చుకునే తియ్యటి ప్రతీకారం ('ప్రతీకారం' కథలో-) ఈతని కథల్లో అందంగానే కనబడుతుంది. అయితే, జీవిత వాస్తవాలకు దూరంగా పారిపోయిన కథలు కావు వీరాజీవి. మన మధ్య కూర్చుని మనల్ని వేళాకోళం చేస్తున్నాడా అనిపిస్తుంది వీరాజీ వ్రాసిన కొన్ని కథలు చదివితే.

వీరాజీ కథల పాఠకులకు 'కరివేపాకు' కథ జ్ఞాపకం వుందనుకుంటాను. ఇల్లుగలవారికీ, ఇంటిలో అద్దెకున్నవారికీ మధ్య జరిగే 'కోల్డ్‌వార్'ను, కొండొకచో జరిగే 'హాట్‌వార్'ను కూడా వీరాజీ ఈ కథలో కరివేపాకును అడ్డం పెట్టుకుని చెబుతారు. ఇలా చెప్పడంలోనే మనకు మనిషిలోని బొమ్మాబొరుసుల కథ వ్యంగ్యంగా కనబడుతుంది. బెజవాడలాంటి ఊళ్ళో ఇల్లు దొరకడం కష్టం. దొరికినా ఆ ఇంటికి పంపు, గింపూతో సహా అన్ని సదుపాయాలూ వుండడం, ఇంటిలో కల్పవృక్షం లాంటి కరివేపాకు చెట్టు వుండడం మరీ కష్టం. ఇవి అన్నీ అమిరాయి ఓ ఇంట్లో కొత్తగా అద్దెకు దిగిన దంపతులకి.

ఇంటిలో కరివేపాకు చెట్టు వుంది కాబట్టి చారు కాచుకోవడం దగ్గిర నుంచి కరివేపాకు పొడి వరకు చాలా ఉపయోగాలున్నాయనుకున్నారు. కాని, స్కూలు పిల్లలకి దొడ్లో వున్న గోరింటాకును పదిహేను పైసలకి అమ్ముకునే ఇంటావిడ 'బంగారం' లాంటి కరివేపాకు ఊరికే పోనిస్తుందా? మొదట్లో "కరివేపాకుకి ఏం భాగ్యం" అన్నప్పటికీ, కొంచెం భారీయెత్తున నాలుగు కొమ్ములు కరివేపాకు పొడికోసం (ఇంటివాళ్ళను అడక్కుండానే అనుకోండి) కోసేసరికి అసలు యుద్ధం ప్రారంభమైంది. పిల్లా పీచూ లేని ఇంటావిడ కక్కుర్తి చరిత్ర బయట పడింది అప్పటి నుంచే-

ఒక దశలో అద్దెకున్న ఆసామీ ఇంటివాళ్ళమీద కోపం తీర్చుకోవడం కోసం హఠాత్తుగా రౌడీ అవతారం ఎత్తి మారువేషంలో వచ్చి, కరివేపాకంతా దూసి సంచిలో వేసుకుని సైకిల్ మీద పారిపోతే ఎలా వుంటుందని హాయిగా కలగన్నాడు కూడాను. కాని, చిత్రం ఏమిటంటే అక్షరాలా అదే జరిగింది. రౌడీ మార్కు ఫోజులో వచ్చిన ఓ అగంతకుడు ఇంటావిడతో బేరం కుదుర్చుకున్నట్టే కుదుర్చుకుని చెట్టుమీద ఆకంతా దులిపేసీ పైసా ఇవ్వకుండా ఉడాయించాడు. వాళ్ళ అబ్బాయి అన్నట్టు "చెట్టంతా క్షవరం చేసేశాడు",

ఇంటావిడ లబోదిబోమని అంటూ వుంటే - అద్దెకున్న దంపతులకు కసితీరి ప్రాణం హాయిగా వున్నప్పటికీ, ముఖంమీద బాధ పులుముకుని "ఎంత ఘోరం అయిపోయింది పిన్నిగారు" వంటి పరామర్శలు.

ఇలాంటిదే "పెళ్ళాంతో షైరేమిటీ?" కథ కూడా. సాయంకాలం అయ్యేసరికి బీచిల్లోను, పార్కుల్లోను, షాపింగ్ సెంటర్లలోను రంగురంగుల దుస్తుల్లో అందమైన అమ్మాయిలు, వాళ్ళకు తోడుగా పురుషులు కనబడడం నగర నాగరికతలో అతి సాధారణమైన విషయం. మరి ఉద్యోగరీత్యా ఓ చిన్న ఊరిలో వున్న ఓ చిరు ఉద్యోగి పనిమీద హైదరాబాద్ వెళ్ళి టాంక్‌బండ్ దగ్గర తారసపడిన షోకైన జంటల్ని చూచి సరదాపడిపోయి, ఊరునుంచి తిరిగి వచ్చిన తర్వాత ఆ ముచ్చటను తన భార్యామణితో తీర్చుకోవాలని ఉబలాట పడడమూ సాధారణమైన విషయమే! అయితే, ఆ షికారు ప్రహసనం వర్షం రాకతో "ట్రాజెడీ" గా మారిపోయింది. బురద కొట్టుకున్న బట్టల్తో రిక్షాలో సినిమాకు "తగలడ్డారు" గాని అదీ విషాదాంతమే! చుట్టకంపు భరిస్తూ సినిమా చూద్దామనుకున్నా "దొడ్డి తలుపు వెయ్యడం మరిచిపోయినట్టుందండీ" అని శ్రీమతిగారు చావుకబురు చల్లగా చెప్పడంతో సినిమా మధ్యలోనే వర్షంలో రిక్షాలో కొంపకు చేరి "ఇలాంటి మనిషితో షికారేమిటి?" అనుకోవడం మాత్రం మిగిలింది. ఇంతలో విధవప్పుగారి రాక సరేసరి.

వీరాజీ కథల్లో "లక్ష" కథ చాలా బాగుంటుంది. పలువురి మన్ననలను పొందిన కథ ఇది. లక్ష రూపాయిల లాటరీ టిక్కెట్టు కొని ఇంటికి వెడుతున్న ఒక మధ్యతరగతి కుటుంబీకుడి బుర్రలోకి వచ్చిన లక్ష ఆలోచనల రికార్డు ఈ కథ. ఈకథను రచయిత "చైతన్య స్రవంతి" విధానంలో రాసి వుంటే చాలా బాగుండేది. చైతన్య స్రవంతి శిల్పాన్ని ఉపయోగించడానికి ఎంతో అనువుగా వుండే ఈ కథను వీరాజీ సంప్రదాయ పద్ధతిలోనే చెబుతారు. సరే- ఆ విషయాన్ని అలావుంచి కథానాయకుడు చక్రపాణి గురించి తెలుసుకుందాం.

అతగాడు ఒక ప్రయివేట్ కంపెనీలో అకవుంటెంట్. వచ్చే జీతం సంసారాన్ని నెట్టుకు రావడానికి బొటాబొటీగా సరిపోతుంది. "లంచ్" సమయంలో వేడివేడి యిడ్డెన్లు కడుపునిండా తిందామని వున్నా జేబులోని డబ్బు అనుమతించని జీవితం అతనిది. "ఇవాళ ఇంట్లో పిండి వంటలు చేశారు. ఒక కప్పు కాఫీ మాత్రం చాలు" అని చెప్పే దాంబికం- కాఫీ హోటలు ప్రొప్రయిటర్‌తో సహా ఇంటా బయటా తనని అందరూ గౌరవిస్తారని తనకుతానే మురిసిపోయే మనస్తత్వం- చక్రపాణి అనబడే వ్యక్తి 'పెర్సనాలిటీ'లోని ముఖ్యమైన భాగాలు.

ఇలాంటి చక్రపాణి బలవంతంగానే అనుకోండి లాటరీ టిక్కెట్టు కొన్నాడు. "పైకం ఇంటి దగ్గర మరచిపోయా"నని (శుద్ధ అబద్ధం- ఇంట్లోని మాత్రం డబ్బు వుంటేగా?) చెప్పినా అప్పుచేసి కొనక తప్పలేదు.

ఇక- ఈ టిక్కెట్‌ను జేబులో పెట్టుకుని ఇంటికి వెళ్ళడమే అసలు కథ. లాటరీగాని పేలితే దరిద్రం వదిలిపోతుందన్న ఆశ ఓవైపు- లాటరీలో డబ్బు గాలిపాటగా వచ్చిందని నలుగురికీ తెలిస్తే కిరసనాయిలు సుబ్బయ్య, సారాకొట్టు రత్తయ్యలాగా.. 'లాటరీ చక్రపాణి' అని అంటారేమోనన్న శంక మరొకవైపు. లాటరీ డబ్బుతో కారు కొనుక్కుని అందులో వెడితే అందరూ "తేరగా వచ్చిన డబ్బు" అని వేళాకోళం చేస్తారేమోనన్న అనుమానం. కష్టపడకుండా వచ్చిన డబ్బుతో పిల్లలు జల్సాలు చేసి చెడిపోతారేమోన్న బెంగ- ఇవి అన్నీ ఆలోచించి శ్రీముఖంవారి వంశ పేరుప్రతిష్టలు నిలబడడం కోసం లాటరీ రాకపోవడమే మంచిదనుకున్నాడు.

అయితే, డబ్బు అవసరం చాలా జరూరుగా వున్నది కాబట్టి మధ్యేమార్గంగా ఒక పదివేల రూపాయిల చిన్న బహుమతి ఏదయినా వస్తే బాగుంటుందని ఆలోచించాడు. దీనివల్ల తన ఆర్థిక ఇబ్బందులు తీరతాయి- 'లాటరీ చక్రపాణి' అని నలుగురూ ఎకసెక్కం చేసే పరిస్థితీ వుండదు. అయితే, తనకి పదివేల రూపాయిల బహుమతి మాత్రమే వస్తుందని ఎవరికి తెలుసు? ఇదంతా ఆలోచించి పేకాట క్లబ్బులో తనకి ఇరవై రూపాయిలు అప్పు ఇచ్చిన మిత్రుడికి లాటరీ టిక్కెట్టు ఇచ్చేద్దామనుకున్నాడు కాని మళ్ళీ చేతులు రాలేదు.

కథ ఇలా వుండగా, బస్సులో అందమైన అమ్మాయి, 'మాలాసిన్హా'లా కవ్వించే చిన్నది కనబడితే ఆమె వంపులు చూచి పరవశించిపోతూ (తన పెద్దమనిషి తరహా ఓ ప్రక్కనించి 'గీ' పెట్టి అల్లరిచేస్తున్నప్పటికీ) జేబులో బావమరిది రాసిన ఉత్తరం మధ్యలో దాచిన లాటరీటిక్కెట్టు పోగొట్టుకుంటాడు కథానాయకుడు.

జేబులోని పెన్నిధి కాస్తా మాయమైపోయింది. అకవుంటెంట్ బుర్ర కాబట్టి లాటరీ టిక్కెట్ నెంబరు జ్ఞాపకం వుందనుకోండి. అది వేరే సంగతి. నిజంగా ఆ టిక్కెట్టుకు లాటరీగాని వస్తే ఎంత నష్టం? అయినా "నా మొహానికి లాటరీలో ప్రయిజువచ్చే అదృష్టం కూడానా" అనే నిరాశ వుండనే వుంది.

మనిషిలో వుండే విభిన్న వ్యక్తిత్వాలు, వీటి మధ్యనగల వైరుధ్యాలు- మధ్య తరగతి మానవుడి 'పెద్ద మనిషి' ముసుగు తొలగిస్తే కనబడే వికృత రూపాలు ఇవి అన్నీ 'లక్ష' కథలో కనబడి మనిషి బొమ్మ యథాతథంగా మనల్ని పలకరిస్తుంది. 'లక్ష' కథను నేను ఇష్టపడడానికి కారణం అదీ....

---

# 30

## ఆచంట శారదాదేవి - "అమ్మ"



"....కిటికీలోంచి చల్లని గాలి వినిరింది. ఆకాశమంతా మేఘావృతమైంది. చల్లని మబ్బులు అటు, ఇటు పరుగెడు తున్నాయి. ఎడతెరిపి లేని వాన కురియడానికి వాగ్దానం చేస్తున్నాయి. ఆమె ఒక్కక్షణం ఆకాశం కేసి చూస్తూ వుండిపోయింది. నల్లని మబ్బు కోనలలో అస్తమిస్తున్న సూర్యుడి వెండి కిరణాలు పడి తళతళ మెరుస్తున్నాయి. అవి చూస్తున్నంతసేపు ఆమె మనస్సులో ఒక్కటే కోరిక మెదిలింది. వెండి జరీ పువ్వులతో నీలి మబ్బు చీర కట్టుకుని తనూ ఒక మబ్బు కన్యలా ఉండగలిగితే ఆకాశంలో మేఘాలు చూచినప్పుడల్లా ఆ ఆశ మనస్సులో మెదలుతూనే ఉంటుంది....ఎన్నేళ్ళు గడిచినా అది అణగిపోలేదు....."

ఒక తరం భావ కవుల కోరికలా కనబడే ఈ వాక్యాలు ఆచంట శారదా దేవిగారి "అందని ఆదర్శం" కథలోని కథానాయిక అందని ఆదర్శం గురించి చెబుతాయి.

నిజమె మరి-నీలి మబ్బుల అంచులలో తళతళమని వెండి కిరణాల గురించి కవితాత్మక హృదయం వున్నవారికి అర్థం అయిట్టుగా లాభం కోసం చీర నేసేవాళ్ళకు ఏం అర్థం అవుతుంది? అట్లాంటప్పుడు - ముచ్చటపడి నేయించుకున్న చీర తేలిపోతున్న మేఘంలా కాకుండా చెయ్యిజారి వలికిన సిరాలా ఉందంటే ఆశ్చర్యం ఏముంది? నిజానికి ఇలాంటి కళాత్మకమైన కోరికలు మాత్రమే కాదు - (అందని ఆదర్శం కథ-) కథానాయిక భర్తకు కథల పోటీలో మొదటి బహుమతి రావాలనే కోరిక, వాళ్ళ అబ్బాయికి పరీక్షల్లో అరవైమార్కులు రావాలనే కోరిక, ఓ విధంగా ఇవన్నీ అందని ఆదర్శాలే! ఆమె భర్తకు వచ్చిన రెండో బహుమతి – కొడుకుకి పరీక్షల్లో వచ్చిన 57 మార్కులు నిరాశను రగిలించవూ? అందని ఆదార్శాలను చూపించి వెక్కిరించవూ?...

మనిషిలో తీరని కోరికల కథ స్ఫురణకు వచ్చినప్పుడు నాకు శారదా దేవిగారి ఈ కథ జ్ఞాపకానికి వస్తూ ఉంటుంది. మంచుతో నిండిన ఎత్తయిన కొండ శిఖరాలు ఆకాశాన్ని అందుకుందామని ఆరాటపడుతుంటే ఆ కొండ పాదాలను ముద్దెట్టుకోవాలని గడ్డిపూలు ఆత్రం పడడం లేదూ?...

యువతరం పాఠకులకు ఆచంట శారదాదేవిగారి పేరు అంతగా పరిచయం కాకపోవచ్చునేమో గాని, పదిల పరుచుకోవలసిన మంచి కథలను రాసిన తెలుగు కథా రచయిత్రులలో శారదా దేవిగారు ఒకరు. ఆమె కథల్లో చుట్టు తిరుగుడు ధోరణి ఉండదు. తాను చెప్పదలచిన విషయాన్ని నేరుగా గుండెలకు హత్తుకునేలా చెప్పగల నేర్పు ఆమెది. మనిషిలోని విచిత్ర ప్రవృత్తులను, ఆ ప్రవృత్తులకు గల కారణాలను శారదాదేవిగారు తమ కథలలో పరిశీలిస్తారు. (ఈ పరిశీలనకు ఆమెలోని కళాత్మక హృదయం జతచేరి ఆమె కథల్లో మేఘాలు, ఆకాశం, నక్షత్రాలు ఇవన్నీ మనకు అందంగా కనిపిస్తాయనుకోండి - అది వేరే విషయం.) అయితే- శారదాదేవిగారు మనో వైజ్ఞానికక సూత్రాలను కథా సాహిత్యంలో ప్రయోగాత్మకంగా అన్వయించిన కథకుల కోవకు చెందకపోవచ్చు. కాని- మానవ మనస్తత్వపు నిశిత అవగాహన ఆమె కథలు పాఠకులకు చాలా కాలం జ్ఞాపకం వుంటాయి.

మాట వరుసకు ఆమె "వింత స్వభావం" కథనే తీసుకోండి. ఈ కథలోని "మీరా'కు శ్యామల అంటే మనసులో ఎంతో గౌరవం, ఇష్టం. సిరిసంపదలతో తులతూగే మీరా నిరాడంబరంగా, నిండుగా ఉండే శ్యామలలాగా వుండాలని ఆరాటపడేది. ఆ ఆరాటం ఫలితంగానే శ్యామల అంటే అసూయ కలిగి అమె పట్ల నిర్లక్ష్యాన్ని వైముఖ్యాన్ని ప్రదర్శించేది. ప్రేమతో తనని పలకరించే శ్యామలను దూరంగా వుంచి ఆమెను చిన్నబుచ్చాలని ప్రయత్నించింది. అంతేకాదు - శ్యామల అంటే ఇష్టపడే శేఖరాన్ని పనిగట్టుకుని పెళ్ళాడింది. శ్యామల భర్త కామేశ్వరరావు దృష్టిలో తన చలాకీదనాన్ని ప్రదర్శించడానికి తాపత్రయపడింది. అంతరంగంలో వున్న భావాలు కొన్ని పరిస్థితులలో విరుద్ధ స్వరూపంలో ("కౌంటర్ ఇన్వెస్ట్‌మెంట్" జరిగిన కారణంగా) బయపడతాయని చెప్పడానికి 'మీరా' ఓ ఉదాహరణ. ఇలాంటి మీరా చివరికి చనిపోతూ శ్యామలకి ఉత్తరం రాసి "నేను నీలా ఉండాలని ఎంతో ప్రయత్నించి అది సాధ్యం కాదని నిన్ను బాధ పెట్టడానికి ప్రయత్నించా" ననడం ఆమె మనస్తత్వంలోని చిక్కు ప్రశ్నకు ముడివిప్పుతుంది. నిజానికి మానవ మనస్తత్వపు తాళం చెవి ఎక్కడ వుందో వెతికి పట్టుకోవడం చాలా కష్టం. మనోవైజ్ఞానిక శాస్త్రవేత్తలు చేసే ఈ కృషినే రచయిత మరో మార్గంలో చేస్తాడు. తినడానికి తిండిలేని రోజుల్లో బ్రతకడానికి ప్యూను ఉద్యోగం చేస్తూ - అమ్మగారు చెప్పే చిన్న చిన్న పనులు చెయ్యడానికి నామోషీపడి తెగించి ఉద్యోగం వదులుకున్న వ్యక్తి ఆ తర్వాత పరిస్థితుల ప్రభావంతో ఆర్థికంగా ఎదిగి నాలుగు రిక్షాలకు యజమాని అయినప్పుడు- అతనిలో అహంభావం కాక, అణకువ పెరిగిందంటే - ఇందుకు కారణం మనసులోని "ఆత్మ న్యూతనా భ్రాంతి" తొలగిపోవడం కాదూ? ... ('మారిన మనిషి' కథలో ..)

మనిషి మనస్తత్వానికి సంబంధించిన ఇలాంటి వైచిత్రి శారదాదేవిగారి "అమ్మ" కథలో కూడా కనబడుతుంది. శారదాదేవిగారి కథల్లో ఈ కథ అంటే నాకు ఇష్టం. మనిషిలోని మరో మనిషి కథ అందంగా కనబడడమే ఇందుకు కారణం అనుకుంటాను.

ఈ కథలోని సుహాసిని మిత్రురాలు రేఖతో పాటు కలకత్తాలో ఓ ఇంటిలో మేడమీద గదిలో వుంటోంది. ఇద్దరు స్నేహితురాళ్లు వైద్యశాస్త్ర విద్యార్థినులు. అదే ఇంట్లో కొత్తగా దిగిన దంపతులు కూడా తెలుగువాళ్ళు కావడంచేత - త్వరగానే స్నేహం కుదురుతుంది.

సుహాసినిది ఒక విచిత్ర స్వభావం. తన తల్లిని తలచుకోకుండా ఒక్క క్షణం గడవదు ఆమెకు. ఇంటావిడ ఇంటిని అందంగా సర్దుకున్నప్పుడు "అప్పుడే ఎంత బాగా సర్దుకున్నారు అచ్చం మా అమ్మలాగే" ... అని సుహాసిని అనడం మొదట్లో మంచి ప్రశంసగానే అనిపించింది. తర్వాత - ఈ ధోరణి ఆమెకు విచిత్రంగా అనిపించింది. కష్టపడి కుట్టుకున్న ఎంబ్రాయిడరీ పువ్వులు చూచి మెచ్చుకుంటూ– అమ్మ "ఎంత తొందరగా కుదుతుందను కున్నారు" - అనడమూ మిఠాయిచేసి పంపితే" - చాలా బాగున్నదండీ! - కానీ, మా అమ్మ జ్ఞాపకానికి వచ్చి ఒక్క ముక్క తినలేదు. మా అమ్మ ఎంత బాగా చేస్తుందనుకున్నారు" - అని అనడమూ - ఈమె వినడమూ దినచర్యలో భాగాలయిపోయాయి.

రోజుకు ఎన్నో వందలసార్లు వినబడే ఈ "అమ్మ" నెలరోజులు కష్టపడి అల్లుకున్న హేండ్‌బ్యాగ్‌ను సుహాసిని చూచి "మా అమ్మ ఇలాంటివి రోజుకు ఒకటి అల్లుతుంది." అని అంటే - ఇలాంటి అసాధారణ వ్యక్తిని చూడాలని ఎవరికి మాత్రం అనిపించదు?

కాని - చివరికి నిజం తెలిసింది. సుహాసిని చిన్నపిల్లగా ఉన్నప్పుడే వాళ్ళ అమ్మ చనిపోయింది! సుహాసిని తల్లిని ఎరగనే ఎరుగదు. సవతి తల్లికి సుహాసిని అంటే ఇష్టం ఉండేది కాదు. తల్లి ప్రేమ అంటే ఏమిటో ఎరగకుండా పెరిగిందామె. అందుకే తన ఊహ ప్రపంచంలో ఒక అపురూపమైన మాతృమూర్తిని నిలుపుకుంది. ఆమెనొక అసాధారణ వ్యక్తిగా - ప్రేమమయిగా తన "ఫేంటసీ" లలో మలుచుకుంది. ఎవరికీ లేని అలాంటి అపురూప వ్యక్తి తనకు తల్లి అని కొత్తవాళ్ళకు చెప్పుకుంటే - ఆ కల్పన ఆమెకు ఎంతో ఆనందాన్నిస్తుంది.

ఈ నిజాన్ని సుహాసిని స్నేహితురాలు రేఖ ద్వారా ఇంటావిడ తెలుసుకున్నప్పుడు ఇంటావిడ మనస్సు వికలమైపోయింది. జీవితంలో సుహాసిని పోగొట్టుకున్నదాన్ని చేతనయినంతవరకూ అందివ్వగలగాలని ఆమె స్త్రీ హృదయం పరితపించింది. ఈ కారణం చేతనే సుహాసినికి జ్వరం వచ్చి రేఖ కూడా లేని సమయంలో ఒంటరిగా పడి ఉన్నప్పుడు కన్నతల్లిలా ఆమెను లాలించి సేవలు చేసింది. జ్వరం నుంచి కోలుకున్న సుహాసిని

కొన్నాళ్ళపాటు తల్లి ప్రస్తావన చెయ్యకపోతే ఆ అమ్మాయి మనస్తత్వంలో మార్పు వచ్చిందనుకుంటుందామె. కాని – జ్వరం నుంచి కోలుకున్న సుహాసిని ఓ రాత్రివేళ ఆకాశంలోని నక్షత్రాలవైపు చూస్తూ "ఇలా నక్షత్రాలకేసి చూస్తూ కూర్చోవడం అంటే మా అమ్మకు ఎంత ఇష్టమో!" అననడంలో కథ మళ్ళీ మొదటికి వస్తుంది.

– మానసిక కారాణాల వల్ల మనిషి లోనయ్యే ('డెల్యూషన్స్') పలు విధాలుగా వుంటాయి. ఆర్థికంగా అతి సామాన్య స్థితిలో వున్నవాడు తాను కోటీశ్వరుడిననీ కోట్లకొద్దీ రూపాయల ఆస్తి తనకు త్వరలో వారసత్వంగా సంక్రమించబోతున్నదనీ భ్రాంతితో బ్రతకడం, శారీరకంగా ఏ విధమైన అందములేని వ్యక్తి తనని ఎందరో అమ్మాయిలు ప్రేమిస్తున్నారని, ప్రేమ లేఖలు రాస్తున్నారనీ భ్రాంతిలో వుండడం మొదలైనవి ఇందుకు కొన్ని ఉదాహరణలు. ఆత్మన్యూనతా భ్రాంతితో సహా అనేక కారణాల వల్ల ఈ 'డెల్యూషన్స్' ఏర్పడతాయి. ఈ తరహా ఊహలవల్ల వ్యక్తులు నిజ జీవితంలో తీరడానికి అవకాశంలేని కోరికలను తీర్చుకోగలుగుతారు. తాత్కాలికంగా సంతృప్తి వచ్చే అవకాశం ఉంది. కాని–ఇవి మనిషిని పరిపాలించే స్థితికి పెరిగితే మానసిక రుగ్మత తప్పదు.

ఈ కథలోని సుహాసిని తనతల్లి బ్రతికే ఉందని ఇతరులను నమ్మించడానికి ప్రయత్నించడం ఆమెలోని "ఆత్మ న్యూనతా భ్రాంతి" లో నుంచి పుట్టుకొచ్చింది. చిన్నతనం నుంచి తల్లి ప్రేమకు మొహం వాచిపోయిన సుహాసిని – ఆ పెన్నిధిని పోగొట్టుకోవడం వల్ల ఎంతో నష్టపోయానని 'ఆత్మ న్యూనతా భ్రాంతి' కి గురి అయింది. భగ్గున మండే ఆ ఆత్మ న్యూనతా భ్రాంతిని, ఒంటరితనం వల్ల వచ్చే "డిప్రెషన్'ను, కప్పిపుచ్చుకోవడానికి చెప్పే కథలే ఇవన్నీ – సుహాసినిలోని ఈ 'డెల్యూషన్స్' తొలగిపోవాలంటే ఆమెకు "తల్లి లాంటి వ్యక్తి" ఎవరో శాశ్వత ప్రాతిపదిక హోదాలో దొరకాలి. ఆమెకు సన్నిహితమై కన్నీళ్ళు తుడవగలగాలి. అది సుహాసిని భర్తగాని, మరొకరుగాని కావచ్చు. మరి సుహాసినికి ఆ ఆనందం ఎప్పుడు లభిస్తుందనేది ఈ కథ పరిమితికి మించిన ప్రశ్న. ఓ విధంగా చెప్పాలంటే – ఆ ప్రశ్నకు సమాధానం దొరకకపోవడంలోనే కథకు అందం వున్నది. నిజానికి సమాధానం దొరికిన ప్రశ్నలకంటే దొరికీ దొరకని ప్రశ్నలే ఎక్కువకాలం గుర్తుంటాయనుకుంటాను.

---

# 31

## ముళ్ళపూడి వెంకట రమణ - "ఏకలవ్యుడు"



కథలు రాయడం రచయిత పని అయితే వాటిలో విలువలూ 'గట్రా' ఎలా ఉన్నాయో లెక్కలు వేసుకుని అవసరం అయితే జుట్టు పీక్కోవడం (ఇతరుల జుట్టుతో సహా) విమర్శకుల పని. ఈ పని చెయ్యడంలో ఎవరయినా ఎక్కడయినా 'పొరబాటు' పడతారేమోనని 'ఇది చాలా గొప్ప రచన, ఈ రచనకు గొప్ప సామాజిక ప్రయోజనమున్నది' అని బోర్డు పెట్టుకున్న రచయితలు కూడా కొందరుంటారు. అంతటి సాహసం చెయ్యకపోయినప్పటికీ అలాంటి బోర్డు ఎవరయినా తగిలిస్తే బాగుండునని తెగ సరదా పడిపోయేవాళ్ళు కొంచెం హెచ్చుసంఖ్యలోనే కనబడుతుంటారు. ఇట్లాంటి స్థితిలో "ఇందులో వున్న కథలన్నీ కూడబలుక్కుని కలిసి కట్టుగా గాని, విడివిడిగా గాని రచయితకు తెలియకుండా మీ దగ్గరకు వచ్చి ఇందులో దేశానికి సందేశాలున్నాయి తెలుసా? అని చెప్పి, అంతటితో వూరుకోక అవేమిటో వెల్లడి చేసినట్టయితే ఇంకొకసారి నవ్వేసి, అలాగే అనండి - వాటి మాటలు నమ్మకండి" అని ముళ్ళపూడి వెంకటరమణలా తన కథలకు 'ముందుమాట' రాసుకున్న రచయితలు వుండడం కొంచెం కష్టమే. ఒకనాటి వీరేశలింగం, చిలకమర్తి వంటి రచయితల్లా ముళ్ళపూడి హాస్యాన్ని ఒక నిర్దిష్టమైన సామాజిక ప్రయోజనాన్ని ఆశించి తన రచనలలో సృష్టించకపోయినప్పటికీ "రాజకీయ భేతాళ పంచ విశంతిక" వంటి రచనలలో ముళ్ళపూడి వినిపించిన "దేశం కన్నా రాష్ట్రం ముఖ్యం. రాష్ట్రం కన్నా ఊరు ముఖ్యం. ఊరు కన్నా వాడ, వాడ కన్నా పార్టీ, పార్టీ కన్నా గ్రూపు, గ్రూపు కన్నా నాయకుడు, అంతకన్నా 'నేను' ముఖ్యం" వంటి 'సూక్తులు' దానిని అనుకుని వచ్చిన రాజనీతి, ఆ రాజనీతిని ఊపిరిగా చేసుకుని బ్రతుకుతున్న రాజకీయ నాయకులు, జ్ఞాపకం వచ్చి పాఠకులు ముసి ముసి నవ్వులు నవ్వుకుంటారని,'- ఎవరికో ఎక్కడో 'చురుక్కు'మని తగులుతుందని ("ప్రజలు వేరు. ఓటర్లు వేరు" కదా మరీ!) చెప్పిన పాపానికి సందేహింపనవసరం లేదు.

హాస్యం అనేది వయ్యారి వాలుజడతో కొట్టినట్టు వుండాలి అని అంటారు. వయ్యారి వాలుజడతో కొట్టినప్పుడు 'అయ్యబాబో దెబ్బతగిలింది' అని మొర్రో' మని ఏడ్చేవాళ్ళు వుంటారని నేను అనుకోను. చురుక్కుమనిపించినా ప్రాధాన్యత పులకరింతకే వుంటుంది. అయితే చింతబరికతో బాదినప్పటి కథ మాత్రం వేరు. అక్కడ వుండేది ఏడుపు మాత్రమే. ఇది రాస్తుంటే చాలా కాలం క్రితం చిలకమర్తి వారి హాస్యానికీ, వీరేశలింగం గారి హాస్యానికి మధ్య వున్న తేడా గురించి చెబుతూ మధునాపంతులవారు చెప్పిన వివరణ జ్ఞాపకం వస్తోంది. వీరేశలింగంగారు హాస్యం పేరుతో గిల్లి బాధిస్తారని, చిలకమర్తివారు గిలిగింతలు పెట్టి నవ్విస్తారనీ అంటారాయన. హాస్యానికి సామాజిక ప్రయోజనానికీ మధ్య ఉన్న సంబంధమూ దానికున్న పరిమితి ఇదే అనుకుంటాను.

ముళ్ళపూడి తన కథలలో పాఠకులకు గిలిగింతలు పెట్టే మాట నిజమే కాని, ఈ గిలిగింతలు పెట్టడంలో అతడు కొంతవరకూ ముని మాణిక్యానికి ఎక్కువగా బ్రిటిష్ హ్యూమరిస్ట్ 'వోడ్‌హవుస్'కు సన్నిహితంగా కనబడతాడు. ఇద్దరి పుస్తకాలనూ ఇంకొక బాషలోకి అనువదించడం చాలా కష్టమైన విషయం. ఒకసారి 'వొడ్‌హవుస్'ను చదివిన వాళ్ళు ఆ హాస్య రసాంబుధిలో అలా మునిగి తేలేటట్టే ముళ్ళపూడి పాఠకులు కూడా అతని రచనలను విడిచిపెట్టరు. చాలాకాలం క్రితం 'ఎన్‌కౌంటర్' పత్రికలో 'హిలరీ క్లార్క్' వొడ్‌హవుస్'కు అతని పాఠకులకు మధ్యన వుండే సంబంధాన్ని గురించి రాస్తూ "కాన్‌జుగల్ రేదర్ దేన్ – అమాటరీ, వన్‌గోస్ టు హిమ్ ఎగెయిన్ అండ్ ఎగెయిన్" అనడం ఈ సందర్భంలో జ్ఞాపకం వుంచుకోదగ్గది.

హాస్య రసాన్ని సృష్టించే విషయంలో భాషాపరంగా ముళ్ళపూడి చేసినన్ని ప్రయోగాలు చేసిన రచయితలు తెలుగులో చాలా తక్కువే అని చెప్పాలి. రస పట్టుదల, పేకాటవికులు, టెలిగ్రామ్యభాష, కాడిలాకియర్, సెక్స్‌ట్రా వంటి ఎన్నెన్నో పదాలను సృష్టించారు వెంకటరమణ. ఒక్క పదాలు సృష్టించడం విషయంలోనే కాదు పాత పదాలకు కొత్త 'ఎఫెక్ట్' లను ఇవ్వడంలో కూడా ముళ్ళపూడి కొత్త పుంతలను తొక్కాడు. "భీన్న పిల్లలు, హడ్డిలిపోయారు' వంటి పదాలు రమణ కథలలో కోకొల్లలు. ఇక 'మా నాన్న అంతటివాడు వాడూ, నా అంతటివాడూ నేడు", 'సరే సీగాన పెసూనాంబను పెళ్ళాడుతావురాలెండి" వంటి 'బుడుగుభాష'లోని వాక్యాలు– "ఊహ బావుల్ది కానీ, ళిద్దరొస్తోంది పోయి పడుకుంటా(నా" వంటి 'ఆవలింత భాష'ను ముళ్ళపూడి కథలలో చూడడం గిలిగింతలు పెట్టే మరపురాని అనుభవం.

ముళ్ళపూడి పేరు చెప్పేసరికి అప్పారావు, రాధ, గోపాలం, మీసాలరావు, బుడుగు, సీగానపెసూనాంబ, లావుపాటి పక్కింటి పిన్నిగారు, (అన్నట్టు మరిపోయాను - ఆవిడ 'ముగుదు') రెండు జడల సీత, ఇలా ఎంతో మంచి జ్ఞాపకానికి వస్తారు. వీళ్ళందరిలో 'హలో ఓ ఫైవుందా' అప్పారావు (పోనీ 'ఉత్తి హలో') ఒక ప్రత్యేక స్థానం. కాలదోషం పట్టిన దస్తావేజులాంటి బట్టలు, బడిపంతులుగారి చేబదుళ్ళలా చిందరవందరగా వుండే జుట్టు, అప్పుతెచ్చుకున్న విచ్చు రూపాయిలా మెరిసే పత్తికాయ లాంటి కళ్ళు గల అప్పారావును కృష్ణశాస్త్రి కవిత్వం ఎందుకు రాస్తాడో, పువ్వులు ఎందుకు పూస్తాయో అంత సహజంగా ప్రకృతి ధర్మంగా, ఏ ప్రత్యేకమైన కారణం అవసరం లేకుండా అప్పులుచేసే అప్పారావును - ముళ్ళపూడి పాఠకులు ఏనాటికీ మరిపోలేరు. (వొడ్‌హవుస్ 'జీవ్స్' పాత్రకు, ముళ్ళపూడి అప్పారావు పాత్రకు స్వభావస్వరూపాలలో సంబంధం లేకపోయినప్పటికీ పాఠకుల అభిమానాన్ని దోచుకోవడంలో సన్నిహితంగా కనబడతాయి. అయితే ఇంతాచేసి మీ అభిమానం అన్నాడట వోడ్ హవుస్! మరి ముళ్ళపూడి మాట ఏమిటో?) ఇంతకీ చెప్పొచ్చేదేమందటే అప్పులు చెయ్యడం అనేది సిగ్గుమాలిన విషయం కాదనీ అదొక గొప్ప 'కళ' అనీ చాటిచెప్పిన అప్పారావుగారికి స్థానిక, జాతీయ, అంతర్జాతీయ అప్పారావులు దాఋణంగా ఋణపడి ఉంటారు ఎప్పటికీ. అప్పు అంటే బొత్తిగా గిట్టని (నెపోలియన్ ఆఫ్ ఏంటీలోన్' అని అనవచ్చా?) వారు కూడా అప్పారావు 'ఋణ లీల'కూ 'అప్పుకవీయా'నికీ కొంచెం బోలెడెంత 'హాశ్చర్యపడి' మురిసిపోక తప్పదు!

ముళ్ళపూడి కథలను తలచుకుని మళ్ళీ మళ్ళీ నవ్వుకునేటప్పుడు రాధా, గోపాలం కూడా జ్ఞాపకానికి వస్తారు. రాధ 'ఛాలా ఛాలా' అందంగా నుదురుమీద నుంచి ముఖానికి వేలుదుతున్న అందమైన ముంగురులతో అచ్చం బాపూ బొమ్మలా వుంటుంది. మరి ఎల్.కె. గోపాలం చింతపండు ముద్దలా వుంటాడు, అయినా రాధకంటికి ముద్దొస్తూ ఉంటాడు. అవునా మరి? ఇలాంటి రాధా, గోపాలం మధ్య ఓ రోజు ప్రొద్దున్న అంటే జీ.వి. మూర్తి అప్పుకోసం అర్జెంటుగా రావడానికి ముందు, మొగుడు గోపాలం పేపరు చదువుకుంటూ, పెళ్ళాం రాధ అరటికాయ ముక్కలు కోస్తూ వున్న సందర్భంలో- గోపాలం హఠాత్తుగా 'నా బాకీ తీర్చ' మని అల్లరి పెట్టడం జ్ఞాపకం వుందా? (రాధమ్మ బాకీ' కథలో...)

ఇంతకీ అసలు గొడవ ఏమిటంటే శ్రీమతి రాధ 'కుమారి రాధ'గా ఉన్నప్పుడు ఆమెకు రాసిన ప్రేమ లేఖలకు, పంపిన గ్రీటింగులకు, రాధ దర్శనం అయినప్పుడల్లా ఫ్రెండ్సుకు ఇచ్చిన పార్టీలకు అయిన డబ్బంతా చెల్లించమంటారు గోపాలం. రాధమ్మ మాత్రం వూరుకుందా, రోడ్డుమీద తనకోసం పడిగాపులు పడివున్న గోపాలానికి

నయనానందం కలిగించడం కోసం అప్పట్లో అప్పుచేసి మరీ కొనుక్కున్న ఆకుపచ్చ రంగు జార్జెట్ చీరకు, కాళ్ళకు చేయించుకున్న పట్టీలకు ఇవన్నీటికీ అయిన డబ్బు ఇచ్చుకోమంది. రాధమ్మ మాటలకి గోపాలం తెగ సరదాపడిపోయి "ఇవన్నీటికీ అవకూడదు. వీటన్నిటికీ! అనాలి" అవి సరిదిద్దాదనుకోండి. అది వేరే సంగతి.

ముళ్ళపూడి కథలలో 'ఏకలవ్వుదు' కథ అంటే నాకు చాలా ఇష్టం. ముళ్ళపూడి పరిభాషలో 'ఏకలవ్వుదు' అంటే ఒకే అమ్మాయిని 'లవ్' చేసిన వాదు' అనే సంగతి ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. నిజానికి ఆ కథ ప్రారంభం, ముగింపు చాలా తమాషాగా ఉంటాయి.

"పది" అంది వకీలుగారింటి గడియారం.

"కాదుస్మీ!" అంది పక్కవాటాలోని మాస్టారు గారి గడియారం.

"పది అంది గదిలో గడియారం.

"మరేస్మీ" అంది సుబ్బారావుగారింటి గడియారం ప్రతి ధ్వని.

ఈ ఆధ్యంతాల మధ్య గుర్నాధరావు అనబడే ఏకలవ్వుదు సీతతో నడిపిన ప్రేమాయణం అందులోంచి పుట్టుకొచ్చిన విరహం, తుకారాం మూడున్నర రూపాయల అప్పు, అతగాడి 'టెలిపతీ' సర్వీసు, గుర్నాధానికి, సీతకీ, తండ్రులయిన టీచరు రామనాధం, లాయరు సుబ్బారావుల 'కోల్డ్‌వార్' – ఇంత గ్రంథం వుంది. కథ చివరిలో సీతకీ, గుర్నాధానికి పెళ్ళి కావడంతో 'కోల్డ్‌వార్' ముగిసి అభిప్రాయాబేధాలు కూడా సమసిపోతాయి. అదీ కథ.

ప్రాక్టీసు లేని సుబ్బారావుగారు మంత్రి అయిపోదామని ఆశపెట్టుకుని' "అంతర్జాతీయ సమస్యలు, ప్రపంచ శాంతి" వంటి 'తేలికయిన' విషయాలు నాలుగయిదు స్టడీచేసి పెద్ద నాయకులను కలుసుకోదానికి ఢిల్లీ వెళ్ళడమూ, అక్కడ వున్న పెద్దలు చెయ్యదలచుకున్న ఆ దేశ సేవ ఏదో మీ ఊళ్ళోనే వుండే చెయ్యమని సలహా ఇవ్వడమూ దానితో ఆయన మునిసిపల్ రాజకీయాలలో తలదూర్చడమూ, ఈ కథలోని మొదటి భాగం తాలూకు భాగాలయితే, అందులో కూడా విఫలం అయ్యి, బడిపంతులుగారితో వియ్యం అందడం కథలోని రెండో భాగం. సుబ్బారావుగారికి చిన్న సైజు సింహాసనం ఏదయినా దక్కేదేమోగాని

ఓ "ధనస్వారి" (అనగా...ధనమును ధరించినవాడు అని అర్థం) అడ్డంపడి అనుకున్న పని కాకుండా చేశాడు. దీనికి తుకారాం సర్వీసువారి 'రాజకీయం' జతచేరి సీత, గుర్నాథం వివాహానికి కావలసిన నేపథ్యం సమకూరింది.

కథ ఈ విధంగా కొలిక్కి రావడానికి ముందు, సినిమా ఆఖరి రీల్లో మాదిరిగా అర్జంటుగా జరిగిపోతున్న పనులు తనకి వ్యతిరేకంగా వున్నాయని బోలెడు బెంగ పెట్టేసుకుని గుర్నాధరావు హడావిడిగా గుండు చేయించుకు వచ్చేశాడు. (చాలా ఘోరంగా, బుద్ధిగా చదవడం కూడా ప్రారంభించాదనుకోండి) తీరా కథ సుఖాంతం అయ్యాక గుండు వల్ల పెళ్ళికి గాని ఇబ్బంది కలుగుతుందేమోనని గుర్నాధరావు సందేహించాడు గానీ, 'వెధవ క్రాఫింగు ఇట్టే పెరుగుతుంది. మీ నాన్న జీతంలా అనుకున్నా వేమిటి? ఒకంతట పెరగకపోవడానికి?" అని సుబ్బారావుగారు ఒక 'జోక్' జోకడంతో సమస్యలన్నీ దూదెపింజెల్లా తేలిపోయాయి.

ముళ్ళపూడికి ఇష్టమైన ప్రేమ, పెళ్ళి, అప్పు, రాజకీయాలు మొదలయిన విషయాలన్నీ ఈ కథలో పుష్కలంగా దొరుకుతాయి. (వాటిమీద వ్యాఖ్యలతో సహా) చిన్నసైజు ఏకలవ్యుడు గుర్నాథం ప్రేమాయణం చదివి 'హు' అని ఒక ప్రేమ మూలుగుడు మూలగడానికి, కొంచెం అటూ ఇటూగా ఏకలవ్యులుగా వుండేవాళ్ళు 'ఉత్తేజాన్ని' పొందడానికి, బొత్తిగా ఇలాంటి 'వ్యవహారా'లంటే గిట్టని వాళ్ళు కూడా ఓమారు చదివి ముసిముసి నవ్వులు నవ్వుకోడానికి' పలు పలు విధాలుగా ఈ 'ఏకలవ్యోపాఖ్యానం' ఉపకరిస్తుంది! – ఓం శాంతి శాంతిః !

---

# త్రిపుర - 'జర్కన్'



'**మిత్** ఆఫ్ సిసిఫస్' అనే రచనలో ప్రపంచ ప్రఖ్యాత రచయిత 'ఆల్బర్ట్ కేమూ' అంటాడు-

"నిద్రలేవడం ట్రామ్ ఎక్కి ఆఫీసుకు వెళ్ళడం, అక్కడ నాలుగు గంటలు పనిచెయ్యడం, భోజనం, మళ్ళీ ట్రామ్ ఎక్కడం మళ్ళీ ఆఫీసు, మళ్ళీ భోజనం. సోమవారం, మంగళవారం, బుధవారం ఇలా ఒకే పద్ధతిలో అన్ని రోజులు గడిచిపోతూ వుంటాయి. చివరికి ఒక రోజున 'ఎందుకు'? అనే ప్రశ్న బయలుదేరుతుంది. ఆ విసుగుదలలోంచే అంతా బయలుదేరుతుంది' అని!...

నిజమే - గానుగెద్దు జీవితంపట్ల వచ్చే 'మొనాటనీ' ఆకలి సమస్యకన్నా భయంకరమైంది. దీనిని అనుకునివచ్చే ఆత్మహత్యా ప్రవృత్తి 'గిల్టీకాన్షస్' మనిషిని మానసిక సంక్షోభాల విషవలయాల్లోకి తోసివేస్తాయి. తన చుట్టూ వున్న ప్రపంచం నిరర్ధకంగా కనిపించినప్పుడు ఆ ప్రపంచపు విలువలను అంగీకరించలేక వాటినుంచి విడిపోయి తన విలువలను, తననూ అన్వేషించుకోలేక మనిషి మానసికంగా లోనయ్యే యాతన, దాని ఫలితంగా వచ్చే సంఘర్షణ, సామాన్యమైనవి కావు. ఇట్లాంటి మనిషి కథను, వ్యధను ఇతివృత్తంగా తీసుకునే సాహిత్యం సహజంగానే ఒక ప్రత్యేకతను కలిగి ఉంటుంది.

ఈ తరహా రచనల్లో కనబడే 'ఎలియనేషన్' ఒంటరితనం, 'మసోఖిజమ్' (తనను తాను హింసించుకునే ప్రవృత్తి) మొదలయిన వాటిని, వాటి స్థూల రూపాలను దాటి కొంతవరకు లోతుగా ఆలోచించగలిగితే - చీకటిని చీల్చుకుంటూ దర్శనమిచ్చే వెలుగు అర్థం అవుతుంది. అప్పుడే మనకు మరో భాషలోని కాఫ్కా, కేమూ, సాల్‌బెల్లో అర్థం అయినట్టే 'త్రిపుర' కూడా అర్థం అవుతాడు. అప్పుడే మనకు ఫిలిప్ టాయెన్ బీ ఆల్బర్ట్ కేమూ గురించి చెబుతూ "...ఆధునిక ప్రవక్తలందరిలోకీ ఆల్బర్ట్ కేమూ అత్యంత జ్ఞానవంతమైన, ఉపయోగకరమైన రచయిత" అనడంలోని ఆంతర్యం అవగతం అవుతుంది. తెలుగు కథా సాహిత్యాన్ని పదికాలాలపాటు గుర్తుంచుకోదగ్గ పదమూడు కథలతో సుసంపన్నం

చేసిన 'త్రిపుర' (రాయసం వెంకట త్రిపురాంతకేశ్వరరావు) గురించి కూడా ఇదే విషయాన్ని చెప్పవలసి వుంటుంది.

నిజమే- సగటు పడక కుర్చీ పాఠకులకు త్రిపుర కథలు అంత సులభంగా అర్థం కావు. పైగా గాభరాపెడతాయి. ఒక్కొక్కప్పుడు చికాకును కూడా కలిగిస్తాయి. కాని, ఓపికగా రచయితతో మనం ముందుకు సోగలిగితే ఈ కథల్లో హృదయాంతరాలకు సన్నిహితంగా వచ్చే ఆత్మీయమైన పలుకు వినబడుతుంది. ఆ పలకరింపుకు ఒక్కసారి ఉలిక్కిపడతాం. ఆశ్చర్యపడతాం. చీకట్లో చిందులాడుతూ తనకు కావలసిన వస్తువును వెదుకుతున్న మనిషికి హఠాత్తుగా అది దొరికితే వచ్చేలాంటి అనుభూతి ఏదో కలుగుతుంది 'త్రిపుర' కథలు చదివినప్పుడు. పాలగుమ్మి పద్మరాజులాంటి గొప్ప కథకుడి చేత 'నేను ఇంత మంచి కథలు రాయగలనా' అనిపించుకున్న కథలు 'త్రిపుర'వి. సర్రియలిస్టిక్ పెయింటిగ్స్‌లా కనబడే 'త్రిపుర' కథల్లో ... 'గాజుపెంకులు రుద్దిన ముఖం, బరువైన కళ్ళ రెప్పల క్రింద రెండు బలసిన కుక్కలు' ...చూడడం ఒక అనుభవం. ఈ కథల్లోని డెప్త్ సైకాలజీని, ఎగ్జిస్టెన్షియ లిస్టిక్ సైకాలజీని అవగతం చేసుకోగలిగితే అది మరింత మరుపురాని అనుభవం అవుతుంది.

అస్తిత్వవాద మనస్తత్వాన్ని ఆవిష్కరించే రచనలు పొగమంచులో చిక్కుకున్న మనిషి తనను తాను అన్వేషించుకుంటూ ముందుకు పోడానికి చేసే ప్రయత్నాల గురించి చెబుతాయి. ఈ అన్వేషణ విజయవంతం అయ్యేందుకు మతంకాని (అది అర్నాల్డ్ టాయన్ బీ' ఆశించినట్టు ప్రపంచంలోని మతాలన్నింటినీ కలుపగా వచ్చే 'యూనివర్సల్ రెలిజియన్' అయినప్పటికీ...) సామ్యవాదం కాని, ఉపకరించగలదా అనే ఆలోచన చిరకాలంగా వున్నది. 70 ల తర్వాత 'త్రిపుర' రాసిన కథలు చదివినప్పుడు ఆ 'కనిపించిన ద్వారం' కకబడాలంటే సామ్యవాదం శరణ్యం అనే భావం కలుగుతుంది. శామ్యూల్ బెకెట్ రచించిన 'వెయిటింగ్ ఫర్ గోడోట్'ను జ్ఞాపకం చేసే 'భగవంతంకోసం' కథలో కథ చివరిలో 'త్రిపుర' అంటాడు. "భగవంతం రాడు. అట్నించి ఏడోనెంబరు బస్సులోనూ రాడు. ఇట్నించి పదమూడో నెంబరు బస్సులోనూ రాడు. (ఏడో నెంబరు బస్సు హిందూమతాన్ని, మదమూడో నెంబరు బస్సు క్రయిస్తవ మతాన్ని స్ఫురింపచేస్తాయి.) ఈ కథలోని (నిజానికి - ఇందులో కథ అంటూ ఏదయినా వుంటే) 'నేను' అనబడే వ్యక్తి గంటల తరబడి హోటల్‌లో ఎదురుచూస్తూ వేచివున్నది 'భగవంతం' అనబడే వ్యక్తి కోసం కాదనీ భగవంతం ఒక వ్యక్తి కాదనీ కథ ప్రారంభమైన కాసేపటికీ మనకు అర్థం అవుతుంది. 'హోటల్' అనేది సమకాలీన ప్రపంచానికి ప్రతీక అయితే భగవంతం భగవత్స్వరూపానికి ప్రతీక.

ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే- ఏడో నెంబర్లోను, పదమూడో నెంబర్లోనూ దొరకని భగవంతం పాపి మొగ్గలు ఎర్రగా జ్యోతుల్లా వెలిగినప్పుడు.... గులాబీ ఆర్కెడ్స్, ఓల్డ్ స్మగ్లర్ బాటిల్స్ సిరి సంపదలు అన్నింటినీ వదులుకోగలిగినప్పుడు- 'అభినిష్క్రమణ' కథలోని కథ చెప్పే వ్యక్తికి దర్శన మిచ్చాడనిపిస్తుంది. "ఆత్మాశ్రయ అనుభూతులు మెల్లమెల్లగా దగ్ధమవుతున్నాయి. సంశయాలు అడుగడుగునా వాటిని బద్దలుకొట్టి విడుదల కోసం చేసే ప్రయత్నాలు"... వాటి కోసమేగా!... త్రిపుర 'భగవంతం' కోసం చేసిన అన్వేషణ 'అభినిష్క్రమణ'లో విజయవంతంగా ముగిసిందనిపించింది.

త్రిపురకు ముందు మనో వైజ్ఞానిక దృక్పథంతో కథలురాసిన బుచ్చిబాబు, గోపీచంద్ ఇత్యాదులు మానవ మనస్తత్వంలోపలి 'చీకటిగదుల' కథను బయటపెట్టిన మాట, మనిషి గుండెల్లో క్రీస్తుకి, జుడాస్‌కి మధ్య జరిగే సంఘర్షణకు అద్దంపట్టిన మాట నిజమే కాని, వాటిల్లో లేని ప్రత్యేకత త్రిపుర కథల్లో కనబడుతుంది. త్రిపుర కథలు కేవలం "ఇంటలెక్చువల్ ఎక్సర్‌సైజెస్" లా కనబడవు. తానుచెప్పే కథలో రచయిత తాదాత్మ్యం పొందడం త్రిపుర కథల్లో చాలా చిత్రంగా కనబడుతుంది. (అది వాస్తవం అయినా కాకపోయినా సరే-) "నేను" అంటూ ప్రథమ పురుషలో కథ చెప్పే ధోరణిని రచయిత అత్యంత శక్తివంతంగా ఉపయోగించుకుని కవిత్వల్లాంటి కథలను అందివ్వడమే ఇందుకు కారణం అనుకుంటాను.

అంతేకాదు. వ్యక్తి అంతరంగ సంక్షోభానికి సామాజిక సంక్షోభానికి మధ్యగల సంబంధాన్ని తెలిపే సూత్రం కూడా 'త్రిపుర' రాసిన కొన్ని కథల్లో కనబడుతుంది. ఉదాహరణకు త్రిపుర రాసిన "వంతెనలు" "కనిపించని ద్వారం" రెండు కథలనూ తీసుకుందాం. ఈ రెండు కథలూ కథానాయకుడి ఆత్మహత్యతోనే ముగుస్తాయి. (నిజానికి త్రిపుర కథలలో జీవితంలో అసంబద్ధతకు గురిఅయిన పాత్రలు ఆత్మహత్యలకు పాల్పడడం తరచూ కనబడుతుంది. "అన్నింటి కన్నా ముఖ్యమైన ఫిలాసాఫికల్ ప్రాబ్లెం ఆత్మహత్య. కాలం, ఖర్మం ఏర్పరిచిన జీవిత పరిమితుల్ని ఒక్క నిమిషంలో దాటెయ్యాలి" అని 'ప్రయాణీకులు' కథలో శేషాచలపతి అనడం జ్ఞాపకం వుందా?) అయితే ఈ రెండు కథలూ మనలో ప్రేరేపించే ఆలోచనలు మాత్రం వేరు. 'కనిపించని ద్వారం' కథలోని కథానాయకుడికి కనిపించని ద్వారం 'వంతెనలు' కథానాయకుడికి కనిపించిందనిపిస్తుంది. అయితే ఆ ద్వారపు తలుపులను తెరవగల సత్తా అతనికి లేదు. 'చీకటికీ, వెలుతురుకూ మధ్య వంతెన వుందో, లేదో- నాలో మెరుపు మెరిసినప్పుడు ఏదో వంతెన మధ్య కలుసుకుందాం. అంతదాకా నన్ను నమ్ము రాజు" అనే ఆవేదన మాత్రం మిగిలింది. తుపాకిని ఆయుధంగా పట్టి సంఘంలోని చీడను వదిలించగల రాజుకు, తుపాకీతో తనను తాను కాల్చుకున్న కథానాయకుడికి చాలా తేడా వున్న మాట నిజమే. కానీ, గోపీచంద్

సీతారామారావులా "ఎందుకు? ఎందుకు?" అని మధన పడిపోతూ ఆత్మన్యూనతా భ్రాంతితో తండ్రిని, అతని ఆస్తిని ద్వేషించి, చచ్చేముందు బూట్లు పాలిష్ చేసుకుని 'సముద్రంలోకి దూకి చచ్చిపోయిన 'కనిపించని ద్వారం' కథలోని కథానాయకుడి అసంబద్ధ ప్రవర్తన కన్నా, 'వంతెనలు' కథ చివర్లో వచ్చిన గ్రహింపు ఎంతో మేలు.

"త్రిపుర' కథల్లో 'జర్కన్' కథ అంటే నాకు చాలా ఇష్టం. "పసుపూ కాదు ఆకుపచ్చా కాదు. మిరిమిట్లు గొలపదు. అంగుళపు పొడవు, నాలుగు ముఖాల అందం. ఇది జర్కన్ రాయి రూపం. వీరాస్వామి కూడా జర్కన్ రాయిలాంటి వాడే. మనకు కథ చెప్పే 'నేను' 'జర్కన్' రాయిని పోగొట్టుకోడానికి ఇష్టపడనట్లే, వీరాస్వామి తన జ్ఞాపకాలను కూడా ఎప్పటికీ మరిచిపోలేదు. నిజానికి అతడికి ఈ 'జర్కన్' రాయిని యిచ్చింది వీరాస్వామే! బుద్ధిస్ట్ ఫిలాసఫీ మీద ఉపన్యాసాలు ఇస్తూ అనేక దేశాలు తిరుగుతున్న కథకుడికి వీరాస్వామి రంగూన్‌లోని 'మింగ్లడన్' ఎయిర్ పోర్ట్'లో దీనిని కానుకగా ఇచ్చాడు. ఇసుక చీపుళ్ళు పెట్టి దేశాన్ని తుడవాలి, మిగిలిన చెత్తమ కాల్చాలి అనేవాడు వీరాస్వామి.

వివేకానంద స్వామి కోరుకున్న "ఇనుప కండరాలు, ఉక్కు నరాలు" వీరాస్వామిలో వున్నాయనిపిస్తుంది. లేకుంటే ఎన్నో అక్రమాలు చేసి కోట్లకు విలువయిన 'కార్గోబోట్ల' సామ్రాజ్యానికి అధిపతిఅయి, ఆర్థికంగా ఉన్నత శిఖరం మీద వున్న వీరాస్వామి హఠాత్తుగా అదంతా వదిలేసి భారతదేశానికి తిరిగి వచ్చి పాకలలో కూలీల మధ్య ఏ విధమైన గుర్తింపూ లేకుండా బ్రతుకుతాడా? గాంధీజీ పదేపదే చెప్పే ఈ 'వాలంటరీ పావర్టీ' వెనుక వీరాస్వామి తనను గురించి తాను చేసుకున్న అన్వేషణ వున్నది.

వీరాస్వామికి జీవితంలో కనబడిన అసంతృప్తిని గమనించినప్పుడు కథకుడు "వీరాస్వామి తనని తాను తెలుసుకోవాలి. తనకు ఏది కావాలో తెలుసుకుని తనలోంచి తాను వేరుపడి తనను చూసుకోవడం నేర్చుకోవాలి" అని అనుకున్నాడు. కాని కొద్ది సంవత్సరాలలో వీరాస్వామి తనకన్నా ఎంతో ఎత్తు ఎదిగిపోతాడనీ, వృత్తిపరంగా తాను చెప్పే 'అనాసక్త యోగం'లో అతడు సిద్ధిని పొందుతాడనీ ఊహించలేకపోయాడు. వీరాస్వామి తన ఆస్తినంతా వదులుకుని పాకలో వుంటున్నప్పుడు కథకుడితో అన్నాడు- 'నాలోంచి నేను వేరుపడి వచ్చాను" అని! కాని, ఆ తర్వాత తెలిసింది కథకుడికి. వాడలో ఇళ్ళు కాలినప్పుడు 'ఏడు' గురిని రక్షించి ఆ మంటలకే వీరాస్వామి ఆహుతి అయిపోయాడని! "బ్రతికుండగా గీరగాడని ఒగ్గేసినాం. బస్మం అయ్యాక ఆడిని తలచుకోని రోజు లేదు" అన్నాడు ఆ వాడలోని శ్రమజీవి ఒకడు కథకుడితో వీరాస్వామి గురించి చెబుతూ.

బౌద్ధతత్వ శాస్త్రాన్ని క్షుణ్ణంగా అభ్యసించి దేశవిదేశాలలో ఉపన్యాసాలు ఇచ్చే కథకుడు సాధించలేని పనిని వీరాస్వామి సునాయాసంగా సాధించాడు. మన కథకుడు "ఆలోచనకీ,

తెలుసుకోడానికీ మధ్య అఖాతం వుంది. ఆలోచిస్తే తెలియదు" అని గ్రహించగలిగాడు గాని, 'తెలుసుకోడానికి' ఏం చెయ్యాలో గ్రహించలేకపోయాడు. లేకుంటే కళ్యాణి గురించి అతగాడికి అంత ఆవేదన ఎందుకు?

కాని, వీరాస్వామి ఆలోచనని, తెలుసుకోడానికి మధ్యగల అఖాతాన్ని అందులో హోరుపెట్టే జలపాతాన్ని లెక్కపెట్టకుండా అవతలి గట్టుకు గెంతేసాడు. అప్పుడేకదా కథకుడు అనుకున్నది "అవతలి గట్టుకు గెంతెయ్యగలననీ, మానవ మాత్రుణ్ణి కాననీ".

"భగవంతం కోసం" కథలో అంటాడు త్రిపుర "అన్ని కలిపేసేయండి. ఒకదాని కొకటి గొలుసులాగ కలిపి ఆలోచించండి. అర్థమయిపోతుంది. ఆ తర్వాత అంతా సులభమే." అని! అయితే, ఈ పని ప్రారంభించాల్సింది తత్వశాస్త్ర తరగతుల్లో కాదు జీవితంలో, అనుభవంలో, ప్రజల మధ్యలో .....

వీరాస్వామి "ఉక్కు చీపుళ్ళు కావాలన్నది అందుకే"! ఇది జరగాలంటే చీకటికీ, వెలుతురుకు మధ్యగల 'వంతెన' ఎలా దాటగలమనే సందేహం రావడం సహజం. 'ఎర్రటి రంగుల్తో చిత్రించిన బుద్ధుడు' ('అభినిష్క్రమణ' కథలో) ఇచ్చే సందేశం ఇందుకు ఉపకరించగలదను కుంటాను.

---

# 33

## సి.రామచంద్రరావు - "వేలు పిళ్ళై"



"జార్జియా ఎర్రకొండల మీద బానిసల కొడుకులు, వారి యజమానులు భ్రాతృత్వమనే బల్ల దగ్గర కూర్చున్నట్టుగా కలగన్నాను. చర్మపు రంగును బట్టి కాక, శీలాన్ని బట్టి విలువను నిర్ణయించే దేశంలో నా నలుగురు పిల్లలూ నివసించినట్టు కలగన్నాను. నల్లరంగు బాలలు, తెల్ల రంగు బాలలు చెట్టాపట్టాలు వేసుకుని అన్నదమ్ముల్లాగా, అక్క చెల్లెళ్ళలాగా కలిసి మెలిసి తిరిగే రోజు వస్తుందనీ, అగాధాల లోతులు తగ్గి, కొండల ఎత్తు తరిగే రోజు వస్తుందనీ కలగన్నాను."

-చాలాకాలం క్రితం అమెరికాలోని వాషింగ్‌టన్ మాన్యుమెంట్ నుంచి లింకన్ మెమోరియల్ వరకు సాగిన రెండు లక్షల నీగ్రోల శాంతి సేవను ఉద్దేశించి 'అమెరికన్ గాంధీ' మార్టిన్ లూథర్ కింగ్ అన్నమాటలు ఇవి. ఈ పలుకులలో వర్ణ వివక్షత పట్ల దానికి మూల కారణమైన జాత్యహంకారం పట్ల ఆవేదన వున్నది. దానిని అంతమొందించాలనుకునే ధృడసంకల్పం వున్నది.

ఇప్పుడు ఇది ఎందుకు రాశానంటే-

చాలా కాలం క్రితం సి. రామచంద్రరావుగారు రాసిన 'నల్లతోలు' కథను మళ్ళీ మళ్ళీ చదువుతుంటే ఏదో ఒక ఆవేదన గుండెను పట్టి ఊపి ఇది 'పాత కథ' కాదు అని గుర్తుచెయ్యడం. ఒక వేళ పాత కథ యినా ఆ కథ కొత్త రంగులు పులుముకుని, వేషాలు మార్చుకుందని జ్ఞాపకం రావడం.

మంచి తెలుగు కథల పట్ల అభిరుచి వున్న పాఠకులకు, సి. రామచంద్రరావుగారి గురించి ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. ఒక కథకుడు ఎన్ని కథలు రాశాడని కాకుండా, గుర్తు పెట్టుకోదగ్గ కథలు ఎన్ని రాశాడని ఆలోచించినప్పుడు మన మనోవీథిలో మెదిలే కొద్దిమంది కథకుల్లో రామచంద్రరావుగారు ఒకరు.

రామచంద్రరావుగారి 'నల్లతోలు' కథ చదివినప్పుడు బ్రిటిష్‌వాళ్ళు మనల్ని వదిలిపెట్టి వెళ్ళి చాలా కాలం అయినప్పటికీ మన గుండెల్లోని బానిస ప్రవృత్తి ఇంకా పోలేదని మరోసారి అనిపించింది. ఈ కథలోని సేట్‌రావు ఆర్థికంగా బాగా శ్రీమంతుడు. ఒక ధనికుడైన బ్రిటిషర్ ఇంగ్లండులోనూ, బానిస దేశాల్లోనూ అనుభవించగల విలాసాల నన్నింటినీ జీవితంలో అనుభవించినవాడు. ప్రపంచంలో ఉన్నత విద్యకు ప్రతిష్ఠాకరమైన స్థానాన్ని కలిగివున్న 'ఆక్స్‌ఫర్డ్' విశ్వవిద్యాలయంలో చదువుకున్నవాడు. మీకు మిక్కిలి స్నేహశీలి. ఆ స్నేహం బ్రిటిష్‌వారితో అయినప్పుడు అది ఎంతో గర్వింపదగ్గ విషయం అని భావించే వ్యక్తి. ఇలాంటి సేట్‌రావ్‌లో ఏదో ఒక మూల- తెల్లవారితో పోల్చినప్పుడు తాను తక్కువవాడిననే ఆత్మన్యూనతా భ్రాంతి, తెల్లవారి అలవాట్లను అనుసరించడమే హై సొసైటీ నాగరికత అనుకునే 'భ్రమ' పుష్కలంగా వున్నాయి. ఈ బలహీనత కారణంగానే అతడు ఇంగ్లీషు మిత్రుల పార్టీలో అవమానం పాలయ్యాడు.

బ్రిటిష్ మిత్రుడు స్టూవర్ట్ ఇచ్చిన కాక్‌టెయిల్ పార్టీకి అహ్వానింపబడిన భారతీయుడు తానొక్కడినేనని, దారుణంగా ఉక్కపోస్తున్నా డిన్నర్‌కోట్ వేసుకుని మ్రగ్గిపోవడంలోనే సభ్యతా నాగరికతా వున్నాయని సేట్‌రావ్ మురిసిపోయాడు. కాని జన్మలో 'ఆక్స్‌ఫర్డ్' పేరు కూడా వినని నేలబారు బ్రిటిషర్ల ముందు తాను 'తక్కువజాతి' మనిషిగా తల వంచుకుని తప్పుకోవలసి వస్తుందని కలలోనైనా ఊహించలేకపోయాడు. ఇది జరిగింది ఇంగ్లండ్‌లోనూ కాదు, తెల్లవారు నల్లవారిని పరిపాలిస్తున్న రోజులలోనూ కాదు. స్వతంత్ర భారతదేశంలో తెల్లవారి గుంపు మధ్యలో వున్న నల్లవాడికి జరిగిన అవమానం ఇది. బ్రిటిష్ సమాజంలో చావకుండా మిగిలివున్న జాత్యహంకారం సేట్‌రావ్‌ను కాటువేసిన వేళ, సేట్‌రావ్‌కు వున్న సిరిసంపదలు, 'జాగ్‌వార్‌మార్క్-7' ఇంపోర్టెడ్ కాదు, పాశ్చాత్య వేషభాషలు, ఈ అవమానం నుంచి రక్షించలేకపోయాయి. మందు మజా మీద వున్న డంకన్ హార్వే సేట్‌రావ్ అంతటివాణ్ణి పట్టుకుని 'ఈ నల్లతోలుగాడు ఇక్కడికి ఎలా వచ్చాడు' అంటూ మెడ పట్టుకుని గెంటేయ్యడానికి కారణం వాళ్ళు 'మందు' మీద ఉండడం ఒకటే కాదు! డంకన్ హార్వే మిత్ర బృందంలో వున్న 'సుపీరియారిటీ కాంప్లెక్స్' (జాతికి సంబంధించి) కూడా ఈ పనికి కారణం కాకపోవచ్చు. ప్రపంచంలో ఒకప్పుడు ఎంతో ఉన్నతమైన జాతిగా చెలామణి అయిన జాతికి చెందినవాళ్ళమైనప్పటికీ - సేట్‌రావ్‌కు వున్న ఐశ్వర్యం, అతగాడికి వున్న 'ఆక్స్‌ఫర్డ్' చదువు, తమకు లేవనే ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ జాత్యహంకారం పేరుతో సుపీరియారిటీ కాంప్లెక్స్‌గా బయటకు వచ్చి, సేట్‌రావ్‌ను అవమానించిందని నా ఉద్దేశ్యం. మరి వాళ్ళకు ఈ అవకాశాన్ని ఇచ్చింది పాశ్చాత్య నాగరికతా వ్యామోహాలతో సేట్‌రావ్

తన గుండెల్లో పెంచుకున్న ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ కాదూ? ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌కు అందమైన కథా రూపం 'నల్లతోలు' కథలో కనబడి కథాసాహిత్య ప్రియులకు అనందాన్ని కలిగిస్తుంది.

ఈ కథ వెనుక వున్న మనోవైజ్ఞానికపరమైన భావాలు ఏమైన్పటికీ ఈ సందర్భంలోనే ఓ విషయం వ్రాయాలనిపిసుతంది. నిజమైన జాతీయ వాది తప్పకుండా అంతర్జాతీయవాది అవుతాడనే వారు గాంధీజీ. మనుషులు వేలకొద్దీ, విడి విడి గదుల్లో వున్నప్పటికీ, ఇవి అన్నీ ఒకదానితో ఒకటి సంబంధం లేని విడి విడి గదులు కావని, వీటికి పరస్పర సంబంధం వుందని అనేవారాయన. కాని, గదుల మధ్య గల తలుపుల్ని బలవంతంగా మూసి మనిషికీ, మనిషికీ మధ్య కృత్రిమమైన దూరం కల్పించే కథ ఈనాటిది కాదు. ఏదో ఒక దేశానికి ఏదో ఒక కాలానికి సంబంధించింది కూడా కాదు. అందుకే డంకన్ హార్వే అసందర్భ ప్రలాపానికి అసలు కారణం 'మందు' మాత్రమే అనిపించలేదు నాకు.

మానవ ప్రవృత్తికి సంబంధించిన ఇట్లాంటి 'పాత కథే' డబ్బు, అధికారాల కథ కూడా. 'క్లబ్‌నైట్' కథలోని విజయకుమార్ కథా రచయితగా విమర్శకులు మెచ్చుకునే స్థాయికి ఎదిగినా హఠాత్తుగా కథలు రాయడం ఎందుకు మానేశాడు? తీరిక లేకపోవడం వల్లనా - లేక ఎక్కడో దూరంగా వున్న విమర్శకులు మెచ్చుకోవడం కన్నా టీ ఎస్టేట్ ప్రెసిడెంట్‌గా తన చుట్టూ వున్నవాళ్ళు చేసే కృత్రిమమైన ప్రశంసలు, ఇచ్చే గౌరవాలు విలువైనవని భావించడం వల్లనా? అధికారం ఇచ్చే మజాముందు కథకుడుగా పొందే గుర్తింపు నిలుస్తుందా? ఇట్లాంటి వ్యక్తిచేత మళ్ళీ కలం పట్టించాలని చేసే ప్రయత్నాలు విస్కీ సరదాలలో కరిగిపోవూ? ('క్లబ్ నైట్' కథలో)

రామచంద్రరావుగారి కథలలో 'వేలు పిళ్లై' కథ అంటే నాకు చాలా ఇష్టం. (1959 ఆంధ్రపత్రిక దీపావళి కథల పోటీలో మొదటి బహుమతి పొందిన కథ ఇది) సామాజిక నీతికి, వ్యక్తిగత విలువలకు మధ్య గల తేడాను గుండె లోతుల్లోంచి అందంగా చూపే కథ ఇది. అంతేకాదు- సమకాలీన ప్రపంచపు వ్యాపార విలువల పట్ల చురుక్కుమనిపించే విమర్శ (బాగా పరోక్షంగానే అనుకోండి) కూడా ఈ కథలో కనబడుతుంది.

ఈ కథలోని 'వేలు పిళ్ళై' ప్రాస్పెక్టివ్ టీ ఎస్టేట్‌లో కూలీవాడుగా జీవితాన్ని ప్రారంభించి, ఆ స్థితి నుంచి వ్యాపారస్తుడిగా బ్రతుకులో ఎదిగాడు. వినాయకుడికి గుడి కట్టించి పదిమంది చేతా సెబాష్ అనిపించుకున్నాడు. ఇలాంటి వేలుపిళ్ళై కథ వెనుక చీకటి చీలికలు చాలా వున్నాయి. ఇందుకు అతని భార్య 'పవనాళ్' చాలావరకు కారణం.

వ్యాపారంలో కాస్త నిలదొక్కుకున్న వేలుపిళ్ళై భార్యకు మంచి చీరలు, నగలు వగైరా చేయించిన తర్వాత తన కిరాణా దుకాణాన్ని మరింతగా పెంపొందించి లక్షలు వెనకేయాలని కాకుండా వినాయకుడిగుడి కట్టించాలనుకున్నాడు. గుడి కట్టించడం సంఘానికి ఉపకారమా? ఇంతకన్నా మంచి పనులు ఈ ప్రపంచంలో లేవా? ఇలాంటి ప్రశ్నల జోలికి పోకుండా ఆలోచిస్తే- ఒక సాధారణ కిరాణా కొట్టు యజమానికి ఇదొక అసాధారణమైన ఆలోచన అని ఒప్పుకోక తప్పదు. ఇందులో స్వార్థం లేదు. నలుగురికీ చేతనైనంత ఉపయోగపడదామనే తపన మాత్రమే వున్నది.

వేలుపిళ్ళై భార్యకు ఈ ఆలోచన సుతరామూ నచ్చలేదు. రామచంద్రరావుగారు చెప్పదలచుకున్న వేలుపిళ్ళై కథ అక్కడినుంచే ప్రారంభమైంది. భార్యకు తెలియనివ్వకుండా తన ఆలోచనను అమలుచేద్దామని ప్రయత్నించిన వేలుపిళ్ళై సాధారణ దృష్టికి కొన్ని తప్పుడు పనులే చేశాడు. కొట్టుమీద వస్తున్న ఆదాయం వివరాలు భార్యకు తెలియనిచ్చేవాడు కాదు. ఖాతాదారులతో లాలూచీపడి, దొంగ లెక్కలు చూపించాడు. ఇంటినంతా గుల్లచేసి అపర రామదాసులా వినాయకుడికి ఓ చిన్న గుడి నిర్మించడంలో నిలువునా మునిగిపోయాడు. ఇంతటితో ఆగకుండా మామగారు అత్యవసరంగా అప్పు కావాలన్నారని అబద్ధం ఆడి, దొంగ ఉత్తరం సృష్టించి, భార్య నగలను 'పొల్లాచీ' లోని మార్వాడీ దగ్గర తాకట్టు పెట్టాడు. వినాయకుడి విగ్రహాన్ని ప్రతిష్టించడానికి డబ్బు సరిపోకపోతే 'కొన్నత్తూరు' గుడి ఆవరణలో వున్న వినాయకుడి విగ్రహాన్ని అర్ధరాత్రి పూట దొంగతనంగా పెకిలించి తీసుకువచ్చాడు.

యాభైఏళ్ళు పైబడిన వేలుపిళ్ళై చేసిన సాహస కార్యాలు ఇవన్నీ! ఈ సాహస కార్యంలోనే అతనికి యవ్వనంలో వున్న అందకత్తె 'సెందామరై' పరిచయం అయింది. కొన్నత్తూరులో వినాయకుడి విగ్రహాన్ని దొంగిలించినప్పుడు అలికిడి విని 'దొంగ' 'దొంగ' అంటూ జనం వెంట తరిమితే వేలుపిళ్ళై తలదాచుకున్నది సెందామరై ఇంటిలోనే! ఆ చీకటిలోనే వాళ్ళిద్దరికీ నేస్తం కుదిరింది. దాంతో అతడి జాతకం మారింది.

పట్నం నుంచి లారీలో సరుకులు తీసుకువచ్చే చెట్టియార్ వేలుపిళ్ళైకి సరుకులు అరువు ఇచ్చాడు. పనవాళ్ పెట్టే నరకం వదిలిపోవడం మాత్రమే కాకుండా మొగుడ్ని నానామాటలు అని ఇంటిలోంచి చెప్పా చెయ్యకుండా పారిపోయిన మొదటి భార్యకు భరణం ఇవ్వనవసరం లేదని పెద్దలు తీర్పు చెప్పారు. కొట్టుమీద సెందామరై చిరునవ్వులు చిందిస్తూ కూర్చునేటప్పటికి అమ్మకాలు విపరీతంగా పెరిగిపోయాయి. అపుడు మరి - సెందామరై ఒంపులు, సొంపులు చూచి మతిపోగొట్టుకోకుండా వుండడం సాధ్యమేనా?

వయస్సులో ఎంతో తేడా ఉన్నప్పటికీ సెందామరై వేలుపిళ్ళైని ఎంతో సుఖపెట్టింది. అతగాడి అవసరాలన్నిటినీ చూసింది. అభిప్రాయాలను గౌరవించింది. మొదటి భార్యలా ఊరంతా అల్లరి చేసి పరువు తియ్యకుండా గౌరవాన్ని కాపాడింది. అంతేకాదు – ఆ రోజున సెందామరై ఇంటిలో ఆశ్రయం దొరకకపోతే వినాయకుడి గుడి పనిపూర్తి అయ్యేదే కాదు. సెందామరై గురించి వేలుపిళ్ళైకు వున్న అభిప్రాయాలు ఇవి.

కానీ ఊళ్ళో చెవులు కొరుక్కునే కథ వేరే వుంది. వాళ్ళ దృష్టిలో సెందామరై శీలవతి కాదు. వేలుపిళ్ళై వ్యాపారం అభివృద్ధి చెందడం వెనుక ఆమె సాగించిన శృంగార కాండ కూడా వుంది. ఇది వేలుపిళ్ళైకి తెలుసా? తెలియదా? అనేది బ్రహ్మరహస్యం. సెందామరై చచ్చిపోయినప్పుడు సర్వస్వాన్ని మరిచిపోయి వేలుపిళ్ళై వినాయకుడి గుడి మెట్ల దగ్గర పిచ్చివాడిలా ఏడుస్తూ ఉంటే – అందరూ సెందామరై లాంటి మనిషి కోసమా వేలుపిళ్ళై ఇంత బెంగ పెట్టుకున్నదీ' అని బుగ్గలు నొక్కుకున్నారు. చెట్టియార్ కూడా అసలు విషయం చెప్పి అతడి దుఃఖాన్ని మళ్ళిద్దామనుకున్నాడు. కాని అందరికీ తెలిసిన 'అసలు విషయం' అతనికి అక్కరలేదు. అతని దృష్టిలో సెందామరై కేవలం రక్తమాంసాలున్న మనిషి కాదు. అంతకు భిన్నమైన మూర్తిని అతడు సెందామరైలో చూశాడు.

ఓ విధంగా చూస్తే – వేలుపిళ్ళై– సెందామరై ఇద్దరూ లోకం దృష్టిలో తప్పులు చేసినవాళ్ళే. 'నీతి' అని నలుగురు ముద్రవేసినదాన్ని పాటించని వాళ్ళే! కాని 'నీతి' కి అతీతమైన శాశ్వత బంధమేదో వాళ్ళని బంధించింది. ఆ బంధాన్ని అర్థం చేసుకోగల స్థాయికి మనం ఎదగాలంటే 'నీతి' రంగుటద్దాలను పక్కకు పెట్టాలనుకుంటాను. ఇది రాస్తుంటే బెర్ట్రాండ్ రస్సెల్ భావవాణి అంతా వినబడుతుంది. అంకితమివ్వకపోయినా రసెల్‌కి అంకితమైన కథ 'వేలుపిళ్ళై' !

---

# 34



## భానుమతీ రామకృష్ణ
## 'అత్తగారూ కూర్మావతారం'

సాంసారిక జీవితంలోని హాస్యాన్ని రసగుళికల్లాంటి కథలుగా మలిచిన ఆధునిక రచయితల పేర్లు చెప్పవలసి వస్తే - మన మనస్సులో మెదిలే మొదటి పేరు కాంతం కథల మునిమాణిక్యం వారిదీ, రెండోపేరు అత్తగారి కథల 'భానుమతీ రామకృష్ణ గారిదీ! మునిమాణిక్యం వారి కథలలో కనబడేది మధ్యతరగతి కుటుంబాలలోని దాంపత్య ప్రేమను అనుకుని వచ్చే హాస్యం అయితే - భానుమతిగారి కథలలో కనపడేది కలవారి కాపురాలలో పెద్ద తరానికి కుర్రతనానికి మధ్య జరిగే సున్నితమైన సంఘర్షణ లోంచి పుట్టుకొచ్చిన నాజూకయిన హాస్యం. యాంత్రిక జీవితంలోని విసుగు నుంచి సగటు మనిషిని సేద తీర్చడానికి ఎంగిలి కూడులేని ఇల్లాంటి రచనలు ఎంతగానో ఉపకరిస్తాయి. మండు వేసవిలో ఉస్సురంటున్న మనిషికి మునిమాణిక్యంగారి కథలు అప్పుడే చెట్టునుంచి దింపిన కొబ్బరిబొండాల నీళ్ళు అయితే - భానుమతిగారి కథలు 'ఫ్రిజ్' లోంచి తీసిఇచ్చిన చల్లటి 'ఏపిల్ జ్యూస్' అనవచ్చు. దేని రుచి దానిది.

తెలుగు సాహిత్యంలో అత్తాకోడళ్ళ కథ కొత్తదేమీ కాదు. అయితే భానుమతి అత్తగారి పద్ధతి వేరు. ఈమె గయ్యాళి కాదు. అలా అని - బొత్తిగా నోట్లో నాలుకలేని మనిషి కూడా కాదు. తన మాట నెగ్గించుకోవాలనే పట్టుదలకు లోటు ఏమీ లేదు. అయితే ఆ పట్టుదల మంచికీ, మానవత్వానికి దూరమైంది కాకపోవడంలోనే అత్తగారి ప్రత్యేకత కనబడుతుంది. సరే - ఈమెగారి సెంటిమెంట్ల గురించి చాదస్తాల గురంచి చెప్పాలంటే ఎంతయినా వుంది. మరి - కోడలుగారి మాట ఏమిటంటే ఈమె అత్తచాటు కోడలు. అత్తగారంటే ఆమెకు కేవలం భయం మాత్రమే కాదు. బోలెడంత అభిమానం కూడా ఉంది. దీనికి తగ్గి గడుసుదనమూ ఉంది. ఇల్లాంటి అత్తా కోడళ్ళు వున్న ఇంటిలో డబ్బుకు, హోదాకు, పనివాళ్ళకు దేనికీ లోటు లేదు. ఊరికి దూరంగా కట్టుకున్న ఇంటిలో త్రాగడానికి సరిఅయిన

నీరు పడకపోతే రోజూ తమ పాత ఇంటిలోంచి కారులో, డ్రమ్ములతో నీరు తెప్పించుకోగల ఆర్థిక స్థాయి వాళ్ళది.

ఈ సెట్టింగ్‌లోంచి ఆలోచిస్తే - అత్తగారు వంట వాడిచేత పన్నీరు పప్పు చేయించినా, జ్యోతిష్యుడు చెప్పిన మాట ప్రకారం లంకెబిందెల కోసం అర్ధరాత్రి ఇంటి పెరడులో త్రవ్వించినా, వేలకొద్దీ మామిడికాయంలతో అవకాయ పెట్టించినా - అంతా మనకు ఆమె స్వభావానికి తగ్గట్టుగా సహజంగా జరిగినట్టు అనిపిస్తుంది. కొత్తగా దిగిన ఇంటిలో దజన్ల కొద్దీ పాములు గుంపులు గుంపులుగా రాత్రి రెండో ఆట సినిమాకి వెళ్ళినట్టు కనబడితే - హడలిపోయిన అత్తగారు వాటిని పట్టించడం కోసం పాముల వాళ్ళకు కబురుపెట్టి - చిన్న పాములను పట్టడానికి రేటులో "కన్సెషన్"ర అడగడమూ, పాతబట్టలకి స్టీలు సామాను అమ్మేవాడి ముఖాన ఓ పాతమడిచీర, నాలుగు పాత జాకెట్లు పడేసి బోలెడన్ని పాత్ర సామగ్రిని బేరమాడడమూ - (వాడు ఒక స్టీలు స్పూన్ మాత్రం ఇస్తానన్నాడనుకోండి) తలుచుకున్నప్పుడల్లా నవ్వు వస్తుంది.

ఓ విధంగా ఆలోచిస్తే పుట్టింటి నుంచి తెచ్చుకున్న పాత గడియారం లాంటిదే అత్తగారు కూడా. (అత్తగారు అష్టావధానం కథ జ్ఞాపకం లేదూ!) అంకెలు మాసిపోయి, ముళ్ళు సగం దాకా విరిగిపోయి, శిధిలావస్థలో గోడకు వ్రేలుదుతున్న ఆ గడియారం సిలువ కొట్టబడిన ఏసుక్రిస్తును జ్ఞాపకం చేస్తూ వుంటుందట. దాన్ని రిపేరు చెయ్యడానికి ఇవ్వబోతే ఏ గడియారం కంపెనీవాళ్ళూ తీసుకోక నమస్కారం పెట్టి ఇచ్చేశారట - మ్యూజియంలో 'వుంచమంటూ.

పాత గడియారం లాంటి అత్తగారిని 'రిపేరు' చెయ్యడం కోడలి ఉద్దేశం కాదు గానీ - అత్తగారి కథ వింటున్నప్పుడు మాత్రం మన గుండెల లోతుల్లోంచి గడియారాలలో విరిగిపోయిన ముళ్ళు త్రాగినవాడు పాడుతున్నట్లుండే గంటల ధ్వని వున్నదేమోనని రవ్వంత జంకు పుట్టడం సహజం.

రచయిత్రిగా భానుమతిగారికి విశిష్టమైన పేరు ప్రఖ్యాతులను తెచ్చిపెట్టిందని అత్తగారి కథలయినప్పటికి - ఇవిగాక, గిలిగింతలు పెట్టే కథలనెన్నింటినో రాశారామె. "ఎందుకు లెండి..." కథ చదివారా? సిగరెట్ మానేద్దామనుకున్నవాళ్ళు, మానేసి మళ్ళీ కాల్చినవాళ్ళు భర్తలచేత సిగరెట్లు మాన్పిద్దామని వ్యర్థ ప్రయత్నాలు చేసిన భార్యలు, అందరికీ ఇది తమ కథలాగా అనిపించినా ఆశ్చర్యం లేదు! సిగరెట్ మానెయ్యగలిగిన ఆసామీ పైప్‌తోనూ, ఫిల్టర్ సిగరెట్లతోనూ, అవస్థపడి ఆ తర్వాత ఫిల్టర్ సిగరెట్ పెట్టెల్లో మామూలు సిగరెట్లు

పెట్టుకుని కాలుస్తున్నాడన్న వైనం బయటపడినప్పుడు ఆ ఇల్లాలు "ఎందుకులెండి..." అనుకోక ఏం చేస్తుంది? ("అత్తగారూ-నరసమ్మాయణం" కథలో సమయానికి చుట్టపడకపోతే చికాకుతో వెర్రిక్కిపోయే పనిమనిషి సర్వమ్మ కథ జ్ఞాపకం లేదూ?)

భానుమతిగారి కథలలో 'కృత్యాద్యవస్థ' కథ కూడా బాగుంటుంది. కథను ఎలా మొదలు పెట్టాలి. ఎలా రాయాలి అనేది ఎంత కొమ్ములు తిరిగిన రచయితకయినా సామాన్యమయిన విషయం కాదు. దీపావళి సంచికకు కథ ఇమ్మని చక్రపాణిగారు తొందర చేస్తున్న మాట నిజమే. కాని ఇతివృత్తం మాటేమిటి? కర్ణాటక సంగీతంలోని మాధుర్యాన్నంతా వంటలో వలకబోసి వంటావిడ 'మామీ' హఠాత్తుగా వాళ్ళ వూరు వెళ్ళిపోవడం వెనుకగల కారణాల గురించి రాయలా? వాళ్ళ అత్తగారి సవతి ఆడబిడ్డ మనుమరాలికి కడుపులో 'కంతి' వస్తే గర్భిణీ అయిందనుకొని అత్తగారు చేసిన ఆర్భాటం గురించి కథ రాయాలా? భగవంతుడు ఇచ్చిన సిరిసంపదలు అనుభవించే అవకాశాన్ని కోల్పోయి, పిచ్చెత్తి - మిఠాయి, కొట్టు వద్ద బిచ్చగాడిలా వున్న వ్యక్తి విషాద గాథ గురించి రాయాలా? - 'కాదేదీ కథకనర్హం' అనుకుంటే సరిపోతుందనుకుంటాను!

శ్రీమతి భానుమతి అత్తగారి కథలలో "అత్తగారూ కూర్మావతారం" కథ నాకు ఎంతో ఇష్టం. బారిస్టర్ పార్వతీశం టోపీలాగా ఎంత వదిలించుకుందామన్నా వదలని పెంపుడు తాబేలు గురించి తాబేలును చూచి దడుచుకునే పెళ్ళికొడుకు వెంకటేశం, తాబేలును ముద్దుచేసే అతగాడి లావుపాటి భార్య ఇవన్నీ తదలచుకుని నవ్వుకోవడం అంటే మరీ ఇష్టం. ('లావు' అంటే జ్ఞాపకం వచ్చింది అర్ధరాత్రిపూట రెండో కంటివాడికి తెలియకుండా పెళ్ళికెదిగిన లావుపాటి కూతురు చేత చిన్నసైజు రోలరు లాగించి ఎక్సర్‌సైజు చేయించిన దేశవాళీ రాజాగారి కథ జ్ఞాపకం వుందా? అర్ధరాత్రి పూట రోలరు 'కిర్రు కిర్రు'లూ - కూతురుకు తండ్రి ఇచ్చే ఆదేశాల గుస గుసలూ విని, చెట్లు అడ్డంగా వున్నందున పరిస్థితి అర్ధంకాక - నానా అవస్థపడి 'డిటెక్టివ్' పనిచేసి - తనివితీరా నవ్వుకున్న ప్రక్కింటి భార్యాభర్తల సంగతి సరేసరి! 'రోడ్ రోలర్ కథలో)

ఇంతకూ వెంకటేశం కథ ఏమిటంటే - అతగాడు అత్తగారి అక్క మనుమడు. తండ్రి లేని వెంకటేశాన్ని అత్తగారు చేరదీసి ఎం.ఏ. దాకా చదివించారు. ఇంతవరకూ బాగానే ఉంది. కాని - అప్పుడే పెళ్ళి వద్దు మొర్రో అని అతగాడు గోలపెడుతూ వున్నా వినకుండా వాడిచేత ఓ 'లక్షణ'మైన పిల్లకు మూడు ముళ్ళూ వేయించేద్దామని ముచ్చటపడడం తోనే అసలు కథ ప్రారంభమైంది. పెళ్ళిచూపులకు అత్తగారితోపాటుగా వెళ్ళిన వెంకటేశం

పెళ్ళికూతురు 'స్థూల' దేహాన్ని ఆమె తండ్రి, అన్నగార్ల స్థూల దేహాలను చూసి దడుచుకున్నారు. ఈ దడుపువల్లే అతగాడికి దడుపు జ్వరం వచ్చిందని చెప్పలేం కానీ, అందుకు మరో ముఖ్యమైన కారణం ఉంది. పెళ్ళి చూపులకు వెంకటేశం వచ్చినప్పుడు అతగాడి కాళ్ళదగ్గరకు పెంపుడు తాబేలు వచ్చి కాలు కొరికింది. దాంతో అతగాడు 'కెవ్వు'మని కేకపెట్టడం, ఆపైన జ్వరం రావడమూ జరిగాయి. (అయినా - శుభమా అని పెళ్ళిచూపులకు బయలుదేరుతూ ఎదురు రమ్మని పక్కింటి ముత్తయిదువకు కబురుపెడితే - ఆవిడ వచ్చే లోపునే కూరల సంచీ పట్టుకునిన వంట బ్రాహ్మడు వెంకటేశం ఎదురయితే - తాబేలు కరవక ఏం చేస్తుందీ')

'సరే ఈ కథ ఎలా ఉన్నా వెంకటేశం అభిప్రాయంతో నిమిత్తం లేకుండా అత్తగారు పెళ్ళి ఖాయం చేసేసుకుని వచ్చేసారు. ముహూర్తాలు కూడా పెట్టించేసేశారు. అయితే ఈ లోపున వాళ్ళింట్లో ఈనబోతున్న 'గోమాత' చుట్టూ ప్రదక్షిణం చేస్తే బోలెడు పుణ్యం వచ్చేస్తుందని ఆశపడిన అత్తగారు అవుచుట్టూ తిరగబోతే పురుటి నొప్పులు పడుతూ చికాకుగా వున్న ఆవు అత్తగారిని పెద్దంతరం చిన్నంతరం లేకుండా తన్నినందువల్ల ఆవిడ చెయ్యి విరిగిందనుకోండి. కాని ఆ 'ట్రాజెడీ' కూడా వెంకటేశం పెళ్ళిని తప్పించలేకపోయింది.

ఇంతకూ చెప్పొచ్చేదేమంటే పెళ్ళికి వెడుతూ పిల్లిని చంకన పెట్టుకుని వచ్చినట్టు పెళ్ళికూతరు తనతోపాటుగా తాబేలును కూడా తీసుకు వచ్చింది. వచ్చిన తాబేలు తిన్నగా వుండకుండా సూత్రధారణ సమయంలో పెళ్ళికొడుకును ముద్దుపెట్టుకుంటే అతగాడు గాభరాపడిపోయి పెళ్ళికూతురు మెళ్ళో కట్టవలసిన మంగళసూత్రాన్ని పురోహితుడి మెళ్ళో కట్టినప్పటికీ ఆ తర్వాత సర్దుబాటు చేయించి పెళ్ళి జరిపించారు. అంతటితో అయిందా శోభనంనాడు కూడా తాబేలు పెళ్ళకూతురుతో పాటుగా మంచం మీద కూర్చుంది. అది చూచి 'కెవ్వుమన్న వెంకటేశం తలుపులు బాది తప్పించుకుందామని ప్రయత్నించినప్పటికీ - అమ్మలక్కలు నవ్వుకుంటూనే, తాబేలును తాత్కాలికంగా తప్పించి, తంతు జరిపించారు.

పిల్లవాడు జడుసుకుంటాడని అత్తగారు పిల్లతోపాటుగా తాబేలు కాపరానికి రావడానికి వీల్లేదని ఖచ్చితంగా చెప్పేశారు. అందుకు అందరూ అంగీకరించినప్పటికీ పెళ్ళికూతురు కాపరానికి వచ్చేటప్పుడు పెళ్ళికొడుకుకు ఇవ్వవలసిన కొత్తకోటులో తాబేలు రహస్యంగా దూరి రానే వచ్చింది. మరి పెళ్ళికూతురుతో పాటు ఫోటోకి ఫోజు ఇవ్వడానికి నుంచోవలసిన వెంకటేశాన్ని (సూర్యకాంతం ప్రక్కన రమణారెడ్డిలాగే అనుకోండి) తాబేలు కరిచిందంటే అందులో ఆశ్చర్యం ఏముంది? తాబేలు చేసిన 'కుట్ర' గ్రహించిన అతగాడి

బావమరిది తాబేలును తనతోపాటు వాళ్ళవూరు కారులో తీసుకుపోదామనుకున్నాడు గాని తాబేలు ఆ కారులోంచి తప్పుకొని అత్తగారి కారులో దూరింది. ఈ సంగతిని గ్రహించలేని వెంకటేశం తాబేలు పీడా పోయిందనే సంతోషంతో కారులో భార్యతో పాటు గుడికి వెడుతూ మార్గమధ్యంలో తాబేలును చూచి - కారులోంచి దూకి చెయ్యి విరగొట్టుకున్నాడు. ఈ పరిస్థితిలో పెళ్ళికూతురు ఉక్రోషంతో తాబేలును రోడ్డుమీదకి విసిరేసినప్పటికీ అది చూచిన 'పుణ్యాత్ములు' పొరపాటున తాబేలు కారులోంచి క్రిందపడిపోయిందేమోనని భద్రంగా ఆ జీవాన్ని తిరిగి ఇంటికి తీసుకొచ్చారు!

ఎంతకీ వదలని తాబేలును చూచి వళ్ళుమండిన అత్తగారు దాని పీడవదిలించు కుందామని గుట్టుచప్పుడు కాకుండా 'హత్య' చేసేశారు. ఇక అక్కడినుంచే ఆవిడకు భయం పట్టుకుంది. 'సాక్షాత్తూ విష్ణుమూర్తి అవతారం అయిన తాబేలును చంపిన పాపం పోదేమోనని! అత్తగారి భయం గ్రహించిన కోడలు వెండి తాబేలును చేయించి పూజా మందిరంలో పెట్టి అత్తగారికి మనశ్శాంతి కలిగించిందనుకోండి - అది వేరే సంగతి!

కథ మాటేమిగాని - ఈ కథలోని అత్తగారి మూఢనమ్మకాలను, వాటిని అనుకుని వచ్చిన నియంతృత్వాన్ని చదివినప్పుడు నాకు అవి నవ్వుకోడానికి ఉద్దేశింపబడిన ఒక తరం 'అత్తగారి భావాలు' లా మాత్రమే అనిపించలేదు. మనం ఎంత చదువుకున్నా మనలో కూడా ఈ 'అత్తగారి దృక్పథం' కొద్దో గొప్పో వుంటుందని నా నమ్మకం (జ్యోతిష్యం పిచ్చి, లంకెబిందెల ఆశతో సహా!!) ఇక ఈ కథలోని వెంకటేశం లాంటి 'బుద్ధిమంతులు' (!) అయిన పెళ్ళికొడుకులకు కొదవలేదు. సరదాగా నవ్వించే అత్తగారి కథలు పాఠకులలో కలిగించగల 'ఆత్మవిమర్శ' ఇదే అనుకుంటాను!

---

# 35

## పురాణం సుబ్రహ్మణ్యశర్మ - "నీలి"



"..... ఒక మహారణ్యం తగులబడిపోతూంది. జంతువులు చెల్లాచెదురైపోతున్నాయి. బండరాళ్ళు సైతం ఫెడీలు ఫెడీల్మని విచ్చిపోగా ఎగిరెగిరి పడుతున్నాయి. పొగ పెద్ద రాక్షసిలా వీచింది. తప్పించుకుని పోలేని పక్షులన్నీ ఆ పొగలో రెక్కలార్పుకుంటూ ఎగరగలిగినంత వరకూ పైకి పైకి లేచి గిల గిలా కొట్టకుంటున్నాయి. పెద్ద పెద్ద వృక్షాలు మండుతూ నేలకొరుగుతున్నాయి."

-ఇలాంటి దావానలంతో భూమి చిట పటలాడుతున్న వేళ - ఆ మంటలను తప్పించుకొంటూ గులాబీరంగు నేల పాదాల మీద జీరాడే పాలమీగడ వన్నె కుచ్చిళ్ళు గల కోమలాంగి, ఓ రోజా వన్నెపిల్ల పూల పొట్లాల్లాంటి అరచేతులతో, తామర మొగ్గల్లా చెమర్చి కందినట్లున్న తన వక్ష ప్రదేశాన్ని కప్పుకుంటూ ప్రాణభయంతో పరిగెదుతూ వుంది ఆ అమ్మాయిని కాపాడి, ఆ చిన్న నడుము పట్టుకుని అమాంతం పైకి ఎత్తేసి గుండెలకు హత్తుకోవాలని ఏ కవి హృదయుడికి మాత్రం ఉండదూ? 'డేమ్ సెల్ యిన్ డిస్ట్రెస్'ను ఆదుకోవడం కన్నా 'మగ'తనం ఏముందీ?

అవునా? - మరి, ఈ టెక్నీ కలర్ కలకు ఆ కలకు ఆయువుపట్టు అయిన 'అందా'నికి గల బొమ్మా, బొరుసుల కథను గుండెల లోతులకు తగిలేలా ఒక మానవత్వపు కథగా, సగటు బ్రతుకుల్లోని లేకి తనపు వ్యథగా 'అందం'గా చెబితే మళ్ళీ మళ్ళీ చదవాలని ఎవరికి మాత్రం అనిపించదూ? అది ఒక చిరస్మరణీయమైన అనుభూతి కాదు? ఎప్పుడో దశాబ్దాల క్రితం ప్రముఖ కథా రచయిత సుబ్రమహ్మణ్య శర్మగారు రచించిన 'నీలి' యివాల్టికీ సాహితీ ప్రియులందరికీ తెలుగులో వచ్చిన ఒక గొప్ప కథగా జ్ఞాపకం వుండదానికి కారణం యిదే!

1955 నాటికే పురాణ సుబ్రహ్మణ్యశర్మ గారి కథల గురించి రాస్తూ - ఆయన కథల సంపుటిని ప్రకటించిన ప్రకటన కర్తలు "కథకులు అసంఖ్యాకంగా వున్నారు. కథలు వేలాదిగా వస్తున్నాయి కాని, మంచి కథలు కొద్ది మంది మాత్రమే రాయగలగు తున్నారు."

అంటూ - ఉత్తమ శిల్పంతో విశ్వ సాహితిలో స్థానం సంపాయించుకోగల కథలుగా పురాణంవారి కథల గురించి చెప్పడంలో అతిశయోక్తిలేదు. దీనిని ప్రచురణ కర్తల మామూలు భాషగా భావించడానికి వీల్లేదు. ఇవి అక్షర సత్యాలు.

కథకులుగా శర్మగారిదొక ప్రత్యేకమయిన ఫక్కీ. లోతయిన ఆలోచనలను ప్రేరేపించే కథలను, గిలిగింతలు పెట్టి నవ్వించే కథలను కూడా శర్మగారు రాయగలరు. మధ్యతరగతి మానవుల సెంటిమెంట్లను, వాళ్ళ దౌర్భాగ్యపు ఆలోచనల్ని కథకులుగా ఆయన అర్థం చేసుకోగలరు. ("ఈ దేశాన్ని శంకరాచార్యుల వారు, కారల్‌మార్క్సు పాడుచేసేశారని" ఒక "భగవాన్లు" ఉస్సురన్నాడంటే దాని వెనుక కారణాలు ఈ దౌర్భాగ్యపు ఆలోచన ల్లోంచిల పుట్టుకొచ్చినవి కావూ? 'హనీమూన్' కథలో) ఆయన 'చారు' గురించి చెప్పినా- (చారుకు చింతపండు ఆత్మ, చారులో బెల్లం ముక్కకి పట్టిన యోగం ఈ జీవుడికి సంసారంలో ఉండే మూగానుభవం లాంటిది. 'చారు తులసీ దళ ధామ' అన్నది యిందుకే కదా - హనీమూన్ కథలోనే)- బడుగుజీవి కథ రాసినా - అంతకు కొన్ని మెట్లపై నున్న మనుషుల 'మందు' మజా గురించి రాసినా అన్నింటిలోనూ సీరియస్‌గానూ, హ్యూమరస్‌గానూ పలుకగల పురాణంవారి కలం పాఠకులను అలరిస్తుంది.

అన్నట్టు 'కోతి' కథ జ్ఞాపకం వుందా? - మనిషి తన పరిణామ క్రమంలో కోతికన్నా బాగా ఎదిగినప్పటికీ కొన్ని బుద్ధుల్లో సన్నిహితంగానే ఉంటాడు. (కోతి స్వభావం ఉన్నవాళ్ళను సులువుగా పోల్చుకోవడానికి 'కొందరికి తోకలు ఉంచితే బాగుంటుందని - 'అందరూ అనుకుంటారను కుంటాను! -) "భర్త" అనబడే పదార్థం తన చెప్పుచేతల్లో ఉండాలని అతగాడికి అన్నదమ్ములూ, అప్పచెల్లెళ్ళూ వగైరా ఎవరూ ఉండకూడదనేది భార్యలలోని 'కోతి' గుణం అయితే - పెళ్ళాం మీద అధికారం చెలాయిద్దామనేది మగ మహారాజులోని 'కోతి' గుణం. అందుకే - పెళ్ళాలూ మొగుళ్ళ పేరుగల కోతుల్ని పెంచుకుంటే సరిపోతుందనుకుంటాను. (ఈ కథలో శాస్త్రి తన భార్య 'సరస్వతి' పేరు పెట్టి పెంచుకున్న కోతి గురించి చదివినప్పుడు నాకు విశ్వనాథ వారి వేయిపడగల్లో మంగమ్మ పెంచుకున్న కోతి జ్ఞాపకానికి వచ్చింది. అయితే ఇందుకు గల కారణాలు వేరు అనుకోండి.)

ఈ కోతి చేష్టల్లో భాగమే అనుకుంటాను భార్యాభర్తల ప్రణయ కలహాలు కూడా పురాణం సీతగారి "యిల్లాలి ముచ్చట్లు" లోని ఇల్లాలు లాగా "మీరు 'ఇంటలెక్చ్యువల్' అయితే - నేను 'వంట లెక్చ్యువల్ నా పనిమనిషి అచ్చెమ్మ 'అంటలెక్చ్యువల్' అంటూ ఓ యిల్లాలు మొగుణ్ణి 'అయ్ డోంట్ కేర్' అన్నదంటే చిన్న సైజుదో, పెద్ద సైజుదో కలహం రాక తప్పదు. (దానిని ప్రణయ కలహం అనడానికి శాస్త్రకారుడు అంగీకరించినప్పటికీ

అంగీకరించనప్పటికీ) ఇక ఈ కలహం లోంచి పుట్టుకొచ్చే సంగీతం ముని మాణిక్యం వారు వర్ణించేటంత మధురంగా వుంటందనే గ్యారంటీ కూడా లేదు. వెనుకటికి ఒకాయన పెళ్ళాంతో ఎన్నిసార్లు తగువులు పడ్డాడో చాకలి పద్దులాగా పుస్తకంలో రాసుకున్నాడట! అప్పుడు పరిశోధనా శాఖలకు మల్లేనే భవిష్యత్తులో ప్రణయతత్వ పరిశోధనాశాఖ ఏర్పడవచ్చునని అతగాడి విశ్వాసం. (అర్థంకాని మార్పు' కథలో) యిదంతా బాగానే ఉంది. గాని పక్కింటి ప్లీడరుగారి అమ్మాయి ఇందిరా తన భార్య, దుర్గా, స్నేహితులు కాబట్టి ఒకళ్ళ చీరలు ఒకళ్ళు కట్టుకుంటే ఎంత యిబ్బంది? దుర్గ అనుకుని ఇందిర జబ్బను తాను పట్టుకున్నట్టు – దుర్గను యిందిర అనుకుని ఆవిడ మొగుడు సరసమాడితే ఏం కావాలని మొగుడు భయపడి కుయ్యోమొర్రో మనడం మాత్రం తలచుకుని నవ్వకోకుండా వుండలేమను కుంటాను. (అదే కథలో)

ఇంతకూ మనం రోజా వన్నె రమణిని మంటల మధ్యలోనే వదిలేసి వచ్చాం.

శర్మగారి ప్రసిద్ధ కథ 'నీలి' లో కథానాయకుడు కన్న కల అది! సాధారణంగా యువకులు కనే కలల్లో అందమైన అమ్మాయిలే దర్శనమిస్తూ వుంటారు. మరి లోకంలో వున్న ఆడపిల్లలందరూ రోజా వన్నె గల అందాల రాసులు కారు. ఓ విధంగా చెప్పాలంటే వీళ్ళది "మైనారిటీ" వర్గమే. యిక, సాధారణ అందగత్తెల మాట అలావుంచి, అంద వికారులు, అనాకారులు అయిన ఆడపిల్లల మాట ఏమిటి? కొ.కు.గారి 'కురూపి' కథలోని సరస్వతి అంటుంది – "అందం ఒక్కటే ప్రేమకు ప్రేరణ యిచ్చే విషయమైతే ప్రేమకు కూడా "స్పూరియస్ డ్రగ్స్' చట్టం ఎందుకు వర్తింప చెయ్యకూడదు? అని!

అందగత్తెలయినా కురూపులయినా అందరి హృదయాలలోని ఆర్ద్రతలు ఒక్కటే? మొదట మనిషి ఆ తర్వాతే మనిషి అందం గురించి ఆలోచన, విక్టర్ హ్యూగో రచించిన ప్రపంచ ప్రఖ్యాత నవల 'హంచ్ బాక్ ఆఫ్‌నాటర్ డామ్' లోని గూనివాడు 'క్యాసిమోడో' కన్నా కురూపులు వుండరనుకుంటాను. కాని అతగాడికి అందాల రాశి 'ఎమరాల్డ్' పైగల ఆరాధనా భావం, ఆమె కోసం ఏమైనా చెయ్యగల తెగువ, ఆ నవల చదివిన వాళ్ళు మరిచిపోలేరు. శర్మగారి 'నీలి'కి కథానాయకుడైన 'నేను' పట్ల గల ఆరాధనా భావం కూడా అట్లాంటిదే అనిపిస్తుంది. కాని ఈ కథలో రచయిత 'నీలి' హృదయపు లోతుల్లోని ఆర్ద్రతల కన్నా, 'నేను' పాత్రలోని మానవత్వపు కాంతి కిరణాలకు ప్రాధాన్యతనివ్వడంలో కథకొక కొత్తదనం వచ్చింది. అయితే వాటి పరిధి పరిమితంగానే వుండి, గిడస బారిన సగటు మనుషుల మనః ప్రవృత్తికి కొంచెం సన్నిహితంగా కనబడడంతో కథకు సహజత్వమూ, నిండుతనమూ సమకూరాయి.

ఈ కథలోని 'నేను' అనబడే వ్యక్తి ఒక చిఱు రైల్వే ఉద్యోగి. బ్రహ్మచారి అయినందున ఒక సన్నకారు హోటల్ గదిలో మకాం వుంటున్నాడు. మనల్ని ముందుగా పలకరించింది ఈ బ్రహ్మచారి కలలో అందమైన అమ్మాయిని ఆపదలోంచి రక్షించి, ఆమె హృదయాన్ని అందుకోవాలని తహతహలాడే వ్యక్తికి - కుంటికాలు ఈడ్చుకుంటూ, చేతికర్ర 'టక టక' లాడించుకుంటూ కళ్ళముందు ఓ అనాకారి ఆడపిల్ల ప్రత్యేకమైన వికారంతో కనబడితే కడుపుదేవినట్లుగా అనిపించదూ?

కుంటిపిల్ల నీలి ఆ హోటల్ యజమాని మల్లయ్య మేనకోడలు. తన కొడుకు 'వెఱ్ఱి పిల్ల వాడి'ని నీలికి యిచ్చి పెళ్ళిచేసి వాడికో పెళ్ళాన్ని సంపాయించి పెడదామని మల్లయ్య ఆలోచన. తన చెల్లెలు, (ముసలమ్మ గారు) నీలి తన ప్రాపకంలోనే బ్రతుకుతున్నారు కాబట్టి వెఱ్ఱి పిల్లవాణ్ణి చేసుకోనని అధికారం నీలికి లేదని మల్లయ్య దంపతుల నమ్మకం. కాని, పిడతలాంటి తల, బాకాలాంటి నోరుగల వెఱ్ఱిపిల్లవాణ్ణి చేసుకోవడం నీలికి యిష్టంలేదు. తను ఎంతటి అనాకారి అయితే మాత్రం వెఱ్ఱి పిల్లవాడి మీద అందగత్తె కాదూ? కాని, వెఱ్ఱిపిల్లవాడికి మాత్రం నీలి అంటే విపరీతమైన వ్యామోహం.

కథ యిలా నడుస్తుండగానే మన కథానాయకుడు-నీలి-సన్నిహితం అయ్యారు. 'నీలి' చేతి కర్ర చప్పుడు వింటేనే మండిపడి, ఆమె తన గది తుడవడానికి వీల్లేదంటూ అసహ్యించుకున్న కథా నాయకుడు ఆమెకు చదువు చెప్పడం కూడా ప్రారంభించాడు. అతగాడికి జ్వరం వచ్చి గదంతా కక్కుకుంటే - తిట్లను కూడా భరించి అదంతా శుభ్రం చేసిన నీలి - సమయానికి భోజనం అందక ఆకలితో వుండిపోతాడేమోనని కుంటికాలు ఈడ్చుకుంటూ రైలు స్టేషన్‌కి వెళ్లి భోజనం కేరియర్ తీసుకొచ్చిన నీలి-అతడిలో ఏదో ఆర్ద్రతా భావాన్ని ఉద్దీపింప చేసింది. తన గురించి, తన ఆకలి గురించి పట్టించుకునే 'జీవి' ఒకటి వుందనే ఆనందంలోంచి వచ్చిన అభిమానం అది!

ఈ అభిమానంతోనే ఈ మానవతా భావంతోనే, నీలి కాలుకు ఆపరేషన్ చేయించి కాలు బాగుచేయిద్దామని అతగాడు తాపత్రయ పడ్డాడు. ఆపరేషన్ తట్టుకునేందుకు కావలిసిన విశ్రాంతిని, పుష్టికరమైనన ఆహారాన్ని ఏర్పాటు చేశాడు. జీవితం పట్ల ఆశల్ని చిగురింపచేశాడు. ఒక్కమాటలో చెప్పాలంటే కలలో కనిపించిన అందాల రాశిని మంటల్లోంచి తప్పించడానికి తాను పడిన ఆరాటానంతటినీ 'నీలి' విషయంలో ఆచరణలోకి పెట్టాడు. అతడి రోజా వన్నె కోమలాంగికి నీలి ఒక 'సబ్‌స్టిట్యూట్ గ్రాటిఫికేషన్' అనిపిస్తుంది.

'స్త్రీ పురుషుల మధ్య ఉండేది కేవలం శారీరక సంబంధం మాత్రమే అయినప్పుడు - ఒక స్త్రీ ఎంత వికారి అయినప్పటికీ కొన్ని పరిస్థితులలో శారీరక అవసరంలో వున్న పురుషుడు "రెజిస్ట్" చెయ్యలేకపోవచ్చును. కాని మన కథానాయకుడికి 'నీలి' తో గల

అనుబంధంలో ఈ తరహా ధోరణి కనబడదు. నీలి విషయంలో అతనికి ప్రధానంగా వున్నది మానవతా బంధం మాత్రమే. ఆపరేషన్‌కు 'రియాక్షన్' వచ్చి నీలి మృత్యుకుహరంలోనికి ప్రవేశించబోతున్నప్పుడు ఆమెను రక్షించడం కోసం 'నిన్ను నేను పెళ్ళి చేసుకుంటాను' అని అతడు ఆడిన అబద్ధం ఈ మానవతా భావనలోంచి పుట్టుకొచ్చినదే.

కాని నీలి మాత్రం మన కథానాయకుడిపై ఎన్నో ఆశలు పెంచుకుంది. అతగాడిలోని మానవతా భావపు 'క్రూరచర్య' అది. నిజానికి యిలాంటి తియ్యని ఆశలు వెర్రి పిల్లవాడికి కూడా 'నీలి'పై వున్నాయి. నీలి ఆశ నెరవేరితే అందులో 'కల్పన' ఉండేది. నీలికి, వెర్రి పిల్లవాడికి ముడిపడితే అందులో వున్నది 'జీవితం' అవుతుంది. వెర్రిపిల్లవాడితో కాపురం చెయ్యడానికి నీలి కాలు బాగుచేయించుకోవలసిన అవసరం లేదు. నీలి ఎలా వున్నా వెర్రిపిల్లవానికి నీలి పట్ల ఆరాధనే.ఈ కథ చివరిలో కథా నాయకుడు నీలికి చెప్పా చెయ్యకుండా అక్కడన్నుంచి ఉడాయించడంతో సగటు మానవుడి కథ వుంది. రక్త మాంసాలున్న మనిషి కథ ఉంది. వెరసి - ప్రేమకు, ఆకర్షణకు, అందానికి, సంబంధించిన బొమ్మా, బొరుసుల కథ ఉంది.

సత్యానికి మించిన అందం లేదన్నారు గాంధీజీ. (ప్రపంచంలో కల్లా అతి కురూపిగా చెప్పబడిన 'సోక్రటీస్'కు మించిన అందగాడు తన దృష్టిలో మరొకరు లేరన్నారాయన) నిజమే కావచ్చు కాని, సత్యమేదో నిర్ధారించి చెప్పలేని ఈ ప్రపంచంలో బాహ్య దృష్టికి కనబడేదే అందం. దానిని అందుకుందామనే ఆరాటం. దీనిని కాదనగల శక్తి, సగటు మానవులకు లేదు. ఒకప్పుడు ప్రయత్నం జరిగినా దానికున్న పరిమితులను అంగీకరించక తప్పదు. "నీలి" కథ మనకు మరోమారు జ్ఞాపకం చేసేది విస్మరించలేని ఈ న్యాయాన్నే!

---

# 36



## రంగనాయకమ్మ
## 'నన్ను అర్థం చేసుకోరూ"?

"..... చీరల కోసం అలిగి, నగల కోసం ఏడ్చి, అంధకారంలో పుట్టి అంధకారానికి అంకితమయ్యే ఈ వెర్రి ముండా కూతుళ్ళా నిదర్శనం? చూడండి దేశాన్ని - మీ రొమాన్సు, లవ్వు ప్రబంధ కోణాలకి విసిరేసి మనుషులుగా చూడండి స్త్రీలని, మన దాంపత్యాల సొగసును చూడండి. మన గృహిణుల సుఖ శాంతులు చూడండి. మీ హృదయానికి కళ్ళు ఇచ్చి చూడండి. తెలుస్తుంది. మీకు స్త్రీ ఏమిటో, స్త్రీ సమస్య ఏమిటో" ఆవేశంతో, ఆవేదనతో వినబడుతున్న ఈ గొంతు రంగనాయకమ్మగారిది. పలికింది మాత్రం "స్వీట్ హోమ్-2" నవలలోని విమల.

రంగనాయకమ్మ కథ రాసినా, నవల రాసినా, వ్యాసాన్ని రాసినా ఆమె కలం ఈ విమల పలుకులకు ఎప్పుడూ సన్నిహితంగానే వుంటుంది. అరవైలలో 'నవలా' యుగం మూడు పువ్వులూ, ఆరు కాయలుగా వర్ధిల్లుతున్న రోజులలో కలాన్ని కాలక్షేపం కోసం కాక, అంతరంగంలో రగులుతున్న ఆవేదనకు దర్పణంగా ఉపయోగించుకున్న రచయిత్రి రంగనాయకమ్మగారు, స్త్రీ జనాభ్యుదయానికి వీరేశలింగం యుగంలో (సాహిత్యపరంగా) వినిపించిన ఆరాటం ఇటీవలి కాలంలో పోరాటంగా పరిణమించేందుకు కృషి చేసిన రచయిత్రులలో రంగనాయకమ్మగారు ఒకరు మాత్రమే కాదు - ప్రముఖులు కూడా.

రంగనాయకమ్మగారి రచనల గురించి ఆలోచించినప్పుడల్లా నాకు ఎప్పుడో - 1924 ప్రాంతాల్లో ప్రఖ్యాత బ్రిటిష్ రచయిత్రి వర్జీనియా వుల్ఫ్ తన సమకాలీన స్త్రీల పరిస్థితి గురించి చెబుతూ అన్న మాటలు జ్ఞాపకానికి వస్తాయి. "భావనా ప్రపంచంలో కవుల కల్పనల్లో స్త్రీ అత్యంత ఉన్నతురాలు. కాని, వాస్తవానికి వచ్చేసరికి మాత్రం తనను పెళ్ళాడిన ఏ సామాన్యుడికైనా ఆమె ఒక బానిస. అతడి ఆస్తిలో ఒక భాగం." అంటుందామె

ఆవేదనతో! బ్రిటిష్ సమాజాన్ని గురించి చెబుతూ వర్జీనియా వుల్ఫ్ అన్న మాటలు సమకాలీన భారతదేశానికి కూడా కొంతవరకూ వర్తిస్తాయనుకుంటాను.

పురుషాధిక్య సమాజంలో స్త్రీ పట్ల చిన్నచూపు సహజ పరిణామంగా సంప్రాప్తిస్తుంది. ఒకప్పుడు విక్టోరియన్ యుగంలో ఆడవాళ్ళు నవలలు రాస్తే అవి ఎలా ఉన్నాయో చదవకుండానే చెత్త నవలలంటూ విమర్శకులు పెదవి విరుస్తుండేవారట. విమర్శకుల పక్షపాత బుద్ధికి రచనల సహజ ప్రతిభ బలి అయిపోకుండా వుండేందుకు ఆ రోజుల్లో కొందరు రచయిత్రులు 'మగ' పేర్లతో నవలలు ప్రచురించుకుంటూ వుండేవారట. (ఆ మధ్య కొంతకాలం క్రింత మన 'మగ' రచయితలు 'ఆడ' పేర్లతో చెలామణీ అవడానికి ప్రయత్నించినట్టుగానే!) ఈ బాధ పడలేకే కదూ వర్జీనియా వుల్ఫ్-మహాకవి షేక్స్‌పియర్‌కి ఒక సోదరి వుండి - ఆమెలో అన్నగారికి వున్నంతటి ప్రతిభ వున్నప్పటికీ ఆడవాళ్ళు స్టాకింగ్స్ అల్లుకుంటూ కేకలు చేసుకుంటూ బ్రతకాలని నిర్దేశించే ఈ సమాజంలో ఇమడలేక ఆత్మహత్య చేసుకుని చనిపోయి వుండేది. అని రాసిందీ? -

ఇదంతా ఎందుకు వ్రాశానంటే - పురుషాధిక్య సమాజంలో స్త్రీని ఒక ఆటబొమ్మగా చూసేవాళ్ళ సంఖ్యే ఎక్కువ. ఆ బొమ్మకు మంచి గౌనులు తొడుగుతారు. అలంకారాలు చేస్తారు. అద్దాల బీరువాలో పెట్టి అందంగా వుందని చూచి మురిసిపోతారు కాని, ఆ బొమ్మకి కూడా ఆలోచనా శక్తి వున్నదని, అభిప్రాయాలు, ఆలోచనలు వుంటాయనే ఊహకు కూడా అస్కారం ఇవ్వరు. ఒకవేళ ఆ బొమ్మకు నోరే కనుక వుండి తన బాధ విప్పి చెప్పుకుని, అద్దాల బీరువా తలుపులు తియ్యమంటే ఎంత అవమానం? మన అహాన్ని అది దెబ్బతీయదూ? చలం దగ్గర నుంచి రంగనాయకమ్మ వరకు ఎందరో రచయితలు, రచయిత్రులు మనల్ని ఆలోచించమని చెప్పింది ఈ విషయాన్ని గురించే! (అయితే - ఒక్కోకప్పుడు ఈ 'చెప్పడం'లో ఆవేశపు పాలు 'రవ్వంత' ఎక్కువ కావచ్చుననుకోండి! అది వేరే విషయం!)

రంగనాయకమ్మగారి "పెళ్ళానికి ప్రేమలేఖ" కథ జ్ఞాపకం ఉందనుకుంటాను. సగటు మానవుల్లో చాలామందికి ప్రేమలేఖలు రాయడం రాదన్నారు చలంగారు. అందులో పెళ్ళానికి ప్రేమలేఖ రాయాలంటే ఇంతే సంగతులు! (అయినా. పెళ్ళానికి ప్రేమలేఖ రాయడం ఏమిటి? పిచ్చి కాకపోతే) సాధారణంగా ఇల్లాలు పుట్టింటికి వెళ్ళి భర్తగారు చెయ్యికాల్చుకోవలసిన పరిస్థితి ఏర్పడినప్పుడు ఆవకాయ జాడి ఎక్కడ ఉందని వెతుక్కోవడం, ప్రొద్దున్నే లేచి పాలు పుచ్చుకోవలసి రావడం, మొదలైన వాటి నుంచి వందలకొద్దీ చిల్లర సమస్యలు 'క్యూ'లో నిలబడి పలకరిస్తాయి. అదుగో అప్పుడే అతగాడు భార్యచేసే చాకిరీని, ఆమె సమకూర్చే శారీరిక సుఖాన్ని "మిస్" అవుతాడు. ఇల్లాంటి స్థితిలో పుట్టింట్లో

"హాయిగా"గా తిప్పవేసి కూర్చున్న పెళ్ళానికి ఉత్తరం రాయవలసి వస్తే దొంగపిల్లి పాలు త్రాగిన వైనం, హోటలు తిండితో పడుతున్న బాధ, వగైరాలతో ఉత్తరం నిండిపోతే అందులో వింత ఏముంది? తన బాధలకి గుండె కరిగిపోయి పెళ్ళాం రాకపోతే పక్కింటి పిన్నిగారిని పొగుడుతూ రెండు మూడు లైనులు రాసి "జలసీ"ని క్రియేట్ చెయ్యడం కూడా ఓ పద్ధతే. పాపం మన కథలోని కథానాయకుడు ఈ పద్ధతులన్నీ ప్రయోగించి చూశాడు. ఈ పద్ధతులకు విమల లొంగిపోలేదు. సరికదా - పైగా మండిపడింది. "ప్రేమలేఖ రాయడం కూడా రాని మొగుడితో కాపురం వద్దు, చట్టుబండలూ వద్దు" అనుకుంది. (అయితే ప్లీడరుగారు మాత్రం ఈ "చిన్న" కారణానికి విడాకులు ఇవ్వడం పనికిరాదన్నాడను కోండి) అయితేనేం బుచ్చిబాబు దార్లోకి వచ్చాడు.

"నాలోని ఒక్కొక్క అణువూ ఒక్కొక్క హృదయమై నిన్ను ప్రేమిస్తోంది. నీ మనోమందిరం ముందు నిలబడి ప్రతిదినమూ, ప్రతి యుగమూ ప్రార్థిస్తాను" అనే లేఖ అందగానే (దాన్ని ప్రార్థనా పూర్వక ప్రణయ లేఖ అందామా?) విమల రెక్కలు కట్టుకుని బుచ్చిబాబు కోసం ఎగిరి రాలేదూ?

ఇంతకూ చెప్పవచ్చేదేమంటే అవడానికి ఇది లేఖల రూపంలో వున్న చిన్న హాస్య కథ అయినప్పటికీ, ఆలోచించగలిగలితే ఇందులో నేటి వైవాహిక వ్యవస్థలో స్త్రీ పురుష సంబంధాలకు మూల కారణమైన ఎన్నో రకాల ప్రవృత్తుల కథ వున్నది. 'ఆడదాన్ని' మగవాడు జీతం లేకుండా ఇంటి చాకిరీ చేసే మనిషిలా గాక, తన హృదయానికి సన్నిహితమైన వ్యక్తిత్వం వున్న మనిషిగా ఎందుకు చూడలేదు? ఆమె అభిరుచులను ఎందుకు అర్థం చేసుకోలేదు? ఇది జరిగినప్పుడు ప్రేమలేఖల్లో 'ఆవకాయ జాడీలు, చీపురు కట్టలు' చోటు చేసుకోవు. సామ్యవాదం కోసం, సమానత్వం కోసం గొంతుక చించుకుని చేసే ఉపన్యాసాలను ఆచరణ భార్యభర్తల సంబంధాలకు సంబంధించి ఇంటిలోనే ప్రారంభం కావలసి ఉంది.

ఇదంతా సరేగాని - మనసు అనేది ఒకటి వుందనే ఆలోచన అయినా లేకుండా ఒకవేళ అట్లాంటి ఆలోచన ఉన్నా దానికి తాళం వేసి చీరల్లోనూ, నగల్లోనూ ఆనందాన్ని చూచుకుంటూ యాంత్రికంగా బ్రతికే శోభలాంటి ఆడవాళ్ళ మాట ఏమిటి? ఉన్నతమైన అనుభవం, వ్యక్తిత్వం, స్వేచ్ఛ గల భార్య కోసం ఒక యువకుడు పెట్టుకున్న కోరిక అడియాసగానే మిగిలిపోతుందా? ('ఆడపిల్ల అంతరాత్మ' కథలో)

రంగనాయకమ్మగారి "సరికొత్త మనుషులు" కథ చదివినప్పుడు నాకు రసెల్ జ్ఞాపకం వచ్చాడు. (తత్వవేత్తగా - మానవతా వాదిగా రసెల్ పట్ల నాకుగల అభిమానం ఒక్కటే ఇందుకు కారణం కాదనుకుంటాను) 'నీ సమస్యకి పరిష్కారం నీ మనసుకు

తోచినప్పుడు ఇతర్ల మొహాల వేపు కన్నెత్తి చూడకు, సంఘ భయంకన్నా నీచమైన బానిసత్వం లేదు" అంటూ డాక్టరు రాజారావుకు చేసిన హితబోధ రసెల్ ప్రతిపాదించిన 'సబ్జక్టివ్ రైట్‌నెస్'కి అద్దం పడుతుంది. కాని ఇది అంత సులభసాధ్యమైన విషయమా? ముచ్చట పడి పన్నెండు రోజుల క్రితం ఇల్లాలుగా చేసుకున్న వ్యక్తి గర్భిణీ అని తెలిసినప్పుడు అందుకు కారణభూతమైన పరిస్థితులు గురించి మానవతా దృష్టితో ఆలోచించాలంటే ఎంతకష్టం? పన్నెండు రోజుల అనుభవాన్ని పన్నెండు సంవత్సరాల బంధంగా భావించి పెంపొందించుకున్న ఆరాధనా భావం ఆ క్షణంలో హఠాత్తుగా కరిగిపోవాల్సిందేనా? వ్యక్తిగత విలువలకు, సామాజిక నీతికి, మానవత్వానికి మధ్యగల ముడిని ఈ కథలో రచయిత్రి అందంగా విప్పుతాడు. ఇదంతా ఒక ఎత్తు. "ప్రాణ త్యాగానికి సిద్ధపడే దేశ భక్తుడు, విప్లవకారుడు కూడా తన భార్య శీలం కలుషితమైతే సహించలేకపోవచ్చును" అనే రాజారావుకు సమాధానంగా డాక్టర్ "వ్యక్తిపట్ల సానుభూతి లేని దేశం ఎక్కడ ఉంది? స్త్రీ శీలానికి హద్దులు పెట్టేవాడికి విప్లవం ఎక్కడ ఉంది?" అనడం మరొక ఎత్తునూ.

రంగనాయకమ్మగారి కథల్లో "నన్ను అర్థం చేసుకోరూ?" కథ నాకు బాగా నచ్చింది. ఈ కథలోని రాజేశ్వరికి తొలిచూలు అందమైన ఆడపిల్ల పుట్టినప్పుడు ఆ బిడ్డ అందాన్ని చూచి రాజేశ్వరి మురిసిపోలేదు. పైగా "నువ్వు ఏది చేసినా విమర్శించబడతావు తల్లీ, నవ్వులపాలవుతావు. నువ్వు ఆడదానివన్న సంగతి మర్చిపోతావేమోనని లోకం భయపెడుతూ వుంటుంది.... విశిష్టంగా పెంచుకున్న నీ వ్యక్తిత్వం వమ్మయిపోతుంటే నీ తనువు తల్లడిల్లిపోదూ?" అంటూ ఆ బిడ్డ భవిష్యత్తును తలచుకుని రోదించింది.

లౌకిక ప్రమాణాలతో ఆలోచిస్తే రాజేశ్వరి కష్టపడుతుందని చెప్పడానికి తార్కాణాలు లేవు. భర్త మధుమూర్తి ఆమెను 'పువ్వులా' చూచుకున్నా, చూచుకోకపోయినా అడిగిన వస్తువులన్నింటిని బజారులోంచి తెచ్చి పడేస్తూ ఉండేవాడు. మిత్రులతో బట్టల కొట్టుకు వెళ్ళినప్పుడు అందమైన సిల్కు గుడ్డ కనబడితే అది భార్య కట్టుకుంటే చూడాలని ముచ్చటపడి, కొని తీసుకు వచ్చే పాటి ప్రేమ, రసికత కొరవడినవాడు కూడా కాదు. అయితే వున్న చిక్కల్లా అతగాడికి తన భార్యకు కూడా కొన్ని ఆలోచనలు, అభిప్రాయాలు వుంటాయని, ఆమెకు కూడా ఒక వ్యక్తిత్వం ముంటుందని ఆలోచన ఉండేది కాదు. రాజేశ్వరి తనలో రగులుతున్న భావాలను కాగితం మీద పెట్టాలనే తపనతో డైరీ కావాలని అడిగితే నువ్వేం రాస్తావు డైరీ! ఏం రాసుకుంటా వందులో అని వెటకారం. పోనీ, అతడిని డైరీ గురించి దేవిరించడం ఎందుకని తెల్ల కాగితాలతో పుస్తకం కుట్టుకుంటే 'అహానికి దెబ్బతగిలి నన్ను మళ్ళీ అడగకూడదా' అని గదమాయింపు.

నిజానికి ఇవన్నీ సగటు దాంపత్యాలలో సాధారణమైన విషయాలే! రాజేశ్వరి భర్త ఇందుకు ఏమీ మినహాయింపుకాదు. భార్యని కాపరానికి తీసుకువచ్చిన కొత్తల్లో తన

భార్యను మిత్రుడికి 'చూపించాలా, వద్దా అనే విషయాన్ని - అతగాడు తన భార్యను చూపించాడా లేదా అనే విషయాన్ని బట్టి నిర్ణయించడమూ (అవును మరి అతగాడు పెళ్ళాన్ని ఇంట్లో 'దాసేసు'కుంటే ఇతగాడేనా తక్కువ తిన్నది?) అర్ధరాత్రి సెకండ్ షో సినిమాకు వెళ్ళిన భార్య మేనత్త కొడుకు బస్సు దొరకని కారణంగానే అనుకోండి - తనులేని సమయంలో ఇంట్లో పడుకుంటే నలుగురూ ఏమనుకుంటారో అని భయపడడమూ - ఇవన్నీ ఆ బాపతు సగటు ఆలోచనల్లోంచి ఊడిపడ్డవే.

ఇట్లాంటి దాంపత్యంలో తాళి కట్టిన భర్త దగ్గర కేవలం తలదించుకుని బ్రతికే భార్యలాగా కాకుండా, ప్రియాతి ప్రియమైన ప్రేయసిగా మసులో మెదిలే భావంలాగా, ఓ విధమైన తాదాత్మ్యంతో తియ్యగా జీవిద్దామనుకున్న ఒక ఇల్లాలి కలలు కల్లలు కాక తప్పేదేముంది? "నేను ఒక బొమ్మను కాను. మనిషిని. సజీవమైన స్వతంత్రంవున్న మనిషిని" అని ఆమె పడ్డ తపనకు ఫలమేమున్నది? చివరకు మిగిలింది - "ఒక భార్యగా" బ్రతకడం మాత్రమే! ఒక ఇల్లాలి ఆదర్శానికి జీవిత వాస్తవాలకు మధ్యగల అగాధాలకు కథా రూపం ఇది.

ఈ కథలోని రాజేశ్వరి అందరు ఆడవాళ్ళలాగే కోపంతో కసురుకున్న భర్త ఆ తర్వాత లాలిస్తే పొంగిపోయేది. ప్రేమగా గుండెలకు హత్తుకున్నప్పుడు తనకన్నా అదృష్టవంతులు ఎవరున్నారని మురిసిపోయేది. రాజేశ్వరిలోని ఈ ప్రవర్తనకు సంబంధించి తన కథను తానే విమర్శించుకుంటూ - రంగనాయకమ్మగారు (తన కథల సంపుటి 'కొత్త ముందుమాటలో' రాజేశ్వరి 'అమాయకురాలయినా అయి వుండాలి లేదా మూర్ఖురాలయినా అయి వుండాలి' అని అన్నారు. నా దృష్టిలో రాజేశ్వరి రెండూ కాదు. ఉన్నంతలో జీవితాన్ని సుఖంగా గడపాలని బ్రతుకుతో ఆమె చేస్తున్న రాజీ అది! లేకుంటే ఆడపిల్ల పుట్టినప్పుడు ఆమెలో అగ్ని పర్వతం బ్రద్దలై స్వేచ్ఛకోసమై రోదిస్తుందా? కథ చివర్లో రాజేశ్వరి భర్త ఆమె కన్నీటిని తుడిచి "మనసు వున్న మనిషి సన్నిధిలో వున్నావన్న సంగతి తెలుసుకుంటే ఎంత ఆనందం కలుగుతుంది" అన్నాడనుకోండి, కాని "నన్ను అర్థం చేసుకోరూ!" అనే ఆరాటాన్ని ఆమె భర్తలాంటి సగటు మనిషి పోగొట్టగలడని అనిపించదు. ఈ ఎత్తుకు మనిషి ఎదగగలిగిన రోజున మానవ నాగరికతలో ఒక శుభసూచకమైన పరిణామానికి అది నాంది కాగలదనుకుంటాను. ఆ రోజు కోసం రంగనాయకమ్మగారితో పాటు మనమూ వేచి వుందాం.

---

**37**

# వాకాటి పాండు రంగారావు-"ప్లే సెబో"



'ఆధునిక తెలుగు కథా సాహిత్యంతో పరిచయం వున్నవాళ్ళకు వాకాటి పాండురంగారావు గారి పేరు క్రొత్తది కాదు. వైవిధ్యం ఉన్న ఇతి వృత్తాలతో, వివిధ కథా శిల్ప రీతులతో, ఎన్నో కథలను అందించిన తెలుగు కథకులలో వాకాటి వారు ప్రత్యేకించి పేర్కొనదగినవారు. విశాఖపట్టణపు సముద్రపు అందాలను అవలోకిస్తూ ఓడ నడిపే కెప్టెన్ కథనో, స్టీమరులో సరదా ప్రయాణం చేద్దామని బయలుదేరినవాళ్ళు సముద్రపు ఆటు పోటుల మధ్య మృత్యుముఖం వరకు వెళ్ళి వచ్చిన వైనాన్నో, ఆయన కథల్లో చదవడం ఎలాంటి మరువరాని అనుభూతిని కలిగిస్తుందో- మహానగరాలలో బడుగుజీవుల కథను ఆయన కథల్లో చదవడం కూడా అలాంటి ఆనందాన్నే కలిగిస్తుంది. మానవ జీవితాన్ని బహుముఖంగా (వికృత రూపాలతో సహా) ఆవిష్కరించే కథలు ఆయనవి. మరి - దీనికి రవ్వంత వ్యంగ్యం తోడయినప్పుడు ఇక చెప్పేదేముంది?

పాండురంగారావుగారి కథల గురించి చెప్పదలచినప్పుడు ముందుగా 'ఆర్. చక్రారావు' జ్ఞాపకానికి వస్తారు. "ఎలక్షన్‌లో గెలిచిన నాయకుడిలా వెలిగిపోతున్నాడు సూర్యుడు. గుమస్తాముండా వాడి దారిద్ర్యంలా మండిపోతూంది మధ్యాహ్నపు ఎండ-" (ఆర్. చక్రారావు కథలో) యిలాంటి క్లర్కు చక్రారావు బనియన్ కొనుక్కోలేకపోయానని - జోడు కొనుక్కోలేకపోయానని బాధపడితే - అవి ఎండాకాలపు కోరికలు. ఈ లిస్ట్ ఒక్కో ఋతువులో ఒక్కో విధంగా వుంటుంది. అందుకే అతగాడు 'ఋతు చక్రారావు' (ఆర్. చక్రారావు) అయ్యాడు.

పాండురంగారావుగారి చాలా కథల్లో అనేక రూపాల్లో ఈ 'ఆర్. చక్రారావు' మనల్ని పలకరిస్తాడనిపిస్తుంది నాకు. అంతేకాదు. ఓ విధంగా ఆలోచిస్తే మనం అందరం "సైజు'లో తేడాలు వున్న చక్రారావులమని కూడా అనిపిస్తుంది. వేసవిలో జోడు కొనుక్కోలేనివాడు చిన్న తరగతి చక్రారావు అయితే ఎయిర్ కండిషనర్ కొనుక్కోలేకపోయానని విలవిలలాడేవాడు పెద్ద చక్రారావు అంతే తేడా!

అదీ గాక, 'చక్రా'నికి కాస్త విస్తృత అర్థాన్ని కల్పించగలిగితే మారుతీ కారు, కలర్ టి.వి. మొదలుకొని - సైకిల్, ప్రెషర్ కుక్కర్ వరకూ ఒక్కో తరగతి చక్రారావుకు ఒక్కో

తరహా కోరికలు 'క్యూలో' నుంచొని ఉంటాయి. అవి మామూలు దేశవాళీ కోరికలూ కావచ్చు. కాలానికి కూడా సంబంధించినవి కూడా కావచ్చు.

'మళ్ళీ బ్రతికిన సూరి' కథ చదివినవాళ్ళకు 'సూరి' అనబడే సూర్యనారాయణ నాతూమల్ దుకాణంలో వేణువు వాయిస్తున్న కృష్ణుడి బొమ్మ వున్న వెండి పలకం మీద పెట్టుకున్న కోరిక కథ జ్ఞాపకం వుందనుకుంటాను. ఎం.2 సెక్షన్‌లో క్లర్కుగా బ్రతుకుతున్న క్లర్కు సూరి,100-200 స్కేలు మీద ప్రాకే గొంగళిపురుగు గుమాస్తా సూరి-ఖరీదయిన జీవితాలు గడిపే వాళ్ళ డ్రాయింగ్ రూమ్ అందాల కోసం నాతూమల్ దుకాణం వాళ్ళు విక్రయించే విలువయిన వస్తువులను కనీసం తాకడానికి అర్హత వుందా? (అందుకే కాదూ సూరి కలల్లోకి పారిపోయి, సూర్యనారాయణ పంతులు గారి అవతారం ఎత్తి అయిదెకరాల తోట మధ్య అందమైన బంగళా కట్టుకుని - 'డ్రాయింగ్ రూమ్‌లో' ఖరీదయిన తివాచీలు, కళాఖండాలు అమర్చుకొన్నదీ - ఆ పైన ఎలిజిబెత్ టేలర్‌తో ఫ్రెంచి రివేరాలో విలాస యాత్ర చేసిందీ) ఖరీదయిన చేతి పని వస్తువులు అమ్మే దుకాణాదారుకు కావలసింది ఓడల్లాంటి కార్లలో వచ్చే విదేశీ రాయబారులు (వాళ్ళు అందమైన కృష్ణుడి బొమ్మని మొరటుగా కోడిపిల్లను పట్టుకొన్నట్టు పట్టుకున్నప్పటికీ,) కావాలి గాని - క్లర్కు గారి కళాత్మక హృదయం ఎందుకు?

యిలాంటిదే - మధ్య తరగతి మానవుడికి పుస్తకాల పట్లగల అభిరుచి కూడా! "పుస్తకం అంటే సూర్యానికి బ్రాందీ లాంటిది. నల్లమందు లాంటిది. అమ్మ ఒడి లాంటిది. పక్షి రెక్కల్లాంటిది. ('పాత కథే' అను కథలో) నిజమే! కాని వెయ్యి పుస్తకాల లైబ్రరీని తన యింట్లో అందంగా తీర్చిదిద్దుకోవాలనుకున్న ఓ బడుగు గుమస్తా నెలాఖర్లో పూట గడుపుకోవడం కోసం తన ప్రియాతి ప్రియమైన పుస్తకాన్ని సెకండ్ హాండ్ పుస్తకాల వాడికి (తన కూతురును తగనివాడికి అమ్మిస్తున్నట్టు బాధపడి) అమ్మజూపితే - "యివి అమ్ముడుపోవండీ - డిటెక్టివ్ నవల్సు గాని - గైడ్స్ కాని కావాలి" అని వాడు అన్నప్పుడు పుస్తకం దక్కిందని సంతోషించాలా? పూట గడవడం ఎలా అని ఏడవాలా? 'చీకటి పోదా, వెలుతురు రాదా' అన్న ఆశ ఒక్కటే మిగిలింది! యిక, పెళ్ళిరోజు నాడు భార్యాబిడ్డలతో హోటలులో భోజనం చేసి జల్సాగా విహరిద్దామనీ, పిల్లలని ఎగ్జిబిషన్‌కు తీసుకెడదామని యిలాంటి చిల్లర మల్లర కోరికలన్నీ కూడా వీరికి తోబుట్టువులే - ('ఎదురీత' కథలో)

ఓ విధంగా ఆలోచిస్తే "మంది-మరొకడు" కథలో గుమాస్తాగారు ఎరియర్సు డబ్బుతో కొనుక్కుందామని ముచ్చటపడిన జోడు లాంటివే మధ్య తరగతి కుటుంబాల కథ కూడా అనిపిస్తుంది. ఒక జోడు అతగాడి పాదం సైజుకు పెద్దది. మరొకటి బొత్తిగా చిన్నది. నచ్చిన జోడు కావాలంటే - ఏడాదికి అయిదు కోట్ల చెప్పులజతలు అమ్మే ఘనత వహించిన తను కంపెనీ వారు మనిషికొక మోడల్ జోడు తయారుచేస్తారా అని పెద్ద దుకాణదారు

చిన్న కస్టమర్‌పై వేసిన పెద్ద జోకు. యిల్లాంటి పరిస్థితుల్లో రోడ్డు పక్క జోళ్ళు కుట్టేవాడికి పాదం సైజు ఇచ్చి కాస్త చవకలో జోడు తయారు చేయించుకుంటే సంతృప్తి కదూ? - అయినా - పాతజోడు అరిగిపోతేనేం, బాగానే ఉంది కదా! మనిషి జీవితం ఒక 'పాదం'అని అనుకుంటే కొన్ని కోరికలకు ఈ బ్రతుకుకు యిమడనంతటి యిరుకు - మరికొన్ని - అందుకోలేనంతగా ఎత్తులో వుంటాయి. అందుకే గాను గెద్దులాగా గిరగిరా తిరగడం అలవాటయిన జీవికి బ్రతుకులోనే ఆనందం వుందనుకునే సంతృప్తిని మించిన సుఖం మరొకటి లేదు. అంతగా అయితే - ఆదుకోవడానికి కర్మ సిద్ధాంతం వుందనే ఉంది. అందుకే అన్నది - మందిలో మరొక్కడు అని!

మధ్యతరగతి మానవుల్లో యిల్లాంటి గొంగళిపురుగు మార్కు భావాలున్న సంఖ్య ఎక్కువ కావచ్చునేమోగాని ఎన్ని అడ్డదారులయినా తొక్కి సీతాకోకచిలకల్లా ఎగిరిపోదామనుకునేవాళ్ళు, అలా ఎగిరిపోయిన వాళ్ళు కూడా ఉన్నారు. పి.యు.సి. వరకు మాత్రమే చదువుకున్న పీతాంబరం ఎందరో విద్యాధికుల తల మీద నుంచి ఎదిగి - ఎడ్మినిస్ట్రేటివ్ అధికారిగా ఫారన్ డెలిగేషన్స్‌లో సభ్యుడిగా ఎదగగలిగాడంటే అందుక్కారణం అతగాడి "కాకాగుణ సంపత్తి, 'రెండు రెక్కలు కాదూ?" (రెండు రెక్కలవాడు' కథలో- రెండు రెక్కలు అంటే మరేం లేదు. మదిరా, మదపతులను ఎదుటి వాళ్ళు మీద సంధించడంలో సులువు తెలియడం అని అర్థం! పాండురంగారావు గారి కథల్లో యిలాంటి 'కోడ్' పదజాలాలు తరచూ వినబడతాయి. ఋతు చక్రారావు ఆర్. చక్రారావు అయినట్టుగానే భారత దేశ పౌరుడు 'బి.పౌరుడు' కావడం ఆయన కథల పాఠకులకు సుపరిచితమే)

వాకాటి వారి కథల్లో 'వైతరణి'కి యిటూ, అటూ' 'అన్యోన్యం' కథలు కూడా బాగుంటాయి. వైతరిణికి యిటూ, అటూ కథలో - ఒక ఆస్పత్రి జీవితపు నేపథ్యంలో మానవ జీవితానికంతటికీ తీసిన 'రియలిస్టిక్' ఫోటోగ్రాఫ్ కనబడితే (ఈ కథలో చైతన్య స్రవంతి ధోరణిలో కనబడిన కొన్ని వాక్యాలు కవిత్వానికి సన్నిహితంగా వుంటాయి. ఈ తరహా రచనా ధోరణి కూడా వాకాటి వారి కథల్లో అక్కడక్కడా తళుక్కుమంటూ ఉంటుంది.) 'అన్యోన్యం' కథలో పురుషాధిక్య సమాజంలోని స్త్రీకి గల స్థానం దయనీయంగా కనబడుతుంది. ఈ కథ చదివిన పాఠకులకు వివాహ వ్యవస్థలో స్త్రీ అనుభవిస్తున్న బలవంతపు సెక్సు గురించి బెర్ట్రాండ్ రసెల్ పడిన ఆవేదనా, చలంగారు వెలిబుచ్చిన బాధ జ్ఞాపకం రావడం సహజం.

ఈ కథలో కుంటి కాలు ఈడ్చుకుంటూ ప్రాద్దస్తమామా ఇంటి అరుగు మీద తమలపాకులు తింటూనో, భార్యను తిడుతూనో కాలక్షేపం చేసే నటరాజన్ దృష్టిలో అతని భార్య లక్ష్మి ఒక యంత్రం మాత్రమే! రాత్రిపూట భర్తగారి శారీరిక అవసరాన్ని తీర్చే. ఆ

యంత్రానికి కూడా ఒక హృదయం ఉంటుందనీ, అందరిలాగే ఆమె కూడా విశ్రాంతి కోరుకుంటుందనీ ఎవరికి కావాలి? - ఈ కథ చివరిలో రచయిత చెప్పిన చారల కుక్క లాంటి వాడే నటరాజన్ కూడా! కాని- సమాజం యిల్లాంటి వాళ్ళను కుక్కలుగా అంగీకరించదు. పైగా అర్ధరాత్రిపూట బలవంతంగా జరిగే శృంగారచేష్టను 'అన్యోన్యంలో' ఒక భాగంగా చేర్చి ముచ్చటపడుతుంది కూడా!

పాండురంగారావుగారి కథల్లో "ప్లే సెబో" కథ నాకు బాగా నచ్చింది. ఇందుకు కారణం ఈ కథకు కేంద్రబిందువయిన విషయం మన పూర్వీకులు చెప్పిన సూక్తి "మంత్రము నందు, తీర్థము నందు దైవము కలదు, ఔషదమునందు ఎట్టి భావమో అట్టి సిద్ధి కలుగును" అనేది కావడం! మనసును మనిషి సక్రమంగా ఉపయోగించుకోగలిగితే మహనీయుడు కాగలుగుతాడు. నత్తివాడు డెమస్తనీస్ మహోపన్యాసకుడు కాగలిగాడన్నా, చెవిటి వాడు బిథోవెన్ గొప్ప సంగీత విద్వాంసుడయ్యాడన్నా, చీకట్లో బయటకు వెళ్ళడానికి భయపడి భార్యను సాయం తీసుకువెళ్ళిన మోహన్‌దాస్ కరం చంద్ గాంధీ మహాత్ముడుగా తెల్లవాళ్ళను గడగడలాడించాడన్నా - వాళ్ళను ముందుకు నడిపించిన శక్తి మనస్సు నుంచి మాత్రమే వచ్చింది. తననుంచి ఉద్భవించిన ఆ మహత్తర శక్తికి వాళ్ళ శరీరాలు కేవలం ఉపకరణాలు మాత్రమే అయ్యాయి. మరి యింతటి శక్తి గల మనస్సు శారీరిక రుగ్మతలను మాత్రం ఎందుకు బాగుచెయ్యలేదు? అందుకు సమాధానమే 'ప్లే - సెబో' కథ.

'ప్లే-సెబో' అనే లాటిన్ మాటకు 'సంతృప్తి పరచడం' అని అర్థం.

రోగి శారీరిక రుగ్మతను నయం చేయడానికి కావలసిన మందు లేనప్పుడు వైద్యులు రోగికి 'మందు లాంటిది' ఏదో ఒకటి ఇచ్చి మందులేసుకుంటున్నాన్న సంతృప్తిని, ఈ మందుతో అనారోగ్యం తగ్గిపోతుందన్న నమ్మకాన్ని కలిగిస్తారు. మరి - దీనికి రోగి మనోశక్తి తోడయినప్పుడు ఏ మందూ పని చెయ్యనంతటి శక్తితో ఈ 'ప్లే సెబో' మందు పనిచేసి వ్యాధిని నివారణ చేస్తుంది.

ఈ కథలోని 34 ఏళ్ళ 'మాలినీఖంబెట్టా' ఒక పెద్ద షిప్పింగ్ కంపెనీకి మానేజింగ్ డైరెక్టర్. కొలంబో వెడుతుండగా హఠాత్తుగా అస్వస్థురాలయి డాక్టర్ రవిచంద్ర నర్సింగ్ హోమ్‌లో జాయినయింది. వైద్య పరీక్షల అనంతరం ఆమె వ్యాధి "అన్‌కైలోసింగ్ స్పాండిలైజిస్' అనీ - భయంకరమైన ఈ వ్యాధి సోకినవాళ్ళలో బ్రతికి బట్టకట్టిన వాళ్ళు ఒకశాతం వుంటారేమోనని తేలింది. ఈ వార్త వినగానే మామూలు వాళ్ళయితే బెంబేలుపడి ముందే చచ్చిపోయేవాళ్ళేమో గాని- నూటికో, కోటికో వుండే ఆ ఒక్కరు తాను ఎందుక్కాకూడదనే ఆత్మ ధైర్యమామెది. అందుచేతనే 'ప్లే-సెబో' వైద్యంతో తాను యిచ్చిన నామమాత్రపు మందును డాక్టర్ రవీంద్ర ఒక అద్భుతంగా మార్చగలిగాడు.

నష్టాలతో నడుస్తున్న షిప్పింగ్ కంపెనీ దివాళా కొట్టకుండా కాపాడి లాభాల మార్గం వైపు మళ్ళించగలిగిన మాలినీఖంబెట్టా- తన కంపెనీకి అంతర్జాతీయ ఖ్యాతి రావాలనే తపనతో పరిశ్రమిస్తున్న మాలినీఖంబెట్టా - మనోధైర్యానికి మారుపేరు. నిన్న గాక మొన్న ప్రారంభించిన సితార్ వాదనలో కూడా పరిపూర్ణురాలై కచేరీ చేయగల స్థాయికి ఎదగాలనే పట్టుదల ఆమెది. యిలాంటి మాలిని మృత్యువు చేతిలో అంత సులువుగా ఓడిపోతుందా? వ్యాధి ఎంత ప్రమాదకరమైనప్పటికీ తనకి వైద్యం చేస్తున్న వైద్యుడినీ, అతడి మందునూ విశ్వసించి, మనోశక్తితో వ్యాధిని ఎదుర్కొంది. అందుకే డాక్టర్ రవిచంద్ర "ప్లే-సెబో"తో ఒక మెడికల్ ఫీట్ చేయగలిగాడు.

ఇక- ఈ కథలోని డాక్టర్ రవిచంద్ర భార్య మీనాక్షి విద్యాధికురాలు. ఒక కళాశాల ప్రిన్సిపాల్ కూడా, కాని స్త్రీ సహజమైన కోరికలకు, సంకుచితమైన మనస్తత్వం ఫలితంగా ఏర్పడే అసూయకూ, ఆమె అతీతురాలు కాలేకపోయింది. గుండెజబ్బుతో అనారోగ్యంగా వున్న ఆమె ఈ ఆవేదనను తట్టుకోలేక మృత్యువుకు సన్నిహితమై 'యింటన్సివ్ కేర్ యూనిట్'లో చేర్చాల్సి వచ్చింది. అంతేకాదు 'ప్లే-సెబో' విషయంలో అంతర్జాతీయ స్థాయిలో గుర్తింపు రాగల ప్రయోగం చేసి మెడికల్ పేపర్‌ను సమర్పించాల్సిన రవిచంద్ర- తన భార్య వ్యాధిని నివారించడానికి మరొక వైద్యుడి కోసం వెతకవలసి వచ్చింది. వ్యక్తిగానే తన భర్తపట్ల నమ్మకం లేని బలహీనమైన గుండెగల మీనాక్షికి వైద్యుడుగా అతడు యిచ్చే మందు పట్ల కూడా ఏం నమ్మం వుంటుంది?

ఒక వ్యక్తి శారీరక రుగ్మతను గురించి వైద్యశాస్త్ర ప్రయోగపరంగా రచయిత చెప్పిన విషయాన్ని- కథకు గల పరిధిని మించి ఆలోచింపగలిగితే 'మాలినీఖంబెట్టా' ఆర్థిక, రాజకీయ వ్యాధులతో మంచం పట్టి మూలుగుతున్న దేశానికి ప్రతీకగా కనిపించింది. ప్రణాళికలు, ఆర్థిక పథకాలు, 'ప్లే-సెబో'లు అని అనుకుంటే వైద్యులు చేసే ఆ వైద్యం విజయవంతం అవడానికి ప్రజల సామూహిక మనోధైర్యం, కృతనిశ్చయం ఎంతయినా ఆవశ్యకం అనిపించింది. ఇలాంటి ఊహ మనస్సులోకి రాగానే వివేకానంద స్వామి ప్రజలకు వుండాలని చెప్పిన "యినప కండరాలు, ఉక్కు నరాలు" కూడా జ్ఞాపకం వచ్చాయి! కథలో చెప్పబడిన విషయం పాఠకుడి ఆలోచనా ధోరణిని బట్టి - అతగాడి 'మనోశక్తి'తో మరెక్కడికో తీసుకుపోతుందని చెప్పడానికి యిది మరో తార్కాణం అనుకుంటాను!

---

38

## ఇచ్ఛాపురపు జగన్నాధరావు-'ఎదురద్దాలు'



కథల్లో రకాలు అనేకం. పెట్టెల తాళాలు బాగుచేసేటట్టుగా లోకాన్ని రిపేరు చేసే కథలు ఒక రకం. ఒకే మంచం మీద భార్యభర్తలు పడుకుని సరదాగా చదువుకోడానికి పనికొచ్చే కథలు మరొక రకం. (ఈ పదజాలం పురాణం వారివి) ఇచ్ఛాపురపు వారివి చాలా వరకూ సరదా కథలు. అప్పుడప్పుడూ అవి పెట్టె తాళాలు బాగుచేసేటప్పటికీ ...కప్పను మాత్రం బద్దలు కొట్టే ప్రయత్నం చెయ్యవు!

ఐ.జె. రావుగారి కథల గురించి ప్రస్తావించే సరికి ఆయన కథల పాఠకులకు సుజాత, సులోచన, సురేఖ, వసంత ఇలాంటి ఎందరో అందమైన అమ్మాయిలూ ... తాజ్‌మహల్, ఫతేపూర్ సిక్రీ, బులంద్ దర్వాజా విహారాలు- క్వాలిటీ, క్లార్క్ షరాజ్ జ్ఞాపకానికి వస్తాయి. కలకత్తా, ఆగ్రా, ఢిల్లీ వంటి నగరాలలోని ఎన్నో వీధులు సుపరిచితమైనట్టుగా అనిపిస్తాయి. ముఖ్యంగా కలకత్తా మహానగరం మరీని .... ఇక, గంగానది గలగలలూ, వెన్నెల సోయగాల సంగతి సరేసరి.

జగన్నాధరావుగారి కథల్లో పాత్రలకి ఆర్థిక ఇబ్బందులు వుండవా? నెలఖరులో పర్సుఖాళీ అయిపోయి, బుర్రలో జరిగే "సర్కస్" తాలూకు భోగట్టా ఏదీ వారి కథల్లో కనబడదా? అంటే బొత్తిగా కనబడదని చెప్పనుగాని, ఒకవేళ కనబడినా అది మల్లెపూల పరిమళంలో షోగ్గా సోయగాలు విరజిమ్ముతూ వుంటుందని మాత్రం చెప్పగలను. ఆయన కథల పాఠకులకు "చీకట్లో పారిజాతం" కథ జ్ఞాపకం వుందనుకుంటాను. పుట్టిన రోజునాడు భార్యను ఆమె భర్త-నగలన్నీ అలంకరించుకోమన్నాడు. కనీసం వజ్రాల దుద్దులయినా పెట్టుకోమన్నాడు. 'మెర్సిడేజ్' కారులో షాపింగ్‌కి తీసుకెళ్ళి సురాజ్‌మల్‌లో నెక్లెస్‌లూ, న్యూ మార్కెట్‌లో ఖరీదయిన చీరలు కొంటానన్నాడు. కాని ఆమె ట్రామ్‌లో భర్తతోపాటు వెళ్ళి వాయిల్ చీర మాత్రం కొనుక్కొచ్చింది. (మల్లెపూలు కొన్నదనుకోండి) ఇదంతా చదివి భర్త ప్రేమను, భార్య పీనాసి గుణాన్ని యధాశక్తి మెచ్చుకోవడమో, తిట్టుకోవడమో చెయ్యచ్చు. కాని, అసలు కథ అదికాదు. ఇదంతా వాళ్ళు నిజ జీవితంలో ఆడుతున్న నాటకం-

మాత్రమేనని వాళ్ళకు లక్షలకొద్దీ బ్యాంక్ ఎకౌంట్ సిరిసంపదలు ముఖ్యం కాదనీ, మల్లెపూల పరిమళం లాంటి ప్రేమ మాత్రమేనని తెలుసుకుంటే, ఇందులో ఎంత తీపీ, చేదూ, ఉన్నాయి? ఆశ, ప్రేమ, ఆవేదన, కన్నీళ్ళు వున్నాయి? బహుశా– ఇదేనేమో జీవితం అంటే అనిపిస్తుంది.

నిజమే... జీవితం అనేది గుండుసూదులు కుట్టే కుషన్ లాంటిది! ('గుండుసూది' కథలో) అందులో గుచ్చుకునే గుండు సూదులు సవాలక్ష ఉంటాయి. కాని రావుగారు 'ఫోకస్' చేసేది కొన్నింటిని మాత్రమే. వీరి కథలు అమ్మాయిల చుట్టూ తిరుగుతాయి. అలకలతో భర్తను ఆటపట్టించే ఇల్లాలు, కవ్వించి ఏడిపించే ప్రియురాలు... ఎవరియితేనేం లక్ష్యాన్ని చేరుకోవడం చేతకాక రొప్పుకుంటూ పరిగెట్టే మగవాడి కథమాత్రం ఎప్పుడూ ఒక్కటే!.....

భార్యభర్తల మధ్య ప్రణయ కలహాలు రావడానికి కారణం ఏదీ అనే విషయాన్ని ఇతమిద్ధంగా నిర్దేశించి చెప్పగల శాస్త్రకారుడు ఎవరూ లేరు! మిత్రుల ఇంటికి భోజనానికి వెళ్ళినపుడు ఫలానా అమ్మాయి, ఆమె నవ్వు బాగున్నాదా? ఆ ఇంటి వంట బాగున్నదా? ఇలాంటి ప్రశ్నలు తలఎత్తినప్పుడు ... కట్టుకున్న ఇల్లాలితో "అందం చూచే కళ్ళలో ఉంటుంది. తియ్యగా మాట్లాడటం అంతా కృత్రిమం" ఇలాంటి సమాధానాలు చెబితే ఇల్లాలికి సంతృప్తి కలుగుతుందని (మనసులో ఉన్న కథ ఎలా ఉన్నప్పటికి) మగవాళ్ళు అనుకోవడం సర్వసాధారణం. కాని, అవి అబద్ధాలని పసిగట్టేసిన గడుసరి ఇల్లాలిని ప్రసన్నం చేసుకోవడం కోసం – ఆమె అలిగి పుట్టింటికి వెళ్ళిపోతే తిరిగి రప్పించుకోవడం కోసం అతగాడు పడిన బాధంతా ఒక ఎత్తూ, కథ చివర్లో "అబద్ధాలు జీవితానికి పూసే చక్కటి రంగులు. అవి అవసరం లేని జీవితం ఉండదు" అని ఆమెగారు అనడం మరొక ఎత్తూను.('పగటి నక్షత్రాలు' కథలో)

భార్య భర్తల ప్రణయ కలహానికి సంబంధించిన ఇలాంటి రంగుల చిత్రణ 'మనిషి-మమత' కథలో కూడా కనబడుతుంది. ప్రణయ కలహాలు కొండొకచో కలహాలు కూడా .... భర్త కాల్చే సిగరెట్లతో ప్రారంభమవుతాయనుకుంటాను! భర్త చేత సిగరెట్లు మానిపించాలని ఎంతో ప్రయత్నించి విఫలురాలై ఆ కోపంతో ఓ సుజాత పుట్టింటికి వెళ్ళిపోయింది. భార్య వూళ్ళోలేని సమయంలో అతగాడు గమ్మత్తుగా సిగరెట్లు మానేశాడు. ఇందుకు కారణం సుజాత మాత్రం కాదు. 'అమిత' లాంటి అందమైన అమ్మాయి. (సుజాత ఎంత అందంగా ఉన్నప్పటికీ) అతగాడితో అమిత "మీరు సిగరెట్ కాల్చినప్పుడల్లా నాకు ఒళ్ళు కాల్చినట్టుటుంది. సిగరెట్లు కాల్చడం మానేయండి....నా కోసం" అన్నప్పుడు ఆ మాత్రం త్యాగం చెయ్యాలని ఏ మగాడికి అనిపించదు? సిగరెట్ ఇచ్చే మజా కంటే అమితతో తాజ్‌మహల్ షికార్లు, క్లార్క్ షెరాజ్ డిన్నర్లు ఎక్కువ ఆనందాన్నిచ్చేవికావూ?

కాల్చమంది! "నేను సుజాతని, మీరు జగన్ అందుకోసం..." అంటుంది. జగన్ సిగరెట్లు కాల్చడం మళ్ళీ ప్రారంభిస్తే అమృతసర్ వెళ్ళిపోయిన 'అమిత' స్మృతి కాలిపోయినట్టే కదూ? సుజాతకు అంతకన్నా కావలసింది ఏముంది? కారణం ఏమయితేనేం ..... అమ్మయ్య మళ్ళీ సిగరెట్ దొరికింది.

యిక, కథా శిల్పం విషయం చెప్పాలంటే రావుగారికి కథ చివర వచ్చే 'కొస మెరుపు'పై విపరీతమైన ఆసక్తి కనబడుతుంది. ఆయన కథలు చదివిన వాళ్ళకి 'ధైర్యే సాహసే లక్ష్మి' కథ జ్ఞాపకం వుందనుకుంటాను. ఈ కథలోని సుదర్శనం పద్మినిని ఒక విషయం అడగాలని పదేపదే మథనపడుతున్నప్పుడు అది ఏమిటో అనుకుంటాం. ఒక దశలో నిర్ధారణకు కూడా వచ్చేస్తాం. (మంచులాంటి తెల్లచీర పల్చదనం లోంచి దొంగ చూపులు చూస్తున్న బ్లవుజ్ వగయిరా వర్ణనలు చదివిన తర్వాత మరీను.....) కాని, కథ చివరకు వచ్చే సరికి అతగాడు అడగదలచుకున్నది పూటగడవటానికి ఇబ్బందిగా ఉన్న కారణంగా ఆ నెల జీతం మాత్రమే అని తేలుతుంది! ఇక 'అదృష్టం' కథలోని రాజ్యం... అన్నపూర్ణ తనని ఇంట్లోకి రావద్దనటానికి కారణం తన గత చరిత్ర అనుకున్నది గానీ ...... ఇదంతా భర్త చేసిన నిర్వాకం అని అనుకోలేదు. ఎవరూ లేని సమయం చూచి ఆమె చెయ్యిపట్టుకుని శృగారం వలకబోద్దామని రాజ్యం భర్త శర్మ చేసిన ప్రయత్నం ఫలితంగా అతగాడి వళ్ళు హూనం అయ్యిందని రాజ్యం కావలించుకోబోతున్నప్పుడు అతగాడు దూరంగా జరగడానికి కారణం దెబ్బలనొప్పి అనీ కథ చివరిలో తెలుసుకొవడం సరదాగా వుండదూ?

ఈ సందర్భంలోనే 'ఖరీదయిన ఉత్తరం' కథ గురించి కూడా రాయాలి. గోవిందరావుకు పరమానందంకు మధ్య ఉత్తరం విషయంలో జరిగిన 'లావాదేవీ'లలో పరమానందం గోవిందరావుకు ఇచ్చిన చిన్న సైజు 'షాక్' ఇట్లాంటి కొసమెరుపుకు మరో ఉదాహరణ. ఈ కథను రావుగారు సోమర్‌సెట్ మామ్ రచించిన 'రైటర్స్ నోట్‌బుక్'లోని ఒక ఉదంతాన్ని ఆధారంగా చేసుకుని రాశారు. (రావుగారి కథలపై ముఖ్యంగా స్త్రీ పాత్ర చిత్రణ విషయంలో సోమర్‌సెట్‌మామ్ ప్రభావం కొద్దో, గొప్పో కనబడుతూనే ఉంటుంది. 'నిజమైన ప్రేమ కథ' 'మానవుడు-గీత' మొదలయిన కథలు చదివినప్పుడు ఇది మరీ అనిపించింది)

అసలు విషయం ఏమిటంటే, ప్రపంచ ప్రఖ్యాత రచయిత సోమర్‌సెట్‌మామ్ ప్రపంచ పర్యటన చేస్తూ భారతదేశం వచ్చినప్పుడు అస్సామ్‌లో ఒక విచిత్రమైన కథ విన్నాడట. అక్కడ వున్న ఒక కొండ ప్రాంతపు గ్రామంలో "ఏ" అనే వ్యక్తికి ప్రతిరోజు ఉత్తరాలు వస్తూ వుండేవి. 'బి' అనే వ్యక్తికి ఉత్తరాలు అసలు వస్తూ ఉండేవి కాదు. (అసలు పేర్లు రాయకుండా మామ్ 'ఏ' 'బి' అనే పేర్లు వాడాదు) ఉత్తరాలు రాని 'బి' ఒకసారి 'ఏ'తో ఒక ఒప్పందం

చేసుకున్నాడు. ఆ ఒప్పందం ప్రకారం ఒక నిర్ణయింపబడిన రోజున 'ఏ' కి వచ్చిన ఉత్తరాన్ని అది ఎక్కడినుంచి వచ్చిందో కూడా చూడకుండా 'బి'కి ఇచ్చేయాలి. అందుకు ప్రతిఫలంగా 'బి' అయిదు రూపాయలు ఇవ్వాలి. ఇది సరదాకి అనుకోడానికి బాగానే ఉంది కాని, తీరా ఉత్తరాన్ని ఇచ్చాక 'ఏ'లో బోలెడంత సస్పెన్స్ బయలుదేరింది. ఆ ఉత్తరం ఎక్కడ నుంచి వచ్చిందో తెలియక! ఇక ఆతృత భరించలేక'ఏ' 'బి' అనేవాడి దగ్గరకు వెళ్ళి డబ్బు తిరిగి ఇచ్చేస్తాను ఉత్తరం ఇచ్చేయ్యమంటాడు. కాని, అందుకు 'బి' అంగీకరించడు. వాస్తవంలో జరిగింది ఇంతే! మామ్ ఈ ఉదంతాన్ని కథగా అల్లుదామనుకున్నాడు. గాని ఆయనకు ఇందులో 'తలా' 'తోకా' కనబడనందున రాయడం మానేశాడు. కథకుడుగా మామ్...మొపాసా శిల్ప ధోరణిని సమర్ధిస్తాడు. తుదీ, మొదలూ లేకుండా చెహోవ్ రచనా ధోరణిని ప్రశంసిస్తూ- "అది ఒక సంఘటన ప్రాతిపదికగా మొత్తం జీవితానుభూతిని పట్టుకోవడం" అని అన్నప్పటికి - సోమర్‌సెట్‌మామ్ మాత్రం "చెహోవ్ పద్ధతి ఇసుక మీద కెరటం దిగవిడిచిన చారలాంటిది. నాకది తృప్తిని ఇవ్వదు" అనేవాడు అంతేకాదు. "తలా తోకా లేకపోతే అది చేప కానేకాదు!" అనేవాడు వ్యంగ్యోక్తిగా.....

ఇంతకూ చెప్పొచ్చేదేమంటే ... "ఖరీదయిన ఉత్తరం' కథకు రావుగారు ఇచ్చిన కొసమెరుపులో తుదీ, మొదలూ చక్కగా సమకూరాయి. ఇదే ఇతి వృత్తంలో ప్రఖ్యాత తెలుగు కథకుడు బుచ్చిబాబు 'మామ్ వ్రాయని కథ' అనే పేరుతో ఒక కథను రాశాడు గాని - ఆ కథకు బుచ్చిబాబు ఇచ్చిన ముగింపు కృతకంగా వుండి అదొక కాశీమజిలీకథలాగా తయారయింది. కాని 'ఖరీదయిన ఉత్తరం' కథకు రావుగారు ఇచ్చిన కొసమెరుపు కథాశిల్పానికి ఒక పరిపుష్టి ఇచ్చింది.

రావుగారి కథలలో "ఎదురద్దాలు" కథ చాలా బాగుంటుంది. ఇందులో అబ్బాయి, అమ్మాయి "ప్రేమాయణాలు...ప్రణయ కలహాలు లేవు. క్లార్క్ షె.రాజ్ డిన్నర్లు లేవు. ('క్వాలిటి'లో సాండ్విచ్‌తో కాఫీ బ్రేక్ వుందనుకోండి) ఇక - కలలు, కల్పనలు, వున్నమాట నిజమేగాని, అందులో జీవితం ఉంది. ఆ జీవితపు వికృత స్వరూపం కూడా ఉంది.

రామనాథం, రమణమూర్తి ఇద్దరూ ఎలమంచిలి బడిలో క్లాస్‌మేట్స్. ఇద్దరూ పెరిగి పెద్దవారయిన తర్వాత ఓ మహానగరపు నడివీథిలో తారసపడ్డారు. రామనాథంతోపాటు షాపింగ్‌కి వచ్చిన ఆమెను అతగాడు కారులో సాగనంపడం చూచిన రమణమూర్తి రామనాథం చాలా పెద్ద ఉద్యోగంలో వున్నాడనుకున్నాడు. అతగాడి సౌజన్యం వల్లనే ఇంత ఎత్తుకు ఎదిగి వుంటాడని అనుకున్నాడు. ఇక రమణమూర్తి నడుపుతున్న ఖరీదయిన ఇంపోర్టెడ్ కారును చూచిన రామనాథం అతను చాలా పెద్దస్థితిలో వున్నాడని, అతనికున్న పెర్సనాలిటీవల్ల మంచి ఉద్యోగం సంపాదించి వుంటాడని అనుకున్నాడు. ఒకరి ఉద్యోగం

పెర్సనాలిటీవల్ల మంచి ఉద్యోగం సంపాదించి వుంటాడని అనుకున్నాడు. ఒకరి ఉద్యోగం సంగతి మరొకరు స్పష్టంగా చెప్పరు. అసలురంగు బయటపడిపోతుందని భయం.

రమణమూర్తికి తన ఉద్యోగం గురించి ఉన్న భ్రమను ఆసరాగా చేసుకుని చిన్నప్పుడు అతగాడు తనని ఫుట్‌బాల్ ఆటలో ఏడిపించినదానికి బదులు తీర్చుకోవాలనుకుంటాడు రామనాథం. అతగాడిని 'క్వాలిటీ' హోటల్‌కి తీసికెళ్ళి, పన్నెండు రూపాయలు ఖర్చుపెట్టి ఖరీదయిన 'స్టేట్ ఎక్స్‌ప్రెస్' సిగరెట్ పేకట్ కొని రమణమూర్తిని ఏడిపిస్తాడు. ఆ క్షణంలో అది తనకు ఇచ్చిన సంతృప్తి ముందు పిల్లలకు కట్టవలసిన స్కూలు ఫీజు, భార్యకు కొనవలసిన హార్లిక్స్ సీసా జ్ఞాపకానికి రాలేదు. అది సరే- షాపింగ్ అయిన తర్వాత మిగిలిన డబ్బు గురించి సేట్ జీ కూతురు 'ఉష' లెక్క అడిగినప్పుడు ఏం సమాధానం చెప్పాలి? సేట్ జీ కి కోపం వస్తే తన గుమస్తా ఉద్యోగం ఊడిపోదూ? ఇట్లాంటి ఆలోచనలతో క్లార్కు రామనాథం కొంపకు చేరుకుంటున్న సమయంలో పెద్దకారు డ్రయివర్ రమణమూర్తి తన టెరిలిన్ బట్టలమీద ఖాకీ యూనిఫారమ్ వేసుకుని సినిమాకు వెళ్ళిన 'అమ్మగారిని' తిరిగి తీసుకురావడం కోసం థియేటర్ దగ్గర వేచివున్నాడు.

ఈ కథ చివరిలో రామనాథం, రమణమూర్తిల అసలు వృత్తులు తెలిసినప్పుడు - ఈ ఎదురద్దాలలో వాళ్ళ బ్రతుకుల నిజస్వరూపం బయటపడినప్పుడు - అదొక 'కొసమెరుపు'లా మాత్రమే అనిపించదు. గుండెల్లో ఏదో మూల కలుక్కుమని గుచ్చుకున్నట్టుగా అనిపిస్తుంది. కలలు-కన్నీళ్ళు-భ్రమలూ ఓ విధమైన అబద్ధపు బ్రతుకులు మధ్య తరగతి కుటుంబీకుల జీవితాలలో మామూలయిన విషయాలే. ఈ 'మామూలు' వెనకాల ఆర్థిక వ్యవస్థ భయంకర స్వరూపం ఉన్నప్పటికీ ఆ తరహా కుటుంబీకుల మనస్తత్వంలోని లేకిగుణపు కథ కూడా వుంది. రామనాథం, రమణమూర్తి అనబడే ఇద్దరు బడుగు జీవుల 'నిన్న-నేడు-రేపు'ల కథను "ఎదురద్దాలు" కథలో చూడగల్గినప్పుడు అది కేవలం వాళ్ళిద్దరి కథలాగా మాత్రమే అనిపించదు. అదొక సగటు భారతీయుడి కథలా అనిపిస్తుంది. అందుకే - ఈ కథ అంటే నాకు ఇష్టం!

---

# 39

## బలివాడ కాంతారావు కలం 'ఇంటికోసం'



**తె**లుగు కథా సాహిత్యంలో ఎత్తిన కలం దించకుండా వందలాది కథలు వ్రాసి రాశికీ, వాసికీ ప్రాధాన్యతను ఇచ్చిన మంచి కథకుల పేర్లు చెప్పేటప్పుడు బలివాడ కాంతారావుగారి పేరు కూడా చెప్పాలి. కథా శిల్పపరంగా కాంతారావుగారు కొత్త కొత్త ప్రయోగాలు చేయకపోవచ్చు. బుర్ర బద్దలు కొట్టుకుంటేగాని బోధపడని కొరకరాని కొయ్యల్లాంటి కథలు ఆయన రాయకపోవచ్చు. సామ్యవాద దృక్పథంతోనో, మరొక తరహా దృక్పథంతోనో ఆవేశంతో మన రక్తాన్ని ఉడుకెత్తించే రచనలు కూడా ఆయన చేయకపోవచ్చు. చాలామంది తెలుగు కథకుల్లాగానే ఆయన కూడా మధ్య తరగతి కుటుంబాలలోని మనుషుల కథనే చెప్పినా, ఇదివరకు ఎప్పుడో చదివిన పాత కథల్లా అనిపించవు ఆయన కథలు. అంతేకాదు ఎలాంటి ఆవేశమూ లేకుండా కాస్త ఆలోచించమని చెప్పే కథలు ఆయనవి.

పొట్టగడవక మొగుడికి ఉద్యోగం రావడానికి ఇవ్వాల్సిన లంచం కట్టుకోలేక కన్న బిడ్డను నడిబజారులో వంకాయలు, బీరకాయలు అమ్ముకున్నట్టు అమ్ముదామనుకున్న వెర్రితల్లి కథ రాసినా ('శిశు విక్రయం' కథలో) మడపాం గ్రామంలో (కథకుడు కాంతారావుగారి జన్మస్థలం యిది.) ఓ డాక్టరుగారు ప్రేమతో పెంచుకున్న ముంగిసను కర్రతో చంపిన భైరవయ్య, ప్రతీకారపు కథ తెలిపినా ("ముంగిస కథ"). గోవా సుందర దృశ్యాల నేపథ్యంలో 'గుండెకు తగిలిన గాయాల పరామర్శ వేసినా ("గాయాలు' కథలో) కాంతారావుగారి దృష్టి మనిషి మనసుమీద మాత్రమే. ఆర్థికంగా వాళ్ళు ఏ ఆర్థిక వర్గానికి చెందిన వారనే విషయంపైనా, వర్గాలమధ్య జరిగే సంఘర్షణపైనా వుండదు. "శిశు విక్రయం" కథలోని తల్లి బిడ్డను అమ్ముకోడానికి దారితీసిన ఆర్థిక పరిస్థితులకంటే ఆ వెర్రి తల్లి దృష్టిలో ఆ రోగిష్టి పిల్లవాడిని అమ్మజూపితేచాలు రూపాయిల వాన కురిసేటంతటి విలువయిన వస్తువుగా కనబడడం గుండెల్ని పట్టి వూపుతుంది. జబ్బుతో, ఆకల్తో, చావడానికి సిద్ధంగా ఉన్న ఆ ఎముకలపోగు కన్నతల్లి దృష్టితో చూస్తే కోహినూర్ వజ్రం కాదూ? మరి ఆ వజ్రాన్ని యాభై రూపాయలకు అమ్మజూపడంలో వున్నది త్యాగమా? స్వార్థమా? ప్రేమా? అనే విషయాన్ని నిర్ధారించి చెప్పగలిగితే ఈ సమాజపు విలువలు అవగాహన అయినట్టే

కాదూ? ఇంతకూ చెప్పదలచిన విషయం ఏమిటంటే పరపీడన ఫలితంగా ఇనుప పాదాల క్రింద నలిగిపోయిన బడుగుజీవులపట్ల సానుభూతిని చూపడం వరకూ కాంతారావుగారు పీడితులవైపు కనబడతారు. కడుపు కక్కుర్తితో దొంగతనాలు చేసే నిర్భాగ్యులకన్నా అన్యాయంగా లాభాలు ఆర్జించే షావుకార్లు, మతం పేరుతో ప్రజలను దోచే సాధువులు, అసలు దొంగలు అని కాంతారావుగారు "దొంగలు" చెప్పడం ఆ కథ చదివిన పాఠకులు మరచిపోలేరు! ఇదంతా సరేగాని ఓ విషయం మాత్రం నిశ్చయంగా చెప్పవచ్చు. రావుగారు ఏ ఇతివృత్తంతో కథలు రాసినా అందులో మనిషి గుండెల చప్పుడు వినబడుతూనే ఉంటుంది.

ఆ మధ్య కాంతారావుగారు "నైజరు తేనె" అనే పేరుతో ఒక కథను రాశారు. నిజానికి అందులో పెద్దగా 'కథ' ఏదీ లేకపోయినప్పటికీ పారిశ్రామికీకరణఫలితంగా సహజమైన లక్షణాలన్నింటిని కోల్పోయి యంత్రాలలో మరల్లాగా అయిపోతున్న మానవజాతి కథ అంతా అందులో వున్నదనిపించింది. పదేళ్ళ క్రితం అదొక అనాగరిక ప్రాంతం. అక్కడి గిరిజనులకు చదువు రాదు. ఆధునికులు గొప్పగా చెప్పుకునే సంస్కారవిశేషాలన్నీ వారికి లేవు. కాని కథకుడికి అక్కడ దొరికిన నైజరు తేనె, నిండు హృదయంతో పొంగి పొరలే అమాయక జీవుల ఆతిధ్యం, అన్నిటికీ మించి 'పర్భతీ' లాంటి స్త్రీతో పరిచయం, అతడి జీవితానికంతటికీ సరిపోయే మధురానుభూతులు మిగిల్చాయి. పదేళ్ళ తర్వాత వాటిని మళ్ళీ నెమరు వేసుకుందామనే తపనతో అతడు మరోసారి అక్కడకు వచ్చాడు. ఈ దశాబ్దికాలంలో ఆ ప్రాంతంలో పారిశ్రామిక నాగరికత ప్రభావం దిట్టంగా అలుముకుంది. ఆ కారణంగా అక్కడ వున్న వాళ్ళంతా డబ్బు యంత్రాలలో మరల్లాగా మరిపోయారు. అన్నింటికీ కొలమానం రూపాయిలే! అందరి దృష్టి సంపాదనమీదే. ఆనాటి పర్భతీ ఇప్పుడూ వుంది. కాని కల్తీ నాగరికతతో ఆమెకూడా కలుషితమైపోయింది. మరి మధురమైన ఆ 'నైజరు తేనె' దొరికేదెలా?

రోజు రోజుకూ అదృశ్యమైపోతున్న 'నిజమైన' ఈ నైజరు తేనె గురించిన ఆవేదన ప్రపంచ మేధావులందరినీ కలవర పెడుతున్నది. "ది రైటర్స్ డైలమా" అనే గ్రంథంలో ఒక వ్యాసం వ్రాస్తూ ప్రపంచ ప్రఖ్యాత రచయిత "సాల్ బెల్లో" నేటి యాంత్రిక యుగంలోని మనుషుల గురించి ప్రత్యేకించి రాయల్సింది ఏమీ లేదని వీళ్ళందరి జీవితాలలోనూ ఉన్నత విలువలు మృతమై ఒకే మోస్తరుగా ఉన్నాయని వాపోతాడు. ప్రపంచంలో అన్నింటికన్నా 'మనిషి' మానవత్వానికి సంబంధించిన విలువల్ని "సీల్డ్ ట్రెజర్" అని అన్నారు. అందులోని సంపదను కొలవడమే రచయిత బాధ్యత. అలా కానినాడు 'సాల్ బెల్లో' అన్నట్టు మరుగుజ్జులపై మహోన్నత విలువలు ఆపాదించి మనకు మనమే మురిసిపోవలసి వుంటుంది.

కాంతారావుగారికి మనిషి కథలోని బొమ్మా, బొరుసులను చూపడం మహా యిష్టమైన విషయం. సారా వ్యాపారాన్ని ఊళ్ళోంచి ఎత్తించి వెయ్యడానికి ఎంతో శ్రమపడిన మనిషి.

చావు బ్రతుకులమీద వున్న కొడుకు ప్రాణాల్ని ఒక సారా వ్యాపారస్తుడి డబ్బుతోనే కాపాడుకొనవలసి రావడం- ఇంద్రియ నిగ్రహం గురించి లెక్చర్లు దంచిన పెద్ద మనుషులు అందమైన అమ్మాయి సాన్నిధ్యం లభించే సరికి నరాల వేడికి తట్టుకోలేక 'లబోదిబో' మనడం, ఇలాంటి ఇతివృత్తాలతో కథలు రాయడం కాంతారావుగారికి నల్లేరు మీద బండి! ఇలాంటి సందర్భాలలో గుండెలలో జరిగే అలజడి సామాన్యమైంది కాదు. అయితే ఈ అలజడిని కాంతారావుగారు ఒక బుచ్చిబాబులా మనోవైజ్ఞానిక దృక్పథంతో అద్దం పట్టడానికి ప్రయత్నించరు. (కొన్ని సందర్భాలలో అప్రయత్నంగా అది చోటు చేసుకునే టప్పటికీ) ఆయన దృష్టి అంతా మధ్యతరగతి కుటుంబాలలో పలు సందర్భాలలో దర్శనమిచ్చే 'జెకిల్ అండ్ హైడ్' కథను బయట పెట్టాలని మాత్రమే. ఇక ఈ తరగతి మానవుల్లో వుండే జంకులు, భయాలు, మూఢ నమ్మకాలు, వీటన్నింటి ఫలితంగా పుట్టుకొచ్చే, దౌర్భాగ్యపు ఆలోచనలు - ఆ కథ సరేసరి.

కాంతారావుగారి కథల పాఠకులకు 'పెళ్ళి' కథ జ్ఞాపకం వుందనుకుంటాను. ఈ కథలోని రమణమూర్తి తన తాత రమణయ్యకంటే నైతిక విలువల దృష్ట్యా చాలా అధికుడనని అనుకున్నాడు. ఇంటిలో రంభలాంటి ఇల్లాలు ఉండగా గడ్డికోసే పాలేరు పిల్లతో తాతచేసిన రొమాన్సు, పెళ్ళిళ్ళకు డబ్బు మంచినీళ్ళలా ఖర్చుచేసిన అతగాడి మూర్ఖత్వం తలుచు కున్నప్పుడల్లా రమణమూర్తికి వళ్ళు మండిపోయేది. పెళ్ళి అనే బంధానికి సంపూర్తిగా న్యాయం చెయ్యాలనీ, కట్నం లేకుండా మనసుకు నచ్చిన బీద పిల్లను అతి నిరాడంబరంగా పెళ్ళి చేసుకుని 'రికార్డు' సృష్టించాలనుకున్న రమణమూర్తి, తనకు తానే చివరకు అపర శ్రీరామచంద్రుడిగా సర్టిఫికెట్ ఇచ్చుకున్న రమణమూర్తి, చివరకు తాత చేసిన తప్పులన్నిటినీ తెలిసో, తెలియకో చెయ్యడం ఆ కథ చదివిన వాళ్ళు మరచిపోలేరు. ఈ కథ అంతా ఒక ఎత్తూ, కథ చివర్లో 'బజారు మనిషి' పసుపుకొమ్ము అవతల పారేసి, రూపాయి కట్టి దాచుకోవడం మరొక ఎత్తూను (అవును మరి- బజారు పిల్లకు 'అబద్ధపు విలువల' ముసుగు ఎందుకూ?)

ఇక, "ఉద్రేకాలని అణచుకోలేని మనిషి కుక్కతో సమానం" అన్న పెద్ద మనిషి సంగతి ఏమిటి? ('నీతి-అవినీతి' కథలో) తన తమ్ముడు నలుగురి మాటా కాదని ఒకరిని నమ్మి మోసపోయిన స్త్రీని పెళ్ళాడితే ఆ వివాహాన్ని హర్షించేంత వరకూ తాను పెద్ద మనిషినన్న మాట నిజమే! కాని విధి వశాత్తూ తమ్ముడు చనిపోతే 'పవిత్రుడ'నని పేరుపడ్డ తన ఇంటికి దిక్కులేని స్థితిలో ఆ అమ్మాయి ఆశ్రయంకోసం వస్తే తన గుండెల్లోని గుర్రాలు ఆమె అందాన్ని చూచి గంతులేసి అలజడిని సృష్టించలేదూ? అన్ని విలువలను ఒక్క క్షణంలో ముంచెత్తివెయ్యగల ఆ వరద వెల్లువ ముందు తాను నిలువ గలిగేదా? (అదే కథలో) ఇలాంటి కథే 'అడవి పువ్వు' కథలోని కథానాయకుడిది కూడా! అయితే

వచ్చే సరికి రసికత్వానికి దిగజారినా చెంపదెబ్బ కొట్టకుండా దాదాపుగా అంతపనీ చెయ్యడం కాంతారావుగారి కథానాయికల ప్రత్యేకత (వాళ్ళు కొ.కు. కథానాయికల్లా గడుసువాళ్ళని చెప్పడానికి ఆస్కారం లేకపోయినప్పటికీ)

కాంతారావుగారి కథల్లో 'ఇంటికోసం' కథ నాకు బాగా నచ్చింది. ఇందుకు కారణం ఈ కథలో మధ్య తరగతి మనుషుల మనస్తత్వపు కథ యావత్తూ వున్నది. వాళ్ళ ఆశలూ, భయాలు, మూఢ నమ్మకాలు అన్నీ ఉన్నాయి. ఈ రోజుల్లో మహా నగరాలు మొదలుకుని అతి సాధారణమైన గ్రామాలవరకూ మధ్య తరగతి కుటుంబీకులను వేధిస్తున్న ముఖ్య సమస్య గృహ సమస్య! అద్దె ఇళ్ళల్లో గోడమీద మేకు కొట్టడం దగ్గరనుంచి రాత్రి తొమ్మిది తర్వాత వెలిగే లైట్లు వరకు ఎన్నో నిబంధనలు, ఆంక్షలు. ఇంటి యజమాని డిక్టేటర్‌షిప్' పడలేక ఏడాదికో ఇల్లు మార్చే కథ వుండనే వున్నది. (అందుకే కాదూ భమిడిపాటి వారు అద్దెకొంపల ధోరణిని బట్టి చూస్తే భౌతిక లోకం యొక్క అస్థిరత్వం స్ఫురణకు వస్తుంది. జీవుడి శరీరాలు అద్దె కొంపలు అని హాస్యంగానే అనుకోండి అన్నదీ!) ఇంటియజమాని బొత్తిగా మంచివాడని 'సర్టిఫికెట్' ఇవ్వగల అద్దె కొంపల కాపురస్తులు చాలా అరుదుగా వుంటారనుకుంటాను. (ఇంటి యజమాని మరీ మంచివాడయినా ఇబ్బందే! అతగాడు బొత్తిగా ఇంటి అద్దె పెండచం మానేసి సాటి వాళ్ళలో తనని అవమానపరుస్తున్నాడని తగువుకు వెళ్ళిన ఆసామి గురించి బుచ్చిబాబు ఓ కథలో చెప్పడం జ్ఞాపకం లేదూ?)

ఇదంతా అలావుంచి కాంతారావుగారి కథ విషయానికి వస్తే, ఈ కథలోని విశ్వనాథం నిజాయితీపరుడయిన ఉద్యోగి. చిన్న ఉపకారం చేసినందుకు ఎవరో దంతపు బుద్ధ విగ్రహాన్ని ఇంటిలో బలంతంగా ఇచ్చి వెళ్ళితే ఎడ్రస్ తెలుసుకుని బొమ్మను పార్సిల్‌చేయించి తిరిగి పంపిన 'బుద్ధావతారం' అతను. ఆరు కొబ్బరికాయలు బహుమతిగా తీసుకున్నా 'ఆనెస్టీ' మంటలో కలిసిపోతుందనే ఐ.ఎస్.ఐ. మార్కు మనిషి అతను. ఇలాంటి విశ్వనాథం స్వంతానికి ఇల్లు అనేది లేకుండా ఇంటి యజమానుల బాధల్ని భరిస్తూ అద్దె ఇళ్ళల్లో అగచాట్లు పడుతూ ఉండడంలో అతిశయోక్తిలేదు. అవునా? మరి ఈ విశ్వనాథం టవున్ ప్లానింగ్ ట్రస్టువాళ్ళు వాయిదాల పద్ధతి మీద ఇళ్ళు విక్రయిస్తున్నారని విని ఓ మిత్రుని బలవంతం మీద అప్లికేషన్ పడేశాడు. ఇంతలోనే అసలు వార్త తెలిసింది. కట్టిన ఇళ్ళ సంఖ్య కన్నా వచ్చిన అప్లికేషన్ల సంఖ్య చాలా ఎక్కువగా వున్నందున రికమండేషన్ చేయించనిదే పనిజరగదని! ఈ పరిస్థితుల్లో విశ్వనాథం ఆశవదులుకునే వాడేమోకాని, ఇంటి ఇల్లాలి పోరుఫలితంగా తన ప్రిన్సిపుల్స్‌ను అతడు కొంత సడలించుకోక తప్పలేదు. విశ్వనాథం దగ్గిరకు ఆఫీసు పనిమీద వచ్చే కాంట్రాక్టరు ఎం.ఎల్.ఎ. గారి సన్నిహిత మిత్రుడు కాబట్టి అతని చేత ఎం.ఎల్.ఎ. గారి చెవిలో ఓ మాట వేయిస్తే పని అయిపోతుందని మిత్రుడు ఇచ్చిన సలహాను అతగాడు అయిష్టంగానే ఆచరించాడు. ఫలితంగానే అన్నట్టు విశ్వనాథం

ఇంటి ఎలాట్ మెంట్ నిముషాలమీద జరిగిపోయింది.

అద్దె కొంపల్లో నానా బాధలు పడ్డ భార్యా బిడ్డలు స్వతం ఇంటిలో అందమైన డ్రాయింగ్‌రూమ్, డైనింగ్ రూమ్, ఇంటి చుట్టూ వున్న స్థలం - వీటన్నింటినీ చూసి మురిసిపోతూ వుంటే తనూ సంతోషించాడు, ఇన్నాళ్ళకు కష్టాలు గట్టెక్కినందుకు. కాని గుండెల్లో ఏదోమూల ముల్లు గుచ్చుకుంటూనే ఉంది. (రికమండేషన్ వల్ల వచ్చిన ఇళ్ళల్లో వున్న వాళ్ళ బ్రతుకులు మండిపోతాయని ఇంటి ఎలాట్‌మెంట్ రాని ఓ మిత్రుడు అన్నాడు కూడాను!) దీనికి తగ్గట్టుగా ఆ యింటిలో దిగిన కొద్దిరోజులకి కుదురుతుందనుకున్న కూతురు పెళ్ళి సంబంధం తప్పిపోయింది. డాబామెట్ల మీదనించి జారిపడి ఒక్కగానొక్క కొడుకు జ్వరం తెచ్చుకుని ఒళ్ళు తెలియనట్టుగా పడి ఉన్నాడు. ఇలాంటి స్థితిలో Auditory Hallucinations, Visual Hallucinations. పలుకరిస్తే గాభరాపడి ఏం చెయ్యాలో తోచక జ్యోతిష్యుణ్ణి ఆశ్రయించడం- అతగాడు ఇల్లు మార్చెయ్యమని సలహా ఇవ్వడం- జరిగాయి! వీటన్నింటి ఫలితమే అతగాడు బంగారంలాంటి స్వంత ఇల్లు వదులుకొని మురికి గుంట లాంటి అద్దె కొంపకి తరలిపోవడం! అంతటితో ఆగక కొడుకు దక్కితే చాలునన్న ఆశతో ఇంటిని మళ్ళీ టవున్ ప్లానింగ్ ట్రస్ట్ వాళ్ళకి అమ్మేసి చేతులు దులుపుకుని తన నిజాయితీని నిలబెట్టుకున్నాడు కూడాను!

ఇంతటి ఘనకార్యం చేసినందుకు విశ్వనాథం నిజాయితీని మనం అభినందిస్తామా? అదొక వెర్రి తనమని వేళాకోళం చేస్తామా? అనేది వేరే విషయంగాని అసలుకథ వేరే ఉన్నది. ఇంటి అమ్మకం అయిపోయిన తర్వాత తెలిసింది విశ్వనాథానికి ఎం.ఎల్.ఎ. గారు తనకి ఎలాంటి రికమండేషనూ వెయ్యలేదని! (వారికి ఊపిరి సలపని పనులు కదా మరీ) విశ్వనాథానికి ఇంటి ఎలాట్‌మెంట్ ఎలాంటి రికమెండేషనూ అవసరం లేకుండానే దానంతట అదే వచ్చిందని! (హతోస్మి)

ఈ 'కొసమెరుపు' కాంతారావుగారి కథకు ప్రాణం పోసింది. లేకుంటే అది బుద్ధిమంతుడగు బాలుడు 'రాము' కథలాగా మాత్రమే వుండేది. మనసుకు గల శక్తి గురించి, దాని ప్రభావం వల్ల మనం తగిలించుకునే రంగు కళ్ళజోళ్ళను గురించి తెలిసేది ఇక్కడే. అంతేకాదు మధ్యతరగతి కుటుంబాలలోని మూఢనమ్మకాలు, వాళ్ళ విలువల కథలోని బొమ్మా, బొరుసుల గురించి తెలిసేది కూడా ఇక్కడే. ఈ కొసమెరుపుతో కాంతారావుగారు మనసు కథను అందంగా ఆవిష్కరింపగలిగారు. మంచి కథ నిర్వర్తించవలసిన పనుల్లో ఇదికూడా ముఖ్యమైనదనుకుంటాను.

---

# 40

## 'కాళీ పట్నం' రామారావు - చావు



**నూ**టికి ఎనభైశాతం మంది ప్రజలు గ్రామాల్లో నివసిస్తున్న దేశం మనది. నిజమే! వాళ్ళ కష్టాలు, కన్నీళ్ళు, వాటి వెనుక గల 'అసలు కథ' విప్పి చెప్పిన కథా రచయితలు తెలుగులో యిప్పటికీ తక్కువే - ఆ తక్కువ మందిలో తెలుగు వాళ్ళు గర్వంగా చెప్పుకోదగ్గ రచయిత కాళీపట్నం రామారావుగారు. ఇలా రాసినంత మాత్రాన - కాళీపట్నం వారికి ముందు గ్రామీణ ప్రజా జీవితంలోని బడుగు జీవుల కథను కథలుగా మలిచిన కథకులు లేరని అర్థం కాదు. కరుణకుమార, మా. గోఖలే వంటి కథకులు బడుగు జీవుల దైన్యానికి కరిగిపోయినంతగా వారిని ఆ దైన్యానికి దిగజారుస్తున్న ఆర్థిక శక్తుల గురించి, వాటికి అంతటి శక్తి వుండడానికి గల మూల కారణాల గురించి పట్టించుకోలేదు. తెలుగు కథ 'క్రిటికల్ రియలిజమ్' నుంచి "సోషలిస్ట్ రియలిజమ్" ను ఎదగడానికి (మాగ్జిమ్ గోర్కి పరిభాషలో) ముఖ్య కారకులయిన కథకుల్లో కాళీ పట్నం రామారావుగారు ఒకరు. ఆయన కథలు కాలక్షేపం బఠానీలు కావు. ప్రజలను రెచ్చగొట్టడమే పనిగా పెట్టుకున్న కరపత్రాలు కూడా కావు. ఓ పక్క నుంచి గుండెల్ని పట్టి ఊపుతూనే మరో వైపు నుంచి వెన్ను తట్టి నడిపించే కథలు ఆయనవి.

నిజమే - సంప్రదాయ కథా శిల్పంలో కాళీపట్నం కథలు యిమడకపోవచ్చు. యిందుకు ఆ కథల నిడివి, ఆ కథలలో రచయిత చెప్పదలచిన విషయాలకున్న విస్తృతి, కొన్ని సందర్భాలలో కథల ముగింపు, మొదలయినవి కారణాలు కావచ్చు. ఇది రాస్తూంటే - నాకు ప్రపంచ ప్రఖ్యాత రచయిత డి.హెచ్. లారెన్స్, జ్ఞాపకం వస్తున్నారు. తన నవలల్లో శిల్ప 'దోషాలు' వున్నాయి అని చెప్పే విమర్శలకు సమాధానంగా లారెన్స్ అంటాడు కదా - "నవలా నిర్మాణ విషయంలో నిబంధనలు యితర నవలలను కాపీ చేసే వాళ్ళ విషయంలో వర్తిస్తాయి. స్వతసిద్ధమైన నవలలకు తనవైన నిర్మాణ ధోరణి వుంటుంది. ఇతరులు 'దోషాలు' అని చెబుతున్న విషయాలను నా నవలల లక్షణాలుగా పేర్కొంటాడు." అది కథ అయినా, నవల అయినా, యిదే విషయం వాస్తవం అనుకుంటాను!

ఒక నవంబరు తొమ్మిదో తారీఖున జన్మించిన కాళీపట్నం వారు కథకుడుగా 1942-72 సంవత్సరాల మధ్య రచించిన కథలు - దాదాపుగా అన్నీ మంచి కథలు. నలనభైలలోను, యాభైలలోనూ, రామారావు గారు రాసిన కథలకు కేంద్రబిందువు మధ్యతరగతి కుటుంబాలలోని మనుషుల మనస్తత్వం, వాళ్ళ ఆలోచనలు. పెళ్ళికొచ్చి నగదు పోగొట్టుకుని ఆ పని చేసింది ఆడబడుచు అని కనిపెట్టిన ఇల్లాలి కథ వ్రాసినా, - అన్నదమ్ముల అనుబంధాల మధ్య, తల్లీ కూతుళ్ళ మధ్య గృహ రాజకీయాలు దూరిచేసిన అలజడిని గురించి రాసినా ఒకప్పుడు రామారావు' గారు రాసిన కథల్లో మధ్య తరగతి కుటుంబాల కథ అద్దంలో కనబడినట్టు అందంగా కనబడేది. రామారావు గారిలో వున్న ఒక ప్రత్యేకత ఏమిటంటే ఆయన పాత్రలు ఆర్థికంగా ఏ తరగతికి చెందినప్పటికీ - వాటి ప్రవర్తనలో లౌక్యం, వ్యవహార జ్ఞానం, గడుసుదనం, స్పష్టంగా కనబడతాయి. వాటి సంభాషణల్లో ఆ తరగతికి అనువైన సొగసైన శ్రీకాకుళం మాండవకం వినబడుతుంది. నిశితమైన పరిశీలనా దృష్టికి, మనుషుల గుండెల్లోని వెలుగుచీకట్లు పట్ల అవగాహనకు, ఆయన కథలన్నీ తార్కాణంగా నిలుస్తాయి.

మధ్యతరగతి కుటుంబాల కథను ఆవిష్కరిస్తూ ఒకప్పుడు కాళీపట్నం వారు రాసిన కథలు - కథకుడుగా ఆయనకు కొంత పేరును తెచ్చినప్పటికీ హఠాత్తుగా కొన్నాళ్ళపాటు ఆయన రాయడం మానుకున్నారు. "నాకు యిష్టమయిన కథలు వేరు. రాయడం చేతనయిన కథలు వేరు. నాకు యిష్టమైన కథలు ఎలా రాయడమో ఆనాడు నాకు తెలియదు. నాకు చేతనయిన కథలు రాసి ప్రయోజనం లేదని తెలియసాగింది." అంటారు 'కా.రా' ఒకనాటి తన ఆలోచనలను తలచుకుంటూ ఈనాటి వాణిజ్య యుగంలో యిలాంటి నిజాయితీ వున్న రచయితలు ఎంతమంది? మార్కిస్టు సిద్ధాంతాల అవగాహనతో రామారావుగారు 1964 తర్వాత రాసిన కథల్లో ఈ వైరుధ్యాన్ని తొలగించుకున్నప్పటికీ, యిందుకు సంబంధించిన నేపథ్యం అంతకుముందు కథల్లో కూడా కనబడుతుంది. 'ఆ ప్రజ్ఞాతం' కథలోని సుదర్శనం ఆర్థిక వ్యవస్థలో బహిరంగంగా జరుగుతున్న దోపిడీని గురించి రచ్చబండ దగ్గిర చర్చించిన తీరు, 'పలాయితుడు' కథలోని రాజశేఖరం కథ చివరిలో మిత్రుడికి రాసిన ఉత్తరంలోని కొన్ని అంశాలు ఆ కథల పాఠకులకు జ్ఞాపకం వున్నాయనుకుంటాను. అయితే - "అతను (సూరప్పుడు) దోపిడి చెయ్యలేదు. అతని వల్లే దోపిడీ జరిగింది. ఫలితం భౌతికంగా ఒక్కటే అయినా- నైతికంగా రెండిటికీ తేడా వుంది." అది కథ చివరిలో సుదర్శనం అనుకోవడమూ ( ఆప్రజ్ఞాతం') మధ్యలో 'దేవుడి వ్యవహారం వుండడమూ, - యాభైలవాటి కథల్లో రామారావుగారు లోనయిన 'సంఘర్షణ'కు ఉదాహరణ అని చెప్పవచ్చును.

సంబంధించినవే అయినప్పటికీ- కొన్ని కథల్లో మధ్యతరగతి కుటుంబ జీవితము, మరికొన్ని కథల్లో ఆర్థికంగా వున్నత వర్గానికి చెందిన వ్యక్తులు కూడా కనబడతారు. అయితే - కేంద్ర బిందువు మాత్రం వేరు. ద్రవ్యోల్బణ సమయంలో పెరిగే వస్తువుల విలువకు, కరిగే ద్రవ్యపు విలువకు, సంబంధించిన ఆర్థిక రహస్యం తెలుసుకోలేక - రిటైరైరయిన తర్వాత వచ్చిన డబ్బుతో స్థలం కొనుక్కోకుండా-రొక్కం చేతిలో పెట్టుకుని శేషజీవిత యాత్ర చేద్దామనుకుని అష్టకష్టాలు పడిన బీద బడిపంతులు కథ రాసినా ('మహదాశీర్వచనం' కథలో) పిల్లలు అమ్మ దగ్గర డబ్బు తీసుకుని అట్లలు తయారుచేసుకున్నప్పుడు వాటిని వాళ్ళ మధ్య ఎలా పంచాలన్నా విషయానికి సంబంధించి "అదనపు విలువ" సిద్ధాంతానికి (సర్‌ప్లస్ థియరీ ఆఫ్ వేల్యూ) అద్దం పట్టగలిగినా ('తీర్పు' కథలో) ఆఖరికి ఇళ్ళల్లో మనం పెట్టుకునే పని మనుషుల విషయంలో కూడా మనం ఆర్థికంగా ఏ తరగతికి చెందిన వాళ్ళమనే విషయంతో సంబంధం లేకుండా - పుట్టలోపాము వున్నట్టుగా మనలోని పెట్టబడిదారీ మనస్తత్వం ఎలా బయటకు వస్తూ వుంటుందో చెప్పినా ('ఆదివారం' కథలో ఈ కథ చదివి ముసి ముసి నవ్వులు నవ్వుకోకుండా వుండగలమా? కొండొకచో భుజాలు కూడా తడుముకోవచ్చు. అది వేరే సంగతి) ఇక, "స్నేహం" కథలో మందు మజాలోని డాక్టరుగారు "స్నేహితురాలి" యింట్లో 'స్నేహం' గురించి వెలువరించిన అమూల్యమైన వాక్కుల సంగతి సరేసరి! తెలుగు కథా సాహిత్యంలో - ఒకప్పుడు మధ్య తరగతి కుటుంబాల కథలు రాసీ, ఆ తర్వాత, ఆ తర్వాత ఆ తరహా కథలు వ్యర్థమనే విషయాన్ని గుర్తెరిగి దృక్పథాన్ని మార్చుకున్న రచయితలు చాలా మంది వుండవచ్చు. కాని దృక్పథంతో సంబంధం లేకుండా కేవలం కథలపరంగా ఆలోచించినప్పుడు ఏ తరహా కథలు రాసినప్పటికీ పట్టిందల్లా బంగారం చెయ్యగల శక్తి కుటుంబరావుగారి తర్వాత, మళ్ళీ కాళీపట్నం వారికే వున్నదనిపిస్తుంది. "ఇల్లు" రాసి పాత వాసనలు పోవడం లేదని బాధపడ్డాను" అంటారు కాళీపట్నం వారు. ఆ విషయం అలా వుంచండిగాని, కథ చివర్లో పావన రామయ్య తెగించి యిల్లు కొనడానికి గల కారణాన్ని చెప్పడం గుండెల్ని పట్టి వూపదూ'?

1964లో కాళీ పట్నం వారి ప్రసిద్ధ కథ "యజ్ఞం" వెలువడింది. ఒక దివాళా కొట్టిన షావుకారుకు వడ్డీలపై వడ్డీలు పెరిగిన బాకీని ఒక బక్కరైతు చెల్లించవలసి వుంటే న్యాయం బక్కరైతు వైపు వుండాలా? ఆర్థికంగా యిబ్బందుల్లో వున్న షావుకారు పక్షాన వుండాలా? పెట్టుబడిదారీ న్యాయం షావుకారునే సమర్థిస్తుంది. ఇందుకు కారణం అతగాడు చితికిపోయిన ఇబ్బందుల్లో వుండడం కాదు - అసలును, వడ్డీని గుంజుకునే హక్కు అప్పుయిచ్చిన వాడికుందనే ధర్మ సూత్రాన్ని కాపాడ్డం కోసం! అలాకాని నాడు అప్పు యిచ్చిన వాళ్ళంతా ఏమైపోవాలి? పెట్టబడీ దారీ వ్యవస్థ కూకటి వేళ్ళతో కూలిపోదూ? ఈ ఆలోచనలను మన ముందు వుంచుతుంది "యజ్ఞం" కథ! స్వాతంత్ర్యానంతరం మనం

సాధించిన అపారమైన ఆర్థికాభివృద్ధి సామాన్యులకి అందలేదనే ఆవేదనకు "సుందరపాలెం" అనే గ్రామం మరో ఉదాహరణ. ఈ కథలోని చితికిపోయిన షావుకారు గోపన్న, బక్కరైతు అప్పల్రాముడు, ప్రస్తుతం ఆర్థికంగా ఒకే వర్గానికి చెందిన వారయినా - వారిద్దరి మధ్య వర్గ సంఘర్షణ సమస్య తల ఎత్తడం పెట్టుబడీదారి సమాజం మిగిల్చిన వారసత్వం! ఈ కథలోని శ్రీరాములు నాయుడు నా కంటికి గాంధేయ తత్వానికి వారసుడుగా కనబడడం లేదు. స్వాతంత్ర్యానంతరం ఎర్రకోట మీద జండా ఎగరేస్తూ లక్షలాది ప్రజల కన్నీళ్ళు తుడుస్తానని వాగ్దానం చేసి, ఆర్థిక విష వలయాల ఉచ్చుల్లో నిస్సహాయంగా కూరుకుపోయిన నెహ్రూ జ్ఞాపకం వచ్చాడు. గాంధీ -నెహ్రూకి రాజకీయ గురువేగాని, ఆర్థిక గురువు కాదు. సామాన్యుడిని పైకిలాగుదామనే తపనలో నెహ్రూ రూపొందించిన ప్రణాళికలు ఆర్థిక శాస్త్రవేత్తల తప్పుడు సలహాలు వల్లనైతేనేమి, పెట్టుబడిదారుల 'కుట్ర' వల్లనైతేనేమి సామాన్యుడు ఆశించిన విధంగా ఫలితాలను అందివ్వలేకపోయాయి. (రామారావుగారు ఈ ఇతివృత్తంతో 'కుట్ర' అనే కథ కూడా రాశారు!) సుందరపాలెంలో జరిగింది కూడా యిదే! నిజానికి శ్రీరాములు నాయుడు 'కుట్ర'లో భాగస్వామి కాకపోయినప్పటికీ అతను పెట్టించిన స్కూలు, వేయించిన రోడ్డు, విద్యుచ్ఛక్తి మొదలయినవి పెట్టుబడిదారులకు మాత్రమే ఉపయోగబడ్డాయి. ఈ పరిణామ క్రమంలో కొందరు బక్కరైతులు, చిన్న షావుకార్లు మొదట్లో బాగుపడినా ఆ తర్వాత పెద్ద చేపలు చిన్న చేపల్ని తినేశాయి! గ్రామాభివృద్ధికి శ్రీరాములు నాయుడు చేసిన 'యజ్ఞ' ఫలాన్ని బడా బాబులు అనుభవించిన మాట నిజమే - అంత మాత్రాన, యాంత్రీకరణ, పారిశ్రామికీకరణ లేని 'ప్రిమిటివ్ సొసైటీని' కోరుకోడం, ప్రమాదం అంతా ద్రవ్యమారకం వల్ల వచ్చిందనుకోవడం, 'వేయిపడగల్లో' విశ్వనాథ వారికి వున్న భ్రాంతి లాంటిది! కాళీపట్నం వారు చెప్పేది యిది కాదు. మరో కొత్త యజ్ఞాన్ని ప్రారంభించమని మాత్రమే!

ఈ కథ చివరిలో శ్రీరాములు నాయుడు యిచ్చిన తీర్పు ప్రకారం బాకీ చెల్లుగొట్టడం కోసం వున్న కొద్దిపాటి మడి చెక్కనూ గోపన్న పరంచేసి, తన కొడుకుని పాలేరుగా పెంచడం యిష్టంలేని అప్పల్రాముడు కొడుకు సీతారాముడు తన కొడుకును చంపుకుని రక్తంతో తడిసిన మూటను ఊరి పెద్దల ముందు పడేస్తాడు. ఈ ముగింపు అప్పట్లో సాహిత్యపరుల మధ్య చాలా చర్చలకు దారి తీసింది. యంత్రాలే కార్మికులకు ద్రోహం చేస్తున్నాయని భావించే చైతన్యానికి, సీతారాముడి చైతన్యానికి తేడా లేదని, ముగింపుకు అర్థం లేదని, రంగనాయకమ్మగారు భావించారు. ఈ చర్చ మళ్ళీ ప్రారంభించాల్సిన అవసరం ఏదీ లేదుగాని, సీతారాములు కొడుకు రేపటి తరానికి ఒక ప్రతీకగా మాత్రమే మనం తీసుకోవాలి. అమాయకత్వంతోనో, దుర్బుద్ధితోనో అమలు జరిగిన ఆర్థిక విధానాలకు రేపటి తరాన్ని

అమాయకత్వంతోనో, దుర్బుద్ధితోనో అమలు జరిగిన ఆర్థిక విధానాలకు రేపటి తరాన్ని బలి చేసుకుంటామా. లేక చెయ్యెత్తి రేపటి కథను వేరుగా రూపొందించు కుంటామా, తేల్చుకోమంటున్నారు రచయిత! "జనం మీద చెయ్యెత్తగలవాడే అయితే ఈ సీతారావుడు కన్న బిడ్డను చంపుకోడు" అనే అప్పల్రాముడి ఆవేదన-బంజరు ముక్క వదులుకొంటున్న అప్పల్రాముడిపై జనం సానుభూతి కురిపించినప్పుడు 'దేనికా ప్రవాహం దానికన్నా మురుగు నీరు నయం' అనే రచయిత వ్యాఖ్య-పాఠకులని కదిలిస్తాయి. "ధర్మ పన్నాలు ఎంతవరకూ? అంతా నువ్వు చెప్పినట్టు వినేవారకూ- ఆ తరువాత?" అనడం సరేసరి.

ఇక- "ఆర్తి" కథ చదవడం మరొక మరుపురాని అనుభవం. పండగలకీ, పబ్బాలకి ఆడకూతుళ్ళు అత్తింటి నుంచి పుట్టింటికి వెళ్ళడం మామూలు కథే! కాని, ఆడ కూలీలకు డిమాండు వుండే సమయంలో కోడలిని తన యింట ఉంచుకోవాలని అత్త, పుట్టింటికి తీసుకెళ్ళి నాలుగు రాళ్ళు చేసుకోవాలని తల్లి, వీధిన పడి వాదులాడుకోవడం ఈ కథ చదివిన వాళ్ళు మరిచిపోగలరా? నీతుల గురించి, సెంటిమెంట్ల గురించి, ఆచారాల గురించి మనం చెప్పే గాలి కబుర్లు ఆకలి సమస్య ముందు నిలబడతాయా?

కాళీపట్నం వారి కథల్లో "చావు" కథ అంటే నాకు చాలా యిష్టం. తెలుగు సాహిత్యంలోనే కాదు - నేను చదివినంతవరకూ విశ్వ సాహిత్యంలో నాకు నచ్చిన పది గొప్ప తెలుగు కథల్లో "చావు" ఒకటి అని చెప్పేందుకు తెలుగు వాడిగా నేను గర్వపడతాను. మనిషి ఏ ఆర్థిక వర్గానికి చెందిన వాడయినా, ఎవరయినా, చావు తప్పదనే మెట్టవేదాంతం అందరూ ఎరిగిందే! చచ్చిన మనిషి శవాన్ని కప్పెడతారా, కాల్చేస్తారా అనేది మతానికి సంబంధించిన సెంటిమెంట్ మాత్రమే కావచ్చు. కాని కర్రలు ఊరికే రావనీ, చెప్పేది ఆర్థిక సత్యం. ఊళ్ళో కర్రలు మూలుగుతూ వున్నా ఒక్క కర్రకూడా దొరకనప్పుడు ఆ శవాన్ని కప్పెట్టి ఊరుకోవాలా? బలప్రయోగం చేతనో, మరో మార్గాన్ని అవలంబించో, కట్టెలు తెచ్చి శవాన్ని కాల్చి సంతృప్తి పొందాలా? పైకి కేవలం సెంటిమెంట్లకు సంబంధించిన విషయంగా కనబడుతున్న ఈ సమస్యను కొంచెం నిశితంగా పరిశీలించగలిగితే రేపటి ప్రపంచపు తాళం చెవి కనబడుతుంది! "యజ్ఞం" "ఆర్తి" కథల్లో సూచనామాత్రంగా చెప్పి వదిలేసిన విషయాలను స్పష్టంగా గుండెలకు హత్తుకునేలా చెబుతారు రామారావుగారు ఈ కథలో! ఈ కథ చదివే పాఠకుడు సోషలిస్టా, ఉగ్రసోషలిస్టా, మరొక 'యిస్టా' అనే ప్రశ్నలు అలా ఉంచి చదివే వాడికి హృదయం అనేది ఉంటే, ఆ హృదయానికి స్పందించగల శక్తి ఉంటే, చలి వంట్లో దడను పుట్టిస్తూంటే శవం మీద మ్రోలగుడ్డ కప్పుకుని చలి బాధ తట్టుకోవాలనే ఆలోచనలను, శవం ఈ రాత్రికి బుగ్గిలో పడకపోతే కూలికి వెళ్ళడం ఎలా

అన్న ఆతృతను - అర్థం చేసుకోగలుగుతాం. అందుకే అనిపించింది నాకు ఈ కథ చదివినప్పుడు యిందులో జీవితం ఉంది. కార్యాచరణ ఉంది. రేపటి బ్రతుకు పట్ల ఆశ ఉంది - అని!

ఇంతకూ యిందులో వున్న కథ ఏమిటంటే- చలిగాలి కత్తి కోతకోస్తున్న వేళ హరిజన వాడలో నారెమ్మ అనబడే ముసలిది జీవితమల్లా కటికదారిద్ర్యం, కష్టాలు అనుభవించి (సూరయ్య తాత అనేటుట్ట చిన్నప్పుడు "సంతల సింతపండు లాగుండేది" ఏం లాభం?) మంచి కూలీ పనుల సమయంలో చచ్చిపోయింది. తనని కప్పెట్టకుండా కట్టెల్తో కాల్చాలనేది ముసలిదాని చిరకాల వాంఛితం! కాని, ఆ కాలంలో కట్టెలు దొరకడం కష్టం. నాయుళ్ళ దగ్గర వున్నాయి. కాని, ఎంత బ్రతిమాలినా యివ్వం పొమ్మనేశారు. తెల్లారితే కూలీ పనులకు వెళ్ళకపోతే బ్రతుకు గడువదు. ఈ పరిస్థితిలో శవాన్ని కప్పెట్టెయ్యబోయారుగాని - అప్పారావు నాయకత్వంలోని యువశక్తి - నాయుళ్ళ అనుమతితో సంబంధం లేకుండా కర్రలు లాక్కొని తీసుకుని వచ్చింది. సూరయ్యలాంటి వాళ్ళకిది చాలా తప్పుగా తోచినప్పటికీ!

అది సరేగాని- ఈ కథ చదివిన పాఠకులకు కథ చివరిలో అప్పారావు అన్న మాటలు జ్ఞాపకం వున్నాయనుకుంటాను. "ఈ శవాన్ని మీరెలా వదుల్చుకున్నా ఒక్కటే! ఎందుకంటే నీట్లో పడేసినా, నిప్పుల్లో కాల్చినా, గొయ్యి తీసి పాతెట్టేసినా, జీవుదేదుస్తాదని నేననుకోను. సచ్చిన శవాల కోసం నేనేడవను. నా ఏడుపల్లా బతికున్న శవాల గురించే!" దీనిని గ్రహించగలిగిననాడు "నిన్న నేడు అంతా అలికేసినట్టు ఒక్కలా వుంటుంది" అనే బాధ ఉండదు. రచయితగా కాళీపట్నం వారు కోరుకునేది అదే!

---

# 41

## పెద్దిభొట్ల సుబ్బరామయ్య - "నీళ్ళు"



**1977**లో ఐక్యరాజ్య సమితి పెద్దలు "హబిటాట్" సమావేశంలో "1990 నాటికి అందరికీ మంచి నీరు" అనే కార్యక్రమాన్ని ప్రకటించారు. (2,000 సంవత్సరం నాటికి అందరికీ ఆరోగ్యం అనే నినాదం లంటిదే ఇదీనూ! తీర్మానాలకీ, నినాదాలకి కొదవ ఏముంది?) ఆ తర్వాత, 1981లో అంతర్జాతీయ మంచినీటి దశాబ్దిని ప్రకటిస్తున్నాం అన్నారు. ఈ ఊపును మన దేశం కూడా కొంతవరకూ అందుకున్న మాట నిజమే. కాని ఇప్పటికీ మన దేశ జనాభాలో 41.3 శాతం మందికి సరిఅయిన మంచినీటి సదుపాయం లేదు. ప్రభుత్వం వారి లెక్కలను బట్టి చూచినా, దేశంలోని 39వేల గ్రామాలు తీవ్రమైన మంచినీటి ఎద్దడిని ఎదుర్కొంటున్నాయి. ఇట్లాంటి స్థితిలో - ప్రణాళికల్లో ప్రభుత్వం గ్రామీణులకు మంచినీరు కోసం ఎన్ని వందల కోట్ల రూపాయలు కేటాయించిందనే విషయం ఆర్థశాస్త్ర తరగతులలో నాలుగు గోడల మధ్య పుస్తకాలతో కుస్తీపట్టే వాళ్ళకు చాలా ముఖ్యమైన విషయం కావచ్చునేమో గాని, దాహంతో గుక్కెడు నీళ్ళకోసం అలమటిస్తున్న వ్యక్తికి కావలసిన విషయం - చేరువలో మంచినీళ్ళు వున్నాయా లేదా అనే విషయం మాత్రమే! ఈ నీటి కథను, దానిని అనుకుని వున్న కన్నీటి కథను కథలో యిమడ్చగల సత్తా కథకుడికి వుండాలేకాని అది మంచి కథగా రూపొందడంలో అతిశయోక్తి లేదు.

1965లో పెద్దిభొట్ల సుబ్బరామయ్యగారు "నీళ్ళు" కథను రాసేనాటికి ఇప్పుడు మనం ప్రస్తావించుకున్న అంతర్జాతీయ పథకాలు లేకపోవచ్చునేమోగాని నీటికోసం మనిషిపడే వేదన, ఆ నీరు తనివితీరా లభ్యమైనప్పుడు కలిగే ఆనందం చిరకాలంగానే వున్నది. అయితే దీనిని ఒక సామాజిక సమస్యగానో, ఆర్థిక సమస్యగానో కాకుండా వ్యక్తికి సంబంధించిన సెంటిమెంట్లకు, హృదయపు ఆర్ద్రతలకు, ప్రాధాన్యతను ఇస్తూ గుండెలకు హత్తుకునేలా చెప్పడంలోనే సుబ్బరామయ్యగారు కనబడతారు.

ఒక తరానికి చెందిన చాలామంది కథకుల్లాగే సుబ్బరామయ్యగారు మధ్య తరగతి కుటుంబాల కథలనే ఎక్కువగా రాశారు. ఈ కుటుంబాలకు సంబంధించిన ప్రేమ, పెళ్ళిళ్ళ కథలు కాకుండా ఈ కుటుంబాలు ఆర్థికంగా ఓ మెట్టు దిగజారినప్పుడు అవి ఎదుర్కొనే

ఇబ్బందుల గురించి, మనిషికీ మనిషికీ మధ్య ఉండే సంబంధాలలో ఆర్థిక భావానికి వుండే ప్రేరణ గురించి, చెప్పే కథలు వీరివి. అయితే కేంద్ర బిందువు ఆర్థిక శక్తులు కాదు మనిషి మనసు మాత్రమే! ఈ సందర్భంలోనే మరొక విషయం చెప్పాలి. తగలబడిపోతున్న పాకలో బంగారు గాజులు ఉండిపోతే గాజులు దక్కించుకుందామని మంటల్లోకి దూకి గాజులతోపాటు తానుకూడా బుగ్గిఅయిపోయిన బీద ముసలిదాని కథ చెప్పేటప్పుడు బీదదానికి కూడా బంగారు గాజులా అనే హేళన కాకుండా ... ఆ గాజులు ఆ ముసలిదాని జీవిత సర్వస్వం, అనే అవగాహన కలగజేయడంలోనూ, ముసలిదానిది పీనాసితనం కాదని చెప్పడంలోను, పెద్దిబొట్లవారి కథలు వెనుకబడవు. ('నిప్పు' కథలో) పాఠకుల్ని వెనుకకు నెట్టవు.

సుబ్బరామయ్యగారి కథా ప్రపంచంలో శనిపట్టిన వాళ్ళు గ్రహపీడ వదిలించుకోవడానికి ఇచ్చే దానాలను తీసుకుని పొట్టగడుపుకునే బడుగు బాపడు ('పూర్ణాహుతి' కథలో) మొదలుకొని, ఉద్యోగంలో జీతం పెరగడం కోసం పెద్ద వయస్సులో మెట్రిక్యులేషన్ పరీక్షకు కూర్చుని లెక్కల పేపరు ఆన్సరు చేయలేక ఓ చిన్న ప్రశ్నను కాపీ చేయబోయి వాచర్‌చేత చివాట్లు తిని బోలెడంత అవమానం పడిపోయి అంతలోనే తమాయించుకుని" అబ్బే! ఈ మాత్రం దానికి బాధపడడం పురుష లక్షణం కాదు ఇంతకు ముందు మనం ఎన్ని చేదుమాత్రలు మింగి ఉండలేదు గనుక?" అనుకున్న గుమస్తా శ్రీనివాసరావు వరకూ ("చేదుమాత్ర" కథలో) ఎందరెందరో మనల్ని పలకరిస్తారు. ఒక ఆఫీసర్ అలసిపోయి ఎ.సి. రూమ్‌లో కూర్చుని, దజన్ల కొద్దీ గుమాస్తాలు, రెండే రెండు ఫ్యాన్లతో అఘోరిస్తూఉండగా వాళ్ళమీద అథారిటీ చెలాయిస్తున్నట్లు కలలుగనే చిట్టి గుమాస్తాల కలలు, కన్నీళ్ళు, ఆశలు ఎన్నెన్నో ("ఏవి తల్లి విరుదు కురిసిన హిమ సమూహాములు" కథలో)

రాజుగారి మన్నన పొంది ఎన్నెన్నో సత్కారాలు పొందిన ఒకనాటి పహిల్వాన్‌ను పోషించే నాథులు లేక వీధినపడినప్పుడు అతడిని వేధించేది ఆకలి సమస్య కాదూ? ("నిప్పుకోడి" కథలో) ఇక, మతం పేరుతో జరిగే వ్యాపారం, ఆ బ్రతుకుల్లోని రాజకీయాలు, మామూలు కథేగాని, ఈ కథలో (పూర్ణాహుతి) గ్రహపీడల వల్ల బ్రతికే 'నేను' అనే పాత్ర చిత్రించిన తీరు బాగుంటుంది. అతగాడికి కల్లు పాక దగ్గిర గంగిని చూస్తే వంట్లో తాపం. ఆ తాపం తీర్చదానికి ఆవిడకు అభ్యంతరం ఏదీ లేదు గాని జంకు అంతా అతడికే. కనీసం తినడానికి తిండి లేనప్పుడు కూడా తాను తినకుండా దానాలకు వచ్చిన బియ్యాన్ని ఆమెకు ఉచితంగా ఇచ్చి వెళ్ళిపోయే ఆ వెర్రి బాపడిని చూచి గంగి నవ్విందంటే నవ్వదూ? ఇక తాను పట్టిన క్షుద్ర దానాలు తన ఆరోగ్యాన్ని క్షీణింపచేస్తున్నాయనే మానసిక వ్యధ మరొకవైపు - ఇంత మంచి కథకు 'సెంటిమెంట్' మార్కు ముగింపు లేకపోతే ఎంత బాగుండునూ అనిపిస్తుంది నాకు.

పెద్దిభొట్లవారి కథల పాఠకులకు ఆయన "ముసురు" కథ జ్ఞాపకం వుందనుకుంటాను. నైతిక విలువలపట్ల సమాజానికి గల సంకుచితమైన అవగాహనకు సంబంధించిన వికృత రూపాన్ని మన ముందు వుంచుతుంది ఈ కథ. స్త్రీ పురుషుల మధ్య గల శారీరక సంబంధాలు కేవలం వ్యక్తిగతమైన విషయాలుగా భావించి, బెర్ట్రాండ్ రసెల్ ప్రతిపాదించిన Compassionate Marriage ను అంగీకరించే స్థితికి మనం ఎదగలేకపోవచ్చు. (చదువుకునే రోజుల్లో స్త్రీ పురుషుల మధ్య గల శారీరక 'అలజడిని' తట్టుకునేందుకు అవస్థపడనక్కరలేదని, తాత్కాలిక లైంగిక సంబంధాలు పెట్టుకోవడం వల్ల ప్రమాదం ఏదీ లేదని, తాత్కాలిక వివాహాలు కూడా చేసుకోవచ్చునని అంటాడు రసెల్.) దిక్కులేని స్థితిలో, దేశంకాని దేశంలో నిస్సహాయురాలయిన అమ్మాయిని ఒక ఉదారుడు తన ఇంట కొన్నాళ్ళు తలదాచుకోనిస్తే ఆ స్త్రీ పురుషుల మధ్య రంకు సంబంధం తప్ప మరొక మానవతా బంధం వుండేందుకు అవకాశం లేదా? – ఆమె ఒక స్త్రీ అనీ, ఆమె వంటిమీద నగలున్నాయని తప్ప, ఆమెకూడా ఒక 'మనిషి' అని ఎందుకు భావించదు ఈ సంఘం? పైడినాయుడికి ఆశ్రయం ఇచ్చాడని, సింహాచలాన్ని పెళ్ళాడదనన్న లక్ష్మి చివరకు తన తప్పు తెలుసుకుని సింహాచలాన్ని పెళ్ళాడితే ఒక చవుకబారు కథ లాగా ఈ కథ వుండేది. కథ చివరిలో రసికుల నవ్వులు, కేరింతల మధ్య లక్ష్మి గొంతు వుండడంలోనే వుంది "నీతి" అసలు కథ అంతా! సింహాచలానికి కలలో కన్పించిన రంగు రంగుల మంచి ముత్యాలు, గంధపు చెట్ల అరణ్యాలు, ఇలలో అంతగా కన్పించక పోవడానికి గల కారణం అదే.

సుబ్బరామయ్యగారి 'మనసు' కథ చదివితే ఆత్మన్యూనతా భ్రాంతి గుండెల్లో చేసే అలజడి కథ తెలుస్తుంది. మనిషికి కావలసింది తిండి, బట్ట మాత్రమే కాదు. తాను ఉపయోగపడగలననీ, తనకు కూడా ఓ ప్రాముఖ్యత వుందనీ నలుగురూ గుర్తించాలనుకుంటాడు మానవుడు. (ఇలా తన 'ఉనికిని' చాటాలనే తాపత్రయం మనిషి చిన్ననాటి నుంచి ప్రారంభం అవుతుంది. అందంగా తెల్లగా వున్న గోడలను పిల్లలు ఖరాబు చేసేది ఇందుకే. అంటారు ఆల్‌ఫ్రెడ్ ఆడ్లర్) ఈ కథలోని రిటైర్ అయిన ఉద్యోగి పరితపించింది. ఇట్లాంటి 'ఉనికి' గురించే. – అతగాడు పిల్లల్ని దండించి వీధిలోనికి నెట్టయ్యడం, బ్యాంకులోనుంచి అనవసరంగా డబ్బు 'డ్రా' చేయడం మొదలయినవని తన ఉనికిని చాటుకోవడానికి చేసిన వ్యర్థ ప్రయత్నాలే! ఒక కొడుకు ఇంజనీరు, కూతురు లెక్చరరు, కోడలు టీచరు ఇంటిలో అందరూ సంపాదనా పరులే. ఏం అదృష్టం అంటారు అందరు. కాని తన పెన్షన్‌లోని ఒక్క పైసా కూడా ఎవరికీ అక్కరలేదని, తాను చెయ్యగల పని ఏదీ లేదని కేవలం 'విశ్రాంతి' తీసుకోవడం మాత్రమేనని అనుకోవడం ఎంత కష్టం? (ఈ కథ చదువుతూంటే నాకు జి.వి. కృష్ణారావుగారి మంచి కథ "షష్ఠి పూర్తి" కథ జ్ఞాపకం వచ్చింది. రిటైరైపోయిన తర్వాత ఆర్థిక ఇబ్బందులు ఏవీ లేకపోయినప్పటికీ వ్యర్థ

జీవితం ఎందుకని చచ్చిపోదామనుకుంటాడు ఓ ఆసామి. కాని చావాలంటే ఎన్నో ఇబ్బందులు? బ్రతకడం కన్నా చావడం చచ్చిన చావు కాదూ?).

– పెద్దిభొట్ల వారి కథల్లో "నీళ్ళు" కథ అంటే నాకు చాలా ఇష్టం.

దీనికి కారణం ఇది జీవనాధారమైన నీటిపట్ల మనిషికి ఉన్న బలమైన కోరికను తెలిపే కథ అవడం మాత్రమే కాదు. పాత్ర చిత్రణలోనూ కథా శిల్పపరంగానూ ఈ కథ సుబ్బరామయ్యగారి కథలన్నింటిలోకి విశిష్టమైనది కావడమే ఇందుకు కారణం! 'నీళ్ళు' కథకు కొంచెం సన్నిహితంగా వున్నట్టు కనబడే "గాలి" కథ వీరి కథ పాఠకులకు జ్ఞాపకం వుందనుకుంటాను. ఈ కథలోని రోగి వేసవికాలంలో గాలికోసం అలమటిస్తూ ఆరాటపడుతూంటే అది చూడలేని కూతురు తోడేలు లాంటి ఇంటి యజమానిని బ్రతిమలాడి టేబుల్ ఫ్యాన్‌ను తెస్తుంది. కాని అంత గాలిని భరించలేని ఆ బక్కజీవి అంతలోనే 'హరీ' మంటుంది. 'నీళ్ళు' కథలోని నీరు కథ సుమారులో యింతే. అయితే ఈ కథలోని ప్రత్యేకత నీరు నేపథ్యంలో ఆవిష్కరింపబడిన మనిషి మనసు కథలో వుంది. అందుకే కృతకంగా ఏదో ఒక విషయాన్ని "ప్రాజెక్ట్" చేస్తున్నట్టు అనిపించదు.

ఈ కథలోని జోగినాథం గుంటూరు జిల్లాలోని ఒక మారుమూల పల్లెటూళ్ళో పుట్టి పెరిగాడు. పట్టణవాసులకుండే నాగరికత గురించి అతనికి కృష్ణానది ఒడ్డున వున్న నగరంలో ఉద్యోగంలో చేరేంతవరకూ అంతగా తెలియదు. నాగరికతకు, సిరిసంపదలకు నీటి లభ్యతకు సంబంధం ఉందని అనుకుంటే, అతని వూరు అనాగరిక ప్రాంతంలో వుందనే చెప్పాలి. చుక్క నీరు కూడా లేని లోతయిన బావులు – బావిలో నీరు ఊరితే బిందెడు నీళ్ళు పట్టుకుపోదామని తెల్లవారకుండానే ఎంతో ఆశతో నూతి దగ్గరకు వెళ్ళి సగం నిండిన బిందెతోనే ఊసూరుమంటూ తిరిగి వచ్చే మనుషుల ఆశలు నిరాశలు – పుష్కలంగా నీరు వున్న ప్రాంతాలవారికి అర్థం కాకపోవచ్చు. అర్థం చేసుకోవడం కష్టం కూడా కావచ్చు. కాని ఇవి యదార్థ జీవిత సత్యాలు.అతి విలువయిన బిందెడు నీళ్ళు ఒలకబోసిందనే కోపంతో జోగినాథం తల్లి అతని చెల్లెల్ని చావగొట్టినప్పుడు ఆ పిల్ల కళ్ళల్లో జాలువారిన కన్నీటి గురించి ఏమని చెప్పుకోవాలి? ఇలాంటి నీటి కరవు ప్రాంతానికి చెందిన జోగినాథం రైలు కృష్ణానదిమీద ఉన్నప్పుడు ఆ నీటిని చూచి పులకించిపోయాడన్నా, నీళ్ళకోసం అలమటించిపోయే తన వాళ్ళను తలచుకుంటూ భోజన సమయంలో గ్లాసుల తరబడి నీళ్ళు త్రాగుతూ, ఇది అమ్మ గ్లాసు, ఇది చెల్లెలి గ్లాసు, ఇది తమ్ముడి గ్లాసు అనుకునే వాడన్నా, అందులోని ఆత్మీయత, అనురాగాలు ఎంతయినా విలువయినవి. ఆ విలువను గ్రహించలేనప్పుడు "మంచినీళ్ళ పంతులుగారు" అనే హేళన మాత్రం మిగులుతుంది. జోగినాథానికి మంచినీళ్ళ విషయంలో గల మక్కువను చూచి మైత్రేయరావు లాంటి వాళ్ళు అదొక 'మానసిక వ్యాధి' అంటూ వ్యంగ్యంగా తీర్మానించారనుకోండి అది వేరే సంగతి!

పనిచేసే కుసుమ అనే అందమైన అమ్మాయికీ మధ్య నడిచిన స్నేహాన్ని గురించి కూడా చెబుతాడు. సాధారణంగా జోగినాథం వయస్సులో ఉండే కుర్రాళ్ళను అందమైన అమ్మాయి పరిచయం అయినప్పుడు వాళ్ళ కలలన్నీ అమ్మాయి చుట్టూ అల్లుకుంటాయి. జోగినాథం విషయంలో ఇది బొత్తిగా జరగలేదని చెప్పలేము గాని, (గాజు గ్లాసులోని నీళ్ళు తళతళలాగుతుంటే అవి కుసుమ కళ్ళలా ఉన్నాయని అతగాడు అనుకున్నాడు కాదు?) అతగాడు ఎక్కువగా కుసుమ అన్నగారు కాలేజీ లెక్చరరు అయిన కామేశం గురించే ఆలోచించాడు. అతడు తన చెల్లెలికి ఈడూ జోడూ అనీ ఈ పెళ్ళి జరిగితే బాగుండునని కలగన్నాడు. మధ్య తరగతి కుటుంబాలలో చిన్న వయస్సులో పెద్ద బాధ్యతలు నెత్తిమీద పడ్డప్పుడు ఇలా కలల స్వరూపాలు మారిపోవడం సహజమే అనుకుంటాను. అయితే జోగినాథం కలలు కల్లలు అని తేలడానికి ఎక్కువ రోజులు పట్టలేదు. బీటవారిన భూములు, బీదవాళ్ళ కలలు పండుతాయా?

బీదవాళ్ళ కలల కథ ఎప్పుడూ ఒక్కటే గాని నాగార్జునసాగర్ పూర్తిఅయిన తర్వాత జోగినాథం వూళ్ళోని బీడువారిన భూములు పండే వుంటాయి. కాని అందుకు సంబంధించిన వివరాలు చెప్పడానికి జోగినాథం బ్రతికిలేడు. గాజు గ్లాసులో నీళ్ళను చూచి, అదొక అందమైన ప్రకృతి దృశ్యంగా పులకించి పోయిన జోగినాథం-నూతిగట్టుమీద కూర్చుని చేద తర్వా చేద నీళ్ళు వంటిమీద దిమ్మరించుకుంటూ ఆ మైమరుపులో చుట్టూ ఉన్నవాళ్ళు ఏమనుకుంటున్నారో కూడా పట్టించుకోని జోగినాథం- రూమ్‌మేట్ల హేళనను తప్పించుకోవడం కోసం తెల్లవారుఝామునే లేచి కృష్ణానదిలో స్నానం చెయ్యడానికి వెళ్ళి, బీడువారిన తమ పూరి భూముల్ని, నీళ్ళకోసం తిరిగి తిరిగి అలసిపోయే తన తల్లినీ, చెల్లెల్ని తలచుకుంటూ జోగినాథం కృష్ణలో తనివి తీరా మునిగినప్పుడు కృష్ణమ్మ అతడిని తనలో ఐక్యం చేసుకుంది. అది విని తల్లీ, చెల్లీ సర్వస్వాన్ని కోల్పోయిన కారణంగా గుండెలు బాదుకుని ఏడ్చి ఉండవచ్చు. అందాల టైపిస్ట్ కుసుమ భారంగా ఓ నిట్టూర్పు విడిచి ఉండవచ్చు. సహోద్యోగులు 'అయ్యోపాపం' అని బాధపడి ఉండవచ్చు. కాని కథ ఇంతటితో అయిపోయిందనుకోను. ఈ కన్నీళ్ళు, నిట్టూర్పులు, సానుభూతులు వీటన్నింటికీ అతీతంగా ఎక్కడో ఒకచోట జోగినాథం వ్యధ వినబడుతునూ ఉంటుంది. నాగార్జునసాగర్ ధర్మమా అని ఇప్పుడు అక్కడ సునాయాసంగానే బిందెనీళ్ళు దొరుకుతూ ఉండవచ్చు. కాని ఈ సువిశాల భారతదేశంలో ఎందరెందరో జోగినాథాలు, ఎన్నెన్నో కన్నీటి గాథలు. అందరికీ మంచినీరు లభిస్తుందా? నిజంగానే నిఖిల లోకం హాసిస్తుందా? ఏమో! ఆ మరో ప్రపంచంలో జోగినాథాలు వుండరనే ఆశిద్దాం.

---

## 42

# ఆర్.ఎస్. సుదర్శనం-"ఎరుపు"



**"....నాలుగు అద్దాలున్న గదిలో ఒకరే ఎన్నో ప్రతిబింబాలుగా వైవిధ్యంతో కనిపించినా యథార్థానికి వ్యక్తి ఒకడే! తిరుమలలో స్వామివారి అద్దాల మహలులో ప్రవేశిస్తే ఈ అనుభవం కొత్తది కాదు. ఈలోకం భగవంతుని అద్దాల మహలు...."**

"ప్రతిబింబాలు" కథలో అనుభవాలతో పండిన ఒక పాత్ర చేత సుదర్శనంగారు పలికించిన పలుకులు ఇవి. ఇందులో వినిపించిన "అద్వైత భావం" సుదర్శనంగారి ప్రసిద్ధ కథలన్నింటిలోనూ అంతర్లీనంగా ద్యోతకం అవుతూనే ఉంటుంది. తెలుగు కథా సాహిత్యంలో అద్వైత భావాన్ని అస్తిత్వ వాద ధోరణిని, ఇంత అందంగా ఆవిష్కరించిన కథకులు తక్కువే అని చెప్పాలి. "....నన్ను నేను సృష్టించుకొన్నట్లే నా విలువలను కూడా సృష్టించుకునే హక్కు వుంది....." అనే జీన్ పాల్‌సార్త్ర దృక్పథాన్ని అంగీకరించినట్టయితే - వ్యక్తి తనను గురించి తాను తెలుసుకోవడం వల్ల మాత్రమే నిజమైన విలువల్ని గ్రహించగలుగుతాడు. అయితే "తనను తాను అన్వేషించుకునే ఒడిస్సీ యొక్క ప్రథమ కర్తవ్యం భగవంతుణ్ణి వెదకడం కాదు, నిరాకరించడం..." అనే సార్త్రదృక్పథం ప్రకారం మనిషి చేసే ఈ అన్వేషణ Atheistic Existentialism అయినట్టుగానే - ఇందులో భగవంతుని ప్రస్తావన వచ్చినప్పుడు అది Theistic Existentialism అవుతుంది.'సుదర్శనంగారి రచనలు - ముఖ్యంగా 'మధుర మీనాక్షి' లాంటి కథలు ఈ తరహా 'థీయిస్టిక్ ఎగ్జిస్టెన్షియలిజమ్' కు పలు సందర్భాలలో సన్నిహితంగా కనబడతాయి.

ఆర్.ఎస్.గారి కథలు ఆదివారం పూట మధ్యాహ్నం ఒక కునుకు తియ్యడానికి ముందు మంచం మీద పడుకుని ఊసుపోక కోసం చదవడానికి పనికిరావు. అలాంటి పాఠకులను వీరి కథలు కొన్ని సందర్భాలలో గాభరాపెట్టినా ఆశ్చర్యం లేదు. కథా రచనలాగానే కథలను పఠించడం కూడా ఒక 'సీరియస్' విషయంగా గుర్తించుకోగలిగలిన పాఠకులకు వీరి కథలు జ్ఞాపకం పెట్టుకోదగ్గవిగా అనిపిస్తాయి. అన్ని కథలూ అందరికీ నచ్చాలనే నియమం లేనట్టుగానే, వీరి కథల వెనుకగల దృక్పథం అందరికీ ఆమోదయోగ్యం

కాకపోవచ్చు. అది వేరే విషయం. సుదర్శనంగారి కథలలో వున్న ప్రత్యేకత ఏమిటంటే - ఆయన చేతిలో పడిన ఏ ఇతివృత్తమైనా అది ఎంత సాధారణమైనదైనా సరే, లోతయిన తాత్విక భావం వినబడుతుంది. మాటవరసకి - భర్తచేత సిగరెట్ మానిపించాలని ఇల్లాలు చేసే ప్రయత్నాలు, సణుగుడులు - అన్నట్టు రేపటినుంచి సిగరెట్ మానెయ్యాలని ఏరోజుకారోజు కార్య క్రమాన్ని రేపటికి వాయిదావేసే ధూమపానప్రియుల ఉత్తుత్తి పట్టుదలలు ఇవేమీ కొత్త విషయాలు కావు. ఈ ఇతివృత్తంతో అద్వైత భావపు లోతులకు కథారూపం ఇవ్వాలంటే అది సాధారణమైన విషయమా? ('ఏకాంతం' కథలో) తడికల స్నానాల గదిలో స్నానమాడే పడతిని మేడమీది గదిలో నుంచి చూచే ఒక రసికుడి రసికత్వం వెనుక వున్నది కేవలం కామభావమేనా? - మానవ జీవిత నిరంతర సత్య ఆవిష్కరణ లేదూ? - ('ఎరుపు' కథలో)

"ఏకాంతం' కథలోని ఆనందరావుకు సిగరెట్లు కాలిస్తే తన ఆరోగ్యం పాడయిపోతుందనీ, దగ్గుతో తెల్లవార్లూ బాధపడవలసి వస్తుందని తెలుసు. కాని, రాత్రిళ్ళు సిగరెట్ కాలుతున్నప్పుడు చీకట్లో గులాబీ మొగ్గలా సిగరెట్ నిప్పుకొన మెరిసిపోతునప్పుడు, తనకు శత్రువయిన సిగరెట్ సాన్నిధ్యంలో ఆనందాన్ని పొందకుండా వుండడం సాధ్యం కావడంలేదు. తనని ఎంతో ప్రేమించే భార్య సాన్నిధ్యం కన్నా ఏకాంతంలో సిగరెట్ త్రాగడంలోని అనుభవమే ఎక్కువ ఆనందాన్ని ఎందుకు ఇస్తోంది? తర్కానికి అందని ఈ ప్రశ్నకు జవాబు ఎక్కడ? "ఇది తన ఏకాంతం, తనలోని 'తన' స్వరూపం. జీవితానుభవాలు అనే పూసలకి అర్థాన్ని ఆకారాన్ని కల్పిస్తున్న అంతఃసూత్రం ఏకాంతం ....." అనేది ఆనందరావు ప్రశ్నకే కాదు, మానవాళిని చిరకాలంగా వేధిస్తున్న ప్రశ్నకు జవాబు.

అస్తిత్వవాదులు Alienationకు, ఒక తరహా ఒంటరితనానికి తమ దృక్పథంలో అధిక ప్రాధాన్యతను ఇస్తారు. తన విలువలకు, చుట్టూ వున్న ప్రపంచంలోని విలువలకు వైరుధ్యం కనబడినప్పుడు వ్యక్తిలో ఒక విధమైన అసహనం, ఈ ప్రపంచంలో ఇమడలేని పరిస్థితి ఏర్పడుతుంది. (ఇలాంటి స్థితిలో - అస్తిత్వవాద తత్వవేత్త 'హెడ్‌గర్' అన్నట్టు మృత్యువు జీవితానికి సంపూర్ణమైన అర్థాన్ని ఇస్తుందని అనుకోవాలా? లేక సార్త్ర అన్నటు మృత్యువు జీవితాన్నుంచి అర్థాన్నంతటినీ తొలగిస్తుందని అనుకోవాలా? అనే విషయానికి సంబంధించిన చర్చ ప్రస్తుతానికి వదిలేద్దాం) సార్త్రపరిభాషలో తనలో తాను వుండే దానికి, (Being in itself) తనకోసం తాను వుండేదానికి, మధ్య సంఘర్షణ అనివార్యమై వ్యక్తి జీవితంలో ఒక 'అసంబద్ధత' (Absurdity) చోటుచేసుకుంటుంది. వ్యక్తి పూర్తిగా తయారయిన పదార్థం కాకపోవడం చేత, తన విలువల గురించి అతనికి ఒక నిర్దుష్టమైన అవగాహన లేకపోవడంచేత, ఈ సంఘర్షణ మరింత జటిలమైపోతంది. ఆల్బర్ట్ కేమూ అన్నట్టు "My revolt, My Free-dom, and My Passion" అనుకుంటూ తన ఇచ్ఛ ఏది చెబితే ఆ విధంగా హేతువాదంతో సంబంధం లేకుండా ప్రవర్తించే ఈ పాత్రల

ఆవేదనకు అద్దంపట్టే రచనలలో సుదర్శనంగారి "మధుర మీనాక్షి" కథ కూడా కొంతవరకూ ఉదాహరణ.

ఈ కథను మనకి కథ చెప్పే 'నేను' అనే వ్యక్తి వృత్తిరీత్యా ఒక వ్యాపారస్తుడు, వ్యాపారం చేసి ఆర్థికంగా బాగుపడ్డాడు. పిల్లలు బోర్డింగ్ స్కూల్లో చదువుకుంటున్నారు. భార్యపోయిన లోటు మినహా అతనికి జీవితంలో చెప్పుకోదగ్గ ఇబ్బందులేవీ లేవు. కాని అతను అశాంతితో, ఒంటరితనంతో బాధపడ్డాడు. క్లబ్బులో వున్నా డాన్స్ ప్రోగ్రామ్‌కి వెళ్ళినా, ఎంతమంది స్నేహితుల మధ్యన వున్నా స్వేచ్ఛకోసం, ఆనందం కోసం అనుభూతికోసం ఏమీ లేనిదాని కోసం, నిరంతరం తపన, ఆరాటం ఈ ఆరాటంతోనే అతని మధురకు ప్రయాణం ఒక అస్తిత్వవాది జీవితయాత్రకు ప్రతీక. అతడి ఈ ప్రయాణానికి కారణం తనకు తానే చెప్పుకున్నట్టు మధురలో మీనాక్షి దేవాలయాన్ని చూడాలనిపించడం కాని, మద్రాసులో చదువుకునే రోజుల్లో మిత్రుడయిన మధుర నివాసి గురుమూర్తిని చూడాలనుకోవడం కాని, కారణాలు కానే కావు. తనను తాను అన్వేషించుకుంటూ మధురకు చేరుకున్న అతడు మీనాక్షి అనే ఫిలాసఫీ లెక్చరర్‌తో అతిచిత్రమైన పరిస్థితులలో పొందిన శారీరిక అనుభవంలో అన్వేషణలో చివరి మజిలీ చేరుకున్నాడనవచ్చు. ఈ శారీరిక అనుభవంలో నిజానికి అతడు పొందింది పారమార్థికానుభవం. గుళ్ళోని దేవతా విగ్రహానికి, దేవతకు మధ్య గల అద్వైత భావం – సౌందర్యానికి సౌందర్యరాహిత్యానికి – వ్యక్తికీ సౌందర్యానికి మధ్యగల అనుభూతి ఏకత్వం – వీటన్నింటి మూల స్వరూపాలను అతగాడు గ్రహింపగలిగింది ఈ పారమార్థిక అనుభూతిలో నుంచే! ఒక్కమాటలో చెప్పాలంటే – అద్వైత భావ సిద్ధిని పొందిన మధురక్షణమది. ఈ విధమైన భావ సిద్ధిని పొంది హోటల్ గదిలోకి వెళ్ళి పడుకున్న తర్వాత అతనికో చిత్రమైన కల వచ్చింది. ఆ కలలో తను చచ్చిపోతాడు. తన శరీరం చుట్టూ జనం మూగి ఉంటే ఏడేళ్ళ కూతురు ఏడుస్తూ ఉంటే అతని శరీరం నుంచి అతగాడు వేరై వచ్చి తాను చచ్చిపోలేదని చెప్పాలనుకుంటాడు. కాని అది సాధ్యపడదు. ఇంతకూ చచ్చిపోయింది అతనిలోని 'అజ్ఞానమే' కాని, అతడు కాదుకదా! అయినా "అనశ్వరమైనది నశ్వరమై కనిపించేది ఈ లోకం ద్వారానే అనే గ్రహింపు అందరికీ అందుతుందా?" ఇక ఈ కథలోని మీనాక్షి నిజంగా ఒక స్త్రీయా లేక అమ్మవారి ప్రతిరూపమా అనే ఆలోచన జోలికి వెళ్ళదలచలేదు. ఎందుచేతనంటే అలాంటి ఆలోచనలు కథలో రచయిత చెప్పదలచిన విషయాన్ని ప్రక్కకు తోసేసి దానిని ఒక "ఫేంటసీ" గా తయారుచేసే భయం వున్నది కాబట్టి!

సుదర్శనంగారి కథలలో "ఎరుపు" చాలాకాలం గుర్తుండే కథ. ఇందుకు కారణం ఈ కథలోని అస్తిత్వవాద దృక్పథానికి మార్క్సిస్టు దృక్పథానికి ముడిపెట్టడానికి జరిగిన ఒక ప్రయత్నం కూడా (సార్త్రవంటి మేధావులు ఈ రెండింటిని ముడిపెట్టేందుకు ఒక దశలో

ప్రయత్నించడం కొందరికి గుర్తుండవచ్చు.) దీనికి కారణం మార్క్సిస్టు దృక్పథపు కేంద్ర బిందువు హేతువాదంలో వుంటే అస్తిత్వవాదం హేతువాద దృక్పథాన్ని నిరాకరిస్తుంది. "మార్క్సియన్ కాన్సెప్ట్ ఆఫ్ మాన్"లో ఎరిక్ ఫ్రోమ్ అన్నట్లు మార్క్సిస్టు దృక్పథాన్ని "Rational mysticism" అని అభివర్ణించడం "అమెరికన్ భాష"గా కొట్టివేయవచ్చు కానీ – ఈ రెండు సిద్ధాంతాలూ మనిషిలోని Aliena-tion కు ప్రాధాన్యత నిస్తాయనే విషయం వరకూ అంగీకరించవచ్చుననుకుంటాను. ఈ విషయాన్ని గురించిన చర్చ ఈ వ్యాసం ఉద్దేశంకాదు కానీ ఈ తరహా ప్రయత్నం కొంతవరకూ "ఎరుపు" కథలో నాకు కనబడిందని మటుకు చెప్పగలను.

ఈ కథలో రచయిత మనకు మూడుసార్లు ఎర్రని రంగును చూపిస్తాడు. మొదటిది నడుస్తున్న రైలు ఎక్కుదామన్న ఆశతో పరిగెట్టి చివరకు రైలు క్రిందపడి రెండు కాళ్ళు విరగగొట్టుకున్నవాడి రక్తం. రెండోది ప్రక్క ఇంటిలారీ డ్రయివర్ భార్యతో ఒక వ్యక్తి కులాసాగా ప్రారంభించిన రోమాన్సు విషాదాంతంగా ముగిసినప్పుడు చిందిన రక్తం, మూడవది – ఆకలి, నిరుద్యోగాల వంటి సమస్యలతో కుళ్ళిపోయిన ఈ ఆర్థిక వ్యవస్థకు చెయ్యవలసింది చికిత్స కాదు శస్త్రచికిత్స అని భావించిన వ్యక్తి సాయుధ పోరాటంలోకి దుమికినప్పుడు పోలీసులు కాల్పులు జరిపి చిందించిన రక్తం. ఈ రక్తం కథను రచయిత వివరంగా చెప్పనప్పటికీ ఈ మూడింటి కథకు పోలిక లేకపోయినప్పటికీ, వ్యక్తి తనను తాను చేసుకునే అన్వేషణలో– తన ఇచ్ఛ ప్రకారం చేసే యాత్రలో, తన ఒంటరితనంలో, తన తిరుగుబాటులో చిందించే రక్తాలే ఇవన్నీ అనిపిస్తుంది. "ఇచ్ఛ" వెంట పరిగెత్తడం పరుగెత్తే రైలు వెంట పరిగెత్తడంలాంటిది కాదూ? అనిపిస్తుంది!

ఈ కథలోని సారథి అంతో ఇంతో మంచి ఉద్యోగంలో ఉన్నవాడే! భార్య పురుడుపోసుకోడానికి పుట్టింటికి వెళ్ళిన సమయంలో అతనికి క్షయ వ్యాధి పట్టుకుంది. శారీరకమైన 'సెక్సు' నిషేధం అన్నారు డాక్టరు. అది అతనికి ఎంతవరకూ సమస్య అయ్యేదో కాని రాజమ్మ వంపుసొంపులు నిజంగానే అతనికి పరీక్ష పెట్టాయి. ప్రక్కఇంటిలో ఉన్న లారీడ్రైవర్ భార్య రాజమ్మ. వైద్యుని సలహామేరకు విశ్రాంతిగా ఇంటిలోనే వుంటున్న సారథి మేడమీది గదిలోంచి ప్రొద్దస్తమానూ రాజమ్మను చూస్తూండేవాడు. ఆమెను కంటితో అనుభవించే "సెక్సుకూ, శరీరంతో అనుభవించే 'సెక్సు'కూ తేడా ఏమీలేదనే" సిద్ధాంతాన్ని తయారుచేసుకుని సంతృప్తిపడదామనుకున్నాడు కాని – ఇలా కథ ఎంతో కాలం నడవలేదు. ఇతగాడి వ్యవహారాన్ని మొదటి నుంచీ కనిపెడుతున్న రాజమ్మ చివరికి రంగంలోకి దిగడంతో "అద్వైత" భావం కాస్తా పటాపంచలయిపోయింది. పది రూపాయలు అప్పుకావాలనే వంకతో పరిచయాన్ని ప్రారంభించి రాజమ్మ అతనికి మంచం మిత్రురాలయిపోయింది! తన అనారోగ్యాన్ని కూడా లక్ష్యపెట్టకుండా నిర్హేతుకంగా ప్రవర్తించి – 'సెక్సు అనుభవంవల్ల

జబ్బును తిరగబెట్టుకున్నాడు సారథి. ఇంతలో లారీ డ్రయివర్‌గారికి మరోచోట ఉద్యోగం రావడంతో రాజమ్మ ఆ వూరు విడిచి పెట్టాల్సివస్తుంది. మొగుణ్ణి వదిలేసి తనతో ఉండిపోమ్మంటే నలుగురూ నడిచిన దోవలో నడవక తప్పదంటుంది. రాజమ్మను వదులుకోలేని సారథి ఆమె తన కౌగిట్లో వుండగానే కత్తితో పొడుస్తాడు! ఈ కథలోని సారథి, రాజమ్మ ఇద్దరూ తమ 'ఇచ్ఛ' నిర్దేశించిన దోవలోనే నడిచారు. ఆరోగ్యం కన్నా సెక్సు అనుభూతి ముఖ్యం అనేది సారథిని నడిపించిన 'ఇచ్ఛ' అయితే - రాజమ్మను నడిపించిన 'ఇచ్ఛ' ఆమె మనసు నచ్చిన వ్యక్తి పొందు! రాజమ్మ వ్యభిచరించవచ్చును. కానీ శరీరాన్ని అమ్ముకోలేదు. దీనికి కారణం ఆమె సారథి నుంచి ఎలాంటి ప్రతిఫలాన్ని తీసుకోవడానికి ఇష్టపడకపోవడం. కారణాలు ఏమయితేనేం - ఫలితం - రాజమ్మ గుండెల్లో రక్తం చిమ్మడం, సారథి జైలు పాలు కావడం.

ఇక, విద్యాధికుడయిన నిరుద్యోగి విశ్వం వ్యవస్థలోని అవినీతిపై కసిని పెంచుకుని ప్రజావిరోధుల గుండెల్లో తూటాలు పేల్చడానికి ప్రయత్నించి చివరకు పోలీసుల తుపాకీ గుళ్ళకు బలయిపోయాడు. ఈ రెండు కథల వెనుక వున్నది "ఇచ్ఛ" నిర్దేశించే దోవలో నడిచే వ్యక్తుల జీవితయాత్రే అయినప్పటికీ వాటి గమ్యాలు, ప్రేరణలు వేరు. సారథి చేసిన హత్య వెనుక స్వార్థం ఉన్నది. తన ఆరోగ్యాన్ని పణంగా పెట్టుకున్నా రాజమ్మ తనకు శాశ్వతంగా దక్కలేదే అన్న బాధ ఉన్నది. కాని - విశ్వం చేసిన త్యాగం వెనుక ఆరని గుండెల్లోంచి చిమ్మిన ఎర్రని రక్తం వెనుక- రేపటి ప్రపంచాన్ని గురించిన తపన ఉన్నది. "అదంతా ఒక భ్రమ. ఒక ఎండమావిని చూచి పరుగెట్టడం"- అని సారథి లాంటివాళ్ళు విశ్వానికి హితవచనాలు చెప్పేటప్పటికీ - సామ్యవాద వ్యవస్థలో స్వేచ్ఛ కుంటుపడుతుందనే చిలుక పలుకులు వల్లించినప్పటికీ - ఒకటి కేవలం వైయక్తికం మరొకటి సామాజికం.

ఈ విభేదాలను గురించిన చర్చ ఎలా వున్నప్పటికీ రెండు విరుద్ధమైన విషయాలలో సమానత కలిగిన అంశాలను- 'ఇచ్ఛ' నడిపిన దోవలో నడవడాన్ని Alienation ను ఫోకస్ చేస్తూ అస్తిత్వవాద దృక్పథంతో రాసిన మంచి కథ 'ఎరుపు'. జీవిత సత్య అన్వేషణలో వ్యక్తి సుఖిస్తాడని కాని, ఆ వ్యక్తి కథ సుఖాంతం అవుతుందని కాని అస్తిత్వవాదులు చెప్పరు కాబట్టి - విశ్వం సారథి లాంటి వాళ్ళు మృత్యువు వొడిలో ఒరిగిపోక తప్పలేదు. - అయితేనేం సంఘం నిర్దేశించిన సూత్రాలకు, అది బిగించిన చట్రాలకు అంగీకరించిన వ్యక్తులు నిరంతరం తమను తాము అన్వేషించుకుంటూ పోరాటాన్ని సాగిస్తూనే ఉంటారు. అస్తిత్వవాద సిద్ధాంతాలను మనం అంగీకరించినా, అంగీకరించకపోయినా ఇది నిరంతర సత్యం. సుదర్శనంగారి కథలు మనకు మరో మారు జ్ఞాపకాన్ని తెచ్చేది ఈ విషయాన్నే!

# 43

## బీనాదేవి-"ఫస్ట్ కేస్"

**క**థలనేవి కాలక్షేపం కోసమా, లేక వాటికి ఒక విశిష్టమైన ప్రయోజనాలు వున్నవా అనే విషయాన్ని ఇవాళ పనిగట్టుకుని చర్చించ పూనుకోవడం ఎలాంటిదో-తెలుగు కథకుల్లో బీనాదేవిగారిది విశిష్టమైన స్థానమని చెప్పడం కూడా అలాంటిదే! తెలుగువాళ్ళు గర్వంగా చెప్పుకోదగ్గ పదిమంది కథకుల్లో బీనాదేవిగారు ఒకరు.

బీనాదేవిగారి పేరు చెప్పేసరికి వారి కథల అభిమానులకు "థేంక్స్ ఫర్ ది పి.ఎం." "ఎ మేటర్ ఆఫ్ నో ఇంపార్టెన్స్", "డబ్బు" మొదలైన కథలు జ్ఞాపకం వస్తాయి. (సరే-జలుబు తగ్గడానికి పదేపాట్ల గురించి చెప్పే కథను జ్ఞాపకం చేసుకుని ముసిముసి నవ్వులు నవ్వుకునేవారు కూడా వుండవచ్చుననుకోండి- అది వేరే విషయం) ఇంతేకాదు, "డబ్బున్నవాడు ఖూనీ చేస్తే డిఫెన్స్‌కి పోలీసువాడే పునాది వేస్తాడు. శవం మీద దెబ్బలే లేవంటాడు శవం డాక్టరు" ('పాత కథే' అను కథలో). "సెడ్డోడికి దవడ పళ్ళు రాలగొట్టీ-ఆడికాడ మంచి నాబం నేదు. ఆడి జోదుతుడు. అదే నీ మీద కెత్తుతాడు. ముందు సెప్పు నువ్వె ఎత్తు. నీకు సలాం పెడతాడు" ('ఎ మేటర్ ఆఫ్ నో ఇంపార్టెన్స్' కథలో) వంటి ధర్మ సూక్ష్మాలు మదిలో మెదులుతాయి. అంతటితో అయిందా- "కేసులకీ నా గుంటలే. ఊసులకీ నా గుంటలే. ఎదవ ముండ కాడ ఎదురు బేరంగాడివి. నీతో నాకేటి ఎల్లెల్లు-" అంటూ హెడ్ కానిస్టేబుల్‌తో పరాచికాలాడే ముండల కంపెనీ ప్రొప్రయిటరిణీ ముత్యాలమ్మ - ఈ రేత్తిరి సాకల్ది కోక యిప్పుకుపోద్ది, కంసాలోడు సెవులివి తెంపుకుపోతాడు. దాట్రు దగ్గరకు వెళ్ళడానికి యివాళ కూడా రెండు రూపాయిలుండవు" అంటూ 'హెడ్డు' కోరిన ప్రకారం పోలీసు స్టేషన్‌కి వెళ్ళి- వ్యభిచారం చేసిన నేరానికి గాను (ఆ నేరం ఋజువు చెయ్యడానికిగాను కాన్‌స్టేబుల్‌గారి ఆదేశానుసారం 'వైరు'గాడు స్టేషన్‌లో 'రెడీ'గానే వున్నాడనుకోండి) కోర్టులో పాతిక రూపాయిలు జరిమానా కట్టుకునే రోడ్డు ప్రక్క గుడిసెల్లోని వ్యభిచారిణీ, రాబందుల్లాంటి ప్లీడర్లు, డాక్టర్లు- వెరశి సమకాలీన ప్రపంచం అంతా కథల్లో యిమిడి కనబడుతుంది. ఈ కథల్ని గిలిగింతలు పెట్టే 'సిమిలీ'లతో, చురుక్కుమనిపించే వ్యంగ్యంతో మనకు వినిపించడంలోనే బీనాదేవిగారి కథల ప్రత్యేకత కనబడుతుంది. అయితే ఈ 'ప్రత్యేకత' రావిశాస్త్రిగారి పంథాని అనుసరించడంవల్ల మాత్రమే రాలేదు. బీనాదేవి

కథలకు రావిశాస్త్రి కథలకు కొన్ని పోలికలు వుండవచ్చునేమో గాని, ఇవి జీవం లేని నకిలీ కథలు మాత్రం కాదు. కొడవటి గంటి కుటుంబరావుగారు అన్నట్టు – బీనాదేవి కథలకు తనదంటూ చెప్పదగిన వ్యక్తిత్వం వున్నది. అయితే వాటిలోనూ కవిత్వం వుండడంచేతా, "ముందు హృదయాన్ని కదిలించి ఆ తర్వాత మెదడును కదిలించే లక్షణం" వుండడంచేతా, మీదుమిక్కిలి శాస్త్రిగారి కథల గురించి శ్రీశ్రీ చెప్పిన "రసన" బీనాదేవిగారి కథల్లో పుష్కలంగా దొరకడంచేతా– బీనాదేవిగారి కథలు చదువుతున్నప్పుడు శాస్త్రిగారి కథలు స్ఫురణకు వస్తాయి.

"ఈ రోజుల్లో పాకీవోడు మొదలుకొని పరబ్రహ్మం వరకూ, డాట్రుబాబు మొదలుకొని దాఫర్నాయాల వరకూ అందరికీ ఒకటే కావాలి – డబ్బు!" అంటాడు బీనాదేవిగారి 'డబ్బు' కథలోని లారీ డ్రయివరు. నిజమే మరి, 'నల్లంచు తెల్లచీర'ను చూసి ముచ్చటపడ్డ భార్య కోరికను తీర్చడంకోసం ఆమె భర్తపడ్డ ఆరాటానికి అడుగడుగునా అడ్డంగా నిలిచింది ఈ డబ్బుగాడే కాదూ? (యిది రాస్తుంటే శాస్త్రిగారి 'జరీ అంచు తెల్లచీర' కథలోని విశాలాక్షి సహజంగానే జ్ఞాపకం వచ్చింది.) ఇక, రిక్షా తొక్కుకునే సింహాచలం తన రక్తాన్ని ఏడున్నర రూపాయిలకు అమ్ముకుని తిరిగి అదే రక్తాన్ని కొడుకు ప్రాణం కాపాడ్డం కోసం ముప్పది రూపాయిలకు కొనుక్కోలేక – కోపంతో రక్తం సీసాను బ్రద్దలుకొట్టాడంటే– ఈ 'కడుపుమంట' వెనకాల వున్న శక్తి 'డబ్బు' కాదూ? (ఎ మేటర్ ఆఫ్ నో ఇంపార్టెన్స్ కథలో) ఇలాంటి 'నేరస్థుడు' సింహాచలాన్నికోర్టులో ముద్దాయిగా నిలబెడుతూ ప్రతివాదన చేయాల్సిన పబ్లిక్ ప్రాసిక్యూటర్ "నేను ప్రతివాదన చెయ్యదలచుకోలేదు. ఇది చాలా చిన్న కేసు. ఎ మేటర్ ఆఫ్ నో ఇంపార్టెన్స్" అనడం ఆ కథను చదివిన పాఠకులు మరిచిపోలేరు.

ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే– మనం ఇంత గొప్పది అని అనుకుంటున్న "డబ్బు" కన్నా విలువైనవి జీవితంలో వుంటాయన్న అవగాహన మనిషికి వచ్చినప్పుడు నిజంగానే పెద్ద 'షాక్' తగులుతుంది. మాట వరుసకు– బీనాదేవిగారి "డబ్బు" కథనే తీసుకోండి. ఈ కథలోని 'డాట్రుబాబు' ప్రపంచంలో అన్నింటికన్నా 'డబ్బు' మాత్రమే ముఖ్యమైందని అనుకున్నాడు. రెండు చేతులా ధనాన్ని ఆర్జించి "పెళ్ళాం పుస్తె అమ్మించేసి, పది రూపాయిల మందు యిరవైకి అమ్మేవాళ్ళు, ఈయేల కడితే రేపు కొట్టుకుపోయే బ్రిడ్జీలు కట్టే కాంట్రాక్టర్లు" ఆరోగ్యంతో 'వర్ధిల్లడం'కోసం 'కోవారంగు గోడల' ఆస్పత్రి కట్టాడు. డబ్బుతోపాటుగా పేరు, ప్రఖ్యాతి కూడా సంపాదించాడు. అయితేనేం– తన కన్న కొడుకును రక్షించుకోలేక పోయాడు. నదిలో మునిగిపోయిన డాక్టర్ కొడుకును బెస్తవాడు రక్షించి, కొనవూపిరితో వున్నవాడిని తన ఆస్పత్రికే తీసుకొనివస్తే– బీద బెస్తవాడి దారిద్ర్యమే డాక్టర్‌కి కనబడింది గాని– ఆ బెస్తవాడు తెచ్చింది తన కొడుకునేనని గ్రహించలేకపోయాడు. ధర్యాసుపత్రికి పొమ్మన్నాడు. తన ధనదాహానికి తన కొడుకునే బలి యిచ్చుకున్నాడు. ఆ తర్వాత కొడుకు చావు వార్త విని డాక్టర్ 'ధర్మాసుపత్రి'కి వెళ్ళినప్పుడు అక్కడ ఆ బెస్తవాడు ఆందోళనతో కనబడితే

అంతకన్నా పెద్ద 'షాక్' ఏముంటుంది? గుండె ఆగిపోదూ? ఈ కథను 'టీ దుకాణం' శ్రోతలకి చెబుతున్న డ్రయివర్ అన్నట్టు "(డాక్టరు) బిడ్డ సచ్చిపోయిన సాక్కు (షాక్) నిలబడగలిగినాడు గానీ- బీదోడు సూపిన సత్తేనికి నిలబడ్నేకపోనాడు. ఆ 'సాక్కు' సచ్చిపోయి వరండాలో దిక్కుమాలిన సెవంగా పడిపోనాడు"- 'బీదోడు సూపిన' ఈ 'సత్తెం' వెనుక మానవత్వపు విలువలున్నాయి. జీవితాన్వేషణలో మానవుడు తనకు కావలసినదానిని తాను గ్రహించలేకపోతున్నాడనే విషాద వాస్తవపు అవగాహన వున్నది. ఈ అన్వేషణలో జరిగే పొరపాట్ల వల్ల వచ్చే విషమ పరిణామాల పట్ల హెచ్చరిక వున్నది. ఈ కథను బీనాదేవిగారు ఆస్తిత్వవాద దృక్పథంతో రాయకపోయినప్పటికీ- ఆ తరహా దృక్పథం గల కథలు సాధించే పనిని ఇది పరోక్షంగా కొంతవరకయినా సాధించిందనిపిస్తుంది. (బీనాదేవి గారి "రిలీవరు" కథలో- బస్సులో ఫ్రంట్ సీట్‌లో కూర్చుందామని తహతహలాడిన తాసిల్దారుగారు, శాస్త్రిగారి "కార్నర్ సీటు" కథలో "కార్నర్ సీటు' గురించి ఆరాటపడిన వ్యక్తి- "దబ్బు" కథలోని డాక్టర్‌లాగా తనకు కావలసిందేదో తెలియనివాళ్ళే!)

బీనాదేవిగారి కథల్లో "ఫస్ట్ కేస్" కథంటే నాకు చాలా యిష్టం. ఇరవయ్యొకటవ శతాబ్దానికి "అందరికీ ఆరోగ్యం" అనీ- దారిద్ర్య సమస్యని పోగొట్టడం జరుగుతుందని తరచూ వినబడే ఊకదంపుడు ఉపన్యాసాలు ఒక రకమైన 'ఎలర్జీ'ని గుండెల్లో కలిగించడం ఇందుకు ఒక కారణం అనుకుంటాను.

ఈ కథలోని డాక్టర్ ఆనందరావు ఐశ్వర్యంలో పెరిగాడు. అతని తండ్రి ఒక పెద్ద పారిశ్రామికవేత్త. అందుచేత ఆనందరావు జీవితం సహజంగానే "కాంక్రీటు రోడ్డుమీద, పండు వెన్నెల్లో, అమెరికన్నారులో ప్రియురాల్తో ప్రయాణంలా" సాగిపోతూ వచ్చింది. చెవర్లెట్ కారు 'రేర్ వ్యూ' మిర్రర్‌లోంచి అడపా, తడపా 'ముష్టి వెధవల్ని' చూడడం మినహాగా అతను దారిద్ర్యం అంటే ఏమిటో ఎరుగడు. ఇక ఆనందరావు డాక్టరుగా ప్రాక్టీసుపెట్టి అడ్డమైనవాళ్ళ కురుపులూ కడిగి నెలకో ముష్టి మూడువేల రూపాయిలు సంపాదించడం యిష్టంలేని వాళ్ళ నాన్న అతగాడిచేత మందుల ఫ్యాక్టరీ పెట్టించడం కోసం అమెరికా పంపిద్దామనుకున్నాడు కూడాను.

- యిలాంటి నేపథ్యంలో మన కథానాయకుడు ఆనందరావు మిత్రుడి బలవంతంమీద ఓ పల్లెటూరు వెళ్ళాడు. ఆ పల్లెటూళ్ళో వున్న ప్రకృతి సౌందర్యాన్నీ (సరే బిగువు 'రవికెల ఆడకూలీలనీ) బంగారం పండిన పంటచేలనీ చూచి ఆనందరావు ఈ ప్రపంచంలో లోటు ఏముందని అనుకుంటూ పొంగిపోయాడు.

కాని సరిగ్గా యిలాంటి సమయంలో సాయంత్రం ఎండ వెచ్చగా, ఊలురగ్గులా వున్నప్పుడు తడిసిన కాకిపిల్లలా, అసహ్యంగా వున్న ఎనిమిదేళ్ళ పిల్ల - చూడగానే 'డిస్టింక్ట్‌లీ ఏన్ ఎడ్వాన్స్‌డ్ కేస్ ఆఫ్ మాల్-న్యూట్రిషన్' అని అనిపించే పిల్ల- తన చెల్లెలుకు తీవ్రమైన అనారోగ్యం చేసిందని చెబుతూ, డాక్టర్ బాబును రమ్మని బ్రతిమాలింది.

పాములు చేరిన గుహలా వున్న తోటలో - కూలిపోతున్న పూరిపాకలో నెల్లాళ్ళనుంచీ టైఫాయిడ్‌తో, వారం రోజుల నుంచీ ఏ విధమైన ఆహారం లేక కొడిగట్టిన దీపంలా వున్న ఆ పిల్ల చెల్లెల్ని ఆనందరావు చూసింది అక్కడే! రోగిని బ్రతికించాలంటే మందుకన్నా ముందు తిండి పెట్టడం అవసరం. రోగి మాట దేముడెరుగు- ఆ పిల్ల తల్లికీ, చెల్లికీ మూడు రోజులుగా తిండిలేదు. ఇలాంటి పరిస్థితిలో రోగికి హార్లిక్స్, గ్లూకోజ్ వగైరాలు ఇవ్వాలని చెప్పడానికి డాక్టర్‌కి నోరు రావద్దూ? -

ఏది ఏమైనా ఇది అతని ఫస్ట్‌కేస్. పేషెంట్ చస్తే ఆస్పత్రికి అవమానం. కాని తిండిలేక చస్తే దేశానికే అవమానం అనుకున్నాడు. అందుకే హడావుడిగా మిత్రుడి ఇంటికి పరుగెట్టి ముందు ఆ పిల్ల అక్కచేత ఫ్లాస్కు నిండా హార్లిక్స్ పంపించాడు. ఆ తర్వాత కావలసిన మందులు తీసుకునిరోగి దగ్గరకు బయలుదేరి వెళ్ళాడు. కాని మందుల్తో ఆనందరావు వెళ్ళేసరికే ఆకల్తో ఆ పిల్ల చచ్చిపోయింది.

శవాన్ని చూసి బాధతో ఇంటికి తిరిగి వెడుతున్న ఆనందరావుకి తోటలో ఓ గోడను ఆనుకొని నిద్రపోతున్న రోగి అక్క కనిపించింది. తాను హార్లిక్స్ పంపించింది ఈ పిల్లచేతనే! ఆనందరావుకి పిల్ల వెనుకాల బుసలు కొడుతున్న పాము, ఆ పిల్ల పక్కన మూత తెరిచివున్న ఫ్లాస్క్ కనబడ్డాయి. పాముకంటే ఫ్లాస్క్ భయంకరంగా కనబడింది. అంతేకాదు. మరో పాములా కూడా కనబడింది. రోగికి చేరవలసిన హార్లిక్స్‌ను ఆ పిల్ల అక్క తాగేసింది. ఆకల్తో రోగి చచ్చిపోయింది. మామూలు దృష్టికి యిది చాలా ఘోరమైన అపరాధంగా కనబడవచ్చు. కాని కరకర మండిపోతున్న జఠరాగ్నిముందు మనం ఉన్నతమైనవిగా భావించే విలువలన్నీ అల్పంగా కనబడతాయి. ఇందులో అసహ్యించుకోవలసిన విషయం ఏదైనా వుంటే- అది ఈ ఆకలికి, దారిద్ర్యానికి మూలకారణమైన శక్తులను మాత్రమే!

ఇలాంటి సమాజాన్ని బాగుచేయాలన్న తలంపు వచ్చిన డాక్టరు ఆనందరావు (సహజంగా కాస్తో, కూస్తో మంచివాడు కాబట్టి.) ఆ క్షణంలో ఒక 'డైలమా'లో పడ్డాడు. అమెరికా వెళ్ళి తిరిగొచ్చి తనకు అక్కరలేని లక్షలు గడించడమా? లేక లక్షలాది బీదలకు సేవ చెయ్యడమా? అనేది ప్రశ్న. అయితే ఈ ప్రశ్న ఎక్కువ బాధ పెట్టకుండానే లక్షలు ఆర్జించడానికి అతగాడు అమెరికా వెళ్ళి పోయాడనుకోండి. అది వేరే సంగతి.

ఈ కథలో ఆకల్తో, అనారోగ్యంతో చచ్చిపోయిన ఆరేళ్ళ పిల్ల కథా, ఆ పిల్ల ఆకలిని, దారిద్ర్యాన్ని చూసి బోలెడంత బాధపడి ఎంతో చేద్దామనుకుని ఏమీ చేయలేకపోయిన డాక్టరు కథా- యించుమించుగా మనందరి కథ అని చెప్పవచ్చు. 'లిప్ సింపతీ' కథ నిన్నటికథగా మారాలంటే అందుకు కావలసిన "మందు" ఏదో ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. ఆ 'మందు'ను తయారుచేయడానికి అమెరికా వెళ్ళి శిక్షణ పొందవలసిన అవసరం కూడా లేదు. అయ్యా- అదీ కథ!

---

# 44

## పురాణం సూర్యప్రకాశరావు–'బాలకాండ'

**మ**నుషులకీ, కాకులకీ మధ్య ఆత్మీయానుబంధం ఏర్పడి–వాటిని మనుషులు ఆప్యాయంతో ఆహ్వానించే పరిస్థితి అశుభం జరిగినప్పుడే వుంటుందనుకుంటాను.

అలాంటి పరిస్థితిలోనే– అంటే, రామనాథం మాస్టారి పిండాన్ని కాకులు ఎప్పుడు తింటాయా అని లోకులు ఎదురుచేస్తున్న సందర్భంలో– అవి సం(ప్రతింపులకు రావడానికి ఇష్టపడని (ప్రతిపక్షాల వాళ్ళలాగా మొరాయించి కూర్చున్నాయి! (ప్రతిదానికీ సం(ప్రదాయపు డిక్షనరీలో ఒక కారణం వున్నట్టుగానే దీనికీ ఒక కారణం వుంటుంది కాబట్టి రామనాథం మాస్టారి ఆత్మకు సంతృప్తి లభించలేదు అని తీర్మానించారు పెద్దలు. అప్పుడు – పిల్లలు బుద్ధిగా చదువుకుంటామని చచ్చిపోయిన తం(డ్రి ఆత్మకు వాగ్దానం చేశారు గాని, (బ్రతుకల్లా పిల్లలకు చదువు చెప్పీ, చెప్పీ అందులో విలువలేదని (గ్రహించడం వల్లనో ఏమో మాస్టారి ఆత్మ శాంతించిన దాఖలాను కాకులు చూపలేదు. అదుగో – అలాంటి సందర్భంలోనే ఉభయ తారకంగా వుండే కారణాన్నొకటి బయటపెట్టాడొక (ప్రబుద్ధుడు. అది కాస్తా అయిందనిపించిన తర్వాత కాకులు పిండాన్ని ముట్టినమాట నిజమే కాని, సం(ప్రదాయం మాట దేవుడెరుగు, మాస్టారి భార్య (బ్రతుకుతెరువుకు ఆధారం కూలిపోయింది కాదూ?– తినడానికి తిండిలేక, వుండడానికి గూడులేక బడిపంతులు భార్యాబిడ్డలు రోడ్డుమీద నిరాధారంగా నిలబడే పరిస్థితి ఏర్పడింది కాదూ?

పురాణం సూర్య(ప్రకాశరావుగారి 'కాకులు' కథ చదివిన పాఠకులకు ఆ కథలోని వ్యథ సుపరిచితమే! ఈ తరం పాఠకులకు అంతగా పరిచయం లేకపోవచ్చునేమో గాని ఒక తరం పాఠకులకు పురాణం సూర్య(ప్రకాశరావుగారి పేరు చెప్పేసరికి వెంటనే స్మృతిపథంలో మెదిలే పేరు 'జీవన గంగ'! కొన్ని దశాబ్దాల (క్రితం ఒక వారప(త్రికలో సీరియల్‌గా వెలువడి, పాఠకుల్ని ఉ(ర్రూతలూగించిన నవల అది. సాధారణ, మధ్యతరగతి కుటుంబ జీవనానికి నైపుణ్యంతో తీసిన ఫోటో(గ్రాఫ్ ఆ నవల. నిజానికి మధ్యతరగతి జీవన గంగలో ఈదులాడే ఓపిక, సామర్థ్యం రచయితలకు వుండాలే గాని, ఇతివృత్తాలకు

కొదవలేదు. ప్రతి ఇంటి తలుపు తడితే ఎన్నెన్నో కథలు వినబడతాయి. వాటిల్లో రొమాన్స్ వుంటుంది. హాస్యం, విషాదం వుంటాయి. కుత్సితపు రాజకీయాలు, ప్రేమాభిమానాలు, వాత్సల్యాలు వుంటాయి. అదొక విచిత్ర ప్రపంచం. ఆ ప్రపంచానికి అద్దం పడుతూ ఒక్కొక్కరు ఒక్కొక్క రీతిలో అందమైన కథలుగా గుదిగుచ్చారు. దేనికదే కొత్తగా వుంటుంది. "ప్రతి దాంట్లోను అంతకుముందు అన్వేషించబడని కొత్త విషయం వుంటుంది. చెట్టు ముందు నుంచుని అంతకుముందు కనిపించినదానికన్నా భిన్నంగా కనిపించేంతవరకు చూడగలిగితే చెట్టు గురించి ఒక 'ఒరిజినల్' రచన వెలువడుతుంది" అనే ప్రఖ్యాత ఫ్రెంచి కథా రచయిత 'మొపాసా 'చెట్టు ఫిలాసఫీ' మధ్యతరగతి కుటుంబ జీవనం విషయంలో తెలుగు కథకులకు కూడా వర్తిస్తుందనుకుంటాను! ఇందుకు సూర్యప్రకాశరావుగారు ఒక ఉదాహరణ. సూర్యప్రకాశరావుగారు తమ కథల్లో ప్రత్యేకించి చెప్పదగిన ఆర్థిక, సాంఘిక, సిద్ధాంతాలేవీ ప్రవచించరు. మధ్య తరగతి మానవుల బ్రతుకుల్లోని ఓ చిన్న భాగాన్ని మన ముందు వుంచుతారు – అంతే! "నవల అనేది ఒక అనుభూతి. వాదోపవాదాలు కావు" అనే 'హార్డీ' పలుకుల్ని కథకు కూడా విస్తరింపచేయవచ్చు అనుకుంటే అందుకు కనబడే ఉదాహరణల్లో ప్రకాశరావుగారి పేరు కూడా చేర్చవచ్చు.

ఇంతకూ 'కాకులు' కథలోని కాకుల్ని అలాగే వుంచి ఇంతదూరం వచ్చాం. ఈ కథలోని రామనాథం మాస్టారు ఏళ్ళతరబడి సర్వీసు చేసినప్పటికీ, భార్యాబిడ్డలుకోసం నాలుగు రాళ్ళు నిలవ వేసినవాడు కాదు. ఇలాంటి పంతులుగారు చచ్చిపోతే, చావు నిజంగా వచ్చేది పెళ్ళాం బిడ్డలకే అని ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. నాలుగు ఇళ్ళల్లో కాయకష్టం చేసి బ్రతకడానికి అభిజాత్యం అడ్డురావడంచేత రామనాథంగారి భార్య నలుగురి కాళ్ళు పట్టుకుని చందా డబ్బులతో కుట్టు మిషను కొనుక్కుని బ్రతుకుదామనుకుంది. ఇందుకు కొంతవరకు పూనిక జరిగింది. కాని కాకుల ధర్మమా అని కథ మళ్ళీ మొదటికి వచ్చింది. బ్రతికినన్నాళ్ళూ హుందాగానూ, గౌరవంగానూ బ్రతికిన రామనాథం మాస్టారు ఆయన తదనంతరం భార్యాబిడ్డలు ముష్టెత్తిన డబ్బుతో కుట్టుమిషను కొనుక్కుంటే స్వర్గాన్నించి ఈ వ్యవహారం అంతా చూస్తూ ఆయన సహించగలడా? అన్నారు లోకులు. 'నిజమే' అన్నాయి కాకులు. మరి మాస్టారి భార్యాబిడ్డల ఆకలి తీరే మార్గం ఏమిటి? నిలువ నీడ లేకుండా రోడ్డు మీద పడ్డవాళ్ళు బ్రతికేదెలా? ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పవలసిన బాధ్యత కాకులకు లేదు. అయినా ఇదంతా కాకుల్ని అడ్డం పెట్టుకుని లోకులు వేసిన ఎత్తుగడ కాదూ? (ఆ విషయాన్ని రచయిత స్పష్టంగా చెప్పనప్పటికీ–)

"చిన్న విషయం దగ్గరనుంచి పెద్ద పెద్ద రాజ్యాలను ఏలడం వరకు డబ్బున్నవాళ్ళు చేసే పని పేదోళ్ళను దోచడం, ఈ పెట్టుబడిదారీ వర్గాలు నశిస్తేనేగాని దేశం బాగుపడదు.

ఈ దేశం బాగుపడితేనే గాని, మనం బాగుపడం" అంటాడు ప్రకాశరావుగారి 'తెలివి' కథలోని అప్పారావు. ఇక 'ముందడుగు' కథలోని నారాయణబాబు ప్రవచనాలు ఇందుకు తీసిపోయినవి కావు. "నిజమైన రచయిత సంఘానికి ఎంత సన్నిహితంగా వుంటే అంత ప్రజాసేవ చెయ్యగలడు. మనం రచయితలం అయి వుండి నిత్య జీవితం నుంచి పారిపోయి లాభం లేదు" అంటాడితగాడు. ఈ ప్రవచనాల అసలు విలువ ఎంతో ఆ కథలు చదివినవాళ్ళకు ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. అయితే - రచయిత తాను వ్రాసిదాన్ని ఆచరించగలిగినంతటి నిజాయితీపరుడు కాకపోయినప్పటికీ పాఠకులచేత ఆచరింప చేయగలిగినంతటి శక్తివంతమైన రీతిలో చెప్పగలిగితే- అందులో నీతి లేకపోయినప్పటికి రచనకు సాహిత్యపరమైన విలువ వుంటుంది. 'ముందడుగు' కథలోని రచయితగారు తనను నమ్మిన అమ్మాయిని వంచించి, ఆత్మహత్య చేసుకునేందుకు కారణ భూతుడైనప్పటికీ ఓ పాఠకుడు సంఘ సంస్కరణ వివాహం చేసుకునేందుకు కారకుడయ్యాడు కాదూ?

సూర్యప్రకాశరావుగారి కథల్లో "బాలకాండ" కథ అంటే ఇష్టం నాకు. పిల్లల్ని ప్రేమించనివాళ్ళు వుండరు. ప్రతిఏడూ మన దేశంలో బాలల దినోత్సవం చేస్తారు కూడాను. అవునా? ఇక తల్లికి, పిల్లలకు వున్న అనుబంధం కూడా మనం ఎరిగిందే! పిల్లలు లేని తల్లిని గొడ్రాలుగా చిన్నచూపు చేసే అలవాటునుంచి ఇంకా చాలామంది ఆడవాళ్ళు బయటపడలేదు. ఇదంతా మనం ఎరిగిన కథే! ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే- సూర్యప్రకాశరావు గారి "బాలకాండ" కథ చదివినప్పుడు ఇదంతా నిజమే కాని, అనాలనిపిస్తుంది!

ఈ కథలోని రెండు వాటాల ఇంటిలో ఒక వాటాలో నలుగురు పిల్లలు వున్న దంపతులు, మరొకదాంట్లో పిల్లలు లేని కుటుంబరావు దంపతులు వుంటారు. పిల్లల తల్లి సరస్వతి బండెడు చాకిరీతో, పిల్లల ఏడుపులతో సతమతం అవుతూ వుంటే- పిల్లలు లేని యిల్లాలు మొగుడు ఆఫీసునుంచి ఎప్పుడు వస్తాడా అని ఎదురుచూస్తూ అతగాడు రాగానే సినామాలకో, షికారుకో వెళ్ళడం- ఆ తర్వాత పొద్దుపోయిందాకా కబుర్లు, నవ్వులూను. కవిగారయిన భర్తగారు అర్ధాంగికి తాను రచించిన పాటలు వినిపించడం సరే సరి. సరస్వతికి వీళ్ళను చూస్తే ఒళ్ళు మంటగా వుండేది.

అవును మరి - అర్ధరాత్రిపూట ఉయ్యాలలోని పిల్లవాడు పెంకులు ఎగిరిపోయేలా ఏడుపు అందుకుంటే, మిగతా పిల్లలు బృందగానం ప్రారంభించినప్పుడు బంగారం లాంటి నిద్రను వదులుకోవలసి వచ్చిన సరస్వతి- ఎప్పుడో ఒకప్పుడు భర్తతో సినిమాకు వెళ్లినా పిల్లల గోలతో ఆ సరదాను సంతృప్తిగా అనుభవించలేని సరస్వతి- ఏ బాదర బందీలు

లేని ప్రక్క ఇంటావిడను చూసి అసూయ పడిందంటే అది సహజమే! కాని, సరస్వతిది అసూయ అని కూడ చెప్పలేము. ఆడదానికి పిల్లల్ని కనడంలోనే ధన్యత వుందని, అలాంటి ధన్యతకు ప్రక్క ఇంటి ఆవిడ నోచుకోలేదని ఛీత్కరిస్తూ తనే ఓ మెట్టు, పైనున్నా ననుకునేదామె. అంతేకాదు– ప్రక్క ఇంటావిడే ఓర్వలేని స్వభావి అని ఆమె దృఢవిశ్వాసం.

కథ ఇలా నడుస్తూండగా ఓ శుభ ముహూర్తాన ప్రక్క ఇంటి కుటుంబరావుగారు సరస్వతి భర్తతో స్కూలుకు దగ్గరలో రెండు వాటాలున్న మంచి ఇల్లు చూశానని, ఇద్దరం కలిసి ఆ ఇంటికి వెళ్ళిపోతే బాగుంటుందని ప్రతిపాదన చేశాడు. ఈ ప్రతిపాదన సరస్వతికి నచ్చదనుకుంటాడు మనకు కథ చెప్పే 'నేను' అనే వ్యక్తి. ప్రక్కవాళ్ళ "ప్రవర్తన" నచ్చక వేరే ఇంటికి మారిపోదామని భర్తను అస్తమానూ శతపోరే సరస్వతి వాళ్ళతో ఇంకో ఇంటికి వస్తుందా? భర్తగారి ఆలోచన మాట ఏమోగాని సరస్వతి మాత్రం ఈ ప్రతిపాదనకు వెంటనే ఒప్పుకుంది. ఇందుకు కారణం – ప్రక్క యింటావిడ త్వరలో తల్లి కాబోతుండడం. "అయిందిలెండి సంబరం" అని ఆమె భర్తతో అంటే– "అయితే ఆమె ధన్యురాలవుతుందన్న మాట" అంటాడు భర్త– భార్య మాటలు ఆమెకే ఒప్పజెబుతూ! అప్పుడు సరస్వతి అంటుంది కదా "ఆ! ధన్యత కాదుగానీ, జీవితం నరకం కాకుండా వుంటే అదే పదివేలు. ధన్యతట...ధన్యత" అని గొణుగుతుంది!

ఈ కథలోని సరస్వతి పిల్లలు వరం అనుకుంటోందా, శాపం అనుకుంటోందా అనేది ఒక చిక్కు ప్రశ్న. పిల్లలు వుండాలి నిజమే! కాని వాళ్ళు షో కేసులో బొమ్మల్లాగా ముద్దొస్తూ తల్లిదండ్రుల మురిపాన్ని తీరుస్తూ వుంటే బాగానే వుంటుంది. కాని– ఏడుపుతో, చీమిడి ముక్కుతో, అల్లరి పెట్టినప్పుడే వుంటుంది అసలు కథ! సరస్వతిలాంటి స్త్రీలతో సహా దంపతులందర్నీ కలవరపెట్టే సమస్య ఇది. పిల్లల్ని ప్రేమించడం, వాళ్ళ గోలకు చికాకుపడడం అనే వైరుధ్యాల మధ్య ఒక స్త్రీ మనస్తత్వాన్ని అందంగా అద్దంపట్టే కథ ఇది! అయినా పిల్లలే లేకపోతే నరకంలాంటి స్వర్గాన్ని, స్వర్గం లాంటి నరకాన్ని, చేదులాంటి తీపిని, అనుభవించడం ఎలా?

---

# 45

## నగ్నముని - "సిమెంటు సంతతి"



"మన మనసుల్లో గడ్డ కట్టుకునిపోయి వున్న సముద్రాన్ని బద్దలుకొట్టే గొడ్డలి ఒక్కొక్క పుస్తకం" అంటాడు 'కాఫ్కా'. ఇది చదివిన ప్రఖ్యాత అమెరికన్ కథకుడు, నవలాకారుడు అప్‌డైక్-కాఫ్కా తన రచనల్లో పెకిలించింది తనలోని సముద్రాన్నే అని అన్నాడనుకోండి అది వేరే సంగతి! ఈ సముద్రాలు తనలోనివా, ఇతరులులోనివా అనే విషయానికి సంబంధించిన చర్చ ఎలా వున్నప్పటికీ మనుషులందరి గుండెల చప్పుడులోనూ ఒకే రకమైన 'లయ'ను అనుభూతి పొందగలిగినప్పుడు రచయిత తన ఆవేదనను అందరి కథగా వినిపించగలుగుతాడు. ఇందుకు అతని జీవితానుభవం తోడ్పడుతుంది. "సైబీరియాకు పంపించడం వల్లనే దోస్తోవ్‌స్కీ మహారచయితగా రూపొందగలిగాడు. కత్తి పదునెక్కినట్టుగా అన్యాయ పూరిత వాతావరణాన్నిఎదుర్కోవలసి వచ్చినప్పుడు అతనిలోని భావాలు పదునెక్కుతాయి" అని ఎర్నెస్ట్ హెమింగ్వే అనడంలోని అంతరార్థం ఇదే అనుకుంటాను. ("గ్రీన్ హిల్స్ ఆఫ్ ఆఫ్రికా' అనే రచనలో) 'నగ్నముని'గా ప్రసిద్ధులయిన కేశవరావుగారి కథలు చదివినప్పుడు ఈ భావాలన్నీ నా మనోవీధిలో మెదిలాయి.

నగ్నముని కథలు కొన్ని సందర్భాలలో కవిత్వానికి సన్నిహితంగా వుంటాయి. ఆ కవిత్వంలో వాడి, వేడి కలగలిసిన భావాలు వుంటాయి. "వచనం బరువైన బండలాగా ఒకంతటగానీ ఆకాశం మీదకు లేవదు. వచనాన్ని కవనం నెయ్యడమనేది ఒక్క కళాకారుడికి మాత్రమే సాధ్యం" అంటూ శ్రీశ్రీ నగ్నముని వచన కవితల గురించి చేసిన ప్రశంస కథలకు కూడా వర్తిస్తుందనుకుంటాను. ముఖ్యంగా ఆయన "విలోమ కథలు" చదివినప్పుడు ఇది మరింతగా అనిపించింది.

కథకుడుగా నగ్నముని సమాజంలో మనుషులను పట్టిపీడిస్తున్న విభిన్న తరహాల శక్తుల కథలను ఇతివృత్తాలుగా ఇమిడ్చాడు. ఆకలి మంటను చల్లార్చుకోడానికి అర్ధరూపాయికి మానాన్ని అమ్ముకునే అభాగినులు మొదలుకొని సంసార సాగరాన్ని

ఈదడంకోసం అప్పులపాలయిపోయిన మధ్య తరగతి కుటుంబీకుల కథ వరకు -ఆయన కథల్లో ఎందరెందరో మనల్ని పలకరిస్తారు. చుట్టూ వున్న చీకటి బాధాకరమయిందని తెలిసినప్పటికీ భయంతో బిక్కచచ్చిపోయి బ్రతకడం మినహాగా ఏమీ చెయ్యలేని "ఎలకల" సంగతి సరేసరి! "బస్సుల్లో ఎలకలు, సినామా హాల్స్ దగ్గిర ఎలకలు. ఆఫీసుల్లో ఎలకలు. పందికొక్కులు, చుంచెలకలు, బజార్నిండా ఇళ్ళనిండా ప్లేగ్ ఎలకలు" ('ఎలక్కన్నం' కథలో) అయ్యా ఇదండీ పరిస్థితి! ఇట్లాంటి ఎలకలనీ, ఆ ఎలుకలు బ్రతుకుతున్న కుళ్ళు వాతావరణాన్ని చూస్తే రచయితకు వళ్ళుమంట. ఆపుకోలేని ఆవేశంతో మండిపడతాడు. "ఇన్నేళ్ళుగా పొట్టలు బానల్లాగా పెంచుకున్నవాళ్లు ప్రజలందర్నీ ఇది ప్రజల ఉత్సవమని నమ్మించడానికి నానాయాతన్లూ పడుతున్నారు. రేడియోల్లో సందేశాలు వాంతులు చేసుకుంటున్నారు. పత్రికల్లో సాధించిన అభ్యుదయాన్ని వర్ణిస్తూ ఉచ్చలు పోస్తున్నారు" (సంఘ విద్రోహక శక్తులు' కథలో-) అని స్వాతంత్ర్య దినోత్సవాన్ని ఒక కథలో వర్ణించడానికి కూడా రచయిత మొహమాటపడడు.

నగ్నముని కథలు చదివిన పాఠకులకు ఆయన 'శరం' కథ జ్ఞాపకం వుందనుకుంటాను. ఈ కథలో అప్పులపాలయిన, సదానందం తనకు అప్పు ఇచ్చిన విష్ణుమూర్తి అనబడే కిరాతకుడైన వడ్డీ వ్యాపారస్తుణ్ణి తప్పించుకోవడం కోసం తెల్లవారుఝామునే ఇంటి నుండి బయలుదేరి అర్ధరాత్రి అయ్యాక ఇంటికి చేరుకుంటూ వుంటాడు. ఒక రోజున అతగాడికి హఠాత్తుగా విష్ణుమూర్తి అనుకోని విధంగా ఎదురుపడితే, వాడిని తప్పించుకొనే మార్గం తోచక స్మశానానికి తీసుకుపోదానికి సిద్ధంగా వున్న శవంబదులుగా ఉలిపికట్టెమీద పడుకుంటాడు. కాని, ఆ 'నిజంగా' చచ్చినవాడు కూడా విష్ణుమూర్తికి బాకీపడివున్న మానవుడు కావడంతో కథ అడ్డం తిరుగుతుంది. అప్పుల బాధతో శవాల్లా బ్రతుకుతున్న మధ్యతరగతి మానవుల ఏడుపుగొట్టు మొహాలకి ప్రతీక సదానందం! ఇక, "శిశుహత్య" కథలో 'డబ్బు దగ్గిర నిక్కచ్చి' అయిన వడ్డీ వ్యాపారస్తురాలు కామాక్షమ్మ కథ విష్ణుమూర్తి లీలలకు తీసిపోయిందేమీ కాదు. ఆస్పత్రిలో చావు బ్రతుకులమీద వున్న మొగుడ్ని కాపాడుకోవడం కోసం డబ్బు కావలసివచ్చి తాకట్టు పెట్టడానికి ఏమీ లేని ఓ ఆడకూతురు వంటిమీద చీరను తాకట్టు పెట్టి కామాక్షమ్మ దగ్గిర అప్పు తీసుకున్న కథ జ్ఞాపకం వుందా? ఆ బీదరాలు అన్నమాట ప్రకారం వడ్డీ చెల్లించలేకపోతే, కామాక్షమ్మ దౌర్జన్యంగా ఆమె వంటిమీద చీరను లాగేసి, దిగంబరంగా ఆమెను గదిలోకి పడేసిపోతే, చచ్చేలా వున్న ఆమె మొగుడే ఆస్పత్రి నుంచి తిరిగి వచ్చి పెళ్ళాం మానాన్ని కాపాడుకోవలసి వచ్చింది కాదూ? కామాక్షమ్మ ఆడది కాబట్టి దుశ్శాసనుడు కాకపోవచ్చు, బీదరాలు మొగుడు

శ్రీకృష్ణపరమాత్ముడు కూడా కాకపోవచ్చు. కాని, ఈ విశాల భారతంలో ఇలాంటి ఋణభాగవతాల కథలు ఎన్నెన్నో!

ఈ 'భాగవతం' సంగతి సరేగాని, ఈ కథలో (శిశుహత్య) పెళ్ళాం అంటే భయపడి చచ్చే గుమాస్తా విఘ్నేశ్వరరావును– ఓ రాత్రివేళ పెళ్లాం కడుపులో పెరుగుతున్న శిశువు కేకేసి – విఘ్నేశ్వర్రావు ఆర్థికస్తోమతుకు సంబంధించిన వివరాలన్నీ అడిగి "ఆడపిల్లగా (బయటకు) వస్తే నువ్వు నాకు పెళ్ళి చెయ్యలేవు. ఎవడితోనో లేచిపోవాలి. వాడింకా చాలామందితో రకరకాలుగా లేచిపోయేటట్టు చేస్తాడు. చివరికి ఆత్మహత్య తప్ప మరో దారి వుండదు. పోనీ మగపిల్లాడుగా పుడదామా అంటే ఈ ఆడ సంతతినీ, నీ అప్పుల్నీ నా నెత్తిమీద రుద్ది నువ్వు పైకి తప్పుకుంటావు. అప్పుడు కూడా ఆత్మహత్య తప్ప ఇంకో దారి కనపడదు" అని, ఎలాగూ "ఆత్మహత్య' తప్పదు కాబట్టి 'ఎబార్షన్' రూపంలో బయటకు వచ్చెయ్యడాన్ని చదివినప్పుడు కలిగేది నవ్వా, ఏడుపా అంటే చెప్పడం కష్టం. అది కథలో జరిగింది 'శిశుహత్యా' లేక 'శిశు ఆత్మహత్యా' అని తేల్చి చెప్పడం వంటిదే అనుకుంటాను.

నగ్నముని కథల్లోని ఒక ప్రత్యేకత ప్రతీకలను విస్తృతంగా ఉపయోగించడం. కవితలోనయినా, కథలోనయినా రచయిత ప్రతీకలను ఉపయోగించినప్పుడు దాని కథాకమామీషూ తెలుసుకోనిదే అసలు కథకు తాళంచెవి దొరకదనేది అందరికీ తెలిసిన విషయమే! ఈ కథల్లో యంత్రాల 'స్పేర్ పార్ట్'లలాగా మనుషుల ముక్కులు, చెవులు, కాళ్ళు అమ్మే దుకాణాల గురించి చదివినప్పుడు ఇదేదో చిన్న పిల్లల కథలాగా వుందని విసుక్కుంటే 'అసలు కథ' తెలిసేదెలా? 'అసలు కథ' అంటే జ్ఞాపకం వచ్చింది. ఎర్నెస్ట్ హెమింగ్వే రచించిన ఓల్డ్ మాన్ అండ్ ది సీ' నవలలోని 'సింబాలిజమ్' గురించి ఎందరో సాహిత్య విమర్శకులు జుట్టు పీక్కొని సుదీర్ఘమైన విశ్లేషణలు చేస్తే చివరికొచ్చేసరికి హెమింగ్వే అంటారు కదా "ఈ నవలలో 'సింబాలిజమ్' అంటూ ఏదీ లేదు. ఇందులోని ముసలివాడు కేవలం ముసలివాడు మాత్రమే! అదే విధంగా కుర్రవాడు కుర్రవాడే! సముద్రం కేవలం సముద్రం మాత్రమే!" అని. (Bernard Berensonకు వ్రాసిన లేఖలో 'సెలెక్టెడ్ లెటర్స్'లో ప్రచురితం.) ఈ మాటలను హెమింగ్వే నిజంగానే అన్నాడా లేక వినయశీలాన్ని చాటుకోడానికి అన్నాడా అనేది వేరే విషయం అనుకోండి! ఇంతకూ చెప్పొచ్చేది ఏమిటంటే 'నగ్నముని' గారి విషయంలో ఇలాంటి 'ప్రమాదం' లేదనుకుంటాను. వీరి 'విలోమ కథలు' చదువుతున్నప్పుడు ఆ కథల 'తాళం చెవి' ఎక్కడ వుందో సులువుగానే అర్థం అవుతుంది. ('70లలో ప్రజాస్వామ్యానికి పట్టిన 'గ్రహణం' గురించి అవగాహన వుంటే).

'విలోమ కథల'లో భార్యల ముఖాలు మెడకి తగిలించుకుని ఆఫీసుకు వెళ్ళే భర్తలు,

జంతువుల ముఖాలను మెడకి బిగించుకున్న బస్సు ప్రయాణీకులు. కుడిచెయ్యి పారేసుకున్నవాళ్లు - పరిచయం అయినప్పుడు మొదటిలో ఇది ఆబ్సర్డ్ ఫిక్షన్‌కి సంబంధించిందేమో అనిపించవచ్చు. కానీ, నిజానికి ఇవి 'వళ్ళుమంట'తో రాసిన అధిక్షేపక రచనలు మాత్రమే! - విలోమ కథలలో నాకు "సిమెంటు సంతతి" కథ బాగా నచ్చింది. ఈ కథల్లో "చీకటి"ని ఇంతకన్నా తీవ్రంగా అధిక్షేపిస్తూ రాసిన కథలున్న మాట నిజమేగాని, ఈ కథలో కనబడే చీకటి మనిషి కథ అంత పురాతనమైనది అనిపించింది.

ఇందులో 'తాళంచెవి' వంటి ఫ్రాయిడియన్ సింబల్స్, సిమెంట్ వంటి పొలిటికల్ సింబల్స్, మాటకేమికాని, రాజకీయ జంతువులు బ్రతికి వున్నప్పుడే కాకుండా చచ్చి విగ్రహం అయిన తర్వాత కూడా ప్రమాదకరం అనడంలో చురుక్కుమనిపించే వ్యంగ్యం వుంది! అంతేకాదు కథ చివరిలో చెప్పిన 'సృష్టికి సిగ్గులేదు' అనేది కూడా ఆలోచించగలిగితే విలువయినదే! భావ ప్రేరణకుగల ప్రాతిపదికలలో పోలికలేదు కాని, చలం "ఓ పువ్వు పూసింది' కథకు నగ్నముని గారి 'సిమెంట్ సంతతి' ఒక ఆధునిక రూపం అనిపించింది. విరుద్ధమైన విషయాల మధ్యగల పోలికను చూడడం అంటే ఇదే అనుకుంటాను!

---

# 46

## మాలతీ చందూర్ - "డాబాయిల్లు"



"-పదిహేనేళ్ల వయస్సు వచ్చినప్పటి నుంచీ 'ఓడియన్' గేలరీ వద్ద నుండే పుస్తకాల దుకాణాల దగ్గిరే కాలక్షేపం చేసేవాడిని. మూడున్నర ఫ్రాంకులు పెట్టి "ముపాసా' పుస్తకాలు కొనాలంటే ఆ రోజుల్లో నా దగ్గిర డబ్బు వుండేది కాదు. అందుచేత నిలబడే గబగబా ఆ పుస్తకాలు చదివేవాడిని. అలా చదవడానికి సమయం చాలనప్పుడు - పుస్తకాల దగ్గిర వుండే వ్యక్తి చూడకుండా రహస్యంగా పేజీలు కత్తిరించి, పట్టుకెళ్ళి తీరికగా యింటి దగ్గిర చదువుకునే వాడిని-" అని అంటాడు ప్రఖ్యాత ఆంగ్ల కథా, నవలా, రచయిత సోమర్‌సెట్‌మామ్.

ఈ విషయాన్ని ఇప్పుడు వ్రాయడానికి కారణం సోమర్‌సెట్‌మామ్‌లా అందరూ పుస్తకాల్లో పేజీలు కత్తిరించాలని కాదు! - కథా రచయితల్లో ముపాసా ఒక్కడే అగ్రగణ్యుడని చెప్పడానికి కూడాకాదు. కలంపట్టి రచయితగా రాణించదలచుకున్న వ్యక్తి జీవితాన్ని చదవడం, అనుభవించడం, ఎంత అవసరమో మంచి పుస్తకాలను చదవడం పట్ల తపనను పెంపొందించుకోవడం కూడా అంతే అవసరమని మరోసారి జ్ఞాపకం చేసుకునేందుకే యిది వ్రాశాను.

తెలుగు సాహితీ సీమలో ఈ రెండు లక్షణాల్ని పుణికి పుచ్చుకున్న మంచి రచయిత్రులలో శ్రీమతి మాలతీ చందూర్ గారు ఒకరు.

మాలతీచందూర్‌గారి కథల్లో 'డాబా యిల్లు' కథ అంటే నాకు యిష్టం. ధనికులకు యిల్లు కొనడం, అమ్మేయడం, సాధారణమైన విషయాలుగానో - లేక లాభ నష్టాలకు సంబంధించిన విషయాలుగానో వుండవచ్చు. కాని - అల్ప ఆదాయ వర్గానికి, మధ్య తరగతికి, చెందిన వ్యక్తుల విషయంలో ఒక యింటికి స్వంతదారు అవడం అంటే అది జీవితంలో ఒక ముఖ్యమైన సంఘటన. అందుచేతనే వాళ్ల అనుబంధాలు, ఆశలు, బలంగా యింటి చుట్టూ పెనవేసుకుని వుంటాయి. - యిది సర్వసాధారణమైనది విషయమే! - ఒక దంపతుల యిట్లాంటి అనుబంధాల కథే 'డాబా యిల్లు' కథలో కనబడుతుంది. ఖైరతాబాద్

స్టేషన్‌లో దిగి, ఆలిండియా రేడియో స్టేషన్ రోడ్డమ్మట నడిచి, మూడో గల్లీకి తిరిగితే - యిప్పుడు 'ఆయా బర్సాత్ హే' గ్రామఫోను పాటా - బాలమ్మ, రాజయ్యలు, ఒకప్పటి దాబాయిల్లు మనకి కనబడకపోవచ్చు. ఆ పరిసరాల వాతావరణం పూర్తిగా మారిపోయి వుండవచ్చు. కాని - నగర జీవితాల్లో పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ నిర్దేశించే ఆర్థిక న్యాయంలో యిట్లాంటి రాజయ్యల కథలు, కలలు, కన్నీళ్లు, ఎన్నెన్నో... అయితే ఒకటి మాత్రం నిజం. కన్నీళ్ల కథ ఎప్పుడూ ఒక్కటే కావచ్చు గానీ - రాజయ్య, బాలమ్మల్లాంటి వ్యక్తులు మరొకరు వుంటారని తోచదు. 'దాబాయిల్లు' కథ గుర్తుంచుకోదగ్గ కథ కావడానికి బహుశా ఇది కూడా ఒక కారణం అనుకుంటాను.

- ఇంతకూ, అసలు కథ ఏమిటంటే - ఈ కథలోని రాజయ్య, బాలమ్మ ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు. బాలమ్మని పెళ్ళాడ్డానికి ముందు రాజయ్యకి పెళ్ళి అయ్యింది. పిల్లలు కూడా వున్నారు. బాలమ్మ కూడా వివాహితే!- కాని, తాపీ మేస్త్రీ రాజయ్యకీ, బాలమ్మకి మధ్య రొమాన్సు జరగడంతో - బాలమ్మ వంటిమీద వున్న పాతిక తులాల బంగారంతో రాజయ్యతో లేచి వచ్చింది. పెళ్ళి అయిన తర్వాతమ మానసికంగా వాళ్లేం సుఖించారో తెలియదు గాని - కాయకష్టంతో ఇద్దరూ పొట్టపోసుకుని రోజులు గడపాల్సి వచ్చింది. రాజయ్య తాపీపని చేసేవాడు. బాలమ్మ నాలుగిళ్లలో పాచిపని చేసుకుంటూనో, కూలీపని చేస్తూనో, పదో పరకో సంపాయిస్తూ వుండేది. కథయిలా నడుస్తూండగా - వాళ్లకి హైదరాబాద నగరంలో ఓ చిన్న ఇల్లు కట్టుకోవాలని కోరిక కలగడమూ - కూలీ డబ్బుల్లో మిగుల్చుకున్న దానితో ఓ ఇంటి స్థలం కొనడమూ జరిగిపోయాయి. ఆ తర్వాతే మొదలయింది అసలు కథ. ఇల్లు కట్టడానికి బాలమ్మ వంటిమీద వున్న నగలు, తమ రెక్కల కష్టం, పెట్టుబడిగా పెట్టారు. పగలంతా కూలీకోసం పనిచేసి, రాత్రిళ్లు విశ్రాంతి తీసుకోవలసిన సమయంలో, ఇంటికోసం రాళ్లుమోసీ, పునాదులు తవ్వీ, రాజయ్య దంపతులు పడినకష్టం శ్రమ జీవన సౌందర్యానికి ఉదాహరణ అయితే కావచ్చునేమో కాని, ఈ శ్రమ ఫలితంగా గోడలు సగం లేచేసరికి ఇబ్బందులు మొదలయ్యాయి! చేతిలో డబ్బు అయిపోయింది. ఇల్లు పూర్తి చేయడం కోసం ఇంటిని తాకట్టుగా పెట్టి అప్పు చేయాల్సి వచ్చింది. అలా ఆ ఇంటికథ తాకట్టుతో మొదలయింది.

సరే, కొన్నాళ్లకి యిల్లు తయారయింది గాని, ఇంటిమీద అప్పుమాత్రం పాపంలా పెరిగిపోయి భయపెట్టసాగింది. ఇంటిమీది బాకీని తీర్చడం తక్షణ కర్తవ్యం కాబట్టి ముచ్చటపడి కష్టించి కట్టుకున్న తమ దాబా ఇంటిలో నివసించే అదృష్టం వారికి పట్టలేదు.

ఇంటిని అద్దెకు ఇచ్చారు. తన ఇంటిలో రాజమ్మ అద్దెకున్నవాళ్ళ దగ్గర పాచి పనికి కుదిరింది. రాజయ్య యథా ప్రకారం మేస్త్రీపని, తోటపనీ చేస్తుండేవాడు. ఇలా కొన్నాళ్లు నడిస్తే – కష్టించి కట్టుకున్న డాబా ఇల్లు వాళ్ల స్వంతం అయివుండేదేమో గాని, ఇంతలో రాజయ్యకు ఏక్సిడెంట్ అయి ఆస్పత్రి పాలుకావడం, ఇంటిలో అద్దెకున్న వాళ్లకు బదిలీ అయి ఇల్లు కొన్నాళ్లుగా ఖాళీగా వుండడమూ, మొదలైన ఆర్థిక ఇబ్బందులు ఒకదాని తర్వాత ఒకటిగా పలకరించి – షావుకారు బాకీని చెల్లుగొట్టలేని పరిస్థితిని కల్పించాయి. తాకట్టు వాకట్టుచేసి ఇంటిని మింగడానికి సిద్ధంగా వున్న షావుకారు – బాకీకిగాను ఇంటిని జమకట్టేసుకున్నాడు! రాజయ్య దంపతులకు మిగిలింది షావుకారు 'దయదలచి' ఇచ్చిన పన్నెండు వందల రూపాయిలు! ఇన్నేళ్ళ రెక్కల కష్టానికీ, పెట్టుబడికీ, దక్కిన ప్రతిఫలం అదీ.

ఒక 'ఇంటివాళ్లం' కావాలనే కోరికతో అనాలోచితంగా రంగంలోకి దూకిన ఎంతోమంది మధ్యతరగతి గృహస్తుల బ్రతుకుల్లో ఇలాంటి కథలు సాధారణమే కావచ్చునేమోగాని, రాజయ్య విషయంలో ఆ తర్వాతే వుంది అసలు కథ. ఇంటిమీద మమకారం వదులుకోలేని రాజయ్య దంపతులు ఆ డాబా ఇంటిముందు వున్న ఒక పాకలో వుండేవారు. ఆ ఇంటి యోగక్షేమాలను ఇంటి యజమానికన్నా ఎక్కువగా పట్టించుకునేవారు. అద్దెకున్న వాళ్లు ఆ ఇంటి గోడమీద మేకు కొడితే వాళ్ల గుండెల్లో గునపాలు దిగబడేవి. ఇంటివాళ్లు ఇంటికి సున్నం వెయ్యదలిస్తే ఆ బేరం ఇంకొకళ్ళకి పోకుండా బయట వాళ్లకన్నా తక్కువకే ఒప్పుకుని, నిండు హృదయంతో – కన్న బిడ్డకు తల్లి స్నానం చేయిస్తున్నంతటి ఆనందంతో ఇంటికి సున్నం వేసేవాడు! ఆ ఇంటిలోనే రాజమ్మ పాచిపని చేస్తూ, ఇంటిని అద్దంలా శుభ్రంగా వుంచుతూ సంతృప్తిని పొందేది. సాధారణమైన దృష్టికి ఇదొక విచిత్రమైన విషయంలా అనిపించవచ్చు. కాని వాళ్ల దృష్టిలో అది మామూలు ఇల్లు కాదు. వాళ్లకలలకి, కష్టానికి ప్రతిరూపం. ఆ ఇంటి గోడల్లో వున్న ప్రతి యిటుకకూ వాళ్ల కష్టం తెలుసు. వాళ్ల వంటి చెమట విలువ తెలుసు. కాని ఆ విషయాన్ని చెప్పేందుకు వాటికి నోరులేదు. ఒకవేళ వున్నా, పెట్టుబడిదారీ న్యాయం చెమట విలువను లక్ష్యపెట్టదు. అయితేనేం – ఆ ఇంటి నీడను బ్రతికితేనే వాళ్లకు ఆనందం, సంతృప్తి. ఓ విధంగా చూస్తే, కేవలం 'సెంటిమెంటల్ స్టఫ్'లా కనబడే ఈ కథ గురించి కొంచెం నిశితంగా ఆలోచించినప్పుడు అంతర్లీనంగా సమకాలీన ఆర్థిక సమాజపు మూలాలు అన్నీ కనిపిస్తాయి. వీటిని చూపడం ఈ కథలో రచయిత్రి ఆశించిన ముఖ్య ప్రయోజనం కాకపోవచ్చును. అది వేరే విషయం.

ఇక, ఈ కథలోని బాలమ్మ, రాజయ్య ఇద్దరూ కూడా అంతకు పూర్వమే వివాహితులు. కేవలం సంప్రదాయాన్ని మాత్రమే గౌరవించే సమాజం వీళ్లిద్దరినీ భార్యాభర్తలుగా అంగీకరించకపోవచ్చు. కాని వాళ్లిద్దరూ భార్యాభర్తలు. (నగలన్నీ ఇంటిమీద తగలేశాదని ప్రతిరోజు బాలమ్మ రాజయ్యను తిట్టేటప్పటికీ, అతగాడు అప్పుడప్పుడూ ఆమెను గుద్దులతో సత్కరించేటప్పటికీ) అదే విధంగా చట్టప్రకారం ఆ దాబా ఇల్లు వాళ్లది కాకపోయినప్పటికీ, ఆ ఇంటికి యజమానులు వాళ్లే! కరెన్సీ నోట్లకు కాక, స్వేద బిందువులకు విలువ వుండే రోజు ఆవిష్కరించబడినప్పుడు, రేపటి ప్రపంచం బాలమ్మ, రాజయ్యల లాంటి వాళ్లకే అంకితమవుతుందనుకుంటాను. అప్పుడు దాబా ఇంటి యజమాని ఎవరయినా ఫర్వాలేదు.

---

## ఆదివిష్ణు - 'జాలికథ'



**మ**నిషి మనసు గుప్పెడు' అని అంటారు గానీ అందులో ఎన్ని కలలు, ఆశలు, నిరాశలు, కుత్సితపు ఆలోచనలు, కుతంత్రాలు వుంటాయో తలచుకుంటే ఆశ్చర్యంగా వుంటుంది. ఇంత మనస్సు ఇన్ని సముద్రాలను ఎలా దాచుకుందా అని! ఈ మనస్సు కథను మనో వైజ్ఞానిక శాస్త్ర సిద్ధాంత పరిచయంతోనో, చైతన్య స్రవంతి శిల్ప విశేషంతోనో, ఆవిష్కరించడం ఒక పద్ధతి అయితే ఈ బాదరబందీల జోలికి పోనవసరం లేకుండానే గుండె చప్పుడు వినబడేలా కథ చెప్పగలగడం మరొక సొగసు. ఈ సొగసులు, సోయగాలు, 'ఆదివిష్ణు' కథల పాఠకులకు సుపరిచితమే! (మధ్యమధ్యలో బ్రాకెట్లలో కనబడే మనిషిలోని మరో మనిషి సణుగుడుతో సహా!)

ఆదివిష్ణు కథలలో కుర్రకారు ప్రేమ పురాణం, మందు పురాణం. వున్నప్పటి గాని, అదొక్కటే ఆదివిష్ణు కథల లక్షణం అని నేననుకోను. వీరి కథల్లో గుండెలోయల్లో పేరుకుపోయి వున్న కుళ్ళు బుద్ధులు చేసే అలజడి, బ్రతుకు గుర్రప్పందెంలో ఘోరంగా ఓడిపోయిన బడుగు జీవులు చేసే ఆక్రందన, మనిషికి తనమీద తనకు వుండే సెల్ఫ్‌పిటీ, పాఠకులను చిత్రంగా పలుకరించినప్పుడు ఈ కథలకొక ప్రత్యేకత వుంది అనిపిస్తుంది. బహుశా ఈ కారణంచేతనే అనుకుంటాను. ఇతివృత్తాలు పాతవే అయినా, ఆదివిష్ణు కథలు నిలదొక్కుకోగలిగాయి.

ఆదివిష్ణుగారి కథల్లో "జాలికథ" అంటే నాకు చాలా ఇష్టం. ప్రపంచంలో మనుషులకు చేతనయిన పనుల్లో అతి సులువయినది- కష్టాల్లో వున్న మరో మనిషిని చూచి "సింపథీ" చూపించడం అనుకుంటాను. నీటిలో మునిగిపోతున్న మనిషిని చూచి గుండెలు బాదుకుని ఏడ్చేవాళ్ళు ఎక్కువ. నీట్లోకి దూకి రక్షించగలిగినవాళ్ళు ఎప్పుడూ తక్కువే! అయితే "జాలికథ" కథానాయకుడు నరసరాజుకి ఇలా బయటకు ఏడ్చే తెగువ లేదు. అందుకే ఇది నిఖార్సయిన "రియలిస్టిక్" జాలికథ అనిపించింది.

ఈ కథలోని ధనికుడయిన కాలేజి కుర్రాడు నరసరాజుకి చదువుకునే రోజుల్లో బోలెడంత జాలిగుండె వుండేది. సరే– ఈ జాలిగుండె కారణంగానూ, సీత అనబడే కాలేజీ విద్యార్థిని బొత్తిగా అందంగా వుండడం చేతనూ, నరసరాజు తన 'జాలి'ని సీతపై కేంద్రీకరించాడు. జీవితపు లెక్కలు చెయ్యడంరాని బీద బడి పంతులు కుమార్తె సీత, ఆ పాత పెంకుటింట్లో ఏ విధమైన ఆనందానికీ నోచుకోకుండా నిస్సారమైన జీవితం గడపడం నరసరాజుకు నచ్చేది కాదు. ఆమె ఒక లక్షాధికారికి భార్యయై లక్షణంగా జీవితం గడిపితే బాగుండునని అతడు కోరుకున్నాడు. అయితే, ఆ లక్షాధికారి తానే కావాలని మాత్రం అతడు కోరుకోలేదు. ఆత్మ విమర్శ చేసుకుని ఆ విషయాన్ని మరీ రూఢి చేసుకున్నాడు.

శ్రీమంతుడయిన వెంకట్రావు సీతతో చనువుగా తిరిగినప్పుడు, సీత కాలేజీ ఫీజు కట్టడానికి వెంకట్రావు పూనుకున్నప్పుడు, వాళ్లిద్దరికీ మధ్య ప్రేమ వ్యవహారం వంటిదేదో జరిగి అది ముదిరి పెళ్లి అయిపోతే బాగుండునని పగటి కలలు కన్నాడు! (అవును మరి– ఆ పగటి కలల్లో తానే 'హీరో' అయితే అది ఆర్థికంగా లాభసాటి విషయం కాదు కద!) కాని పెట్టుబడిలేకుండా నరసరాజు కన్నకలలు నిజంచెయ్యడానికి వెంకట్రావు తెలివి తక్కువ వాడేంకాదు.

ఆ తర్వాత కొంతకాలం గడిచిం తర్వాత సీత కులాంతర వివాహం చేసుకుందని విని, ఆ పెళ్లి చేసుకున్నవాడు ఖచ్చితంగా లక్షాధికారే అయి వుంటాడనుకున్నాడు. కాని, సీతను చూచి అతని జాలిగుండె ఘొల్లుమని ఏడవాల్సి వస్తుందని ఊహించలేకపోయాడు. నరసరాజు తండ్రి చేస్తున్న వ్యాపారాన్ని అందుకుని కాంట్రాక్టరుగా ఎదిగి, లక్షల్లోంచి మరిన్ని లక్షలకీ, కోట్లకీ పెరుగుతున్నప్పుడు బసవరాజు కంపెనీలో టైపిస్టుగా సీత అతనికి దర్శనమిచ్చింది. నాజూకయిన ఆమె చేతివేళ్లు, అందమైన ఆమె చేతివేళ్లు, ఆ డొక్కుటైపు మిషన్ దగ్గర బండబారి పోతున్నాయన్న భావన అతనిలో ఎంతో బాధ కలిగించిది. "– సీతగారూ మీరీ ఉద్యోగం చెయ్యడం నాకిష్టం లేదు. మీరు మల్లెపువ్వులా బ్రతకాలి" అని చెబుదామనుకున్నాడు గానీ, ఎప్పటిలాగే ఏమీ చెప్పలేకపోయాడు. ఆ తర్వాత, తన ఎదుటనే బసవరాజు కంపెనీ మేనేజర్ శర్మ సక్రమంగా పనిచెయ్యనందుకు సీతను మందలిస్తూ వుంటే అతని హృదయం కోపంతో కుతకుతలాడిపోయింది. అంతేకాదు, సీత దగ్గిర డబ్బు గుంజాలని చూచే ఆమె భర్తను చూచినప్పుడు అతనికి వాడిని తన్నాలనిపించింది! "నువ్వు క్లాస్‌వన్ రోగ్‌వి – అందమైన సీతని అన్యాయం చేసిన రాస్కెల్ – వెళ్లిపో ఇక్కడ్నించి" అని అతగాడిని తిట్టి, సీతతో "రండి సీతగారూ – నాతో వచ్చేయండి నరసరాజు అండ్ బ్రదర్స్‌కి

మీరివాళనించి పెర్సనల్ సెక్రటరీ – మీ జీతం వెయ్యి రూపాయిలు. ఫ్రీ క్వార్టర్స్, నా కారుమీకిచ్చేస్తాను" అని చెబుదామనకున్నాడు గానీ, ఎప్పటిలాగే ఇప్పుడూ చెప్పలేదు!–

అవును మరి, లక్షలకొద్దీ ఆస్తిపరుడయిన తనకు కొన్ని కట్టుబాట్లున్నాయి, నియమాలున్నాయి. వాటిని ఉల్లంఘించడానికి వీలులేదు. గుండెచేసే గోల వినబడకుండా చెవులు మూసుకోవడమే సరి అయిన పని! ఈ కథలోని నరసరాజు వెంకట్రావు అన్నట్లు ఒక "బ్యూటిఫుల్ రోగ్"! సీతపట్ల తనకున్న జాలిని వ్యక్తం చెయ్యడానికి అతగాడికి ధైర్యం ఎలాలేదో, కనీసం అంతరాత్మ దగ్గిరయినా సీతని ప్రేమించానని ఒప్పుకోవడానికి కావలసిన తెగువ లేదు. అంతరాత్మ అనేది వుంటే దానిని కూడా మోసపుచ్చగల మనుషులుంటారని చెప్పడానికి నరసరాజు ఒక తార్కాణం. నరసరాజు సీతపట్ల చూపించాననుకుంటున్న "జాలి" అతనిలోని కామభావనలకు "సబ్‌స్టిట్యూట్ గ్రాటిఫికేషన్" అని చెప్పక తప్పదు. ప్రేమించిన ప్రియుడు ఇంకొకరి అమ్మాయికి మొగుడయితే అతడి పిల్లల్ని ముద్దులాడి "లిబిడో"ను సంతృప్తి పరుచుకునే ప్రియురాలికీ– నరసరాజు చూపించే జాలికీ పెద్ద తేడా ఏమీ లేదు!

ఇది సరేగాని – కానీ ఖర్చులేకుండా "లిప్‌సింపతీ" చూపించే మనుషులు ఈ "నరసరాజు వ్యవస్థ"లో తప్పనిసరి అనుకుంటాను. బలిసిన పిల్లి ఎలకని నోట్లో పెట్టుకున్నకుని కరకర నములుతున్నప్పుడు ఆ దృశ్యాన్ని చూచి ఆనందిస్తూనే, ఆనందించడం లేదనే ఆత్మ వంచన చేసుకుని జాలి కురిపించే కరుణామయులకు ఈ దేశంలో కొదవలేదు! ఈ కథలోని నరసరాజు కూడా ఆ కోవకు చెందినవాడే! అయితే ఈ కథను రచయిత ప్రేమ కథ చట్రంలో అందంగా యిమడ్చడం వల్ల – కథ కాలక్షేపపు పరిధిని దాటి కొంత ఎత్తుకు ఎదగ గలిగింది. "జాలికథ" నాకు నచ్చింది ఇందుకే!

---

# 48

## డి. కామేశ్వరి-'మహా ఇల్లాలు'

**"ఈ** దేశంలో ఈనాటికీ ఆడదాని కథ మారలేదన్నది స్పష్టపడిపోయింది. ఆడదాని అభ్యుదయం, పురోగమనం, అంతా కాగితాలలో తప్ప, కార్యాచరణలో శూన్యం. ఈ నవ సమాజంలో ఎంత చదివినా, ఎన్ని వూళ్లేలినా, స్త్రీకి ఇప్పటికీ రక్షణ లేదు. స్త్రీల ప్రగతి అంతా వేషభాషలలో తప్ప, వ్యక్తిత్వంలో మార్పు లేదు. ఎంత సంపాయించినా పురుషుడితో సమానస్థాయికి చేరడం అన్నది ఇప్పటికీ గగన కుసుమంలాగే మిగిలింది."

– డి. కామేశ్వరిగారి "మారని కథ"లోని సీత అనే పాత్ర ఆవేదన ఇది! నిజానికి ఈ ఆవేదన కలం పట్టిన రచయిత్రుల రచనలన్నింటిలోనూ కొద్దో గొప్పో కనబడుతూనే వుంటుంది. వాస్తవికతను రచనల్లో అద్దం పట్టడాన్ని గురించి విశ్లేషిస్తూ, 'రెయిమాండ్ విలియమ్స్' అనే విమర్శకుడు – సోషల్ రియలిజమ్, పెర్సనల్ రియలిజమ్ అంటూ పెద్ద పట్టికనే తయారుచేశాడు. కానీ, రచయిత్రుల కథల్లోని 'రియలిజమ్'కు డొమెస్టిక్ రియలిజమ్ అనేదే, సరియైన మాట! (ఎలైన్ షోవాల్టర్ – 'ఎ లిటరేచర్ ఆఫ్ దెయిర్ ఓన్' అనే గ్రంథంలో వివరించినట్లుగా) మన ఆలోచనల్లో విప్లవాత్మకమైన మార్పులు రావడానికి అంకురార్పణ చేసిన ప్రముఖుల్లో ముఖ్యుడుగా పేర్కొనదగిన డార్విన్‌లాంటి వాడు సైతం ఆడవాళ్లను చిన్నచూపు చూసి 'చైల్డ్‌హుడ్ ఆఫ్ ది రేస్' అని అన్నప్పుడు రచయిత్రులు తమ రచనల్లో మొగవాళ్ళ మీద విరుచుకుపడ్డారనడంలో ఆశ్చర్యం ఏముంది?

ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే-సీత అనే అమ్మాయి తిరుగుబాటు ధోరణిని అర్థం చేసుకోడానికి- మనిషికి మనిషి పట్ల వుండే సానుభూతి మాత్రమే కాక, ఆత్మ విమర్శనా శక్తికూడా అవసరం అనుకుంటాను. ఎదలో ఇలాంటి ఆవేదనే కలుగుతుంది 'చీకటి' కథ చదివినప్పుడు కూడా! ఈ కథలోని చిన్నిగాడి తల్లి భర్త నిరాదరణకు గురై-అతగాడు ప్రసాదించిన దారిద్ర్యాన్నీ, చావుదెబ్బల్నీ, జీవితంలో భాగంగా చేసుకుని కొన్నాళ్లు బ్రతికింది. ఆ తర్వాత మరొకడితో లేచిపోయి సుఖంగా బ్రతకవచ్చు ననుకుంది. కాని, విధి వక్రీకరించడంతో శరీరాన్ని అమ్ముకుని బ్రతకడమే శరణ్యం అయ్యింది. ఇది ఎందరో

అభాగినుల విషయంలో మనం తరచూ వింటుండే కథ గాని; చీకటి అంటే భయపడే చిన్నిగాడు గుడ్డిదీపపు వెలుగులో తడకల గదిలో తల్లి చేసే దయనీయమైన శృంగార వ్యాపారాన్ని చూడవలసి వస్తుందేమోనన్న బాధతో, భయంతో చీకటినే కోరుకోవడంలోను, చివర ఆ చీకటే వాడి బ్రతుకయి పోవడంలోను ఈ దేశపు 'చీకటి' కథ వుంది!

కామేశ్వరి గారి కథల్లో స్త్రీల సమస్యలు తరచూ పలకరించే మాట నిజమేగాని – వైవిధ్యంగల అనేక తరహాల ఇతివృత్తాలతో కూడా ఆమె కలలు రాశారు. "మన హృదయాలు ఎండిపోయి బీటలువారిన నేల లాంటివి. ఎప్పుడో రెండు చినుకులు పడతాయి. కాని, ఏం లాభం? వాన వెలుస్తుంది. ఎండ కాస్తుంది–" అంటూ బార్‌లో మందు కొడుతూ వెయిటర్‌తో తన 'ప్రేమ గోల' చెప్పుకునే భగ్న ప్రేమికుడి కథ చెప్పినా ('వాన చినుకులు' కథలో), 'మల్కనగిరి' ఫారెస్టులో మూడు లక్షలు రూపాయిల కాంట్రాక్ట్ సంపాయించడం కోసం – పులికి మేకపోతును 'ఎర' వేసినట్టుగా – షికారీకి వచ్చిన ఫారెస్టు కన్సర్వేటర్‌కి అందమైన అమ్మాయిని ఎరవేసి 'వేటాడిన' ఫారెస్ట్ కాంట్రాక్టరు కథను రాసినా ('వేట' కథలో), మిలిటరీలో పెద్ద ఉద్యోగాలు వెలిగిస్తూ హై సొసైటీ బ్రతుకులు బ్రతుకుతున్నామనుకున్న జీవితాల్లోని 'వంకర గీత'ల్ని మనముందుంచినా ఈమె కథలు మొదటి నుంచి చివరివరకు హాయిగా చదివింపజేస్తాయి!–

దూర్వాసుల కామేశ్వరిగారి కథల్లో "మహా ఇల్లాలు" కథ బాగుందనిపించింది. ఈ కథలోని అలివేలు దినచర్యలలో ఒకటి మొగుడిచేత దెబ్బలు తినడం! మరి అతగాడు అలివేలును ఎందుకు కొడతాడు? రచయిత్రి చెప్పే సమాధానం "మొగుడు కనుక!" ఈ కథలో వెంకట్రావు అనబడే అలివేలు మొగుడు గడ్డానికి వేడినీళ్ళు చాలకపోయినా, కూరలో ఉప్పు తక్కువయినా, ఏదో కారణానికి భార్యను రోజూ కొట్టేవాడు గాని, అందుకు అసలు కారణం లేదు. అతగాడికి (చేసేది గుమాస్తా ఉద్యోగం అయినా) తనమీద తనకు చాలా గొప్ప అభిప్రాయం వుంది. తనలాంటి వ్యక్తికి అలివేలులాంటి మొద్దు భార్యగా తగదని అతని ఉద్దేశం! ఇలాంటి వెంకట్రావుగారు పనిచేస్తున్న ఆఫీసులోకి 'గీత' అనబడే అందాలరాశి ఒక పెద్ద ఆఫీసరుగారి అమ్మాయి. సరదాగా ఉద్యోగం చెయ్యడానికి వచ్చింది. వెంకట్రావుతో సహా అందరి 'మగ' కళ్ళూ ఆ అమ్మాయిపైనే! ఇందులో వెంకట్రావు కాస్త అఖండుడు కాబట్టి, వీళ్ళిద్దరికీ పరిచయం, ఆ పైన స్నేహం ఎక్కువగానే వుండేవి. ఇక ఆ అమ్మాయి ఇంటికి వెళ్లడాలు, కాఫీలు సేవించడాలు సరేసరి! ఇంతలోనే వెంకట్రావు భార్య అలివేలు గీతకు పరిచయం అయింది. ఆ తర్వాత కొద్ది కాలానికి పెళ్ళాన్ని చితగ్గొటమటడమనే 'హాబీ' వెంకట్రావుకు వున్నసంగతి కూడా తెలిసింది. ఏ విధమైన ప్రేమకు, లాలనకు

నోచుకోకుండా, యాంత్రికంగా ప్రతి ఏడూ పిల్లల్ని కంటూ పాతికేళ్ళ వయస్సు వచ్చేసరికి వెంకట్రావు ధర్మమా అని నలభై ఏళ్ళు వచ్చినట్టుగా అయిపోయిన అలివేలు కథను విన్న తర్వాత అతగాడికి తగిన గుణపాఠం నేర్పాలనుకుంది గీత!

ఇందుచేతనే ఆమె వెంకట్రావుతో తన స్నేహాన్ని మరికొంత ముదరనిచ్చింది. సినిమాలకు, షికార్లకు, జోరు ఎక్కువ కానిచ్చింది. ఇంతవరకు వచ్చిన తర్వాత ఇక ఆపుకోలేక వెంకట్రావు ఆమెతో శారీరకమైన పొందుకోసం తాపత్రయపడ్డాడు. అంతేకాదు మొద్దు మహంలా వుండే అలివేలుతో తనకు ఏ విధమైన సుఖమూ లేదని, దానికి విడాకులు ఇచ్చి గీతను రెండో పెళ్ళి చేసుకుంటానన్నాడు. అంతగా విడాకులు ఇవ్వడం కుదరకపోతే అలివేలును ఇంట్లో చాకిరీకి వుంచుకోవచ్చు నన్నాడు. అదిగో అప్పుడు గీత ఆఫీసులో నలుగురినీ పిలిచి వెంకట్రావుకి మొహం వాచేలా చీవాట్లు పెట్టింది! "ఏడాదికి ఒక పిల్లని కని తన పెళ్ళాం తోలులా తయారవడానికి తనే కారణం అని ఈ ప్రబుద్ధుడికి అర్థం కాదు. ఈయన గారికొచ్చే ముష్టి మూడొందల జీతంలో ఆ ఇల్లాలు చీని చీనాంబరాలతో ఈయనగారితో బాటు షోగ్గా తయారయి ఎలా కుర్చీలో కూర్చోగలదో ఆలోచించడు" అంటూ అలివేలు తరపున వకాల్తా పుచ్చుకుని వెంకట్రావుని కడిగి పారేసింది. అప్పట్నుంచీ వెంకట్రావుకు బుద్ధి వచ్చి భార్యను ప్రేమగా చూడ్డం ప్రారంభించాడు. ఆమెను సినిమాకు తీసికెళ్ళాడు కూడాను!

ఇదంతా చదివి ఇదేదో నీతికథలా వుంది. ఇందులో క్రొత్తదనం ఏముంది అనవచ్చు. అంతేకాదు. గీతాదేవిలాంటి వాళ్ళు వున్నా, వుండకపోయినా అలివేలు లాంటి దురదృష్టవంతురాళ్ళు ఎందరో వున్నారని, ఇదంతా తెలిసిన కథే అని కూడా మీరనవచ్చు. నేను కూడా ఈ విషయంలో మీతో ఏకీభవిస్తాను గానీ, ఈ కథను 'హైలైట్' చెయ్యడానికి కారణం ఇంతవరకు చెప్పిన ఇతివృత్తం కాదు. ఆ తర్వాత ఉన్న ఓ చిన్న ఉదంతం!

వెంకట్రావులో మార్పు వచ్చినందుకు అలివేలు సంతోషించిది గానీ ఆ మార్పుకు గీత కారణం అని ఆమెకు కొద్దిరోజులదాకా తెలియలేదు. తెలిసిన వెంటనే వరలక్ష్మీ వ్రతం సాకుతో గీతను ఇంటికి పిలిచి, ఒక రవికెల గుడ్డ పెట్టి - కృతజ్ఞతను తెలియజెయ్యాలనుకుంది. పిల్లల చాక్లెట్ల కోసం దాచిన డబ్బుతో కొన్న రవికెల గుడ్డను గీతకు ఇస్తూ అలివేలు అంది కదా-

"నా మొహం చూసి చెయ్యకుండా వదిలిపెట్టానన్నారే, అదికూడా చేస్తే ఇంకా సంతోషించి వుండేదాన్ని" అని! ఆ రోజున గీత వెంకట్రావుని కడిగి పారేస్తూ చెంపదెబ్బ కొట్టకుండా వదిలిపెట్టడానికి కారణం అలివేలు అని అనడాన్ని జ్ఞాపకం చేస్తోందామె!

అలివేలు లాంటి పతివ్రత (పతివ్రత అనగా భర్తచేత దెబ్బలు తినునది అని కదా అర్థం!) అందులో వరలక్ష్మీ వ్రతం చేసుకున్న తర్వాత– ఇలా అనడం గీతకు సహజంగానే ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆ మాటే అడిగితే "ఏదో ఒక మొగుడంటూ చల్లగా వుండకపోతే ఆడది బ్రతకలేదు కదా మన దేశంలో. అలాంటప్పుడు ఆ మొగుడికోసం ఈ వ్రతాలు గట్రా చెయ్యకపోతే ఎలా చెప్పు" అంటుంది అలివేలు!

ఈ దేశంలో సగటున భార్యాభర్తల మధ్యగల సంబంధపు నిజస్వరూపాన్ని చెబుతున్నాయి ఈ వాక్యాలు. భార్యను పోషించే యజమానిగా భర్త, అతడికీ, అతడి పిల్లలకీ జీతం భత్యం లేకుండా చాకిరీ చేసే నౌకరులాగా భార్య, వున్నంతకాలం వారిద్దరి మధ్యా సంబంధం పడక గదిని దాటి ఎత్తుకు ఎదగదు. సగటున చాలా ఇళ్ళు "కొంప"లుగా మారడానికి కారణం ఇదే! అట్లాంటి 'కొంప'లో ఎన్నాళ్ళు కాపురం చేసినా, ఎంతమంది పిల్లల్ని కన్నా, ఇల్లాళ్ళు 'అర్థాంగి' అనిపించుకోలేదు (ఉద్యోగం చేసి తాము కూడా జీతం రాళ్ళు తెస్తున్నా సరే). కామేశ్వరిగారి 'మహా ఇల్లాలు' ఆవేదన నన్ను ఆకట్టుకున్నది అందుకే!!!

---

# 49

## కవనశర్మ - అమెరికా మజిలీ కథలు



**కం**దుల వరాహ నరసింహ శర్మ (కవన శర్మ) గారి పేరు చెప్పేసరికి ఆధునిక భారతదేశంలో వైజ్ఞానిక శాస్త్ర పరిశోధన కథా, కమామీషూ - శాస్త్రజ్ఞుల సెమినార్లు, గిమినార్లు - వగైరా వగైరా ఎన్నెన్నో వింతలూ, విశేషాలూ, గిలిగింతలు పెట్టేలా కథల రూపంలో అందిచ్చిన కథకుడు జ్ఞాపకానికి వస్తారు. కాదేదీ కవిత కనర్హం అన్నట్టుగా - హాస్యం పండించగల నేర్పు వుండాలి కాని ఎలాంటి ఇతివృత్తంతో నయినా నవ్వులు కురిపించవచ్చు, అనిపిస్తుంది శర్మగారి కథలు చదివినప్పుడు.

"-తనవారికిచ్చుకునే ప్రతీ ఉద్యోగం వెనకాల మనవాళ్ళు నడిపే పెద్ద కథా, కమామీషూ వుంటాయి. టెస్ట్‌మ్యాచ్‌కి ముందు 'పిచ్'ని చదును చేసినంత పకడ్బందీగా నేల చదునుచేయవలసి వుంటుంది-" అంటూ శర్మగారు "వడ్డించే మనవాళ్ళ" కథలు చెప్పినా- మన దేశంలో వుండి పరిశోధన చేద్దామనే తపన వున్నవాడిని కూడా తమ స్వార్థాలతో, కుళ్ళు రాజకీయాలతో ఈ దేశం నుంచి మరో దేశానికి తన్ని తగిలెయ్యగల విశ్వవిద్యాలయ ఆచార్యుల విచిత్ర గాథలు వినిపించినా - మనం నవ్వుకుంటాం. ఒక మంచి హాస్య, వ్యంగ్య రచన సాధించగల ప్రయోజనం యింతకంటే వుండదనుకుంటాను. "-ఏ 'లాబ్' చరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం? - శాస్త్రజ్ఞుల చరిత్ర సమస్తం పరదూషణ పరాయణత్వం. పారసైటులు రిసెర్చి గైడులై చరిత్రమున ప్రసిద్ధికెక్కిరి - "ప్రొఫెసరచ్చేసిన పేపరు కాదోయ్" దాన్ని వ్రాసిన విద్యార్థెవ్వడు?" - అనడానికి ఇది శ్రీశ్రీ కవితకు 'పేరడీ' అగుగాక! - కాని దీని వెనుక దశాబ్దాల తరబడిగా వున్న రేపటి తరపు మేధావుల ఆవేదన వున్నది. మన దేశంలో పరిశోధనగా ప్రమాణాల స్థాయి ఆశించిన రీతిలో ఎదగకపోడానికి, మేధావులు ఇతర దేశాలకు వలసపోడానికి సంబంధించిన మూల కారణాల కథ వున్నది. ఈ కథలను శర్మగారు రాసి దశాబ్దాలు గడిచినప్పటికీ అవి పాతబడిపోయాయనిపించదు. అంతేకాదు - కథా శిల్పపరంగా ఆలోచిస్తే వీటిని కథలనడానికి అవకాశం వుంటుందా, వుండదా అనే విషయాన్ని గురించి కూడా

ఆలోచించాలనిపించదు. కథల వెనుకగల శక్తివంతమైన భావం పాఠకులను కదిలించడం అంటే యిదే అనుకుంటాను.

డాక్టర్ యల్లాప్రగడ సుబ్బారావు, హరగోవింద ఖొరానా, ఎస్. చంద్రశేఖర్ వంటి శాస్త్రజ్ఞుల గురించి ఈ సందర్భంలో ప్రస్తావించాలనిపిస్తున్నది. వీరు భారతదేశంలో జన్మించారని మనం గర్వంగా చెప్పుకునేటప్పటికీ - అలా గర్వపడే అర్హత మనకు లేదనేది నిర్వివాదాంశం. వీళ్ళందరూ విదేశాలలో ఉన్నత విద్యను అభ్యసించి, స్వదేశానికి తిరిగి వచ్చి - మన దేశంలో పరిశోధనా కార్యక్రమాన్ని కొనసాగించాలని తపన చెందినప్పటికీ వారి పరిశోధనకు కావలసిన సదుపాయాలను కాని, కనీసం వారి ప్రతిభకు తగిన గుర్తింపును కాని మన దేశం ఇవ్వలేకపోయింది. స్వరాజ్యం వచ్చి దేశంలో ఎన్నో లేబరేటరీలను స్థాపించిన తర్వాత కూడా - కేంబ్రిడ్జి విశ్వ విద్యాలయం నుంచి తిరిగి వచ్చిన డాక్టర్ ఖొరానాను మన దేశంలో ఏ రీసెర్చి లేబొరేటరీ అయినా ప్రతిభను గుర్తించి గౌరవించగలిగిందా? చివరకు అమెరికాకు వలస పోవడమే శరణ్యం అయ్యింది కాదూ? మరి, ఇలాంటి స్థితిలో విదేశాలకు చేరుకున్న ఈ మేధావులు నోబెల్ బహుమతి వంటి అంతర్జాతీయ సత్కారాలు అందుకున్నప్పుడు 'వీళ్ళు మనవాళ్ళేనర్రోయ్' మనం రొమ్ములు చరుచుకున్నా, స్వదేశానికి వారు తిరిగి రాలేదని వాళ్ళపై నెపం మోపినా, అంతకు మించిన ఆత్మవంచన మరొకటి వుంటుందనుకోను. ఇది రాస్తుంటే నాకు డాక్టర్ చంద్రశేఖర్ ఆ మధ్యవెలిబుచ్చిన అభిప్రాయం జ్ఞాపకం వస్తోంది. "-యువ శాస్త్రజ్ఞుల విషయంలో పెద్ద శాస్త్రజ్ఞులు చూపించే అలసత్వం, అధికార రంగంలో వున్నవారు ప్రతిభను గుర్తించడానికి వీల్లేకుండా చేసే జటిలమైన బ్యూరోక్రాటిక్ నిబంధనలు, మన దేశంలోని మేధావులు ఇతర దేశాలకు వలసపోయేలా చేస్తున్నాయి-" అంటూ ఆయన మరొక మాట కూడా అన్నారు. "-అమెరికాలో వైజ్ఞానిక శాస్త్ర ప్రగతికి కారణం - విద్యారంగానికి సంబంధించిన విషయాలలో బ్యూరోక్రసీకి ప్రాధాన్యత లేకుండా వుండడం. వయస్సు, హోదా ఇలాంటివాటితో నిమిత్తం లేకుండా ప్రతిభ ఎక్కడ వున్నా గుర్తించగలగడం" అని! ఈ స్థాయికి మనం ఎదగనంతకాలం "దేశభక్తి" గురించి చేసే ఊకదంపు ఉపన్యాసాల వల్ల ప్రయోజనం వుండదు. శర్మగారి కథలు ఈ విషయాన్నే మరోమారు జ్ఞాపకచేస్తాయి.

అమెరికా మజిలీ కథల కథానాయకుడు గోపన్న మాతృభూమిపట్ల అపారమైన ప్రేమ వున్నవాడు. ఇలా ఎందుకు వ్రాయవలసి వచ్చిందంటే - అతడికి పిల్లనిచ్చిన మామ (మరియు మేనమామ) సిద్ధయ్య అల్లుణ్ణి అమెరికా పంపించాలని ముచ్చటపడితే (అవును మరి - పక్కింటి సుబ్బయ్య మాటి మాటికీ "మా అల్లుడు ఫారన్ వెళ్ళినప్పుడు-" అంటూ

గొప్పలు చెప్పుకుంటూ వుంటే, వంద ఎకరాల మాగాణీకి భూస్వామి, పంచాయితీలో పలుకుబడి వున్నవాడు అయిన సిద్ధయ్యకి పౌరుషం పొదుచుకురాదూ?) మామగారి కోరికను కాదని గోపన్న రీసెర్చి చెయ్యడానికి ఇండియన్ యూనివర్శిటీల చుట్టూ ప్రదక్షిణ చేశాడు కాదూ? ఈ యూనివర్శిటీ మజిలీలలో ఒక్కొక్క యూనివర్శిటీలోని ప్రొఫెసర్లదీ ఒక్కొక్క కథ. రీసెర్చి పేరుతో జరుగుతున్న కార్యక్రమం ఒక్కొక్క చోట ఒక్కొక్క విధము.. స్థూలంగా చూచినప్పుడు వాటి మధ్య తేడాలు కనబడేటప్పటికీ - "డైరెక్టర్లు, రిజిస్ట్రారులు, మినిస్టర్లు అందరు కట్టిరి రీసెర్చికి సజీవ సమాధి" అనేది చివరకు వినబడే చేదు నిజం!

ఈ కథలలోని విద్యార్థుల రీసెర్చి పేపర్లని తమ పేరుతో అచ్చువేసుకునే ప్రొఫెసర్ నవనీత 'చోర్' - పరిశోధనా ఫలితాలను ప్రయోగ ప్రమాణంతో కాకుండా "ఇంట్యూషన్"తో ఊహించి చెప్పి జూనియర్ జూల్స్‌వెర్న్ లాగానో, హెచ్.జి.వెల్స్ లాగానో భావించుకుంటూ తన తెలివితేటలకి తానే మురిసిపోయే ప్రొఫెసర్ మేఘనాథ్ లాంటి వాళ్ళు, అచ్చం అదే రూపంలో కాకపోయినా కనీసం కొద్దిపాటి "అంశ"తోనయినా పలు సందర్భాలలో పరిశోధనా శాలలలో కనబడుతూ వుండవచ్చు. అన్నట్టు - ఈ కథలను చదివిన పాఠకులకు "అచ్చువేయుము లేదా చచ్చుము' (పబ్లిష్ ఆర్ పెరిష్) కథలోని వ్యాస్‌గారి 'పేపరు మిల్లు' కథ జ్ఞాపకం వుందనుకుంటాను. వ్రాయవలసిన అంశం వున్నప్పుడు కాకుండా రీసెర్చి పేపర్ల లెక్క కోసం వాటిని పబ్లిష్ చేయవలసి వచ్చినప్పుడు ఇలాంటి అవస్థ తప్పదనుకుంటాను! (విశాఖపట్నం కూరల మార్కెట్‌లో పెద్ద దొండకాయలు, చిన్న దొండకాయలు, కలిపి దొండకాయల లెక్క చెప్పేటట్టుగా రీసెర్చి పేపర్ల లెక్కతేల్చే సంగతి వేరు- 'ఈక్వివలెంట్ పేపర్ల' కథలో-)

ఇంతకూ అసలు విషయం ఏమిటంటే - "అచ్చు వేయుము లేదా చచ్చుము" కథలోని వ్యాస్ నిమ్మరసం, వేపాకురసం, పెద్ద రసాల రసం, క్రోసూరు రసం మొదలయిన రసాలలో కాంతికిరణం ప్రసారం గురించి పరిశోధన చేసి - ఒక్క పరిశోధనా పత్రానికి సరిపడే విషయాన్ని ఏడు పరిశోధనా పత్రాలుగా తెగ్గొట్టి పరిశోధనా పత్రాల తూకాన్ని పెంచిన ఉదంతంలోనూ, రిసెర్చి పేపర్ల 'మిల్లు' నడిపిన వ్యవహారంలోనూ, అతిశయోక్తి కొంత వున్నప్పటికీ - అది బొత్తిగా 'హ్యూమరసం' అని కొట్టి పారేసేందుకు వీలులేదు. పరిశోధనా పత్రాలలోని విలువ కాకుండా వాటి సంఖ్య మాత్రమే ప్రధానం అయినప్పుడు ఇలాంటి 'పేపరు మిల్లు'లు తప్పవు!

ఇక- పరిశోధన పత్రం అచ్చయినది దేశవాళీ జర్నల్స్‌లోనా, లేక ఫారన్ జర్నల్స్‌లోనా అనే "ఆలోచన" సంగతి సరేసరి. అందుకే కాదూ ఒక అమెరికన్ జర్నల్‌లో ప్రచురించబడిన

ఒక కిలో బరువుగల పరిశోధనా పత్రాలు, దేశవాళీ జర్నల్స్‌లో ప్రచురించబడ్డ పదిహేను కిలోల బరువుగల రీసెర్చి పేపర్లతో సమానం అనే 'మారకం రేటు' ఏర్పరచుకున్నదీ! (ఈ 'మారకం రేటు' ఒక్కొక్క దేశపు జర్నల్స్ విషయంలో ఒక్కొక్క విధముగా వుందునని గమనించుడు) ఇలాంటి మారకం రేటు నిజంగా వుంటుందా అంటే – ఉండకపోవచ్చు. కాని, మన ఆలోచనా సరళి మాత్రం ఇందుకు సన్నిహితంగానే వుంటుంది.

ఇలాంటి పరిస్థితులలో ఒకవేపు నుంచి నవనీతచోర్‌లాంటి చోర ప్రవృత్తిగల ఆచార్యులు రీసెర్చి స్కాలర్లను జలగల్లా పీడిస్తూ వుంటే, మరోవేపు నుంచి విదేశాలలో ఎందుకూ పనికిరాని యూనివర్సిటీ నుంచి ఎందుకూ కొరగాని పి. హెచ్‌డి. తెచ్చుకున్న మూధేశ్వర్ లాంటివాళ్ళు మేధావులుగా గుర్తించబడి అధికారాలలో వున్న వాళ్ళ ఆశీర్వచన ఫలితంగా ఉన్నత ఉద్యోగాలు అలంకరిస్తూ వుంటే – ఎవరికి మాత్రం రెక్కలు కట్టుకుని విదేశాలకు ఎగిరిపోదామని అనిపించదు? – అందుకే కాదూ – బుద్ధిమంతుడయిన గోపన్నలాంటి స్వదేశాభిమాని కూడా బ్రతికుంటే బలుసాకు తినవచ్చునని అమెరికాకు వెళ్ళిపోయిందీ!

శర్మగారి కథలలోని గోపన్నకి సిద్దయ్య లాంటి మోతుబరి మామ వున్నాడు కాబట్టి అతగాడు అమెరికాకు పారిపోగలిగాడు. అలా కానప్పుడు – పనికిరాని ఇండియన్ పి. హెచ్.డి. మీద వెగటు పుట్టి పూర్ రామనాథంలా డాక్టరేట్ పట్టాతో సిగరెట్ వెలిగించుకోవడమే మిగులుతుంది! ఇక పనికిరాని అలాంటి పట్టా కూడా లభించక ప్రొఫెసర్ల ధర్మమా అని శరవేగంతో వెనక్కి తిరిగివస్తున్న థీసిస్‌లను మోసుకుంటూ తిరిగే 'గజనీ' లాంటి వాళ్ళ సంగతి సరేసరి–

"మన బాగు వేరు. దేశం బాగు వేరు. మన బాగు మనం చూసుకొని, ఇతర్లు దేశం బాగు చూసుకునేటట్టు చేయాలి" అంటాడు ఈ కథలలోని సిద్దయ్య ఒకచోట (పనికిరాని ఇండియన్ పి. హెచ్.డి. కథలో) ఇది చదువుతూంటే "ప్రజలు వేరు, ఓటర్లు వేరు" అనే ముళ్ళపూడి పాత్ర పలుకులు జ్ఞాపకానికి వచ్చాయి. (నిజానికి – ఇలాంటి ముళ్ళపూడి ముద్ర శర్మగారి కథలలో పలు సందర్భాలలో కనబడుతుంది.)

ప్రజలూ, ఓటర్లూ ఒక్కటే అనే స్పృహ ఆరోగ్యవంతమైన ప్రజాస్వామ్యానికి ఎంత అవసరమో – మన బాగు, దేశం బాగు ఒక్కటే అనే ఆలోచన. రావడం "బ్రెయిన్ డ్రెయిన్"కు ఆనకట్ట కట్టడానికి అంతగా అవసరం – ఈ ఆనకట్టను నిర్మించవలసిన బాధ్యత అందరిపైనా వున్నది.

---

# 50

## ఇనాక్ - "పిండీకృత శాటి"



"-కథ రాయడం అంటే అగ్గిపుల్లలతో మేడకట్టడం లాంటిదే. ఒక్క అగ్గిపుల్ల ఎక్కువయినా మొత్తం అంతా కూలిపోతుంది-" కథా శిల్పానికి సంబంధించిన క్లిష్టతను, వైశిష్ట్యాన్ని గురించి చెబుతూ హెచ్.యి. బేట్స్ అన్న మాటలు యివి!- -యిట్లాంటి క్లిష్టమైన రచనా ప్రక్రియలో సమాజానికి అద్దం పట్టి చూపడం అంటే సామాన్యమైన పనికాదు. ఈ పనిని సాధించిన కొద్దిమంది మంచి కథకుల పేర్లు చెప్పేటప్పుడు సహజంగానే కొలకలూరి ఇనాక్ జ్ఞాపకం వస్తారు.

"ఆకలి", "ఊరబావి", "తలలేనోడు" వంటి మంచి కథలతో సమకాలీన సమాజానికి ఇనాక్ తీసిన "రియలిస్టిక్" ఫోటోగ్రాఫ్ మరచిపోలేనిది. గోర్కీ పరిభాషలో యివి 'క్రిటికల్ రియలిజమ్'కు సన్నిహితమైనంతగా వుండి 'సోషలిస్ట్ రియలిజమ్'కు సన్నిహితం కాకపోవచ్చును. కాని - ఈ కథల్లో సిద్ధాంతాల చట్రానికి అతీతంగా కన్నీటితో తడిసిన అచ్చమైన బడుగు జీవుల జీవితం ఉన్నది. నాలుగు దశాబ్దాల స్వాతంత్ర్యానంతరం కూడా యివాల్టికీ ప్రశ్నార్థకంగానే మిగిలివున్న లక్షలాది పీడిత ప్రజల కథ వున్నది. ఇనాక్ కథల్లోని జోళ్లకుట్టే చిదంబరం, మంగలి నాగలింగం, చాకలిగూగడు వంటి పాత్రల కథను అవగతం చేసుకోగలిగితే- ప్రజాస్వామ్యం పేరుతో, సమానత్వం పేరుతో వినబడే అరిగిపోయిన గ్రామఫోను రికార్డుల్లాంటి ఉపన్యాసాలు మనకు చేసిన ఉపకారం ఎంతో మరోమారు జ్ఞాపకం వస్తుంది. ఈ దేశంలో ఆర్థిక సమానత్వం మాట దేముదెరుగు- సాంఘిక సమానత్వం కథ కూడా అంతంత మాత్రంగానే వున్నది. ఇనాక్ కథల వెనుక ఈ ఆవేదన స్పష్టంగా కనబడుతుంది.

రచయితకు జీవితాన్ని సన్నిహితంగా పరిశీలించడం ఎంత అవసరమో ఈయన కథలు చదివితే తెలుస్తుంది. యిక- కవితాత్మక వ్యక్తీకరణల గురించి చెప్పాల్సి వచ్చినప్పుడు- "రాత్రంగా నిద్ర పట్టక తలనొప్పితో, కళ్ళనొప్పితో, చలికి వణుకుతూ నిద్రలేచిన ముసలాళ్లా- కళ్లు మూస్తూ, తెరుస్తూ, కంది చేలోంచి కప్పుకున్న మంచు దుప్పటి దులపుకుంటూ కోటి కిరణాలతో వస్తున్న సూర్యుడు" సంగతి సరేసరి-(యింతకూ-వాడే కోటిగాడు!-)

ఇనాక్‌గారి కథల్లో - "పిండీకృతశాటి" కథ అంటే నాకు చాలా యిష్టం. యిందుకు కారణం కేవలం గూని చాకలి గూగడు దయనీయ గాథ కానీ, - గాలికి ఎగిరిపోతున్న మోతుబరిగారి పట్టుబట్టల్ని పట్టుకోడానికి ఆ ముసలి చాకలి చేసిన "ఎడ్వంచర్" గానీ, కాదు. కథ చివర్లో గూగడు- "క్రొత్త శరీరంతో, క్రొత్త ఆత్మతో, క్రొత్త మనస్సుతో-" కనబడడమే యిందుకు కారణం. ఇనాక్ గారి యితర కథల్లో అంతగాలేని ప్రత్యేకత యిది.

ఈ క్రొత్త వూపిరితో గూగడు ఏం చేశాడన్నది ముఖ్యంకాదు. తలుచుకుంటే ఏం చెయ్యలేదు కనుక అనే ఆశాకిరణం చాలా ముఖ్యం. ఆలోచించగలిగితే-

ఎర్నెస్ట్ హెమింగ్వే కథలోని ముసలివాడు లాగానే-గూని చాకలి గూగడు కూడా మనలో ఎన్నో ఆలోచనలకు ప్రేరణ కల్పించగలడు!-

ఈ కథలోని గూని గూగడు చిన్నతనంలోనే తల్లిని తండ్రినీ పోగొట్టుకుని దాదాపుగా దరిద్రంలోనే పెరిగాడు. పెళ్ళికొడుకులను, పెళ్లి కూతుళ్లనూ పల్లకిలో కూర్చోపెట్టి మోసేటప్పుడు గూగడు జీవితంలో ఒక్కసారైనా తను కూడా పల్లకీలో కూర్చోవాలనుకున్నాడు.

కాని- వాడి బ్రతుకు పల్లకీని మొయ్యడంతోనే తెల్లారిపోయింది. ఆపైన గూని కూడా దాపరించింది. ప్రతీదాన్నీ డబ్బుతో కొలిచే నాగరికతలేని రోజుల్లో గూగడు జన్మించాడు. రైతులు యిచ్చిన ధాన్యంతో వాడి కడుపు నిండేది. ఆ తర్వాత- డబ్బుగాడు చూపిన విశ్వరూపానికి తట్టుకోలేక - అటు ధాన్యం, యిటు డబ్బు రెండూ దొరకక కడుపుమంటతో బ్రతికాడు. యిట్లాంటి రోజుల్లో అతగాడి యిల్లు కాలిపోతే బాగుచేయించుకోడానికి అప్పు యిచ్చిన 'ఉదారుడు' రత్తయ్య. బాకీ తిరిగి చెల్లించలేని కారణంగా వడ్డీలకు వడ్డీలు పెరిగిపోతే- గూని గూగడి యింటినీ, వాడికున్న కొద్దిపాటి మడి చెక్కనీ తన పేర రాయించేసుకుని- డెబ్బయ్ ఏళ్ళ ఒంటి గూగడిని చచ్చిందాకా ఆ యింట్లో వుత్తినే వుండడానికి అనుమతించిన ఒంటరి ఉదారుడు కూడా రత్తయ్యే!

ఇట్లాంటి రత్తయ్య (వాడు పరమ కిరాతకుడని గిట్టనివాళ్లు అంటే అనవచ్చు అది వేరే విషయం!) పట్టుపంచలను ఉతికి, చెట్టు కొమ్మకు ఆరేసి - రోహిణీ కార్తి రోజుల్లో మధ్యాహ్నం పూట ముసలి గూగడు ఒక కునుకు తీసేసరికి మహా ప్రభంజనంలాంటి సుడిగాలి దాపురించి పట్టుబట్టల్ని ఎగరేసుకుని పోయింది. ఎగిరిపోతున్న పట్టుబట్టల్ని పట్టుకోవడంకోసం- నేలమీద వున్న ముళ్లనూ, ఎదురుగా వున్న తుప్పల్నీ, డొంకల్నీ, వంటికి అవుతున్న గాయాలన్నీ, తన డెబ్బయ్ ఏళ్ళ వయస్సునూ, గూని శరీరాన్ని -

అన్నిటినీ మరిచి పరిగెడుతున్నాడు గూగడు! దాన్ని తియ్యడం కోసం రక్తం కారుడుతున్న గాయాలను కూడా లెక్కచెయ్యకుండా తాడిచెట్టు ఎక్కి చివరకు విజయాన్ని సాధించాడు గూని గూగడు.

పట్టుపంచెకోసం గూగడు చేసిన ఈ సాహసకార్యం వెనుక వున్నది రత్తయ్య అంటే అతడికి వున్న భయం ఒక్కటే కారణం కాదు. కేవలం భయమే కారణం. అయితే - ఎగిరిపోతున్న బట్టల్నీ, భీకరంగా వుండే రత్తయ్య రూపాన్నీ, తలుచుకుంటూ అతగాడు భోరుమని విలపించేవాడు. అంతేగాని- ఆ వయస్సులో అంతటి సాహసాన్ని చేసేవాడు కాదు! ఒక్క మాటలో చెప్పాలంటే- కర్మయోగిలాగా ప్రవర్తించాడు గూగడు. ఈ కారణం చేతనే అతడు తనలో వున్న మరో మనిషిని ఆవిష్కరింజేసుకోగలిగాడు. ఇన్నాళ్ళూ పిరికివాడుగా, యితరుల దయాధర్మాల మీద ఆధారపడిన వాడిగా, బ్రతికిన గూగడు సుడిగాలి ధర్మమా అని నిజమైన మనిషిగా ఎదగగలిగాడు. కథ చివరిలో చెప్పిన "క్రొత్త శరీరం, క్రొత్త ఆత్మ, క్రొత్త మనస్సు" యిదే!- ఈ క్రొత్తదనంతో "-పాత వూరులోకి, పాత యింటిలోకి, పాత కుక్కి మంచంలోకి-" వెళ్లిన గూగడు ఘనకార్యాలు సాధించడానికి అతడేమీ ఏసుక్రీస్తు, గాంధి, వీరేశలింగం కాదు! ఒక సాధారణమైన మనిషి!- కాని, ఆ మనిషిలో ఇప్పుడు నిండయిన గుండె బలం, పట్టుదల వున్నాయి. అట్లాంటప్పుడు రత్తయ్యలు భయపెట్టలేరు. బూసెమ్మలు దొంగప్రేమతో వేసే ముష్టి కోసం దేవిరింపు లేదు. పిండి ఆరవేసిన ముట్ట చాటున ఇనాక్‌గారు చెప్పదలచిన నిజమైన (మనిషి) కథ యిదే అనుకుంటాను?

---

# Andala Telugu Kadha

(Essays on the Telugu Short Stories)

# అందాల తెలుగు కథ

(కథా సాహిత్య వ్యాసాలు)



ప్రముఖ రచయిత, సాహిత్య విమర్శకులు

## కోడూరి శ్రీరామమూర్తి

రచించిన కథా సాహిత్య వ్యాసాలు







